భర్తృహరి

భర్తృహరిసుభాషితమ్

మదరాసు, 1910

Record no. 453

హోదా

వయస్సు 26.

కులము [illegible]

నివాసస్థలము, చిరునామా [illegible]

తాలూకా [illegible].

సంతకము. [illegible]

---

నేను [illegible] గారిని స్వయముగా యెరుగుదుననిన్ని, వారు గ్రంథాలయమునందలి గ్రంథములను అరువు తీసికొనతగినవారనిన్ని, శిఫారసు చేయుచున్నాను. ఈ పాఠకుడు పెగొను గ్రంథములకు నేను జామీనుగా యుందును.

పేరు Konidi Seshaiah

# భర్తృహరిసుభాషితమ్.



సంపూర్ణాంధ్ర సంస్కృత వ్యాఖ్యలతో

వేదము - వేంకటరాయశాస్త్రి చేత

స్వకీయ

జ్యోతిష్మతీ

ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

---

మదరాసు.



1910.

వెల రు. 2-4-0.] [Price Rs. 2-4-0.

# భర్తృహరిసుభాషితమ్.

## విషయసూచిక.

# శ్లోకసూచిక.



శ్రీ

# భర్తృహరి సుభాషితమ్.

## వ్యాఖ్యాన పీఠిక.

వన్దేఽహం గణునన్దనాఙ్ఘ్రిసరసీజాతద్వయీ మద్వయా
మన్దానన్ద మరన్దబిన్దు లహరీ సందోహ నిష్యన్దినీమ్,
యత్రేన్దిన్దిరజాతవన్మునిమనోబృన్దం కృతస్వాశ్రయం
కాఙ్క్షత్యున్దిలతా మమన్దిత పరానన్దావబోధోదయాత్.

శ్రీమాం స్త్రైలిఙ్గదేశే స జయతి విబుధశ్రేణి కోటీర కోటీ
కోటీమాణిక్యభూతాగణితగుణగణోఽఖణ్డపాణ్డిత్యశౌణ్డః
ధీరః శాణ్డిల్యగోత్రః సకలకవికులాహ్లాది సూక్తిప్రవీణో
వీణోదాహార్య విద్యా వివరణ నిపుణో రామచన్ద్రో బుధేన్ద్రః.

వేదాన్తోదన్తచిన్తా మతనుత చతురే, ణాన్తరే ణాకుతర్కం
తర్కం చాతర్కయద్యః, ఫణిపతివచసాం సారమాదత్త, యోగే
యో గేయః, సాంఖ్యసంఖ్యాగమసమయ విధావప్యలం, తన్త్రవిద్యా
విద్యో, యామిన్యధీశః స్ఫురతి నిరుపమో వత్సవంశామ్బురాశౌ.

విప్రో ణాభూతపూర్వం ఫల మధితపసాఽలమ్భి సూర్యప్రసాదా,
ల్లబ్ధ్వా తస్మాత్ స్వయం తత్ప్రమురతరజరాపఞ్చతాపఞ్చనాఖ్యం,
హిత్వా మోహం స్వకాన్తా స్వతివిమలధియా తం నిషే, వ్యాత్తభవ్యో,
యోగీన్ద్రో భర్తృహర్యాహ్వయ ఇహ కురుతేఽద్యాపి విద్యావిలాసమ్.

సోఽహం మేతత్ప్రణీతాయాః సుభాషితకృతేః కృతీ
కుర్వే సహృదయానన్దివ్యాఖ్యాం వ్యాఖ్యాం సతాం ముదే.

వ్యాకుర్వన్తి నిబద్ధగౌరవభయా న్నైవ స్ఫుటం యుక్తిభి
ర్యే తేఽన్యేత్వజనప్రతారణపరాః, కా నైపుణీ వా తతః!
వైఖర్యా వచసాం కవీశహృదయం ప్రఖ్యాపయన్త్యన్వయా
న్వా సైవాహమిహాఖిలం ప్రవివృణో మ్యుక్తిక్రమోజ్జృమ్భితమ్.

ఇహ ఖలు తత్రభవా నశేషవిశేషసారపారదృశ్వా విశ్వాతిశాయిగుణగరిమావతారో భర్తృహరినామా మహాయోగీశ్వరో నిజయోగమహిమానుసారేణ కరతలామలకీకృతాఖిలవిరిఞ్చిప్రపఞ్చ స్తృణకణ మివ జగజ్జాల మాలోకయన్ పరమకారుణికో లోకవ్యవహారపరిజ్ఞానఖిన్నాన్తఃకరణః లోకానుజిఘృక్షయా నీతి శృఙ్గార వైరాగ్య వర్ణనప్రఖ్యం సుభాషితత్రిశత్యాఖ్యం కంచిత్ ప్రబన్ధం ప్రారభమాణ స్తత్పరిపన్థినిర్మథనద్వారా పరిసమాప్తిప్రచయగమనలక్షణం ఫల మాశాసానః శిష్టాచార పరిప్రాప్తవిశిష్ట పరజ్యోతీరూపేష్టదేవతానమస్కారాకారం మఙ్గళ మాదౌ నిబధ్నాతి.

## మంగళాచరణము.

దిక్కాలాద్యనవచ్ఛిన్నానన్తచిన్మాత్రమూర్తయే
స్వానుభూత్యేకమానాయ నమః శాన్తాయ తేజసే.

టీక.—దిక్కాలా...ర్తయే—దిక్ = దిక్కు - కాల = కాలము - ఆది = లోనగువానిచేత - అనవచ్ఛిన్న = నియమింపఁబడని - (ఎల్లతావులందును ఎల్లకాలములందును ఉన్నట్టి అనుట) - అనన్త = తుదిలేని - చిత్ మాత్ర = జ్ఞానమే అయిన - మూర్తయే = స్వరూపమును, స్వా...నాయ—స్వ=తనయొక్క - అనుభూతి = అనుభవమే - ఏక = ప్రధానమయిన - మానాయ = ప్రమాణముగాఁ గలదియు, శాన్తాయ = ప్రసన్నంబును, (అయిన), తేజసే = వెలుఁగునకు, నమః = నమస్కారము.

తా.—సర్వప్రదేశములందు సర్వకాలములందును ఉన్నదై అనంతమై శాంతమై తన్ననుభవించుటయే తనకు ముఖ్యప్రమాణముగాఁ గలదై జ్ఞానమాత్రస్వరూప మయిన పరమాత్మకు నమస్కారము.

క. అచ్ఛము దిక్కాలాద్యన । వచ్ఛిన్నానంతచిద్విభాసనంబు నిజ
స్వచ్ఛానుభూతిమానము । సచ్ఛాంతము తేజ మే నజస్రము దలఁతున్.

వ్యా.— దిగితి.— దిశః ప్రాచ్యాది దిక్ప్రదేశాః - కాలాః భూతభవిష్యద్వర్తమానరూపాః - ఆదిశబ్దసంగృహీతాని వస్తూని - తథా చ దిక్కాలా ఆదయో యేషాం తాని దిక్కాలాదీని - తద్గుణసంవిజ్ఞానబహువ్రీహిః - అన్యథా తేషా మప్రాధాన్యేన వినాభావే శాస్త్రవిరోధః స్యాత్ - తై రనవచ్ఛిన్నా అపరిక్షిప్తా - విభుత్వా న్నిత్యత్వా దేకత్వా చ్చ దేశతః కాలతో వస్తుత శ్చాపరిచ్ఛిన్నే త్యర్థః - అత ఏవానన్తాఽపరిమితా త్రివిధపరిచ్ఛేదశూన్యత్వా దఖణ్డదణ్డాయమానే త్యర్థః - ఏతేన సజాతీయ విజాతీయ స్వగత భేదత్రయ రాహిత్య మర్థాత్ సూచిత మితి విజ్ఞేయమ్ - ఆనన్దేతి పాఠే ఆనన్ద చిచ్ఛబ్దయో ర్ద్వన్ద్వాన్తే శ్రూయమాణో మాత్ర శబ్దః ప్రత్యేకం సంబధ్యతే - తథా చానన్దమాత్రా ఆనన్దమయీ చిన్మాత్రా జ్ఞానఘనా చ -



చిదేకరసేతి యావత్ - తాదృశీ మూర్తి స్తస్యై త్తద్రూపా యే త్యర్థః; "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ.' 'ఏక మే వాద్వితీయం బ్రహ్మ.' 'విజ్ఞాన మానన్దం బ్రహ్మ.' 'ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్.' 'ఆనన్దమయోఽభ్యాసాత్.' 'సత్యం జ్ఞాన మనన్తం యత్ సానన్దం బ్రహ్మ కేవల మి' త్యాదిశ్రుతిస్మృతికదమ్బక మత్ర ప్రమాణ మితి భావః; నాత్ర బహువ్రీహి రాశ్రయణీయః, అన్యథా, 'ఇకోఽచి విభక్తా' వితి నుమి 'మూర్తినే' ఇతి స్యాత్; న చ 'తృతీయాదిషు భాషితపుంస్కం పుంవ ద్గాలవ స్యే' తి పుంవద్భావ ఇతి వాచ్యమ్, మూర్తిశబ్దస్య నియతస్త్రీలిఙ్గత్వే నాభాషితపుంస్కత్వాత్ ; తస్మా ద్యథాశ్రుత మేవ సాధు మన్తవ్యమ్; భాషితపుంస్కత్వ స్యానిత్యత్వవివక్షాయా న్తు బహువ్రీహివిహితే తదా న కాఽ ప్యనుపపత్తి రితి సర్వం సుస్థమ్; తథా స్వానుభూతి రాత్మానుభవ - ఏవ ఏకం ముఖ్య మద్వితీయం వా - మానం స్వప్రకాశసాధనం - యస్య తస్మై; స్వయంప్రకాశసంవిద్రూపత్వా దస్య ప్రదీపవత్ స్వపరప్రకాశకతయా స్వసాక్షాత్కారే స్వానుభవ ఏవ ప్రమాణం, న ఘటాదే రివ చక్షురాదిప్రామాణికత్వ మితి భావః. ఏతేన వృత్తివిషయత్వ మేవ న తు ఫలవిషయత్వ మి త్యవధేయమ్ ; త దుక్త మాచార్యైః—

'స్వబోధే నాన్యబోధేచ్ఛా బోధరూపతయాత్మనః,
న దీపస్యాన్యదీపేచ్ఛా యథాస్వాత్మప్రకాశనే.' ఇతి;

తథా శాన్తాయ అవిద్యాతత్కార్యసమ్బన్ధశూన్యత్వాత్ ప్రసన్నాయ - 'నిష్కలం నిష్క్రియం శాన్త మి' త్యాదిశ్రుతేః, తేజసే జ్యోతీరూపాయ, బ్రహ్మణే, నమః ప్రహ్వీభావః, 'నమః స్వస్తీ' త్యాదినా చతుర్థీ.

అత్ర మఙ్గళాదీని మఙ్గళమధ్యాని మఙ్గళాన్తాని శాస్త్రాణి ప్రథన్తే, వీరపురుషకాణ్యాయుష్మత్పురుషకాణి చ భవన్తి, అధ్యేతార శ్చ ప్రవక్తారో భవ న్తీతి భగవద్భాష్యకారవచనప్రామాణ్యాత్, 'ఆశీ ర్నమస్క్రియా వస్తునిర్దేశో వాఽపి తన్ముఖ' మిత్యాది దణ్డివచనా చ్చాదౌ నమస్కారరూపం, మధ్యే పరబ్రహ్మస్మరణలక్షణం చ, మధ్యే తదుభయాత్మకం చ, మఙ్గళ మాచరిత మి త్యవగన్తవ్యమ్; 'అథ శబ్దానుశాసన మి' త్యాదౌ సర్వత్ర శాస్త్రారమ్భే మఙ్గళార్థత్వే నాథశబ్దప్రయోగదర్శనాత్, తస్య తదర్థకత్వం చ; ని. 'మఙ్గళానన్తరారమ్భప్రశ్నకార్త్స్న్యే ష్వథో అథే' త్యభిధానాత్;

'ఓంకార శ్చాథశబ్ద శ్చ ద్వా వేతౌ బ్రహ్మణః పురా
కణ్ఠం భిత్త్వా వినిర్యాతౌ ; తేన మాఙ్గళికా వుభౌ'

ఇతి స్మరణా చ్చ; త చ్చ నిర్విఘ్నం ప్రారిప్సితపరిసమాప్తికామే నావశ్యం కర్తవ్యమ్, 'పరిసమాప్తికామో మఙ్గళ మాచరే ది' త్యనుమిత శ్రుతి బోధిత కర్తవ్యతాకత్వాత్ ;

అనుమానం చ:—మఙ్గళం వేదబోధితకర్తవ్యతాక మలౌకికావిగీతశిష్టాచారవిషయత్వాత్, దర్శాద్యాచారవ, దిత్యన్వయవ్యతిరేకాభ్యామ్. తస్య కారణత్వానిశ్చయాత్ కథ మవశ్యకర్తవ్యతాకత్వమ్? తథా హి, శబరభాష్యాదౌ కృతేఽపి మఙ్గళే సమాప్తేరజాతత్వాత్, కిరణావళ్యాదౌ వకృతేఽపి జాతత్వా; దితి చేత్, సత్యం, క్వచి ద్విఘ్నబాహుళ్యేన తత్సమసంఖ్యాకమఙ్గళాభావాత్, క్వచిత్ ప్రాచీనమఙ్గళబాహుళ్యా చ్చ, వ్యత్యయ; ఇత్యలమతిప్రసఙ్గేన.

అత్ర చారుత్వేన యథావద్వస్తువర్ణనాత్ స్వభావోక్తి రలంకారః - 'స్వభావోక్తి రసౌ చారు యథావ ద్వస్తువర్ణన' మితి లక్షణాత్. శ్లోకాఖ్య మేత దానుష్టుభం వృత్తమ్,

'పఞ్చమం లఘు సర్వేషు, సప్తమం ద్విచతుర్థయోః,
గురుషష్ఠం చ సర్వేషా, మేత చ్ఛ్లోకస్య లక్షణమ్.' ఇతి వచనాత్.

---

## నీ తి శ త క మ్.

---

### మూర్ఖపద్ధతిః.

అ.వ.—మంచిమాట చెప్పిన వినువారు అరుదు అనుట.

బోద్ధారో మత్సరగ్రస్తాః, ప్రభవః స్మయదూషితాః,
అబోధోపహతా శ్చాన్యే, జీర్ణ మఙ్గే సుభాషితమ్.

టీక.—బోద్ధారః = తెలిసికొనువారు, మ...స్తాః—మత్సర = అసూయచే - గ్రస్తాః = ఆక్రమింపఁబడినవారు, ప్రభవః=దొరలు, స్మ...తాః - స్మయ=గర్వముచేత - దూషితాః = చెఱుపఁబడినవారు, (కిం) చ = మఱియు, అన్యే = ఇతరులు, అబో...తాః—అబోధ = తెలియమిచేత - ఉపహతాః = అణఁగఁగొట్టఁబడినవారు; (కావున), సుభాషితమ్ = మంచిమాట (హితోపదేశము), అఙ్గే = (నా) యంతరంగమందే, జీర్ణమ్ = క్షయించినది.

తా.—నాహితవాక్యమును—తెలిసినవారు 'వీఁడును మహాపండితునివలె ఖ్యాతి పొందనా?' అను నసూయచేతను, ప్రభువులు 'మాకుఁ దెలియదా? మా కొకఁడు చెప్పువాఁడా?' అను గర్వముచేతను, ఇతరజనులు తెలిసికో నేరమిచేతను,—తిరస్కరింతురు; ఎవ్వరును విననందున నాహితవ్యాము నాయందే క్షయించుచున్నది.



తే. బోద్ధ లగువారు మత్సరపూర్ణమతులు, । ప్రబలగర్వవిదూషితుల్ ప్రభువు లెన్న,
నితరమనుజు లబోధోపహతులు, గాన । భావమున జీర్ణ మయ్యె సుభాషితంబు.

వ్యా.—ప్రబన్ధ స్యాస్య వివిధస్వరూపపరిజ్ఞానార్థం తత్తత్పద్ధతి నిబన్ధనతయా చికీర్షితత్వాత్, తత్ర మూర్ఖవిద్వత్పద్ధత్యో ర్వ్యావర్తకభావ స్యావిశిష్టత్వే నోభయ నిరూపణే సంప్రాప్తే, ప్రాథమ్యే ముఖ్యప్రసఙ్గసఙ్గత్యో రన్యతర స్యాభావా, దశోకవనికాన్యాయప్రాయత్వా, చ్చాదౌ మూర్ఖపద్ధతిం వర్ణయితు మారభతే. తత్ర ప్రథమం సహృదయాభావాత్ సుభాషితస్య వక్తు మనవకాశ ఇత్యాహ — బోద్ధార ఇతి. — బోద్ధారః పరిజ్ఞాతారః * 'బుధ అవగమనే' ఇత్యస్మా ద్ధాతో స్తృచ్, మత్సరేణాసూయయా పరోత్కర్షాసహనేన - గ్రస్తాః సమాక్రాన్తాః - తే న హృదయాళవః అతో నానుమోదన్త ఇతి భావః, ప్రభవో రాజానః, స్మయదూషితాః గర్వదుర్వినీతాః - న తు వినయప్రహ్వాః - అతో న శృణ్వన్తీతి భావః, అన్యే ఉక్తోభయవ్యతిరిక్తజనాః, అబోధే నాజ్ఞానేన - ఉపహతా నష్టాత్మాన - స్తే న తదధికారిణః - అత స్తేషా మాకర్ణనయోగ్యతాఽపి నాస్తీతి భావః, తస్మాత్ సుభాషితం సానుభాషణం - ప్రియవచన మితి యావత్ - నపుంసకే భావే క్తః, అఙ్గేఽన్తరఙ్గే, జీర్ణ మన్తర్హితం - న త్వద్యాపి బహిః ప్రవృత్తమ్ - తథాఽపి వక్ష్యా మీతి వాక్యశేషః. వృత్తం పూర్వవత్.

---

అవ.—మూర్ఖుని రంజింప నశక్య మనుట.

అజ్ఞః సుఖ మారాధ్యః, సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః,
జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాఽపి నరం న రఞ్జయతి. 2

టీక.—అజ్ఞః = తెలియనివాఁడు, సుఖమ్ = సులువుగా, ఆరాధ్యః = సేవింప (బోధింప) శక్యమైనవాఁడు, విశేషజ్ఞః = విశేషము నెఱిఁగినవాఁడు, సుఖతరమ్=మఱియు సులువుగా, ఆరాధ్యతే = సేవింపఁబడును (బోధింపఁబడును), జ్ఞాన లవ దుర్విదగ్ధం నరం = తెలివియొక్క లేశముచేత గర్వించిన మనుష్యుని, బ్రహ్మా అపి = నలువ యు, న రఞ్జయతి=ఒప్పింప నేరఁడు.

తా.—తెలియనివానికి సులువుగా తెలుపవచ్చును, చక్కఁగా తెలిసినవానికి మఱియు సులువుగా తెలుపవచ్చును, కాని, తెలిసియుఁ దెలియక గర్వపడువానికిఁ దెలియఁ జెప్పుటకు బ్రహ్మకును అలవిగాదు.

క. తెలియనిమనుజుని సుఖముగఁ । దెలుపం దగు, సుఖతరముగఁ దెలుపఁగ వచ్చుం
దెలిసినవానిం, దెలిసియుఁ । దెలియనినరుఁ దెల్ప బ్రహ్మదేవునివశమే?

వ్యా.—నను కీదృశో మూర్ఖః యత స్తత్స్వరూపం నిరూప్యతే, తత్రాహ.—

అజ్ఞ ఇతి.— న జానాతీ త్యజ్ఞః అకించిజ్జ్ఞః మూఢ ఇతి యావత్, సుఖ మక్లేశేన, ఆరాధ్యః సమాధేయః - తస్యోపదేశమాత్రే ణైవ విస్రమ్భసమ్భవా దితి భావః, విశేషం జానాతీతి విశేషజ్ఞః తత్త్వవేత్తా, సుఖతర మత్యన్తానాయాసే నేత్యర్థః - 'ద్వివచనవిభజ్యో' త్యాదినా తరప్ప్రత్యయః, ఆరాధ్యతే సమాధీయతే - తద్బుద్ధేః సర్వదా విశేషగ్రహణమాత్రపర్యవసానా దితి భావః, కింతు, జ్ఞానం శాస్త్రజన్యసంవిత్ తస్య లవేన దుర్విదగ్ధం పణ్డితమానినం, నరం మూర్ఖజన మిత్యర్థః, బ్రహ్మాఽపి కర్తు మకర్తు మన్యథా కర్తుం సమర్థ శ్చతుర్ముఖోఽపి - కిము తాన్య ఇతి భావః, న రఞ్జయతి రఞ్జయితుం న శక్నోతి - తన్మనసః సూక్తిసహస్రై రపి సమాధానాసంభవా దితి భావః, ఉక్తోభయ మధ్యస్థో మూర్ఖ ఇతి ఫలితార్థః.

రఞ్జనసంబన్ధేఽ ప్యసంబన్ధాభిధానా దతిశయోక్తిభేదః. 'అజ్ఞో' 'విశేషజ్ఞ' ఇత్యత్ర చ 'ఆతోఽనుపసర్గే క' ఇతి కప్రత్యయో, న 'త్విగుపధజ్ఞే' త్యాదినా కప్రత్యయః; అత ఏ వాహ భగవాన్ కాత్యాయనః 'అకారా దనుపసర్గాత్ కః కర్మోపపదో భవతి విప్రతిషేధే నే' తి వార్తికవ్యాఖ్యానే భాష్యకారే ణార్థజ్ఞశబ్ద ముదాహృత్యాస్యార్థస్య సమర్థనాత్; ఏత చ్చాసకృదుక్తం మదీయశృఙ్గారశృఙ్గాటకేఽపి - 'రక్తిమ్నీరస మయం సమయజ్ఞః' ఇత్యాదిషు; ఏవ ముత్తరత్రాపి ద్రష్టవ్యమ్. ఆర్యావృత్తభేదోఽయ మున్నేయః; ఉత్తరత్రాపి భేదాన్తరా ణ్యున్నేయాని.

---

అవ.— మూర్ఖుని మెప్పింప నశక్య మనుట.

ప్రసహ్య మణి ముద్ధరే న్మకరవక్త్రదంష్ట్రాన్తరాత్,
సముద్ర మపి సంతరేత్ ప్రచలదూర్మిమాలాకులం,
భుజఙ్గ మపి కోపితం శిరసి పుష్పవ ద్ధారయేత్,
న తు ప్రతినివిష్టమూర్ఖజనచిత్త మారాధయేత్. 3

టీక.— మకర వక్త్ర దంష్ట్రా అన్తరాత్ = మొసలియొక్క నోటిలోని కోఱల నడుమనుండి, ప్రసహ్య = బలిమిచేత, మణిమ్ = రత్నమును (ముత్తెము ననుట), ఉద్ధరేత్ =(ఎవఁడేనియు) పెకలించినను పెకలించును, ప్రచలత్ ఊర్మి మాలా ఆకులమ్ = మిక్కిలి చలించుచున్న యలలయొక్క వరుసలచేత కలంగుచున్న, సముద్రమ్ అపి = సముద్రమును సయితము, సంతరేత్ = ఈఁదును, కోపితమ్ = రేఁపఁబడినట్టి, భుజఙ్గమ్ అపి = పామును సయితము, శిరసి = ఔదలయందు, పుష్పవత్ = పువ్వునుబోలె ధారయేత్ = తాల్చును, (కాని), ప్రతినివిష్ట మూర్ఖ జన చిత్తం.తు= మొండిపట్టుపట్టిన మూఢ మానవుని మనస్సును అన్ననో, న ఆరాధయేత్ = ఒప్పింపఁజాలఁడు.



'ప్రసహ్య' అనుటచే మిక్కిలి నొప్పించి యనియు, 'దంష్ట్రా' అనుటచే ఆపని ప్రాణాపాయకరమనియు, 'ప్రచల...కులమ్' అనుటచే ఎట్టియీఁతగాని నేనియు ముంచి వైచు ననియు, 'కోపితమ్' అనుటచే కఱచి చంప సిద్ధముగా నున్న దనియు, 'పుష్పవత్' అనుటచే అపాయము లేకయె గాక అలంకారముగా సయితము అనియు, నభిప్రాయములు. సముద్రమును చెప్పుట విశాలతకొఱకును, జలజన్త్వాదులవలని యపాయముకొఱకును. మకర భుజంగములను చెప్పుట ఘాతుకత్వముకొఱకు.

తా.— మొసలి నోటిలోని కోఱలలోపలినుండి బలాత్కారమున ముత్తెమును పెకలించినను పెకలింపవచ్చును, అల్లకల్లోల మగుసముద్రమును అడ్డు ఈఁదినను ఈఁదవచ్చును, కెరలించి త్రాచును సిగపూవుగాఁ దాల్చినను దాల్పవచ్చును, గాని మొండిపట్టుపట్టిన మూర్ఖుని మాత్రము రంజింప శక్యముగాదు.— మొదటివి మూఁడును అశక్యములే, ఈ నాలవదియు అశక్యమే, కాని, ఇది వానికన్నను అశక్య మని భా.

చ. మకరముఖాంతరస్థ మగు మానికముం బెకలింప వచ్చుఁ, బా
యక చలదూర్మికానికర మైనమహోదధి దాఁట వచ్చు, మ
స్తకమునఁ బూవుదండవలె సర్పము నైన భరింప వచ్చు, మ
చ్చిక ఘటియింప మూర్ఖజనచిత్తముఁ దెల్ప నసాధ్య మేరికిన్.

వ్యా.— అథ ద్వాభ్యాం మూర్ఖజనచిత్తస్య దురారాధ్యతా మాహ— ప్రసహ్యేతి— మకరః శింశుమారాఖ్యో జలగ్రాహవిశేషః - తస్య వక్త్రే వదనగహ్వరే - దంష్ట్రిణాం నిశితాగ్రదశనవిశేషాణామ్ - అన్తరాత్ అన్తరాళాత్ - అతిసంకటా దిత్యర్థః, ప్రసహ్య బలాత్కారేణ, మణిం రత్నం - దురుద్ధర మపీతి భావః, ఉద్ధరే దుద్ధర్తుం శక్నుయాత్, జన ఇతి శేషః, కేనచి దవధానే నానయే దిత్యర్థః, తథా ప్రచలన్తో దోలాయమానాః - యే ఊర్మయ స్తేషాం - మాలాభిః పరమ్పరాభి - రాకులమ్ ఉల్లోలోజ్జృమ్భిత మిత్యర్థః, సముద్ర మపి - దుస్తరమపీతి భావః, సంతరేత్ సమ్యక్ తరితుం శక్నుయాత్ - కేనచి త్ప్లవనసాధనే నేతి భావః, లఙ్ఘయే దితి పాఠే హనుమా నివ కేనచి చ్ఛక్తివిశేషేణ లఙ్ఘితుం శక్నుయా దిత్యర్థః, తథా కోపితం సంజాతకోపం - కోపవశాత్ సఫూత్కారం జిహ్వయా సృక్వప్రాన్తౌ లేలిహాన మిత్యర్థః - 'త దస్య సంజాతం - తారకాదిభ్య ఇతచ్' ఇతీతచ్ప్రత్యయః - తారకాది రాకృతిగణః, భుజఙ్గం సర్ప మపి - దుర్ధర మపీతి భావః, శిరసి కేశపాశే, పుష్పేణ తుల్యం పుష్పవత్ - పుష్పస్రజ మి వే త్యర్థః - 'తేన తుల్యం క్రియా చే ద్వతి' రితి వతిప్రత్యయః, ధారయేత్ ధారయితుం శక్నుయాత్ - మణిమన్త్రాదిసాధనే నేతి భావః, కిం తు ప్రతినివిష్ట మభినివేశాక్రాన్తం - దురాగ్రహావిష్టమతి యావత్ - మూర్ఖజనస్య దుర్విదగ్ధస్య - చిత్తం, నారాధయేత్ ఆరాధ

యితుం సమాధాతుం న శక్నుయాత్ - ఉపాయాలాభా దితి భావః, మకరదంష్ట్రాగ్రస్థ మణ్యుద్ధరణాదిప్రాయం మూర్ఖజనచిత్త సమారాధన మితి శ్లోకార్థః.

---

అవ.—మూర్ఖుని రంజింప నశక్య మనుట.

లభేత సికతాసు తైల మపి యత్నతః పీడయన్,
పిబే చ్చ మృగతృష్ణికాసు సలిలం పిపాసార్దితః,
కదాచి దపి పర్యటన్ శశవిషాణ మాసాదయేత్,
న తు ప్రతినివిష్టమూర్ఖజనచిత్త మారాధయేత్. 4

టీక.—యత్నతః = యత్నముచేత (అనఁగా యంత్రములలో వేసి), పీడయన్ = ఒత్తుచు, సికతాసు అపి = ఇసుకలో(నుండి) సయితము, తైలమ్ = నూనెను, లభేత = పొందినను పొందును, (కిం)చ = మఱియు, పిపాసా అర్దితః = దప్పిచే పీడింపఁబడినవాఁడు, మృగతృష్ణికాసు = ఎండమావులలో, సలిలమ్ = నీళ్లను, పిబేత్ = త్రాగినను త్రాగును, పర్యటన్ = సంచరించుచు, కదాచిత్ = ఒకానొక వేళ, శశ విషాణమ్ = కుందేటి కొమ్మును (లోకములో లేనిదానిని), ఆసాదయేత్ = పొందినను పొందును, (కిం) తు = కాని, (ప్రతినివిష్టేత్యాది-పూర్వశ్లోకమందుం బోలె.)

తా.—ఇసుకను ఆడి నూనెయేనియు దింపవచ్చును, ఎండమావులలో నీళ్లయినను త్రాగవచ్చును, ఎటనేని కుందేటికొమ్మయినను సంపాదింపవచ్చును, కాని, మూర్ఖులను మాత్రము రంజింపఁజాలము.—మూర్ఖులను రంజించుట మిక్కిలి కష్ట మని భా.

తే. తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చుఁ, దవిలి మృగతృష్ణలో నీరు ద్రావ వచ్చుఁ,
దిరిగి కుందేటికొమ్ము సాధింప వచ్చుఁ, । జేరి మూర్ఖులమనసు రంజింపరాదు.

వ్యా. ఏవం దుర్లభవస్తుసాధనే దుష్కరకార్యకరణే చ సంభావనయా శక్తిరుక్తా, న మూర్ఖచిత్తప్రసాధనే; ఇదానీ మత్యన్తదుర్లభవ స్త్వపి ప్రసాధయే న్న తు తచ్చిత్త మిత్యాహ.—లభే తేతి.—యత్నతః కుతశ్చి త్ప్రయత్నాత్ - పఞ్చమ్యా స్తసిల్, పీడయన్ కేనచి ద్యన్త్రేణ సమ్మర్దయన్, సికతాసు వాలుకా స్వపి - కాలత్రయేఽప్యన్తస్స్నేహోద్భవకరణభూతా స్వ పీతి భావః, తైలం స్నేహం, లభేత లబ్ధుం శక్నుయాత్ - 'స్నేహనే తైల' మి త్యనుశాసనా న్నాత్ర తిలసంబన్ధిత్వాశఙ్కా-కళఙ్కావతార ఇతి ద్రష్టవ్యమ్, తథా పాతు మిచ్ఛా పిపాసా - 'పా పాన' ఇ త్యస్మా ద్ధాతోః సన్నన్తాత్ స్త్రియా మప్రత్యయే టాప్ - తయా అర్దితః పీడితః తృష్ణాతురః స న్నిత్యర్థః, మృగతృష్ణికాసు చ మరుమరీచికా స్వపి వా - జలభ్రమ



మాత్రదాయినీ ష్వ పీతి భావః - మృగతృష్ణాశబ్దాత్ స్వార్థే కప్రత్యయే - 'ప్రత్యయస్థాత్ కాత్ పూర్వ స్యాత ఇ దా ప్యసుప' ఇ తీకారః, సలిలం జలం, పిబేత్ పాతుం శక్నుయాత్ - 'పా ఘ్రా ధ్మే' త్యాదినా పిబతేః పిబాదేశః, తథా పర్యటన్ తత్రతత్ర వనాన్తరే సంచరన్, కదాచిత్ కస్మింశ్చిత్ సమయే, శశస్య మృగవిశేషస్య - విషాణం శృఙ్గ మపి - వాఙ్మాత్రగోచర మ పీతి భావః, ఆసాదయే దధిగన్తుం శక్నుయాత్, (న తు ప్రతినివి ష్టేత్యాది పూర్వవత్). సికతాతైలలాభాదివ దత్యన్తదుర్ఘటం మూర్ఖచిత్తసమాధాన మితి భావః; మృగతృష్ణికాజల శశవిషాణయో ర్గగనారవిన్ద వన్ధ్యాపుత్రవ దత్యన్తాసంగతత్వ ముక్తం సురేశ్వరవార్తికే.—

'మృగతృష్ణామ్భసి స్నాతః ఖపుష్ప కృతశేఖరః
ఏష వన్ధ్యాసుతో యాతి శశశృఙ్గధనుర్ధరః.' ఇతి.

పద్యద్వయేఽప్యస్మిన్ మణి ముద్ధరే ది త్యాదౌ 'శకి లిఙ్చే' తి శక్యార్థే విధిలిఙ్; తథా అపిశబ్దః సముచ్చయే, సంభావనాయాం 'చేత్' తదనువాద ఇతి వివేకః; ఉభయథాఽప్యనుశాసనసంభవాత్, ప్రకృతార్థోపపత్తే శ్చ; యథా హేమరసింహః 'గర్హాసముచ్చయ ప్రశ్న శఙ్కా సంభావనా స్వ పి' తి; అత్ర 'సముద్ర మపి లఙ్ఘయే ది' త్యుదాజహార స్వామీ.

అత్ర మణ్యుద్ధరణాద్యసంబన్ధేఽపి తత్సంబన్ధాభిధానా దతిశయోక్తిః.

శ్లోకద్వయ మేతత్ పృథ్వీవృత్తమ్; త దుక్తం కేదారేణ వృత్తరత్నాకరే 'జసౌ జసయలా వసుగ్రహయతి శ్చ పృథ్వీ గురుః' రితి. అత ఏవ 'సికతాసు తైల' మి త్యత్ర, 'మృగతృష్ణికాసు సలిల' మిత్యత్ర 'మూర్ఖజనచిత్త' మి త్యత్ర చ, అష్టమవర్ణవిహితస్య విచ్ఛేద స్యాభావా ద్యతిభ్రష్టం నామ దోషః. ఇమ మేవ కేచి దపస్థయతిం వదన్తి; త దుక్తం విద్యానాథేన 'యత్రస్థానే యతిభ్రంశ స్త ద్యతిభ్రష్ట ముచ్యతే' ఇతి.

'క్వచి త్పదమధ్యే తు యతి మిచ్ఛన్తి సూరయః,
యత్ర పూర్వాపరౌ భాగౌ స్యాతా మే కైకవర్ణగౌ.'

ఇతి దత్తిలవచన మపి సమాధాతుం న శక్నోతి; పూర్వాపరభాగయో రేకవర్ణగతత్వాభావాత్; నిరంకుశాః ఖలు కవయో భవన్తి సర్వపథీనాః ఇ త్యల మతిప్రపఞ్చేన.

---

అవ.—మూర్ఖుని సమాధానపెట్ట యత్నించుట వ్యర్థ మనుట.

వ్యాళం బాలమృణాళతన్తుభి రసౌ రోద్ధుం సముజ్జృమ్భతే,
భేత్తుం వజ్రమణిం శిరీషకుసుమప్రాన్తేన సన్నహ్యతి,
మాధుర్యం మధుబిన్దునా రచయితుం క్షారామ్బుధే రీహతే,
మూర్ఖాన్ యః ప్రతినేతు మిచ్ఛతి బలాత్ సూక్తైః సుధాస్యన్దిభిః.

టీక.—యః = ఎవఁడు, సుధా స్యన్దిభిః = అమృతమును స్రవించుచున్న (అత్యంత ప్రియము లయిన యనుట), సూక్తిభిః = మంచిమాటలతో, మూర్ఖాన్ = అజ్ఞులను, బలాత్ = బలాత్కారముగ, ప్రతినేతుమ్ = (మంచిమార్గమునకు) త్రిప్పుటకు, ఇచ్ఛతి = కోరునో, అసౌ = ఆయాతఁడు, వ్యాళమ్ = దుష్టగజమును, బాలమృణాళతన్తుభిః = లేఁత తామరతూఁడ్ల దారములతో, రోద్ధుమ్ = కట్టుటకు, సముజ్జృమ్భతే = యత్నించును, శిరీష కుసుమ ప్రాన్తేన = దిరిసెన పువ్వుయొక్క అంచుతో, వజ్రమణిమ్ = మగరాతిని, భేత్తుమ్ = పగల్చుటకు, సన్నహ్యతి = యత్నించును, క్షారాంబుధేః = ఉప్పు సముద్రమునకు, మధు బిన్దునా = తేనె బొట్టుతో, మాధుర్యమ్ = తీపును, రచయితుమ్ = చేయుటకు, ఈహతే = పాటుపడును.

తా.—తామరతూఁటిలోని దారములతో మదపుటేనుఁగును కట్టుట, దిరిసెనపువ్వుయొక్క అంచుతో వజ్రమును కోయుట, తేనెబొట్టుతో ఉప్పుసముద్రమును తీపు చేయుటయు, ఎట్లు అసాధ్యములో, అట్లే మూర్ఖులను మంచిమాటచే మంచి మార్గమునకు త్రిప్పుటయు అసాధ్యము.

మ. కరిరాజున్ బిసతంతుసంతతులచేఁ గట్టన్ విజృంభించు వాఁ,
డురువజ్రంబు శిరీషపుష్పములచే నూహించు భేదింపఁ, దీ
పు రచింపన్ లవణాబ్ధికిన్ మధుకణంబుం జిందు, యత్నించు ని
ష్ఠురణిన్ మూర్ఖులఁ దెల్ప నెవ్వఁడు సుధాధారానుకారోక్తులన్.

వ్యా.—అథ మూర్ఖానునయేచ్ఛాయాః అత్యన్తావివేకితా మాహ - వ్యాళ మితి. అసౌ పుమాన్, వ్యాళం దుష్టగజం - న తు సాధారణజన్తు మిత్యర్థః - ని. 'వ్యాళో దుష్టగజే సర్పే' ఇతి విశ్వః, బాల మృణాళ తన్తుభిః కోమల బిసకిసలయ సూత్రైః - ఈష న్నిరోధ స్యాప్యనుపయుక్తై రితి భావః, రోద్ధుం నియన్తుం, సముజ్జృమ్భతే కృతప్రయత్నో భవ తీ త్యర్థః, తథా వజ్రమణిం హీరాఖ్యమణివిశేషమ్ - అలోహలేఖ్య మపీతి భావః - ని. 'హీరో వజ్ర శ్చ కథ్యతే' ఇతి హలాయుధః, శిరీషకుసుమ స్యాతికోమలపుష్పవిశేషస్య - ప్రాన్తే నాఞ్చలేన, భేత్తుం విదారయితుం, సన్నహ్యతి ఉద్యుఙ్క్తే ఇత్యర్థః, తథా క్షారామ్బుధేః లవణార్ణవస్య - న తు స్వల్పజలాశయస్య, మధుబిన్దునా క్షౌద్రవిప్రుషా - న త్వవిచ్ఛిన్నమధుధారాసంపాతే నేత్యర్థః, మాధుర్యం మధురగుణం, రచయితుం సంపాదయితు, మీహతే కాఙ్క్షతి; కోఽసా విత్యత ఆహ; యః పుమాన్, బలా ద్వాక్పాటవాత్, సుధాస్యన్దిభి రమృతస్వాదుభి రతిమధురై రిత్యర్థః, సూక్తైః ప్రియోక్తిభిః - నపుంసకే భావే క్తః, మూర్ఖాన్ ప్రతినేతుం సమాధాతు, మిచ్ఛతి సోఽసా విత్తి సంబన్ధః; మృణాలతన్తుభి ర్వ్యాళనిరోధనాదితుల్య ఇవ మూర్ఖానునయపరోఽప్యత్యన్తావివేకీతి భావః. అత్యన్త దుష్కరం మూర్ఖ ప్రసాదన మితి ఫలితార్థః.



అత్ర, యః ప్రతినేతు మిచ్ఛతి వాఞ్ఛతి అసౌ సముజ్జృమ్భత ఇత్యాది విశిష్టానునయేచ్ఛావిజృమ్భణాది వాక్యార్థయో ర్నిర్దిష్టైకత్వాసంభవాత్ సాదృశ్యలక్షణాయా మసంభవద్వస్తుసబన్ధో వాక్యార్థవృత్తి ర్నిదర్శనాభేదః; న చాయం దృష్టాన్తః, వాక్యభేదేన ప్రతిబిమ్బకరణాక్షేపే తస్యోత్థానాత్, అత్ర తు వాక్యార్థే వాక్యార్థసమారోపా ద్వాక్యైకవాక్యతాయాం తదభావ, ఇ త్యలంకారసర్వస్వకారః.

శార్దూలవిక్రీడితమ్ - 'సూర్యాశ్వై ర్మసజ స్తతాః సగురవః శార్దూలవిక్రీడితమ్' ఇతి లక్షణాత్.

---

అవ.—మూర్ఖులకు మౌనము భూషణము.

స్వాయత్త మేకాన్తహితం విధాత్రా
వినిర్మితం ఛాదన మజ్ఞతాయాః,
విశేషతః సర్వవిదాం సమాజే
విభూషణం మౌన మపణ్డితానామ్. 6

టీక.—విధాత్రా = బ్రహ్మచే, అపణ్డితానామ్ = మూర్ఖులకు స్వాయత్తమ్ - స్వ = తమకు (అపండితులకు) వశమును, ఏకాన్త హితమ్ = నిశ్చయముగా అనుకూలమును, అజ్ఞతాయాః = (తమ) యపండితత్వమునకు, ఛాదనమ్ = మూఁతయు, విశేషతః = ముఖ్యముగా, సర్వ విదాం = సమస్తమును ఎఱిఁగినవారి, సమాజే = సభలో, విభూషణమ్ = (తమకు) అలంకారమును, (అయినట్టిది), మౌనమ్ = పలుకకయుండుట, వినిర్మితమ్ = సృజింపఁబడినది.

తా.—బ్రహ్మ మూర్ఖులపై కరుణించి వారికిఁగాను మౌనమును సృజించినాఁడు. దాని విశేషము లేవనఁగా;—అది ఎప్పుడును వారికిస్వాధీనము, వారికి తప్పక మేలు చేయును, వారి తెలివిలేమిని దాఁచును, ముఖ్యముగా వారికి సర్వమెఱిఁగిన విద్వాంసులసభలో అలంకారముగా నుండును.

తే. స్వవశము హితంబు మూఢతాచ్ఛాదనంబు । గాఁగ నీగతి నిర్మించెఁ గమలభవుఁడు;
సర్వవిదు లగుసుజనుల సభలలోన । మౌనమె విభూషణము మూఢమానవులకు.

వ్యా.—అథైషాం గతి మాహ—స్వాయత్త మితి.—విధాత్రా బ్రహ్మణా కర్త్రా స్వాయత్త మాత్మాధీనం - న తు పరోపదేశసాపేక్షమ్ - ని. 'అధీనో నిఘ్న ఆయత్తః' ఇ త్యమరః, ఏకాన్తహిత మత్యన్తహితకారి - స్వావగుణాచ్ఛాదకత్వా దితి భావః, తథా విశేషతో విశేషాకారేణ - సార్వవిభక్తికస్తసిః, సర్వవిదాం సమాజే సర్వజ్ఞసభాయాం, విభూషణ ముపస్కారహేతుభూతత్వా ద్భూషణప్రాయం, మౌనం తూష్ణీమ్భావః కర్మ వా 'ఇగన్తాచ్చ లఘుపూర్వా ది' త్యణ్, అపణ్డితానా మవిదుషాం సంబన్ధిన్యాః,

అజ్ఞతాయాః, మౌర్ఖ్యస్య, ఛాదన మాచ్ఛాదకం, సత్, వినిర్మితం రచితమ్, అతో౽పణ్డితై ర్నిజమౌర్ఖ్యస్యాగోపనార్థం మౌనే నైవ వర్తితవ్య - మిద మే వైతేషాం గతిః - అన్యథా హాస్యాస్పదతా స్యా దితి భావః, 'ఏకాన్తకృత' మితి పాఠే తు, కృతం కర్మ - భావే క్తః - ఏకాన్తకృతం రహ స్యనుష్ఠితం కర్మ - అజ్ఞతాయాః ఛాదనం స ద్వినిర్మిత - మపణ్డితానాం మౌనం భూషణం స ద్వినిర్మిత - మితి ప్రత్యేక మన్వయో ద్రష్టవ్యః, అజ్ఞతాచ్ఛాదనార్థ మేకాన్త ఏవ కర్మ కర్తవ్య - మపణ్డితై ర్మౌనిభి రేవ స్థాతవ్య - మన్యథా స్వరూపప్రకాశనే నాపహాస్యాస్పదతా స్యా దితి భావః.

ఉపజాతివృత్తమ్ - ఇన్ద్రోపేన్ద్రవజ్ర మితి లక్షణాత్; తౌ ద్వౌ కీదృగ్విధౌ?

'స్యా దిన్ద్రవజ్రా యది తౌ జగౌ గః, ఉపేన్ద్రవజ్రా జతజా స్తతో గౌ,
అనన్తరోదీరితలక్ష్మభాజః పాదా యదీయా ఉపజాతయ స్తాః.'

ఇతి వృత్తరత్నాకరే ఉక్తత్వాత్.

---

అవ.—తెలివి లేనప్పుడు గర్వ ముండును, తెలివి వచ్చినేని వినయము కలుగును.

యదా కిఞ్చిజ్జ్ఞో౽హం గజ ఇవ మదాన్ధః సమభవమ్,
తదా సర్వజ్ఞో౽స్మీ త్యభవ దవలిప్తం మమ మనః,
యదా కిఞ్చిత్ కిఞ్చి ద్బుధజనసకాశా దవగతం,
తదా మూర్ఖో౽స్మీతి జ్వర ఇవ మదో మే వ్యపగతః. 7

టీక.—అహమ్ = నేను, యదా = ఎప్పుడు, కిఞ్చిత్ జ్ఞః (సన్)=కొంచెము తెలిసినవాఁడ(నై), గజః ఇవ = ఏనుఁగు వలె, మద అన్ధః = గర్వముచేతఁ గ్రుడ్డివాఁడనుగా (అనఁగా వివేకహీనుఁడనుగా), సమభవమ్ = ఉంటినో, తదా = అప్పుడు, సర్వ జ్ఞః అస్మి = సర్వము తెలిసినవాఁడను నేను, ఇతి = అని, మమ = నాయొక్క, మనః = మనస్సు, అవలిప్తమ్ = గర్వంచినట్టిది, అభవత్ =ఆయెను; యదా, కిఞ్చిత్ కిఞ్చిత్ = కొంచెకొంచెము, బుధ జన సకాశాత్ = పండిత జనుల యొద్ద, అవగతమ్ = (నాకు) తెలిసినదో, తదా, మూర్ఖః అస్మి ఇతి = మూర్ఖుఁడను నేను అని (తెలిసి), జ్వరః ఇవ = జ్వరమువలె, మే మదః = నా(నన్నుఁ బట్టియున్న) గర్వము, వ్యపగతః = పోయినది.

తా.—నా కేమియు తెలియనప్పుడు సర్వమును నాకు తెలియును నని మదపుటేనుఁగువలె ఎవ్వరిని సరకుగొనక యుంటిని; పెద్దలసేవచేత నాకు కొంచెకొంచెము తెలివి గలిగినంతట, నామూర్ఖత నాకు తెలిసి, జ్వరము పోయి సుఖపడినట్లు, ఆమదము అణఁగి, ఇపుడు సుఖముగా నున్నాను.



చ. తెలివి యొకింత లేనియెడ దృప్తుఁడ నై కరిభంగి సర్వముం
దెలిసితి నంచు గర్వితమతిన్ విహరించితిఁ దొల్లి; యిప్పుడు
జ్జ్వలమతు లైనపండితులసన్నిధి నించుక బోధశాలి నై
తెలియనివాఁడ నై మెలఁగితిన్, గత మయ్యె నితాంతగర్వమున్.

వ్యా.—అథ కశ్చి దనుభవినః పణ్డితాన్ ప్రతి స్వానుభవప్రకార మాహ.—యదేతి.—అకిఞ్చిజ్జ్ఞః అల్పజ్ఞ స్సన్, యదా యస్మిన్ సమయే, గజ ఇవ, మదేన దర్పే - ణాన్ధః కర్తవ్యాకర్తవ్యవివేకశూన్యః, సమభవం జాతో౽స్మి, తదా తస్మిన్ సమయే, సర్వజ్ఞః అశేషజ్ఞో, ౽స్మీతి మమ మనో, ౽వలిప్తం గర్విత మభవత్ - అల్పవిద్యో మహాగర్వీ తి న్యాయా దల్పజ్ఞత్వ స్యైవ గర్వహేతుత్వా దితి భావః, ని. 'అవలేప స్తు గర్వే స్యా ల్లేపనే దూషణే౽పి చే'తి విశ్వప్రకాశః, యదా బుధజనసకాశా ద్విద్వజ్జనముఖా ది త్యర్థః - 'ఆఖ్యా తోపయోగ' ఇ త్యపాదానత్వాత్ పఞ్చమీ, కిఞ్చి త్కిఞ్చిత్ స్వల్పం స్వల్పం - శాస్త్రబోధితాచారాదిక మితి శేషః, అవగతం జ్ఞాతం, తదా, మూర్ఖో మూఢో౽స్మీతి, మే మమ, మదో జ్వర ఇవ, వ్యపగతో నిర్గతః, అభూ దితి శేషః, జ్వరవద్వికారకారిత్వా దస్యైత త్సామ్య మి త్యవగన్తవ్యమ్, 'ఆచార్యవా న్పురుషో వేదే' తి శ్రవణా దాచార్యా దవగతవిద్య స్యైవ వివేకసంభవా దితి భావః; అల్పజ్ఞో౽పి సన్ యః స్వం సర్వజ్ఞ మాత్మానం మనుతే స ఏవ మూర్ఖః, య స్తు సర్వజ్ఞో౽పి మూఢమానీ భవతి స ఏవ విద్వా నితి వివేకః. మదో గర్వహేతు, ర్గురుశుశ్రూషాది ర్వినయహేతు రితి ఫలితార్థః; య ద్వా ఏతావన్తం కాలం మదవశా న్మూర్ఖో౽స్మి, ఇదానీం గురుశిక్షావశా ద్వివేకావగతి, రితి వా యోజనీయమ్.

శిఖరిణీవృత్తం - 'రసై రుద్రై శ్ఛిన్నా యమనసభలా గః శిఖరిణీ' తి లక్షణాత్

---

అవ.—నీచుఁడు నీచమందే ఆసక్తుఁడై లజ్జింపక యుండు ననుట.

క్రిమికులచితం లాలాక్లిన్నం విగన్ధి జుగుప్సితం
నిరుపమరసప్రీత్యా ఖాదన్ ఖరాస్థి నిరామిషమ్,
సురపతి మపి శ్వా పార్శ్వస్థం విలోక్య న శఙ్కతే;
న హి గణయతి క్షుద్రో జన్తుః పరిగ్రహఫల్గుతామ్. 8

టీక.—శ్వా = కుక్క, క్రిమి కుల చితమ్ = పురుగుల సమూహముచేత పొదువుకొన్నఁబడినది (యు), లాలా క్లిన్నమ్ = చొంగచేత తడిసినది(యు), విగన్ధి = చెడు కంపుగలది (యు), జుగుప్సితమ్ = రోఁతకలిగించునది(యు), నిర్ ఆమిషమ్ = మాంసములేనిది (యు), (అగు), ఖర అస్థి = గాడిద యెముకను, నిర్। ఉపమ రస ప్రీత్యా = సాటి

లేని రుచియందలి (అనఁగా ఉత్తమరుచియం దుండఁదగిన) సంతసముతో, ఖాదన్ = కొఱుకుచున్నదై, పార్శ్వస్థమ్=ప్రక్క నున్న, సురపతిమ్ అపి=ఇంద్రు నేనియు, విలోక్య = చూచి, న శఙ్కతే = లజ్జింపదు ; క్షుద్రః జన్తుః = మ్రుక్కడి ప్రాణి, పరిగ్రహఫల్గుతామ్ = (తాను) కైకొనుదానియొక్క తుచ్ఛతను, న గణయతి హి = గణింపదు గదా.—

తా.—కుక్క వృత్తము.—కుక్క తనకు ఒక గాడిద యెముక దొరకి ఆయెముకయు పురుగులతో నంతట లుకలుకలాడుచు తన చొంగలోనే తడిసి కంపుగొట్టుచు రోఁతపుట్టించుచు మాంసములేకయున్నను దానిని మంచి రుచియం దుండఁదగిన ప్రీతితో కొఱుకుచున్నదై తన్ను ప్రక్కను దేవేంద్రుఁడు నిలిచి చూచుచున్నను ఆతనిం గని లజ్జింపదు.—ఇట్లే లోకములో నీచుఁడు తాను గ్రహించిన దాని తుచ్ఛత్వమును తలపోయఁడు.

చ. క్రిమిసముదాయసంకులము గేవలనింద్యము పూతిగంధి హే
యమును నిరామిషంబును ఖరాంగభవం బగు నెమ్ముఁ గుక్క దా
నమలుచుఁ, జెంత నున్న సురనాథుని గన్గొని సిగ్గు చెంద, ద
ల్ప మని నిజస్వభావముఁ దలంపదు నీచపుఁబ్రాణి యెయ్యెడన్.

వ్యా.—మూర్ఖస్యాతినైచ్యం దృష్టాన్తముఖే నాహ.—క్రిమికుల మితి.—శ్వా శునకః, క్రిమికులై రమేధ్యమధ్యోత్పత్తిమ దపాదజన్తు సంతతిభిః, చితం వ్యాప్తం, లాలాక్లిన్నం వసాపూరార్ద్రం - య ద్వా - లాలా సృణీకా దన్తాన్తర్జల మితి యావత్ - ని. 'సృణీకా స్యన్దినీ లాలే' త్యమరః - తయా క్లిన్నం ఖాదనసమయే తస్యా స్తత్ర స్రవణా దితి భావః, విగన్ధి దుర్గన్ధి - అత్ర విశబ్దస్య పూతిపర్యాయత్వ వివక్షాయాం, 'గన్ధస్యే' త్యాదినా సమాసాన్త ఇకారో ఽన్తాదేశః - య ద్వా - విగన్ధ ఆమగన్ధో ఽస్యాస్తీతి విగన్ధి, అత ఏవ, జుగుప్సితం హేయం, త దపి, నిరామిషం మాంసలేశ శూన్యం, త దపి, ఖరాస్థి రాసభకీకసం, నిరుపమః - ఉపమానరహితో - యో రసః స్వాదః - తత్ర యా - ప్రీతిః ప్రేమా తయా, ఖాద న్భక్షయ, న్పార్శ్వస్థ మన్తికస్థం - 'సుపి స్థ' ఇతి క ప్రత్యయః, సురపతి మిన్ద్ర మపి - కిము తాన్య మితి భావః, విలోక్య, న శఙ్కతే న లజ్జతే, తథా హి - క్షుద్రో జన్తుః నీచజన్తుః - పరిగ్రహే స్వీకృతవస్తుని - ఫల్గుతాం తుచ్ఛత్వం, న గణయతి న మనుత ఇ త్యర్థః, జుగుప్సితకర్మాచరణతత్పరో మూర్ఖో ఽప్యేవం న మహద్విగర్హణా ద్బిభే తీతి భావః, ని. 'పత్నీ పరిజ నాదాన మూల శాపాః పరిగ్రహాః' ఇ త్యమరః, 'ఫల్గు తుచ్ఛ మసారం చే' తి యాదవ శ్చ.

అత్రాప్రస్తుతవృత్తాన్తకథనాత్ ప్రస్తుతమూర్ఖజనవృత్తప్రతీతే రప్రస్తుతప్రశంసాలంకారః.



'అప్రస్తుతస్య కథనాత్ ప్రస్తుతం యత్ర గమ్యతే
అప్రస్తుతప్రశంసేయం సారూప్యాదినియన్త్రితా'. ఇతి లక్షణాత్.

హరిణీవృత్తం - 'భవతి హరిణీ న్సౌ మ్రౌ స్లౌ గో రసామ్బుధి విష్టపైః' ఇతి లక్షణాత్.

---

అవ.—వివేకము కోలుపోవువారికి నీచనీచతర దశాపరంపర కలుగును.

శిరః శార్వం స్వర్గాత్, పశుపతిశిరస్తః క్షితిధరం,
మహీధ్రా దుత్తుఙ్గా దవని, మవనే శ్చాపి జలధిమ్,
అధో గఙ్గా సేయం పద ముపగతా స్తోక; మథవా,
వివేకభ్రష్టానాం భవతి వినిపాతః శతముఖః. 9

టీక.—సా ఇయం గఙ్గా = ప్రసిద్ధమయిన యీ గంగానది, స్వర్గాత్ = స్వర్గమునుండి, శార్వమ్ = శివునిదైన, శిరః = శిరస్సును, పశుపతి = శివునియొక్క - శిరస్తః = శిరస్సునుండి, క్షితిధరమ్ = (హిమాలయ) పర్వతమును, ఉత్తుఙ్గాత్ = ఎత్తైన, మహీధ్రాత్ = (ఆ) పర్వతమునుండి, అవనిమ్ = భూమిని, అవనేః చ అపి = భూమినుండి యు, జలధిమ్ = సముద్రమును, అధః = క్రింద - అనఁగా పాతాళమున, స్తోకం = కొంచెపాటి, పదం = చోటును, ఉపగతా = చేరినది, అథవా = అట్లన నేల, వివేకభ్రష్టానాం = వివేకమునుండి జాఱినవారికి, శతముఖః = నూఱువిధములుగల, వినిపాతః = అధోగతి, భవతి = కలుగును.

తా.—గంగ స్వర్గమును వదలినది మొదలు ఒక చోటనేనియు స్థిరముగా నిలువక పరమాధోగతిపాలు అగువఱకు పడుచునే యుండెను. అట్లే వివేకమును వదలినవాఁడును క్రమముగా పరమనీచదశకు వచ్చును.

శా. ఆకాశంబుననుండి శంభునిశిరం, బందుండి శీతాద్రి, సు
శ్లోకం బైనహిమాద్రినుండి భువి, భూలోకంబునందుండి య
స్తోకాంభోధిఁ, బయోధినుండి పవనాంధోలోకముం, జేరె గం
గాకూలంకష; నెక్కుభంగులు వివేకభ్రష్టసంపాతముల్.

వ్యా.—అథావివేకస్యానర్థాదికథనద్వారా వివేకస్యావశ్యకత్వం ప్రదర్శయతి—శిర ఇతి.—అత్రోత్తరవాక్యే తచ్ఛబ్దస్య విద్యమానత్వా ద్యచ్ఛబ్దో ఽధ్యాహర్తవ్యః - యత్తదో ర్నిత్యసంబన్ధాత్ - ఉత్తరవాక్యస్థయచ్ఛబ్దస్యైవ పూర్వవాక్యే తచ్ఛబ్దాపేక్షితత్వ నియమాత్; తథా చ యా గఙ్గా స్వర్లోకాత్, శర్వ స్యేదం శార్వ మైశ్వరం - ని. 'ఈశ్వర శ్శర్వ ఈశాన' ఇ త్యమరః - త స్యేద మి త్యణ్ప్రత్యయః,

శిరశ్శిఖర, ముపగతేతి సర్వత్రానుషజ్యతే, ప్రథమత ఇతి శేషః, తదను, పశుపతే శ్శర్వస్య-శిర స్తశ్శిఖరాత్ - పఞ్చమ్యా స్తసిల్, ధరతీతి ధరః - పచాద్యచ్ - క్షిత్యాః ధరః క్షితిధరః - తం హిమవన్త, ముపగతా, మహీం ధరతీతి మహీధ్రః - మూలవిభుజాదిత్వాత్కః ప్రత్యయః - యథాహ వామనః 'మహీధ్రాదయో మూలవిభుజాదిదర్శనాది'తి - అత ఏవ - ని. 'మహీధ్ర శిఖరి క్ష్మాభృ ది' త్యాద్యమరః, ఉత్తుఙ్గా దున్నతా, న్మహీధ్రా ద్ధిమవదాఖ్యక్షితిధరా, దవనిం భువ, ముపగతా, అవనే శ్చాపి, జలధిం సముద్ర, ముపగతా - 'నదీనాం సాగరో గతి రి'తి'గఙ్గా సాగరపూరణీ'తి వచనా దితి భావః, అథో అన్తరం - ని. 'మఙ్గళానన్తరారమ్భ ప్రశ్న కార్త్స్న్యేష్వథో అథే' త్యమరః - సేయం పరిదృశ్యమానా గఙ్గా మన్దాకినీ, స్తోక మల్పం పరిమిత మితి యావత్, పదం స్థానమ్, ఉపగతా ప్రాప్తా, య ద్వా - అధః ఉక్తప్రకారే ణాధః ప్రదేశే - పాతాళే వా - పద మితి యోజనా - అథ వా తథా హీ త్యర్థః - పక్షాన్తరే వా - వివేక భ్రష్టానాం వివేక శూన్యానాం - స్థానభ్రష్టానాం చ, శతముఖో బహుప్రకారః, వినిపాతో భఙ్గః - అధోఽధః పతనం చ, భవతి, వివేకయుక్తానాం తు నైవమ్, అతో వివేకా న్న భ్రంశితవ్య మితి భావః. యత స్సకలలోక మహితాయా అపి గఙ్గాయా భ్రంశవశా దీదృగవస్థాపత్తిః, కిము తాన్యేషా మితి వివేక స్యాత్యన్తావశ్యకత్వ మిత్యవగన్తవ్యమ్. పురా కిల తత్ర భవాన్ భగీరథో ఽశ్వమేధీయా శ్వాన్వేషణ తత్పరతయా పాతాళ ముపగతానాం కపిల విలోచ నానల భస్మీకృతానాం సగరకుమారాణా మూర్ధ్వలోక ప్రాప్త్యర్థం స్వర్లోకాత్ సురసరిత మవతారయామా సేతి పౌరాణికీ కథాఽత్రానుసంధేయా.

అత్రానేకస్మి న్నాధారే క్రమే ణైకస్యా ఆధేయభూతాయాః గఙ్గాయాః స్థితి కథనాత్ పర్యాయాఖ్యో ఽలంకారః; త దుక్తం విద్యానాథేన:—

'క్రమే ణైక మనేకస్మి న్నాధారే వర్తతే యది
ఏకస్మి న్నథవాఽనేకే పర్యాయాలంకృతి స్మృతా.' ఇతి.

శిఖరిణీవృత్తం-లక్షణ ముక్తమ్.

---

అవ.—మూర్ఖుని మూర్ఖతను వారింప నుపాయము లే దనుట.—

శక్యో వారయితుం జలేన హుతభుక్, ఛత్త్రేణ సూర్యాతపో,
నాగేన్ద్రో నిశితాఙ్కుశేన సమదో, దణ్డేన గోగర్దభః,
వ్యాధి ర్భేషజసంగ్రహైశ్చ వివిధై, ర్మన్త్రప్రయోగై ర్విషం,
సర్వ స్యౌషధ మస్తి శాస్త్రవిహితం, మూర్ఖస్య నాస్త్యౌషధమ్.



టీక.—హుతభుక్ = నిప్పు, జలేన = నీళ్లచేత, వారయితుం = నివారించుటకు, శక్యః = అలవియగునది; సూర్య ఆతపః = సూర్యుని యెండ, ఛత్త్రేణ = గొడుగుచేత, (వార...నది); స మదః = మదముతోఁ గూడిన, నాగ ఇన్ద్రః = గజ శ్రేష్ఠము, నిశిత అఙ్కుశేన=వాఁడియైన యంకుశముచేత, (వార...నది); గౌః గర్దభః = యెద్దు గాడిద, దణ్డేన = కఱ్ఱచే, (వారయితుం శక్యౌ = నివారింపఁ గూడినవి); వ్యాధిః = రోగము, భేషజసంగ్రహైః చ = మందుల సేకరముచేతను, (వార...నది); విషం = విషము, వివిధైః = నానావిధములగు, మన్త్ర ప్రయోగైః = మంత్రముల ప్రయోగములచేతను, (వార...నది); ఇట్లు, సర్వస్య = సకలమునకును, శాస్త్ర విహితమ్=శాస్త్రమున విధింపఁబడిన, ఔషధమ్ = మందు, అస్తి = కలదు; మూర్ఖస్య = మూర్ఖునికి, నాస్తి=లేదు.

తా.—నిప్పునకు నీళ్లు, ఎండకు గొడుగు, మదపుటేనుఁగునకు వాఁడియంకుశము, ఎద్దునకును గాడిదకును కఱ్ఱ, రోగమునకు మందు, విషమునకు మంత్రములును - ఈవిధముగా బాధకముల కెల్ల లోకములో నివారణోపాయము కలదుగాని, మూర్ఖతకు లేదు.

చ. జలముల నగ్ని, శూర్పమునఁ జండమయూఖుని, దండతాడనం
బుల వృషగర్దభంబులను, బో ల్పగుమత్తకరీంద్రము న్సృణిం,
జెలఁగెడురోగ మౌషధముచే, విషముం దగు మంత్రయుక్తి, ని
మ్ములఁ దగఁ జక్కఁజేయ నగు; మూర్ఖునిమూర్ఖత మాన్ప వచ్చునే!

వ్యా.—అథాగ్న్యాదీనాం వినివారణే శాస్త్రప్రతిపాదిత జలాదిరూప హేతూన్ ప్రతిపాద్య మౌర్ఖ్యస్య నివారణే శాస్త్రీభావం హేత్వభావం చ స్ఫుటీకుర్వ న్నాహ:—శక్య ఇతి.—హుతభుక్ - హుతం హోమద్రవ్యం హవిఃపురోడాశవపాది - భునక్తీతి హుతభుక్ వైదికాగ్నిః - అత్ర తు గృహాదిదాహకృత్ లౌకికోఽగ్ని రితి మన్తవ్యం, జలేన ఉదకేన, వారయితుం నివారయితుం, శక్య, ఏవం రీత్యా, సూర్యాతప - స్సూర్యస్య రవే రాతపః, ఛత్త్రేణ వారయితుం శక్య ఇతి పదద్వయ స్యోత్తరత్రా ప్యనుషఙ్గ ఇతి మన్తవ్యం, సమదః మదసహితః, నాగేన్ద్రః గజశ్రేష్ఠః, నిశితాఙ్కుశేన తీక్ష్ణాఙ్కుశేన, గౌః వృషభః, గర్దభో రాసభ శ్చ, దణ్డేన, వ్యాధిః కుష్ఠాదిరోగః, భేషజ సంగ్రహైః ఔషధ సంగ్రహణై శ్చ, అత్ర చకారాత్ మహామన్త్రజప హోమ సురార్చన దానాదిక మపి గృహ్యతే - 'తచ్ఛాన్తిరౌషధై ర్దానై ర్జపహోమ సురార్చనై రి'తి స్మరణాత్, విషం కాలకూటాది, వివిధై ర్నానావిధైః, మన్త్రైః మన్తారం త్రాయన్తే గరున్తీతి మన్త్రాః - నైగమన్త్రైః ప్రణవాదిభిః - వివిధైః ప్రయోగై శ్చ, నివారయితుం శక్య మిత్యర్థః, తస్మాత్ సర్వస్య ప్రాణిహింసా కారణీ భూత దుష్టజన్తు జాతస్య, శాస్త్రవిహితం శాస్త్రవిధిచోదిత,

మౌషధం జలాదిరూపభేషజమ్, అస్తి, మూర్ఖస్య తు, ఔషధం సుభాషితాదిరూపం, నాస్తి శాస్త్రవిహితం న వర్తతే.

ఇతి నీతిశతక వ్యాఖ్యానే మూర్ఖపద్ధతివర్ణనం నామ
ప్రథమదశకమ్.

---

## విద్వత్పద్ధతిః.

---

శాస్త్రోపస్కృతశబ్దసుందరగిరః శిష్యప్రదేయాగమా
విఖ్యాతాః కవయో వసన్తి విషయే యస్య ప్రభో ర్నిర్ధనాః,
త జ్జాడ్యం వసుధాధిపస్య; సుధియ స్త్వర్థం వినాఽపీశ్వరాః;
కుత్స్యాః స్యుః కుపరీక్షకై ర్న మణయో యై రర్ఘతః పాతితాః. 11

టీక.—శాస్త్ర...గిరః—శాస్త్ర = (తర్క వ్యాకరణాది) శాస్త్రములచే - ఉపస్కృత = సంస్కరింపఁబడిన (నిర్దోషమైన అనుట) - శబ్ద = పదములచే - సుందర = అందమయిన - గిరః = వాక్కు గలవారును, శిష్య ప్రదేయ ఆగమాః = శిష్యులకు ఈయఁదగిన (నేర్పఁదగిన) శాస్త్రములు గలవారును, విఖ్యాతాః = మిక్కిలి ప్రసిద్ధికెక్కిన వారును, (అగు), సుధియః = విద్వాంసులు, నిర్ధనాః (సన్తః) = ధనహీనులై, యస్య ప్రభోః = ఏ రాజుయొక్క, విషయే = దేశమందు, వసన్తి = ఉందురో, తత్ = అది (అట్లు వారు ధనహీనులై యుండుట), (తస్య) వసుధా + అధిపస్య = (ఆ) భూనాయకునియొక్క, జాడ్యం = మూఢత, సుధియ స్తు = పండితు లన్ననో, అర్థం వినా అపి = ధనము లేకయే, ఈశ్వరాః = సమర్థులు, మణయః = రత్నములు, యైః కుపరీక్షకైః = చేతఁగానియేమదింపుగాండ్రచేత, అర్ఘతః పాతితాః = వెలనుండి తగ్గింపఁబడెనో, తే కుత్స్యాః స్యుః = వారు నింద్యులు అగుదురు, మణయః న = (ఆ) మణులు నింద్యములు గావు.

తా.—మదింపువేయువాఁడు తెలివి చాలక రత్నములకు తక్కువవెల వేసెనేని ఆతఁడే నింద్యుఁ డగును గాని వానివెల అంతమాత్రాన తగ్గనేరదు. అట్లే ఏరాజు తన దేశములోనిపండితోత్తముల దారిద్ర్యమును పోఁగొట్టఁడో, ఆతఁడే మూఢుఁ డనిపించుకొనును గాని, ప్రసిద్ధులయిన యా పండితుల సామర్థ్యమునకు ధనహీనతచే ఏలోపమును గలుగదు.

చ. సకలకళావిభూషితులు శబ్దవిదుల్ నయతత్త్వబోధకుల్
ప్రకటకవీంద్రు లేనృపతి పజ్జను నిర్ధను లై చరింతు రా
వికృతపుజాడ్య మాఁదొగడ; విత్తము లేకయు వారు పూజ్యు, లం
ధకజనదూషితంబులు ఘనంబులు గావె యమూల్యరత్నముల్.



వ్యా.—అథ మూర్ఖపద్ధతివైలక్షణ్యేన విద్వత్పద్ధతిం వర్ణయతి; యద్వా, యదుక్తం వివేక స్యాత్యన్తావశ్యకత్వం, తస్య శాస్త్ర పరిజ్ఞాన సాధ్యత్వాత్, తస్య చ, విద్వదధీనత్వాత్, తత్పద్ధతివర్ణన మిదానీ మారభతే.—శాస్త్రేతి.—శాస్త్రైః కాణాదగౌతమీయాదిభి-రుపస్కృతాః అలంకృతా-స్తథా శబ్దేన వ్యాకరణేన - సుందరాః - గిరో వాచో - యేషాం తే తథోక్తాః - అత్ర యద్యపి శాస్త్రపదగ్రహణే నైవ సర్వేషాం శాస్త్రాణాం సంగ్రహాత్ పార్థక్యేన శబ్దశాస్త్రగ్రహణే పౌనరుక్త్యం దూషణం స్యాత్ - తథాఽపి గోబలీవర్దన్యాయేన సమాధేయం - యద్వా 'సర్వశాస్త్రముఖం వ్యాకరణమ్' ఇతి తస్య ప్రాధాన్యాత్ పార్థక్యేన నిర్దేశః - అథవా ఇతరేషాం శాస్త్రాణా ముపస్కారహేతుభూతత్వమాత్ర మేవ - అస్య తు 'వాణీ వ్యాకరణేన' ఇతి స్వే నై వోత్తరత్ర వక్ష్యమాణత్వాత్ తదేకాన్తసౌన్దర్యావహత్వేన పృథగ్గ్రహణ మితి మన్తవ్యమ్, తథా శిష్యేభ్యో ఽన్తేవాసిభ్యః - ప్రదేయాః వ్యాఖ్యానరూపేణ ప్రదాతుం యోగ్యాః - ఆగమాః శాస్త్రాణి యేషాం తే తథోక్తాః - సమ్యక్ శిక్షాపాటవాత్ ప్రబుద్ధాఖిలశాస్త్రసిద్ధాన్తత్వేన శిష్యద్వారా వ్యాఖ్యాతనిఖిలాగమా ఇత్యర్థః - యద్వా శిష్యేభ్యః ప్రదేయాః వినియోగార్హాః న తు కుహకతయా గర్భ ఏవ జీర్ణీకృతా ఇత్యర్థః - తథా భూతా ఆగమా యేషాం తే తథోక్తాః - ని. 'ఆగమః శాస్త్ర ఆయతౌ' ఇతి విశ్వః, అత ఏవ విఖ్యాతాః సర్వత్ర ప్రసిద్ధాః, కవయో విద్వాంసః, నిర్ధనాః ధనహీనాః సన్తః, యస్య ప్రభో రాజ్ఞో, విషయే దేశే సన్నిధౌ వా, వసన్తి తిష్ఠన్తి, తన్నిర్ధనత్వే నావస్థానం, తస్య వసుధాధిపస్య ప్రభో, రేవ, జాడ్యం మాన్ద్యం హైన్య మితి యావత్ * 'గుణవచన బ్రాహ్మణాదిభ్యః కర్మణి చే' తి ష్యఞ్ప్రత్యయః, సుధియో విద్వాంస స్తు, అర్థం ధనం, వినాఽపి - 'పృథగ్వినే' త్యాదినా వికల్పాద్ద్వితీయా, ఈశ్వరాః సమర్థాః పూజ్యా ఇత్యర్థః - విద్యయా ఏవ తేషాం మహాధనత్వా దితి భావః, కిం తు, యైః కుపరీక్షకైః రత్నశాస్త్ర పరిజ్ఞానాభావాత్ కుత్సితపరిజ్ఞానిభిః, మణయః అమూల్యా అపీతి భావః, అర్ఘతః మూల్యతః, పాతితాః యది బహుమూల్యా మణయో ఽల్పమూల్యాః కృతా ఇత్యర్థః, కుత్స్యాః స్యుః కిం, న స్యు రే వేత్యర్థః. అయ మర్థః - విద్వద్భిః ప్రభుసమాశ్రయే నైవ స్థాతవ్యం, 'సదాశ్రయేణ శోభన్తే పణ్డితా వనితా లతా' ఇతి న్యాయాత్; తత్ర స తే యది విద్వన్మనోరథం పూరయేయు స్తర్హి తేషా మేవ కుత్సితత్వం, విద్వాంస స్తు కుపరీక్షకోపహత మణయ ఇవ న కుత్స్యా ఇతి; అతః శ్రేయఃకామైః ప్రభుభిః తన్మనోరథ పూరకై రేవ భవితవ్య మితి తాత్పర్యమ్. శార్దూలవిక్రీడితం వృత్తం—లక్షణం తూక్తమ్.

---

అవ.—ధనవంతులకన్న విద్వాంసులే రాజులకు సమాదరణీయులు.

హర్తు ర్యాతి న గోచరం, కిమపి శం పుష్ణాతి యత్ సర్వదాఽ,
ప్యర్థిభ్యః ప్రతిపాద్యమాన మనిశం ప్రాప్నోతి వృద్ధిం పరామ్,
కల్పాన్తే ష్వపి న ప్రయాతి నిధనం, విద్యాఖ్య మన్తర్ధనం
యేషాం, తాన్ ప్రతి మాన ముజ్ఝత నృపాః. కస్తైః సహ స్పర్ధతే?

టీక.—యత్ = ఏది (ఏవిద్యాధనము), హర్తుః = అపహరించువానికి, గోచరం = వశమును, న యాతి = పొందదో - దొరకదో అనుట; (అట్లే), సర్వదా = ఎల్లప్పుడును, కి మపి = చెప్పనలవికాని, శం = సుఖమును, పుష్ణాతి = పెంచునో; అనిశమ్ = సదా, అర్థిభ్యః = కోరువారికి, ప్రతిపాద్యమానమ్ అపి = ఒసఁగఁబడుచున్నప్పటికిని, పరాం = ఉత్కృష్టమైన, వృద్ధిం = పెంపును, ప్రాప్నోతి = పొందునో; (అట్లే), కల్పాన్తేషు అపి=ప్రళయకాలములందు సయితము, నిధనం = నాశమును, న ప్రయాతి = పొందదో; (తత్ = ఆ), విద్యా ఆఖ్యమ్ = విద్యయను పేరుగల, అన్తర్ధనం = లోపలి ధనము, యేషాం=ఎవరికి, (అస్తి=కలదో), తాన్ ప్రతి = వారియెడల, హే నృపాః = ఓ రాజులారా, మానమ్ = గర్వమును, ఉజ్ఝత = విడువుఁడు; తైః సహ = వారితోడ, కః = ఎవఁడు, స్పర్ధతే = మచ్చరించును.

తా.—విద్యయందు—ధనమునకుఁ గల దోషములు ఏవియు లేక, దానికి లేని గుణము లెన్నియో గలవు గాన—విద్వాంసులను ఆదరించుట రాజులకు శ్రేయము.

ఉ. హర్తకుఁ గాదు గోచర, మహర్నిశముఁ సుఖపుష్టి సేయు, స
త్కీర్తి ఘటించు, విద్య యను దివ్యధనం, బఖిలార్థికోటికిం
బూర్తిగ నిచ్చినం బెరుఁగుఁ, బోదు యుగాంతపువేళ నైన, భూ
భర్తలు దద్ధనాధికులపట్టున గర్వము మాను టొప్పగున్.

వ్యా.—అథ విద్యాధనస్య ప్రసిద్ధధనవైలక్షణ్య వర్ణనద్వారా విదుషా ముత్కర్ష మాపాదయ న్నేతేషు గౌరవేణ విశ్వాసోత్పాదనార్థం నృపాన్ సంబోధయతి; హర్తురితి.—య ద్విద్యాఖ్యం ధనం, హర్తు శ్చోరాదేః - 'హర్తు మితి' తుమున్నన్తపాఠే అపహర్తు మి త్యర్థః, గోచరం న యాతి విషయతాం న ప్రాప్నో తీతి - భావప్రధానో నిర్దేశః - త స్యాత్యన్తదుర్గ్రహత్వా దితి భావః, తథా సర్వదా కాల త్రయేఽపి, కి మ ప్యనిర్వాచ్యం, శం సుఖం, పుష్ణాతి వర్ధయతి - 'అర్థానా మర్జనే దుఃఖ మి'తి స్మరణాత్ - ప్రసిద్ధం తు నైవ మితి భావః, అనిశం సర్వదా, అర్థిభ్యో విద్యార్థిభ్యః యాచకేభ్య శ్చ; ప్రతిపాద్యమానం వ్యాఖ్యాయమానం దీయమాన మపి చ, పరా ముత్కృష్టాం- వృద్ధి మభ్యుచ్ఛ్రియం, ప్రాప్నోతి - విద్యాయా వ్యాఖ్యానే నాభివృద్ధి సంభవా దితి



భావః, తథా కల్పాన్తేషు ప్రళయే ష్వపి, నిధనం నాశం-న ప్రయాతి న సశ్య తీ త్యర్థః, కల్పాన్తే ష్వ పీతి బహువచనగ్రహణం విద్యాధన స్యాత్యన్తవినాశాభావ ప్రకాశనార్థమ్, ప్రసిద్ధం తూ క్తవిపరీత మితి భావః - త దుక్తం—

'న భోగహార్యా, న చ బన్ధుహార్యా, న భ్రాతృహార్యా, న చ రాజహార్యా,
స్వదేశమిత్త్రం, పరదేశబన్ధు, ర్విద్యాసుధాం యే పురుషాః పిబన్తి.' ఇతి,

త ద్విద్యాఖ్యం విద్యాభిధానం, య త్తదో ర్నిత్యసంబన్ధా. త్తచ్ఛబ్ద స్యాధ్యాహారః, అన్తర్ధన మభ్యన్తరస్థవిత్తం, యేషాం పురుషాణా మ స్తీతి శేషః, అత స్తా న్విద్యాధనా నప్రతి, హే నృపాః రాజానో, మానం కోపం దురాగ్రహ మితి యావత్, ఉజ్ఝత, తై ర్విద్వద్భి స్సహ, కః పుమాన్ - స్పర్ధతే నిగృహ్ణాతి - న కో పీ త్యర్థః, అత స్తే సర్వదా గౌరవేణ బహుమాననీయా ఇతి భావః.

అత్రోపమానాత్ ప్రసిద్ధ ధనా దుపమేయస్య విద్యాధన స్యాధిక్యకథనా ద్వ్యతిరేకాలంకారః - 'ఉపమానా ద్య దన్యస్య వ్యతిరేక స్స ఏవ స' ఇతి కావ్యప్రకాశకారలక్షణాత్. వృత్తం పూర్వవత్.

---

అవ.—ఐశ్వర్యమునకు పండితులు కట్టుపడ రనుట.

పరిగతపరమార్థాన్ పణ్డితాన్ మాఽవమంస్థా,
స్తృణ మివ లఘు లక్ష్మీ ర్నైవ తాన్ సంరుణద్ధి;
అభినవమద రేఖాశ్యామగణ్డస్థలానాం
న భవతి బిసతన్తు ర్వారణం వారణానామ్. 13

టీక.—పరి...ర్థాన్—పరిగత = పొందఁబడిన - పరమ = ఉత్కృష్టమైన - అర్థాన్ = వస్తువుగలవారైన - తత్త్వ మెఱింగిన యనుట, పండితాన్ = విద్వాంసులను, మా అవమంస్థాః=తిరస్కరింపకుము; (ఏలయన), తృణమ్ ఇవ =గడ్డిపరకవలె, లఘు = అల్పమైన - లక్ష్మీః = (నీ) సిరి, తాన్=వారిని - న సంరుణద్ధి ఏవ = ఆఁపనే ఆఁపదు; (ఇందులకు దృష్టాంతము), అభి...స్థలానామ్ - అభినవ = మిక్కిలి క్రొత్తలైన-మద = మదజలముయొక్క - రేఖా = చాఱలచే - శ్యామ = నల్లనైన - గణ్డస్థలానాం = చెక్కిళ్లప్రదేశములుగల, వారణానాం = ఏనుఁగులకు, బిస తన్తుః = తామరతూఁటిలోని పోఁగు, వారణం = అడ్డగించునది, న భవతి = కాదు.

తా.—మదపుటేనుఁగులు తామరతూఁటిదారమునకుం బోలె పండితులు రాజులకుడై శ్వర్యమునకు కట్టుపడరు.

తే. ప్రభులు పండితు లగువారివలన గర్వ । కలన మానుఁడు; వారు మీ కలిమి తృణము
లీలఁ బోలింప లేమి. మృణాళగుణము । భూరిమదవారణములకు వారణంబె?

వ్యా.—అథ త్వదీయలక్ష్మీర్న తేషాం ప్రతిబన్ధికా, అత స్తేషు బహుమానాచరణ తత్పరే ణైవ భవితవ్య మితి సదృష్టాన్తం రాజానం సంబోధయతి; పరీతి.—హే నృప, పరిగత పరమార్థాన్ విజ్ఞాత తత్త్వార్థాన్—'సర్వే గత్యర్థా జ్ఞానార్థా' ఇతి న్యాయాత్—అథవా ప్రాప్తపురుషార్థాన్, పణ్డితాన్ విదుషో, మావమంస్థాః మావమానయ - మన్యతే రవపూర్వా ల్లుఙి థాసి 'న మాఙ్యోగ' ఇ త్యట్ప్రతిషేధః, కుత స్తృణ మివ లఘు నిస్సారా—లక్ష్మీ స్త్వదీయసంపత్తిః - ని. 'శోభా సంపత్తి పద్మాసు లక్ష్మీః శ్రీ రివ గీయతే' ఇతి విశ్వః, తాన్ పణ్డితాన్, నైవ సంరుణద్ధి ఈష దపి సంరోద్ధుం న శక్నో తీ త్యర్థః; తత్ర దృష్టాన్తః, అభినవ - మదరేఖాభిః దానధారాభిః - శ్యామాని గణ్డస్థలాని యేషాం తేషాం, వారణానాం మత్తేభానాం, బిసతన్తుః మృణాళసూత్రం, వారణం ప్రతిబన్ధక భూతం, న భవతి; అతః పణ్డితేషు బహుమానాచరణ తత్పరత్వే నైవ వర్తితవ్య మి త్యర్థః.

అత్ర దృష్టాన్తాలంకారః—

'యత్ర వాక్యద్వయే బిమ్బప్రతిబిమ్బత యోచ్యతే.
సామాన్యధర్మో వాక్యజ్ఞైః స దృష్టాన్తో నిగద్యతే.'

ఇతి లక్షణాత్; స చోక్తోపమయాఽఙ్గేన సంకీర్యతే.

మాలినీవృత్తం - 'ననమయయయుతేఽయం మాలినీ భోగిలోకైః' రితి లక్షణాత్.

---

అవ.—రాజు పండితులను తన సభనుండి పొమ్మనఁగలఁడే గాని వారి పాండిత్య కీర్తిని పోఁగొట్టలేఁ డనుట.

అమ్భోజినీవనవిహారవిలాస మేవ
హంసస్య హన్తి నితరాం కుపితో విధాతా,
న త్వస్య దుగ్ధజలభేదవిధౌ ప్రసిద్ధాం
వైదగ్ధ్యకీర్తి మపహర్తు మసౌ సమర్థః. 14

టీక.—విధాతా = బ్రహ్మ, కుపితః = కోపగించినవాఁడై, హంసస్య = (తనవాహనమైన) హంసయొక్క, అమ్భో... మేవ—అమ్భోజినీ=తామరతీఁగల - వన = తంపరయందలి - విహార=క్రీడయొక్క - విలాసమ్ ఏవ = సొంపును మాత్రమే - నితరాం = మిక్కిలి - హన్తి = పోఁగొట్టును గాక, (అంతియగాని), అసౌ = ఈయన, అస్య = దీనియొక్క (హంసయొక్క), దుగ్ధ... విధౌ—దుగ్ధ = పాలయొక్కయు - జల = నీళ్లయొక్కయు - భేద విధౌ = వేఱుసేయుటయందు, ప్రసిద్ధామ్ = విఖ్యాతమైన, వైదగ్ధ్య కీర్తిమ్ = నేర్పుయొక్క యశమును, అపహర్తుం = పోఁగొట్టుటకు, న సమర్థః = శక్తుఁడు కాఁడు.



తా.—బ్రహ్మ కోపముచే తన హంసను తామర కొలనిలో విహరింపకుండునట్లు చేయఁగలఁడే గాని, దానికి పాలను నీటిని వేఱుపఱుచు నేర్పుచేఁ గలిగిన కీర్తిని పోఁగొట్టఁ జాలఁడు. అట్లే రాజు పండితుని తన సభనుండి తొలఁగింపఁగలఁడే గాని యాతని పాండిత్య ఖ్యాతిని పోఁగొట్టఁ జాలఁడు.

చ. వనజభవుండు గోపమున వాహనమైన మరాళభర్తకున్
వనజవనీవిహారకలనంబు దొలంగఁగఁ జేయుఁ గాని, గం
భనమున దుగ్ధ జీవన విభాగ విధాన నిరూఢనైపుణీ
జనిత మహాయశోవిభవ సారము హంసకు మాన్పఁ జాలునే!

వ్యా.—కిం బహునా బ్రహ్మాఽపి తదీయవైదగ్ధ్యాపహరణే న శక్త ఇతి దృష్టాన్తముఖే నాహ - అమ్భోజినీతి.—విధాతా బ్రహ్మా, కుపితః కేనచి ద్ధేతునా క్రుద్ధ స్సన్, హంసస్య నిజయానమరాళస్య, అమ్భోజినీవనే పద్మినీవనే - యో విహారః క్రీడా - స ఏవ విలాసః లీలా - త మేవ న త్వన్యత్, నితరామ్ అతిశయేన, హన్తు నాశయతు, 'విలాస మేక' మితి పాఠే - ఏకం కేవలం విలాస మి త్యన్వయః, అమ్భోజాకరసంశోషణేన తత్ర విహారభఙ్గమాత్ర మేవ కర్తుం శక్నో తీ త్యర్థః, కిం త్వసౌ విధాతా, అస్య హంసస్య, దుగ్ధజలయోః క్షీరనీరయోః - ర్భేదవిధౌ విభాగకరణే విషయే, ప్రసిద్ధాం ప్రఖ్యాతాం, వైదగ్ధ్యకీర్తిం వైదగ్ధ్యేన 'కృత్యవస్తుషు చాతుర్యం వైదగ్ధ్యం పరికీర్త్యతే' ఇ త్యుక్తలక్షణనైపుణ్యేన - ప్రయుక్తా యా కీర్తి స్తా, మపహర్తుం న శక్నోతి. హంసో హి క్షీరమిశ్రితే నీరే నీరం విహాయ క్షీరం గృహ్ణా తీతి ప్రసిద్ధిః, ఏవం కుపితో రాజా స్వవిషయవాసాదిభఙ్గమాత్ర మేవ కర్తుం శక్నోతి, న తు తేషా మశేషవిద్యాపరిశీలన జనితచాతుర్యభఙ్గం, మతో నిష్కోపేన భవితవ్యం విద్వత్సు రాజ్ఞేతి తాత్పర్యమ్.

అత్రాప్రకృత విధాతృవృత్తాన్త కథనాత్ ప్రస్తుత రాజవిద్వజ్జన వృత్త ప్రతీతే రప్రస్తుతప్రశంసాలంకారః - లక్షణం తూక్తమ్.

వసన్తతిలకావృత్తమ్ - 'ఉక్తా వసన్తతిలకా తభజా జగౌ గ' ఇతి లక్షణాత్.

---

అవ.—పురుషునికి విద్యయే భూషణ మనుట.

కేయూరాణి న భూషయన్తి పురుషం, హారా న చన్ద్రోజ్జ్వలా,
న స్నానం, న విలేపనం, న కుసుమం, నాలఙ్కృతా మూర్ధజాః;
వాణ్యేకా సమలఙ్కరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే,
క్షీయన్తేఽఖిలభూషణాని, సతతం వాగ్భూషణం భూషణమ్. 15

టీక.—పురుషం = పురుషుని, కేయూరాణి = బాహుపురులు, న భూషయన్తి = అలంకరింపవు, చన్ద్రోజ్జ్వలాః = చంద్రునివలెఁ బ్రకాశించునట్టి, హారాః = ముత్తెపుఁబేరులు, న...పవు, స్నానం = జలకము, న భూషయతి = అలంకరింపదు, విలేపనం = మైపూఁత, న...పదు, కుసుమం = పువ్వు, న...పదు, అలఙ్కృతాః = కైసేయఁబడిన, మూర్ధజాః = తలవెండ్రుకలు, న...పవు, (మఱి యేమనిన), యా = ఏది (ఏవాక్కు), సంస్కృతా = (వ్యాకరణాదిశాస్త్రములచే)చక్కఁజేయఁబడినదై, ధార్యతే = ధరింపఁబడునో (సిద్ధముగా ఉంచుకొనఁబడునో), (సా) ఏకా వాణీ = (ఆ) వాక్కుమాత్రమే, పురుషం = పురుషుని, సమలంకరోతి = చక్కఁగా నలంకరించును, అఖిలభూషణాని = (కడమ) సమస్తభూషణములును, క్షీయన్తే = నశించును, వాగ్భూషణం (తు) = వాక్కు అనెడు భూషణము (అన్ననో), సతతం భూషణమ్ = నిత్యమైన భూషణము.

తా.—అంగదములు, వెన్నెల లాలయుముత్యాలపేరులు, స్నానము, మైపూఁత, పువ్వులు, అలంకరింపఁబడిన జుట్టు, ఇవి యేవియు పురుషునికి భూషణములు గావు. పైగా ఇవి నశించునట్టివి. పరిశుద్ధమైనవిద్యయే పురుషునికి భూషణము, దానికి నాశములేదు.

ఉ. భూషలు గావు మర్త్యులకు భూరిమయాంగద తార హారముల్,
భూషిత కేశపాశ మృదుపుష్ప సుగంధజలాభిషేకముల్
భూషలు గావు, పూరుషుని భూషితుఁ జేయుఁ బవిత్రవాణి; వా
గ్భూషణమే సుభూషణము, భూషణముల్ నశియించు నన్నియున్.

వ్యా.—అథ విదుషాం తావ ద్విద్యైవ భూషణరూపసంపత్తి రిత్యాహ ద్వాభ్యాం - కేయూరా ణీతి.—కేయూరా ణ్యఙ్గదాని - య ద్యపి కేయూరయో ర్భుజ భుజశిరోభూషణత్వేన ద్విత్వ మేవ వక్తవ్యం - తథాఽపి తద్విశేషవివక్షాయాం బహువచన ప్రయోగ ఇతి మన్తవ్యం, పురుషం జనం, న భూషయన్తి నాలంకుర్వన్తీతి యథాయోగం సంబధ్యతే, చన్ద్ర ఇవ దుజ్జ్వలా ధవళతరాః, హారా ముక్తాహారా శ్చ, న భూషయన్తి, స్నాన మభిషేకోఽపి, న భూషయతి, విలేపనం ఘనసార కస్తూరీ గన్ధసార చర్చాఽపి, న భూషయతి, కుసుమం మల్లికా మాలతీ చమ్ప కాది పుష్ప మపి-జాతా వేకవచనం, న భూషయతి, అలంకృతా అభ్యఙ్గపుష్పమాల్యాదినా సమ్యక్ప్రసాధితా, మూర్ధజాః శిరోరుహా, అపి న భూషయన్తి పురుష మితి సర్వత్రానుషఙ్గః; కిం త్వేకా కేవలా, వాణీ, పురుషం, సమలంకరోతి సమ్య గ్భూషయతి, కేయం వాణీత్యత ఆహ - యా సంస్కృతా వ్యాకరణాదిపరిశుద్ధా, ధార్యతే స్వాయత్తీక్రియతే, నేత్యధ్యాహృతతచ్ఛబ్దేన సంబన్ధః; నను కేయూరాదీనాం విభూషణత్వేన ప్రసిద్ధత్వా త్తన్నిషేధే ప్రత్యక్షాపలాపః స్యా దిత్యాశఙ్క్య తేషాం క్షయిష్ణుత్వా న్న తథాత్వ



మిత్యాహ - అఖిలభూషణాని కేయూరాద్యుక్తాశేషభూషణాని, క్షీయన్తే కాలక్రమేణ నశ్యన్తి - 'క్షీయన్తే ఖ ల్వి'తి పాఠే ఖలుశబ్దో వాక్యాలంకారే, వాగ్భూషణం సంస్కృతవాగ్రూపభూషణం తు, సతతం భూషణం నిత్యభూషణం - కదాఽపి న నశ్యతీత్యర్థః.

వ్యతిరేకాలంకారః - లక్షణం తూక్తమ్.
ఏత దాదిశ్లోకచతుష్టయం శార్దూలవిక్రీడితం వృత్తమ్.

———

అవ.—విద్యాప్రభావము.

విద్యా నామ నరస్య రూప మధికం, ప్రచ్ఛన్నగుప్తం ధనం,
విద్యా భోగకరీ, యశ స్సుఖకరీ, విద్యా గురూణాం గురుః,
విద్యా బన్ధుజనో విదేశగమనే, విద్యా పరా దేవతా,
విద్యా రాజసు పూజ్యతే, న హి ధనం; విద్యావిహీనః పశుః.

టీక.—విద్యా నామ = విద్య యనునది, నరస్య = పురుషునికి, అధికం = ఉత్కృష్టమైన, రూపం = సౌందర్యము, ప్రచ్ఛన్న = రహస్యముగా - గుప్తం = దాఁపఁబడినట్టి, ధనం = ధనము; విద్యా, భోగకరీ = భోగములను కలిగించునది, యశస్సుఖకరీ - యశః = కీర్తిని - సుఖ = సౌఖ్యమును - కరీ = చేయునట్టిది; విద్యా, గురూణాం = గురువులకు, గురుః = గురువు; విద్యా, విదేశగమనే = దేశాంతరమునకుఁ బోయినపుడు, బన్ధుజనః = మిత్త్రిజనుఁడైనది; విద్యా, పరా = అందఱికంటె పయిదైన, దేవతా = వేల్పు; విద్యా, రాజసు = రాజులచేత, పూజ్యతే = గౌరవింపఁబడును; ధనం = ధనము, న హి = గౌరవింపఁబడదు; (మఱియు), విద్యావిహీనః = విద్యలేనివాఁడు, పశుః = పశువు (అధముఁ డనుట).

తా.—పురుషునికి సౌందర్యముకన్న విద్య మేలు, ధనమువలని కార్యము విద్యవలన నగును, గాని, ధనమువలె విద్య చోరితము గానేరదు; విద్యవలన భోగ యశస్సుఖములు కలుగును, గురువులకు తెలియనివి గూడ విద్యావంతుని కెఱుకపడును, దేశాంతరమందును విద్వాంసుని ఆదరింతురు, విద్యవలన స్వర్గమోక్షములు కలుగును, విద్వాంసుని రాజులు పూజింతురు గాని ధనవంతుని పూజింపరు, విద్యలేనివాఁడు నరాధముఁడు.

ఉ. విద్య నిగూఢగుప్త మగు విత్తము రూపము పూరుషాళికిన్,
విద్య యశస్సుభోగకరి, విద్య గురుండు విదేశబంధుఁడున్,
విద్య విశిష్టదైవతము, విద్యకు సాటి ధనంబు లే దిలన్,
విద్య నృపాలపూజితము, విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే?

వ్యా.—విద్యా నా మేతి.—రూపం నామ కుణ్డలహారనూపురాఙ్గదాదిచతుర్విధ భూషణాభావేఽపి విభూషితవ ద్భాసమాన ఆకారవిశేషః - త దుక్తం భావప్రకాశే -

'అవే ర్ధ్యాఙ్గోప్య విన్యస్య బన్ధనీయై రభూషితం
య ద్భూషిత మి వాభాతి త ద్రూప మితి కథ్యతే.' ఇతి.—

విద్యా నామ వేదశాస్త్రాద్యాత్మికా వి ద్యైవ, నరస్య పుంసో, ఽధికం భూయిష్ఠం, రూప ముక్తలక్షణాకారవిశేషః - తద్వల్లోకరఞ్జకత్వా దితి భావః, తథా ప్రచ్ఛన్నం నిగూఢం యథా తథా - గుప్తం రక్షితం, ధనం వి ద్యై వేతి సంబన్ధః - తద్వత్కాలాన్తరే షూపకారకత్వా దితిభావః, విద్యా భోగాన్ కరో తీతి భోగకరీ స్రక్చన్దనాదిభోగ్య వస్తులాభ హేతుః, తథా యశః స్సమాఖ్యా - సుఖ మిన్ద్రియతర్పణమ్- ఏతత్కరీ ఏతద్ధేతు శ్చ - ఉభయ త్రాపి * 'కృఞో హేతుతాచ్ఛీల్యానులోమ్యే ష్వి'తి టప్రత్యయే టిత్వాత్ జీప్, తథా విద్యా, గురూణా స్తుపదిశ న్తీతి గురవ స్తేషాం హితాహితోపదేష్టౄణా మాచార్యాణా మపి - గురు రుపదేష్టృభూతా - తథా పరమార్థబోధకత్వా దితి భావః, విద్యా, విదేశగమనే ప్రవాసే, బన్ధుజనః సుహృజ్జనః - తద్వద్విశేషోపచారసంపాదకత్వా దితి భావః - తదుక్తం - 'స్వదేశమిత్రం పరదేశబన్ధుం విద్యాసుధాం యే పురుషాః పిబన్తి', విద్యా, పరా దేవతా పరమాత్మభూతా - మోక్షదాయకత్వా దితి భావః - య ద్వా పరాదేవతా స్వాభీష్టదేవతా - తథా ఐహికాముష్మికఫలదత్వా దితి భావః - విద్యా, రాజసు రాజమధ్యే, పూజ్యతే ప్రశస్యతే - గౌరవసంపన్నత్వా ద్రాజపూజ్యా భవ తీ త్యర్థః-యద్వా విద్యాశబ్దేన విద్యావాన్ లక్ష్యతే రాజశబ్దేన చ తత్సభాః లక్ష్యన్తే తథా చ విద్యావాన్ రాజసభాసు పూజ్యతే పురస్క్రియతే సంభావ్యత ఇతి యావత్, ధనం ద్రవ్యం తు, న హ్యుక్తప్రకారం న భవ తీత్యర్థః, తస్మా ద్విద్యయా ఉక్తరూపయా - విహీన స్శూన్యః జనః, పశుః పశుప్రాయః - కర్తవ్యాకర్తవ్య వివేక రాహిత్యా దితి భావః, అతో బహూపకారకత్వా ద్విశిష్టవి ద్యైవ ప్రధానం న త్వన్య దితి తాత్పర్యమ్.

అత్ర విద్యాయాః రూపధనాద్యాకారేణ బహుధా నిరూపణా న్నిరవయవ మాలారూపకాలంకారః.

---

క్షాన్తి శ్చేత్ కవచేన కిం? కి మరిభిః క్రోధోఽస్తి చే ద్దేహినాం?
జ్ఞాతి శ్చే దనలేన కిం? యది సుహృ ద్దివ్యౌషధైః కిం ఫలమ్?
కిం సర్పై ర్యది దుర్జనాః? కిము ధనై ర్విద్యాఽనవద్యా యది?
వ్రీడా చే త్కిము భూషణైః? సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్?.



టీక.—దేహినాం = ప్రాణులకు, క్షాన్తిః = ఓర్పు, అస్తిచేత్ = కలదేని, కవచేన = మైమఱువుచే, కిం ఫలమ్ = ఏమి ప్రయోజనము, (ఫలమ్ అనుపదమును కింశబ్దము లన్నిటితోను అన్వయించుకొనవలయును), క్రోధః = కోపము, అస్తి...దేని, అరిభిః = శత్రువులచే, కిం...నము, జ్ఞాతిః=దాయాది, అస్తి...దేని, అనలేన = అగ్నిచే, కిం...నము, సుహృత్ = మిత్త్రుఁడు, అస్తి...దేని, దివ్య ఔషధైః = సిద్ధౌషధములచే, కిం...నము, దుర్జనాః = దుష్టులు, (సన్తి) యది=కలరేని, సర్పైః =పాములచే, కిం...నము, అనవద్యా = నిర్దోషమయిన, విద్యా = చదువు, అస్తి యది = కలదేని, ధనైః= ద్రవ్యములచే, కిము (ఫలం) = ఏమి ప్రయోజనము, వ్రీడా=లజ్జ - తప్పు చేయసంకోచపడుట, అస్తి...దేని, భూషణైః=ఆభరణములచే, కిము...నము, సు కవితా =మంచి కవిత్వము, అస్తి యది = ఉన్నయెడల, రాజ్యేన=దొరతనముచే, కిమ్...నము.

తా.—ఓర్పు రక్షించును, కోపము చెఱుపును, జ్ఞాతి సర్వనాశము సేయును, మిత్త్రుఁడు ప్రాణమును గాచును, ఖలుఁడు చంపును, సద్విద్య సర్వధనముల నొసంగును పాపభీతి అలంకరించును, మంచికవికి రాజునకు జరిగినట్లు జరుగును.

చ. క్షమ కవచంబు, క్రోధ మది శత్రువు, జ్ఞాతి హుతాశనుండు, మి
త్త్రము దగుమందు, దుర్జనులు దారుణ పన్నగముల్, సువిద్య వి
త్త, ముచితలజ్జ భూషణ, ముదాత్తకవిత్వము రాజ్య, మీక్షమా
ప్రముఖపదార్థముల్ గలుగుపట్టునఁ దత్కవనాదు లేటికిన్?

వ్యా.—అథ లోకహితాహిత వర్ణనప్రసంగా త్తస్యా ఏవ ప్రకృష్టైశ్వర్యభావమాహ,-క్షాన్తి రితి.—దేహినాం ప్రాణినాం - క్షాన్తిః తితిక్షా - పరిభవాది షూత్పద్యమానేషు క్రోధప్రతిబన్ధక ఇతి యావత్, అస్తి చే త్తర్హి, కవచేన వర్మణా, కిం ఫలమితి సర్వ త్రానుషజ్యతే న కించి ద పీత్యర్థః - తస్యా ఏ వాయుస్తదానా మనవకాశప్రదత్వా దితి భావః, క్రోధ శ్చి త్తక్షోభో,ఽస్తి చేత్, అరిభిః శత్రుభిః, కిం త స్యైవానర్థశత్రుత్వా దుపద్రవహేతుత్వా చ్చేతి భావః, జ్ఞాతి ర్దాయాదో,ఽస్తి చే, దనలే నాగ్నినా, కిం త స్యైవ సర్వార్థనిర్మూలననిదానత్వా దితి భావః, సుహృత్ సన్మిత్రి మస్తి యది * 'సుహృ ద్దుర్హృదౌ మిత్రామిత్రయో రి'తి నిపాతనా త్సాధుః, దివ్యౌషధైః సిద్ధౌషధైః, కిం ఫలం న కించి దపి - త స్యై వారోగ్యకరత్వా దితి భావః, దుర్జనాః ఖలాః, స్సన్తి యది, సర్పైః రాశీవిషైః, కిం తేషా మేవ ప్రాణాపహారిత్వా దితి భావః, అనవద్యా నిర్దుష్టా * 'అవద్య ప ణ్యే'త్యాదినా నిపాతనా త్సాధుః - తతో నఞ్ సమాసః- 'తస్మా న్నుడచీ'తి నుడాగమః, విద్యా వేద వేదాఙ్గాద్యాత్మికా, అస్తి యది, ధనైః కిం తస్యా ఏవాఖిలభోగసాధకత్వా దితి భావః, వ్రీడా అకార్యప్రవృత్తౌ మనస్సంకోచలక్షణాలజ్జా,ఽస్తి చే, ద్భూషణైః కిము హారనూపురాద్యలంకరణైః కిం - తస్యా ఏవ లోకో

త్తర భూషణత్వా దితి భావః, సుకవితా సత్కావ్యకర్తృత్వం - ని. 'సంఖ్యావా న్పణ్డితః కవి రి'త్యమరః - య ద్వా కవయతి వర్ణయతి రసోల్లసితశబ్దార్థసంఘటనాం కరోతీతి కవి - స్తస్య భావ స్తత్తా - యది, రాజ్యేన భూమణ్డలాధిపత్యేన కిం - తస్యా ఏవ సకల లోకవశీకరత్వా దితి భావః - రాజ్ఞో భావః కర్మ వా రాజ్యం ప్రజాపరిపాలనాత్మకం - పురోహితాదిత్వా ద్యక్ప్రత్యయః.

---

అవ.—విద్వాంసులవలననే లోకము చక్కఁగా నెఱవేఱుచున్న దనుట.

దాక్షిణ్యం స్వజనే, దయా పరిజనే, శాఠ్యం సదా దుర్జనే,
ప్రీతిః సాధుజనే, నయో నృపజనే, విద్వజ్జనే చార్జవమ్,
శౌర్యం శత్రుజనే, క్షమా గురుజనే, కాన్తాజనే ధృష్టతా,
యే చైవం పురుషాః కలాసు కుశలా స్తే ష్వేవ లోకస్థితిః. 18

టీక.—స్వజనే=బంధుజనులయెడల (జనే - జాత్యేకవచనము), దాక్షిణ్యం = మోమోటము, పరిజనే = భృత్యులయెడ, దయా = కనికరము, దుర్జనే = దుష్టుల యెడ, సదా = ఎల్లప్పుడును, శాఠ్యం = గూఢముగా అప్రియచేయుట, సాధుజనే = సజ్జనులయెడ, నయః = నీతి, విద్వజ్జనే = పండితజనులయెడ, ఆర్జవం = తిన్ననిదనము, శత్రుజనే = పగతురయెడ, శౌర్యం = శూరత్వము, గురుజనే = పెద్దలయెడ, క్షమా =ఓర్పు, కాన్తాజనే = స్త్రీలయెడ, ధృష్టతా = దిట్టతనము, ఏవం = ఇట్లు, కలాసు= విద్యలయందు, యే చ పురుషాః = ఏపురుషులు, కుశలాః = నిపుణులో, తేషు ఏవ = వారలయందే, లోకస్థితిః = లోకమర్యాద, (అస్తి = ఉన్నది).

తా.—బంధువులయెడల మోమోటము, సేవకులయెడల దయ, ఖలులయెడల నికారము, సాధులయం దనురాగము, రాజులయెడ నీతి, విద్వాంసులకడ నిష్కపటవర్తనము, పగవారిపై శౌర్యము, పెద్దలయెడల నోర్పు, స్త్రీలకు లోఁబడమి, అనునీ యుపాయములను చక్కఁగా నేర్చినవారే యీలోకమర్యాదను జరుపువారు.

చ. వరకృప భృత్యులందు, నిజ వర్గమునం దనుకూలవృత్తి, గా
పురుషులయందు శాఠ్యము, సుబుద్ధులయం దనురక్తి, దార్ఢ్య స
ద్గురువులయందు, గౌరవము కోపిదులందు, నయంబు రాజులం,
దరిజనులందు శౌర్యము, మృగాక్షులయందుఁ బ్రగల్భభావ, మీ
వరుసఁ గళాప్రవీణు లగు వారలయందు వసించు లోకముల్.

వ్యా.—అథ విదుషాం గుణవర్ణనపూర్వకం లోకవ్యవస్థాపకత్వ మాహ దాక్షిణ్య మితి.—స్వజనే బన్ధుజనేష్వి త్యర్థః జాతా వేకవచనమ్ - ఏవ ముత్తరత్రాపి -



దాక్షిణ్యం ఛన్దానువర్తనమ్ - అన్యథా వినిందేయు రితి భావః - ని. 'దక్షిణ స్సరళా వాముపరచ్ఛన్దానువర్తిష్వి'తి, పరిజనే భృత్యజనేషు విషయే, దయా దారిద్ర్యాదిదుఃఖప్రహాణేచ్ఛా - అన్యథా విజహ్యు రితి భావః, దుర్జనే ఖలజనేషు విషయే, సదా శాఠ్యం విప్రియకారిత్వమ్ - అన్యథా అధిక్షిపేర న్నితి భావః, సాధుజనే సజ్జనేషు విషయే, ప్రీతిః స్నేహః - ఆదర ఇతి యావత్-అన్యథాఽనుతపేయు రితి భావః, నృపజనే రాజసు విషయే, నయో నీతిః - అనువర్తనతాత్పర్య మితి యావత్ - అన్యథా దణ్డయేర న్నితి భావః, విద్వజ్జనే పణ్డితజనేషు విషయే, ఆర్జవ మవక్రతా - అన్యథా నిషిధ్యేయు రితి భావః, శత్రుజనే శత్రుజనేషు విషయే, శౌర్యం విక్రాన్తత్వమ్ - అన్యథా నిపాతయేర న్నితి భావః, గురుజనే పిత్రాదిషు విషయే, క్షమా సహిష్ణుత్వమ్-అన్యథా శపేర న్నితి భావః, కాన్తాజనే నారీజనేషు విషయే, ధృష్టతా ప్రాగల్భ్యం చ - అన్యథా వశీకుర్యు రితి భావః; ఇ త్యేవ ముక్తవిధాసు, కలాసు శిల్పేషు - ని. 'కళా శిల్పే కాలభేదే చన్ద్రాంశే కలనా క శే'తి వైజయన్తీ, యే చ పురుషాః, కుశలాః నిపుణాః, తేషు పురుషే ష్వేవ, లోకస్థితిః లోకమర్యాదా, అ స్తీతి శేషః, త ఏవ లోకవ్యవస్థా సంస్థాపకాః న తూక్తగుణరహితా ఇ త్యర్థః. ఏవం భూతా స్తు విద్వాంస ఏవ న త్వన్య ఇతి హృదయమ్.

---

అవ.—సత్సాంగత్యప్రభావము.

జాడ్యం ధియో హరతి, సిఞ్చతి వాచి సత్యం,
మానోన్నతిం దిశతి, పాప మపాకరోతి,
చేతః ప్రసాదయతి, దిక్షు తనోతి కీర్తిం,
సత్సఙ్గతిః కథయ కిం న కరోతి పుంసామ్. 19.

టీక.—సత్సఙ్గతిః = సజ్జనులతోడి సహవాసము, పుంసాం = పురుషులకు, ధియః = బుద్ధియొక్క, జాడ్యం = మాంద్యమును, హరతి = పోఁగొట్టును, వాచి = వాక్కునందు, సత్యం = సత్యమును, సిఞ్చతి = చల్లును, మాన = గౌరవముయొక్క - ఉన్నతిం = అతిశయమును - దిశతి = ఇచ్చును, పాపం = పాపమును, అపాకరోతి = తొలఁగించును, చేతః = మనస్సును, ప్రసాదయతి = నిర్మలముచేయును, దిక్షు = దిక్కులయందు, కీర్తిం = యశస్సును, తనోతి = విస్తరించును, కిం = దేనిని, న కరోతి= చేయదు, కథయ = చెప్పుము.

తా.—సాధువులతోడి సాంగత్యమువలన పురుషులకు సకలశ్రేయస్సులును కలుగును. ఎట్లనిన, అది బుద్ధికి చికిలిసేయును, వాక్కున అమృతమునుంబోలె సత్యమును

నింపును, గౌరవమును పెంచును, పాపమును దూరము సేయును, దుఃఖాదిదోషములను పోఁగొట్టి మనస్సును నిర్మలము సేయును, కీర్తిని విరివి సేయును.

తే. సత్యసూక్తి ఘటించు, ధీ జడిమ మాన్చు,
గౌరవ మొసంగు, జనులకుఁ గలుష మడఁచుఁ,
గీర్తిఁ బ్రకటించుఁ, జిత్త విస్ఫూర్తిఁ జేయు,
సాధుసంగంబు సకలార్థ సాధనంబు.

వ్యా.—ఇత్థం విద్వజ్జనా ననువర్ణ్య సంప్రతి సత్సంగతేః శ్రేయస్కరత్వ మాహ.—జాడ్య మితి.—ధియః బుద్ధేః, జాడ్యం మాన్ద్యం, హరతి నిరస్యతి, వాచి వచనే, సత్యం సూనృతభావం, సిఞ్చ త్యాప్లావయతి, మానోన్నతిం బహుమానాతిశయం, దిశతి ప్రయచ్ఛతి, పాపం కిల్బిషం, అపాకరోతి నాశయతి - ధర్మోపదేశాది నేతి భావః, తథా చేతః, ప్రసాదయతి నిర్మలయతి - జ్ఞానోపదేశాది నేతి భావః, దిక్షు దశసు కీర్తిం, తనోతి విస్తారయతి, అత స్సత్సంగతి స్సజ్జనసమాగమః, పుంసాం కిం శ్రేయో న కరోతి కథ యేతి పృథగ్జనసంబోధనమ్ - సర్వమపి శ్రేయః కరో త్యే వేత్యర్థః; అత స్తై రేవ సంగతిః కర్తవ్యా న తు దుర్జనై రితి తాత్పర్యమ్.

అత్ర క్రియాణాం బహూనాం సముచ్చితత్వా త్సముచ్చయాలంకారః - 'గుణక్రియాయౌగపద్యం సముచ్చయ ఉదాహృతః' ఇతి లక్షణాత్.

వసంతతిలకావృత్తం - లక్షణం తూక్తమ్.

---

అవ.—మహాకవులు చచ్చినను కీర్తిచే బ్రదికియే యుందురనుట.

జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్. 20.

టీక.—సుకృతినః = పుణ్యవంతులును (మంచిగ్రంథములు రచించినవారును అని యర్థాంతరము), రససిద్ధాః = సిద్ధించిన శృంగారాది రసములు గలవారును - (సిద్ధించినపాదరసఘుటిక గలవారును), (అగు), తే = ప్రసిద్ధులైన, కవి ఈశ్వరాః = కవి శ్రేష్ఠులు- (పండితోత్తములు అనియు), జయన్తి = సర్వోత్కృష్టులై వర్తింతురు, తేషాం = ఆకవీశ్వరులయొక్క, యశః కాయే = కీర్తియనెడు శరీరమునందు, జరా మరణ జం = ముదిమివలనను చావువలనను పుట్టినదైన, భయం = దిగులు, న అస్తి = లేదు.

తా.—రసఘుటికాసిద్ధిగల పుణ్యాత్ముల పాంచభౌతిక శరీరమునకుంబోలె మంచి గ్రంథములు రచించుమహాకవుల యశశ్శరీరమునకు ముదిమియు చావును లేవు.

క. సుకృతాత్ములు రససిద్ధులు । సుకవీంద్రులు విజయనిధులు, సుమ్ము; తదీయా
ధిక కీర్తిశరీరంబులు । ప్రకటజరామరణ జన్మ భయరహితంబుల్.



వ్యా.—అథైతేషా మసాధారణమహిమాస్పదత్వా ల్లోకోత్తరత్వం వర్ణయ న్నిగమయతి.—జయన్తీతి.—సుకృతినో ధన్యాః - ని. 'సుకృతీ పుణ్యవాన్ ధన్య' ఇత్యమరః, రససిద్ధాః సిద్ధశృఙ్గారాదిరసాః సిద్ధపారదఘుటికా శ్చ* 'వాఽఽహితాగ్న్యాదిష్వి'తి నిష్ఠాయాః పరనిపాతః, తే ప్రసిద్ధాః పూర్వోపవర్ణితా వా, కవీశ్వరాః కవిసార్వభౌమాః పణ్డితోత్తమా ఇతి వా, జయన్తి సర్వోత్కర్షేణ వర్తన్తే - అద్యాఽపీతి శేషః; యద్వా - రససిద్ధాః సిద్ధరసాః - బ్రహ్మసాక్షాత్కారవన్త ఇత్యర్థః - 'రసో వై స' ఇతి శ్రుతేః,

'శృఙ్గారాదౌ విషే వీర్యే పారదే బ్రహ్మవర్చసే
వేత స్యాస్వాదనే హేమ్ని నిర్యాసేఽమృతశబ్దయోః—రసః.'

ఇత్యభిధానా చ్చ, కవీశ్వరాః-కవయః క్రాన్తదర్శిన - స్తేషా మీశ్వరాః కాలత్రయాభిజ్ఞా బ్రహ్మవిద్యావిశారదా ఇత్యర్థః, జయన్తి, కుత, స్తేషాం కవీశ్వరాణాం, యశఃకాయే కీర్తిశరీరే, జరామరణాభ్యాం జాతమ్ - ఇతి తథోక్తం, భయం నాస్తి; రససిద్ధానాం భౌతికశరీర ఏవ జరామరణభయం నాస్తి, యశశ్శరీరే తు కం వక్తవ్యం, తస్య కల్పాన్తస్థాయిత్వా దితి భావః.

అత్ర రససిద్ధపదార్థస్య విశేషణగత్యా భయాభావపదార్థం ప్రతి హేతుత్వా త్కావ్యలిఙ్గభేదః. వృత్త ముక్తమ్.

ఇతి నీతిశతకవ్యాఖ్యానే విద్వత్పద్ధతివర్ణనం నామ ద్వితీయదశకమ్.

---

## మానశౌర్యపద్ధతిః.

---

క్షుత్క్షామోఽపి జరాకృశోఽపి శిథిలప్రాయోఽపి కష్టాం దశా
మాపన్నోఽపి విపన్నదీధితి రపి ప్రాణేషు నశ్య త్స్వపి
మత్తేభేన్ద్ర విభిన్న కుమ్భ పిశిత గ్రాసైక బద్ధస్పృహః
కిం జీర్ణం తృణ మత్తి మానమహతా మగ్రేసరః కేసరీ ? 21.

టీక.—మత్తే...స్పృహః -. మత్త = మదించిన - ఇభ ఇన్ద్ర = గజశ్రేష్ఠము యొక్క - విభిన్న = చీల్పఁబడిన - కుమ్భ = కుంభస్థలమునందలి - పిశిత = మాంసము యొక్క - గ్రాస = తిండియందు - ఏక = ముఖ్యముగా - బద్ధ = కట్టఁబడిన - స్పృహః = కోరికగలదియు (ఇందువలన శౌర్యాతిశయము సూచితము), మాన మహతాం = మానముచే అధికు లగువారిలోపల - అధికమానముగల వారిలోపల, అగ్రే సరః = మొదట నడచునదియు, (అగు), కేసరీ = సింహము (ఇది కర్త), క్షుత్ = ఆఁకటిచేత - క్షామః

అపి = క్షీణము అయినను, జరా = ముదిమిచేత - కృశః అపి = చిక్కిన దైనను, శిథిలప్రాయః అపి = ఇంచుమించుగా కీళ్లుసడలిన దైనను, కష్టాం = కష్టమైన, దశాం = అవస్థను, ఆపన్నః అపి = పొందిన దైనను, (దానంజేసి), విపన్న = చెడిన - దీధితిః అపి = కాంతిగల దైనను, ప్రాణేషు = ప్రాణములు, నశ్యత్సు (సత్సు) అపి = పోవుచున్నను, జీర్ణం తృణం = ఎండిన గడ్డిపరకను, అత్తి కిమ్ = తినునా యేమి. (ఇందువలన మానాతిశయము సూచితము.)

తా.—సింహము ఆఁకటిచే క్షీణించినను, ముదిమిచే కృశించినను, కీళ్లు సడలి, కష్టదశలో పడి, శోభ గోల్పోయినను, తుదకు ప్రాణములే పోవుచున్నను, మదపుటేనుఁగు యొక్క కుంభస్థలమును తానే చీల్చి యందలి మెదటినే ఆరగింపఁ గోరుచుండునుగాని, ఎండిన గడ్డిని దినదు. ఇట్లే మానశౌర్యవంతులు ఎట్టికష్టములపా లయినను నీచవృత్తి నవలంబింపరు.

ఉ. గ్రాసము లేక స్రుక్కిన జరాకృశ మైన విశీర్ణమైన సా
యాసము నైన నష్టరుచి గ్యునను ప్రాణభయార్త మైన ని
స్త్రాసమదేభకుంభపిశితగ్రహలాలసశీలసాగ్రహా
గ్రేసరభాసమాన మగు కేసరి జీర్ణతృణంబు మేయునే.

వ్యా.—అథ విదుషా మపి మానశౌర్యయో రపేక్షితత్వా ద్విద్వత్పద్ధతినిరూపణానన్తరం మానశౌర్యపద్ధతిం నిరూపయతి—క్షుత్క్షామ ఇతి.—క్షుధా క్షామః క్షీణోఽపి * 'క్షాయో మః' ఇతి మత్వం, జరయా విస్రసయా - కృశో జీర్ణోఽపి - ని. 'విస్రసా జరే' త్యమరః, శిథిలప్రాయః విశ్లథాఙ్గతయా బలహీన స్సన్నపీ త్యర్థః, కష్టాం దశా మాహారాలాభా దతికృచ్ఛ్రామవస్థా, మాపన్నః ప్రాప్తోఽపి - ని. 'దశా వర్త్తా వవస్థాయా మి'తి విశ్వః, అత ఏవ విపన్నదీధితి ర్నష్టకాన్తి రపి, కిం బహునా ప్రాణేషు పఞ్చసు, నశ్య త్స్వాత్క్రమమాణేషు సత్స్వపి - ప్రాణప్రయాణే సంప్రాప్తే స త్యపీ త్యర్థః, మత్తేభేన్ద్రస్య మత్తగజపుఙ్గవస్య - విభిన్నో విదారితో - యః కుమ్భః కుమ్భస్థలం - తత్ర య త్పిశితం మేదో మాంసం - తద్గ్రాసే తత్కబళనే - ఏకం ముఖ్యం యథా తథా - బద్ధా సన్దానితా - స్పృహా వాఞ్ఛా యస్య స, ఇతి శౌర్యాతిశయోక్తిః, తథా మానమహతా మభిమానోన్నతానా, మగ్రేసరోఽగ్రగణ్యః * 'పురోఽగ్రతోఽగ్రేషు సర్తేః' రితి టప్రత్యయః, కేసరీ సింహః, జీర్ణం తృణం ఘాసమ్, అత్తి కిమ్ అభ్యవహరతి కిం - నాత్త్యే వే త్యర్థః. ఇతి మానాతిశయోక్తిః; నీచజన్తు స్తు నైవ మితి భావః.

అత్ర య ద్యపి సర్వత్రాపిశబ్ద స్తావ దేకైక విశేషణ విశిష్ట స్యైవ వాత్యన్త నీచవృత్తిప్రవృత్తిం ద్యోతయతి, తథాఽ ప్యుక్తాఖిల విశేషణ విశిష్టోఽపి గజేన్ద్రమేదః



కబళనవిహితప్రతిజ్ఞః కేసరీ న నీచవస్తుని ప్రవర్తేత ఇతి మహతీ మానశౌర్యపరకాష్ఠోక్తి రితి మన్తవ్యమ్.

'ప్రాణా నపి పరిత్యజ్య మాన మే.వాభిరక్షయేత్,
ప్రాణా స్తరజ్గచపలా మాన మాచన్ద్రతారకమ్.'

ఇతి వచనా న్మాన శౌర్యసంపన్నేన భవితవ్యం యశస్కామే నేతి భావః.

అత్ర ప్రకరణే కుత్రచి న్మానస్య కుత్రచి చ్ఛౌర్యస్య కుత్రచి దుభయస్య చ ప్రాధాన్యకథన మపి ద్రష్టవ్యమ్. కులక్రమాగతోత్తమశీలపరిపాలనం మానం - సహాయ మనపేక్ష్య శత్రుసంహరణసామర్థ్యం శౌర్య మితి వివేకః.

అత్ర ప్రాయే ణాప్రస్తుతప్రశంసాలంకారోఽనుసంధేయః.

శార్దూలవిక్రీడితం వృత్తం - లక్షణం తూక్తమ్.

---

అవ.—ఎల్లవారును తమశక్తికిఁ దగిన ఫలము నపేక్షింతు రనుట.

స్వల్పస్నాయు వసావసేకమలినం నిర్మాంస మ ప్యస్థి గోః
శ్వా లబ్ధ్వా పరితోష మేతి, న చ తత్ తస్య క్షుధాశాన్తయే;
సింహో జమ్బుక మఙ్క మాగత మపి త్యక్త్వా నిహన్తి ద్విపం;
సర్వః కృచ్ఛ్రగతోఽపి వాఞ్ఛతి జనః సత్త్వానురూపం ఫలమ్.

టీక.—శ్వా = కుక్క, స్వల్పస్నాయు—స్వల్ప = కొంచెపాటి - స్నాయుః = సన్ననరముకలదానిని, వ...నమ్ - వసా = క్రొవ్వుయొక్క - అవసేక = తడుపుచేత - మలినం = మురికిదానిని, నిర్మాంసమ్ = మాంసము లేనిదానిని, అపి = అయినను, గోః = పశువుయొక్క, అస్థి = ఎముకను, లబ్ధ్వా = పొంది, పరితోషమ్ = సంతోషమును, ఏతి = పొందును; తత్ చ = అదియో (ఆయెముకయో), తస్య = దాని, క్షు...యే - క్షుధా = ఆఁకటియొక్క - శాన్తయే = నివారణకు, న = కాదు (చాలదనుట); సింహః = సింహము, అఙ్కమ్ = సమీపమునకు, ఆగతమ్ అపి = వచ్చినదాని నైనను, జమ్బుకం = నక్కను, త్యక్త్వా = విడిచి, ద్విపం = ఏనుఁగును, నిహన్తి = చంపును; కృచ్ఛ్రగతః అపి = కష్టమును పొందినవాఁ డైనను, సర్వః జనః = ఎల్ల జనుఁడును, సత్త్వ అనురూపం = (తన) శక్తికి తగినట్టి, ఫలం = ప్రయోజనమును, వాఞ్ఛతి = కోరును.

తా.—కుక్క గొడ్డునెముక కొంచెపాటి సన్ననరముగలిగి క్రొవ్వుతడిచే కంపుకొట్టుచు మాంసహీనమై యున్నట్టిది దొరకినచో, దాని కది సంతసించునుగాని దాన దానియాఁకలి తీఱదు. సింహము చెంత నున్ననక్కను మాని ఏనుఁగునే చంపును. ఎల్లవారును దమకష్టదశలో నైనను దమశక్తికిఁ దగినఫలమునే గోరుదురుగాని యెక్కువ

గాని తక్కువగాని కోరదు.—కుక్కవలె క్షుద్రఫలమును గోరక సింహమువలె నుత్తమఫలమును కోరవలయును - అని యుపదేశము.

ఉ. స్నాయువసావసేకమలిన మ్మగునెమ్ము గ్రహించి జాగిలం
బాయతమోద మందుఁ, జన దాఁకలి దానికిఁ; జెంత నున్న గో
మాయువు, దానిఁ జూచి పరిమార్పక సింగము దంతిఁ గూల్చు; నే
చాయల నెల్లవారు నిజ సత్త్వ సమానఫలార్థులే కదా.

వ్యా.—క్షుద్రజన్తు స్త్వైవ మితి ఉక్త మే వార్థం భఙ్గ్యన్తరే ణాహ.—స్వ ల్పేతి.—శ్వా శునకః, స్వల్పయోః లేశమాత్రయోః - స్నాయు వసయోః - స్నాయు ర్వస్నసాహ్వ్యనాడీభేదః - వసా మేదః - తయో - రవసేకేన మేళనేన - మలినం మలదూషిత మపి - ని. 'వస్నసా - స్నాయుః స్త్రియాం' - 'హృ న్మేద స్తు వపా వ సే' త్యమరః, నిర్మాంసం మాంసలేశ శూన్య మపి, గోః పశోః—

ని. 'స్వర్గేషుపశువాగ్వజ్రదిఙ్నేత్రఘృణిభూజలే
లక్ష్యదృష్ట్యా స్త్రియాం పుంసి గౌః.' ఇ త్యమరః,

అస్థి కీకసం, లబ్ధ్వా, పరితోష మేతి సంతుష్యతి, త చ్చ గవాస్థి తు, తస్య శునః, క్షుధా * 'ఆపం చైవ హలన్తానా మి'తి వచనా ట్టాప్ - తస్యాః శాన్తయే క్షున్నివారణాయ, న పర్యాప్తం న భవ తీ త్యర్థః - అస్తి ర్భవ న్తీపరో౽ప్రయుజ్యమానో౽ప్య స్తీతి భాష్యకారవచనాత్ - భవ న్తీతి లటః పూర్వాచార్యాణాం సంజ్ఞా - నీచజన్తు రితి భావః, సింహ స్తు, అఙ్కం సమీప - మాగత మపి - సమీపవర్తిన మ పీ త్యర్థః—ని. 'అఙ్క స్సమీప ఉత్సఙ్గే చిహ్నే స్థానాపవాదయో రి'తి విశ్వః, జమ్బుకం క్రోష్టారం, త్యక్త్వా అనాదృ త్యాలక్ష్యీ కృ త్యేతి యావత్, ద్విపం గజ మేవ దూరస్థ మ పీతి భావః, నిహన్తి విదారయతి; తథా హి - కృచ్ఛ్రగతో౽ప్యతిసంకటస్థో౽పి, సర్వో౽శేషో జనః, సత్త్వానురూపం స్వశక్త్యనుగుణం, ఫలం లాభం, వాఞ్ఛతి; న తు దుర్బలః ప్రకృష్టఫలకాఙ్క్షీ ప్రబలో నికృష్టలాభకాఙ్క్షీ చ భవతి; అతః శ్వసింహ దృష్టాన్తేన నీచానీచవస్తు పరిహారపరిగ్రహతత్పరేణ భవితవ్య మాయుష్మ తేతి భావః.

వృత్తం పూర్వవత్.

---

అవ.—నీచానీచుల నడవడి తారతమ్యము.

లాఙ్గూలచాలన మధ శ్చరణావఘాతం
భూమౌ నిపత్య వదనోదరదర్శనం చ
శ్వా పిణ్డదస్య కురుతే గజపుఙ్గవ స్తు
ధీరం విలోకయతి చాటుశతైశ్చ భుఙ్క్తే 23.



టీక.—శ్వా = కుక్క, పిణ్డదస్య = అన్నపుముద్దను పెట్టువానిముందల, లాఙ్గూలచాలనం = తోఁకయొక్క యాడించుటను, అధః = క్రింద, చరణ = కాళ్లతో - అవఘాతం = నేలను తన్నుటను, భూమౌ = నేలయందు, నిపత్య = పడి, వదన ఉదర దర్శనం చ = నోటిని కడుపును జూపుటను, కురుతే = చేయును, గజ పుఙ్గవ స్తు = ఉత్తమమయిన యేనుఁగు అయినను, (పిండదుని), ధీరం = బెట్టుగా, విలోకయతి = చూచును, చాటు శతైః = ప్రియవచనముల వందలచేత, భుఙ్క్తే = తినును.

తా.—కుక్క తనకుఁ బిండ మిడువానియెదుటఁ దోఁక యాడించును, కాళ్లతో నేలను తాటించును, క్రింద వెదకిలంబడి నోటిని కడుపును జూపును; గజరాజమయినను బెట్టుగా చూచును, మావటీఁడు బుజ్జవములు పలుకఁగా పలుకఁగా దాణాను ఆరగించును.

వ్యా.—అథ క్షుద్రజన్తో శ్చేష్టావిశేష మాహ-లాఙ్గూలేతి.—శ్వా సారమేయః, లాఙ్గూలచాలనం పుచ్ఛవివర్తనమ్, అధః భూతలే చరణావఘాతం పాదేన విదారణం చ, భూమౌ, నిపత్య స్వయ మేవ పతిత్వా, వద నోదర దర్శనం వక్త్ర కుక్షి ప్రదర్శనం చ, పిణ్డదస్య పురస్తా దితి శేషః, కురుతే నిజనీచచేష్టా మావిష్కరుత ఇ త్యర్థః, పుమాన్ గౌః పుంగవో వృషభః - విశేషణసమాసః * 'గో రతద్ధితలు కీ'తి సమాసాన్త ష్టచ్ - స ఏవ పుంగవః శ్రేష్ఠ ఇ త్యర్థః - ని. 'శ్రేష్ఠోక్షాణౌ తు పుంగవా వి'తి వైజయన్తీ - గజపుంగవో గజేన్ద్ర స్తు, ధీరం గమ్భీరం, విలోకయతి పశ్యతి - పిణ్డద సన్నిధా వితి భావః, అథ చాటుశతై రనేక ప్రియోక్తిభిః - అనూనవాక్యై శ్చ వా, భుఙ్క్తే అభ్యవహరతి - గుడతణ్డు లాదిక మితిశేషః * 'భుజో౽నవన' ఇ త్యాత్మనే పదమ్. ఇమా వేవ నీచానీచ జనయోః దృష్టాన్తా వితి భావః.

వసన్తతిలకావృత్తం - లక్షణం తూక్తమ్.

---

పరివర్తిని సంసారే మృతః కో వా న జాయతే?
స జాతో యేన జాతేన యాతి వంశః సమున్నతిమ్. 24.

టీక.—పరివర్తిని = సుడియుచుండునట్టి, సంసారే = జనన మరణపరంపరయందు, మృతః = చచ్చినవాఁడు, కో వా = ఎవ్వఁడు, న జాయతే = పుట్టఁడు, యేన జాతేన = ఏ పుట్టినవానిచేత - (ఎవని పుట్టువుచేత), వంశః = కులము, సమున్నతిం = గొప్పతనమును, యాతి = పొందునో, సః = వాఁడు, జాతః = పుట్టినవాఁడు.

తా.—పుట్టినమాత్రాన ఏవిశేషమును లేదు, జనన మరణ పరంపర సుడి తిరుగుచుండఁగా చచ్చినవాఁడెల్ల పుట్టువాఁడే. ఎవఁడు పుట్టి వంశమునకు గొప్పతనము తెచ్చునో వాని పుట్టువుమాత్రమే గణనీయము.

గీ. ప్రాణిలోకంబు సంసార పతిత మగుట
వసుధపైఁ గిట్టి పుట్టనివాఁడు గలఁడె?
వానిజన్మంబు సఫల మెవ్వానివలన
వంశ మధికోన్నతి వహించి వన్నెకెక్కు.

వ్యా.—అథ మానశౌర్యసంపన్నతయా వంశవర్ధనస్యైవ జనస్య సత్తాలాభో నత్వన్యస్యేత్యాహ—పరివర్తినీతి.—పరివర్తిని ధర్మాధర్మవశాత్పునఃపున్యేనావర్తమానే, సంసారే జరామరణరూపే సంసారచక్రే, కో వా పుమాన్, మృతః ప్రేతః, న జాయతే న భవతీతి ఉత్పన్నో వా న భవతీతి శేషః - యద్వా - కో వా న మృతః కో వా న జాయతే నోత్పద్యతే - సర్వోఽప్యుత్పన్నో మృతశ్చ భవత్యేవేత్యర్థః - 'జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చే'తి భగవద్వచనాదితి భావః, తతః కిమత అహ, స పుమాన్, జాత ఉత్పన్నో జన్మలాభవానితి యావత్, కోఽసావిత్యత ఆహ, యేన జాతే నోత్పన్నేన పుంసా, వంశోఽన్వవాయ, స్సమున్నతిం మహౌన్నత్యం, యాతి ప్రాప్నోతి; వంశోద్ధారకో యః పుమాన్ స ఏవ జన్మలాభవాన్, నేవం భూతత్వం చ మానశౌర్య సంపన్నస్యైవ నత్వన్యస్య అతః కిమన్యైరజాగళస్తనవదుత్పన్నైర్మశకవద్వినష్టైశ్చేతి భావః.

అనుష్టుభం వృత్తమ్.

---

అవ.—మానవంతుని వృత్తి.

కుసుమస్తబకస్యేవ ద్వయీ వృత్తిర్మనస్వినః,
మూర్ధ్ని వా సర్వలోకస్య, శీర్యతే వన ఏవ వా. 25.

టీక.—కుసుమస్తబకస్యేవ = పూలగుత్తికింబోలె, మనస్వినః = గొప్పమనస్సు కలవానికి (మానశౌర్యములు కలవానికి అనుట), వృత్తిః = నడవడి, ద్వయీ = రెండువిధములది, (ఎట్లనిన), సర్వలోకస్య = సకలజనులయొక్క, మూర్ధ్ని = శిరస్సునందు (సిగయందని స్తబకపరము - అందఱికన్న పైవాఁడై అని మనస్విపరము), (ఉండును అని శేషము), వా = అట్లుకాదేని, వనే ఏవ = అడవియందే, శీర్యతే = జీర్ణించును. పైవాఁడగుట శౌర్యఫలము, అది యలవడనిచో అడవిలో తపస్సుచేయుచుండుట మానకార్యము.

తా.—మానశౌర్యములు గలవానికిఁ బూవుగుత్తికిం బోలె రెండే వృత్తులు; పూగుత్తి ఎల్లవారి మౌళులయందును వెలుఁగును, అడవిలో నొండె వాడి పోవును. అట్లే మనస్వి ఎల్లవారికి పైపడవియందుండును, ఒండె, అడవిలో తపస్సు చేయుచు జీవితమును తుద ముట్టించును.



గీ. కుసుమగుచ్ఛంబునకుఁ బోలెఁ బొసఁగు శౌర్య
మానవంతున కివి రెండు మహితగతులు,
సకలజనమస్తకప్రదేశముల నైన
వనమునం దైన జీర్ణభావంబు గనుట.

వ్యా.—ఇత్థంభూతస్య పురుషస్య వ్యాపార మాహ — కుసు మేతి.— కుసుమస్తబకస్యేవ పుష్పగుచ్ఛస్యేవే త్యేకం పదం, మనస్వినో ధీరస్య - మాన శౌర్యశాలినః పుంస ఇత్యర్థః, ద్వయీ ద్వివిధా, వృత్తి ర్వ్యాపారః, 'ద్వే గతీ హీ'తి పాఠే స్పష్టోఽర్థః - తృతీయా తు న సంభవతీత్యర్థః; కిం తద్వృత్తిద్వయమిత్యత ఆహ:— సర్వలోకస్య సర్వేషాం జనానామిత్యర్థః, మూర్ధ్ని శిరస్యున్నతస్థానే చ, స్థీయత ఏ వేతి శేషః, అథవా వన ఏ వారణ్యే, శీర్యతే వా జీర్యతే వా - భావే లట్, ఏవ ముభయీ వృత్తిః - శౌర్యాదున్నతస్థానస్థితి స్తదలాభే మానాదరణ్యే జీర్ణతా వా ఇతి వివేకః, ఇయమేవ పుంసాం శ్రేయస్కరీ వృత్తిరితి భావః. కుసుమస్తబకస్యేవేత్యత్ర సమాసః— శ్రౌతీ పూర్ణోపమాఽలంకారః, ఇవశబ్దేన సహ సమాసస్య సంభవాత్ - తథా చ వార్తికమ్ * 'ఇవేన సహ నిత్యసమాసో విభక్త్యలోపః, పూర్వ పద ప్రకృతిస్వరత్వం చే'తి వృత్తం పూర్వవత్.

---

అవ.—మానశౌర్య వంతుఁడు ఉడిగియు గొప్పకార్యములనే పూనుకొనును.

సన్త్యన్యేఽపి బృహస్పతిప్రభృతయః సంభావితాః పఞ్చషా,
స్తాన్ప్రత్యేష విశేషవిక్రమరుచీ రాహుర్న వైరాయతే;
ద్వావేవ గ్రసతే దివాకరనిశాప్రాణేశ్వరౌ భాస్వరౌ,
భ్రాతః పర్వణి పశ్య దానవపతిః శీర్షావశేషాకృతిః. 26.

టీక.—అన్యే = ఇతరులు, బృహస్పతి ప్రభృతయః = గురువు మొదలైనవారు - (గురువు బుధుఁడు శుక్రుఁడు శని అంగారకుఁడు), పఞ్చషాః = అయిదాఱుగురు, సంభావితాః = సిద్ధముగా (పూజితులు అని యేని చెప్పవచ్చును), సన్తి = కలరు, తాన్ ప్రతి = వారితో, విశేష...రుచిః - విశేష = విశిష్టమైన - (గొప్పవారిమీఁద అని యేని) - విక్రమ = పరాక్రమమందు-రుచిః=ప్రీతిగలవాఁడైన, ఏష రాహుః = ఈ రాహువు, న వైరాయతే = పగపెట్టుకొనఁడు, భాస్వరౌ = ప్రకాశమానులైన, దివాకర నిశాప్రాణేశ్వరౌ = సూర్య చంద్రులను, ద్వౌ ఏవ = ఇద్దఱను మాత్రమే, శీర్షా...కృతిః - శీర్ష = తలమాత్రము - అవశేష = మిగతగాఁగల - ఆకృతిః = స్వరూపము గలవాఁడు (అయ్యును), దానవ పతిః = అసుర శ్రేష్ఠుఁడు (రాహువు),

పర్వణి = పర్వమునందు - అమావాస్యా పూర్ణిమలందు, గ్రసతే = మ్రింగును; (హే) భ్రాతః = (ఓయి) సోదరుఁడా, పశ్య = చూడుము.

తా.—రాహువు తల తప్ప కడమ దేహము లేనివాఁ డయ్యును విశేషపరాక్రమము చూపఁగోరినవాఁడై, గురువు లోనగు నితరగ్రహములు అయిదాఱుగురు సిద్ధముగా ఉన్నను, వారిపైఁ బగఁబూనక తేజస్వంతులయిన సూర్యచంద్రులనే అమావాస్యా పూర్ణిమలయందు మ్రింగును. దేహము సంపూర్ణముగా నుండిన నింక నేమి సేయునో!

వ్యా.—పున రప్యుక్తోభయగుణవైశిష్ట్య మస్యైవోత్కృష్టతా మాహ.—సన్తీతి.—అన్యే వక్ష్యమాణ సూర్యచన్ద్రాపేక్షయా ఇతరే, బృహస్పతిప్రభృతయః బృహస్పతిప్రముఖాః - ప్రభృతిశబ్దేన బుధశుక్రాదయోఽపి గృహ్యన్తే, పఞ్చ షడ్వా పఞ్చషాః గ్రహాః * 'సంఖ్యయావ్యయే' త్యాదినా బహువ్రీహిః * 'బహువ్రీహౌ సంఖ్యేయే డ జబహుగణా' దితి సమాసాన్తో డచ్ప్రత్యయః, సంభావితాః గ్రాహ్యత్వే నోపస్థితాః బహుమతా వా, సన్తి వర్తన్తే, తాన్ ప్రతి బృహస్పతిప్రభృతీన్ లక్ష్యీకృత్యే త్యర్థః, విశేషేషు విశిష్టేషు తేజోమహత్స్వితి యావత్ - విక్రమే పరాక్రమణే - రుచిః ప్రీతి ర్యస్య స తథోక్తః - తేజస్విభి స్సహైవ కలహాచరణతత్పర ఇత్యర్థః, ఏషః ఉపరాగకర్తృత్వేన ప్రసిద్ధో, రాహుః సైంహికేయః, న వైరాయతే వైరం న కరోతి - అలక్ష్యత్వా త్తత్కలహనతత్పరో న భవతీ త్యర్థః * 'శబ్ద వైర కలహాభ్ర కణ్వ మేఘేభ్యః కరణ' ఇతి క్యఙ్ * 'అకృత్సార్వధాతుకయో ర్దీర్ఘః' ఇతి దీర్ఘః-విక్రమరుచీ రాహు రిత్యత్ర * 'రో రీ'తి రేఫలోపే * 'ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణ' ఇతి దీర్ఘః, కిం తు, భాస్వరౌ తేజస్వినౌ * 'స్థేశ భాస' ఇత్యాదినా వరచ్ప్రత్యయః, ద్వావుభౌ, దివాకర నిశాప్రాణేశ్వరౌ సూర్యాచన్ద్రమసా వేవ - అన్యయోగవ్యవచ్ఛేదార్థోఽయ మేవకారః, శిర మే వావశేషో యస్యా స్సా శిరోఽవశేషా ఆకృతి ర్యస్య శిరోమాత్రావశిష్టగాత్ర ఇత్యర్థః-'శిరోఽవశేషీకృత' ఇతి పాఠేఽప్యయ మేవార్థః పరిణమయితవ్యః, దానవపతి ర్దానవేశ్వరః పూర్వోక్తో రాహుః, పర్వణి దర్శపౌర్ణమాసీప్రతిపత్సంధౌ, గ్రసతి గిళతి, హే భ్రాత రిత్యాదరేణ పృథగ్జన సంబోధనం, పశ్యేత్యత్ర వాక్యార్థః కర్మ.— యతశ్శిరోమాత్రావశిష్ట ఏవాయ మీదృక్కర్మాచరణతత్పరోఽభూ త్సంపూర్ణాఙ్గ శ్చే త్కిం కరిష్యతి న జానామీతి భావః; ఏవం మానశౌర్యశాలినో హి నిజాఙ్గవైకల్యం న పరిగణయేయు రితి కిం తు మహత్కార్య మేవ కర్తుం వ్యవస్య న్తీతి తాత్పర్యమ్.—పురా కిల దేవానా మమృతప్రదానసమయే విష్ణుచక్రేణ ఛిన్న శిరస్త్వా చ్ఛిరోమాత్రావశిష్టగాత్రోఽభూ త్సైంహికేయ ఇతి పౌరాణికీ కథాఽత్రానుసంధేయా. శార్దూలవిక్రీడితం వృత్తమ్.

---



అవ.—మహాత్ముల మహిమ అనంతము.

వహతి భువనశ్రేణిం శేషః ఫణాఫలకస్థితాం,
కమఠపతినా మధ్యేపృష్ఠం సదా స చ ధార్యతే,
త మపి కురుతే క్రోడాధీనం పయోధి రనాదరా,
దహహ మహతాం నిస్సీమాన శ్చరిత్రవిభూతయః! 27.

టీక.—శేషః = అనంతుఁడు, ఫణా ఫలక స్థితాం = పలకలవంటి (వేయి) పడగలమీఁద ఉన్నదానినిగా (-ఉంచుకొని), భువనశ్రేణిం = లోకముల దొంతిని, వహతి = మోచుచున్నాఁడు; స చ = ఆశేషుఁడును, కమఠ పతినా = తాఁబేటి రాజుచే, మధ్యే పృష్ఠం = వీఁపు నడుమ, సదా = ఎల్లప్పుడును, ధార్యతే = మోవఁబడుచున్నాఁడు; తమ్ అపి = అతనిని (కూర్మపతిని) గూడ, పయోధిః = సముద్రము, అనాదరాత్ = అవలీలగా, క్రోడ అధీనం = ఱొమ్ములో (లేక - ఒడిలో), కురుతే = పెట్టుకొనియున్నది; అహహ = ఆశ్చర్యము, మహతాం = గొప్పవారియొక్క, చరిత్రవిభూతయః = నడవడియొక్క వైభవములు, నిస్సీమానః = మేర లేనివి.

దేవాసురులు సముద్రమును జిలికినప్పుడు పుట్టినయమృతమును మోహినీరూపుఁడై విష్ణువు దేవతలకు మాత్రము ఇచ్చుచుండఁగా, అసురుఁడగు రాహువు దేవవేషమున దేవపంక్తిలోఁ గూర్చుండి యమృతము త్రాగుచుండెను. దానిం జూచి సూర్యచంద్రులు విష్ణుమూర్తికి హెచ్చరిక సేయఁగా, ఆయన తనచక్రముతో వానికంఠమును అందులోనికి అమృతము దిగకముందే తెగ నేయఁగా, తలమాత్రము అమృతప్రభావముచే ప్రాణముతో నిలిచి యుండె నని పురాణకథ.

తా.—శేషుఁడు పదునాలుగు లోకముల దొంతరను పలకలవలె విశాలముగా నుండు తనపడగలయందు ఉంచుకొని మోచుచున్నాఁడు. అట్టిశేషుని తనవీఁపుమీఁద నుంచుకొని ఆదికూర్మము సదా మోచుచున్నది. అట్టియాకూర్మమును సయితము సముద్రుఁడు అవలీలగా తన ఱొమ్మున మోచుచున్నాఁడు. మహాత్ముల ప్రభావము అనంతమై యాశ్చర్యకరముగా నున్నది.

మ. భువనశ్రేణి వహించు శేషుఁడు ఫణాభోగంబుపై, సంతతం
బవలీలన్ ధరియించుఁ బృష్ఠమునఁ గూర్మాధీశ్వరుం డాతనిన్,
ధవళక్రోడ వశాత్ముఁ జేయు నతనిన్ వారాశి యశ్రాంతిచే,
నవురా! ధీరచరిత్రసంపద లసంఖ్యాతప్రభావోన్నతుల్!

వ్యా.—అథ మహతాం మాహాత్మ్య మాహ—వహతీతి.—శేషః, ఫణాః సహస్రసంఖ్యాకాః స్ఫుటాః ఫలకా నీవ తేషు - స్థితాం, భువనశ్రేణిం పాతాళాదిచతుర్దశ

విష్టపపఙ్క్తిం, వహతి ధారయతి - ని. 'స్ఫటాయాం తు ఫణా ద్వయో రి' త్యమరః, స చ శేషః కమఠపతినా ఆదికూర్మేణ * 'పతి స్సమాస ఏ వే'తి ఘిసంజ్ఞాయా 'మాఙో నా స్త్రియా మి'త్యాఙో నాభావః, పృష్ఠస్య మధ్యే మధ్యేపృష్ఠం నిజఖర్పరోపరిప్రదేశ ఇ త్యర్థః * 'పారే మధ్యే షష్ఠ్యా వే' త్యవ్యయీభావః - తత్సన్నియోగా దేద న్తత్వం చ మధ్యశబ్దస్య, సదా నిరన్తరం, ధార్యతే, ఉహ్యతే, త మపి కమఠపతి మపి, పయోధిః ప్రళయార్ణవః, అనాదరాత్ అనాయాసాత్, క్రోడాధీనమ్ ఆదివరాహాయత్తం కురుతే - ప్రళయకాలే పాతాళగతభూమణ్డల స్యాదివరాహావతారేణ విష్ణునా నిజదంష్ట్రయా సముద్ధృతత్వా దితి భావః, అతో మహతాం మానశౌర్యశాలినాం మహానుభావానాం సమ్బన్ధిన్యః, చరిత్ర విభూతయో మాహాత్మ్య సంపదో, నిస్సీమానో నిర్మర్యాదా - అవాఙ్మనస గోచరా ఇతి యావత్, అహహ హేత్యా శ్చర్యే - ని. 'అహహ హేత్యద్భుతే ఖేద' ఇ త్యమరః.

అత్ర పూర్వపూర్వ స్యోత్తరోత్తర గుణోత్కర్షావహత్వా న్మాలాదీపకాఖ్యోఽ లంకారః - త దుక్తం విద్యానాథేన -

'యదా తు పూర్వపూర్వస్య సంభవే దుత్తరోత్తరమ్
ప్ర త్యుత్కర్షావహత్వం త న్మాలాదీపక ముచ్యతే'. ఇతి.

హరిణీవృత్తం - లక్షణం తూక్తమ్.

---

**అవ.**—ప్రాణముకన్న మానమే ముఖ్య మనుట.

వరం ప్రాణోచ్ఛేదః సమద మఘవన్ముక్త కులిశ
ప్రహారై రుద్గచ్ఛద్బహులదహనోద్గారగురుభిః
తుషారాద్రేః సూనో, రహహ! పితరి క్లేశవివశే;
న చాసౌ సంపాతః పయసి పయసాం పత్యు రుచితః. 28.

**టీక.**—తుషార అద్రేః=మంచు కొండయొక్క (అనఁగా హిమవంతునియొక్క), సూనోః = పుత్త్రునికి (అనఁగా మైనాకునికి), ఉద్గచ్ఛత్...గురుభిః—ఉద్గచ్ఛత్ = పైకివెడలుచున్న - బహుల = మిక్కుటమైన - దహన = నిప్పుయొక్క (నిప్పును)- ఉద్గార = క్రక్కుటవలన - గురుభిః=దుస్సహములయిన, సమద...ప్రహారైః - సమద =గర్వముతోఁ గూడిన - మఘవత్ = ఇంద్రునిచేత - ముక్త = వేయఁబడిన - కులిశ =వజ్రాయుధముయొక్క - ప్రహారైః = వ్రేటులచేత, ప్రాణ ఉచ్ఛేదః = ప్రాణముయొక్కనాశము, వరమ్ = కొంచెముమేలు, అహహ = కష్టా, పితరి = తండ్రి, క్లేశ వివశే (సతి) - క్లేశ = (వజ్రాయుధపువ్రేటుల) నొప్పిచే, వివశే సతి = వశముతప్పినవాఁడై యుండఁగా, పయసాం పత్యుః = నీళ్లదొరయొక్క (అనఁగా



సముద్రునియొక్క), పయసి=నీటియందు, సంపాతః = పడియుండుట, ఉచితః న = తగినది కాదు.

**తా.**—హిమవంతునికొడుకునకు మైనాకునికి, ఇంద్రుఁడు బలముకొలఁది వ్రేయఁగా నిప్పులు గ్రక్కుచు దుస్సహముగా మీఁదఁ బడుచున్న వజ్రాయుధపు వ్రేటులచేత చచ్చుటయే కొంచెము మంచిది కాని, ఆవ్రేటుల బాధచే వశము తప్పి ప్రాణాపాయ మందున్న తండ్రిని విడిచిపెట్టి తాను తనప్రాణములు మాత్రము కాపాడుకొనుటకై సముద్రములో పడి దాఁగి యుండుట మంచిది గాదు.

చ. సమధికభీషణ జ్వలనజాల వినిర్గమ దుస్సహంబుచే
సమద సురేంద్ర ముక్తకులిశ క్షతిచే నుచితంబు ప్రాణఘా
తము హిమవత్కుమారునకుఁ దండ్రి నిశాతశతారపాతఖే
దమున మునుంగుచున్న తఱిఁ, దా జలరాశిఁ జొరంగ నర్హమే!

**వ్యా.**—మానశౌర్యశాలిన ఏ వోక్తవిధమహత్త్వం న తు తద్విహీన స్యేతి మైనాకం దృష్టాన్తీకృ త్యాహ - వర మితి.—తుషారాద్రేః సూనోః హిమవత్పుత్త్రస్య మైనాకస్య, ఉద్గచ్ఛ న్నుజ్జృమ్భమాణో - బహులో భూయిష్ఠ శ్చ - యో దహన శ్శిలాసంఘర్షణజనితవహ్ని - స్త స్యోద్గారై ర్నిస్సరణైః - గురుభిః దుస్సహైః, సమదేన సదర్పేణ - మఘవతా దేవేన్ద్రేణ - ముక్తస్య ప్రయుక్తస్య - కులిశస్య వజ్రాయుధస్య - ప్రహారై ర్విదారణైః, ప్రాణోచ్ఛేదో మరణ మి త్యర్థః, వరం మనాక్ప్రియం - ని. 'దైవా ద్వృతే వరః శ్రేష్ఠే త్రిషు క్లీబం మనాక్ప్రియే' ఇ త్యమరః, కుతః, అహహ హేతి ఖేదాతిశయద్యోతనార్థోఽనుకరణశబ్దః, పితరి హిమవతి, క్లేశేన వజ్రప్రహారజనిత దుఃఖేన - వివశే విహ్వలే సతి, అసా వద్యాఽ ప్యుపలభ్యమానః, పయసాం పత్యు స్సముద్రస్య - అత్రాసమాసత్వేన ఘిసంజ్ఞాభావాత్ * 'ఖ్యత్యా త్పర స్యే'తి కృతయణాదేశా త్తిశబ్దా త్పరస్య ఙసోఽకారస్య ఉకారాదేశః, పయసి సలిలే సంపాతః ప్రవేశః - నిజప్రాణ సంరక్షణార్థకం నిమజ్జ్యావస్థాన మి త్యర్థః, ఉచితో న్యాయ్యో, న చ న భవతి హి, అ స్యై వేతి శేషః, యతో మానశౌర్య సంపన్నస్య పుంసః స్వప్రాణమాత్ర పరిత్రాణ తత్పరతయా క్వచిన్నిలీ యావస్థాన మేవాత్యన్తాయశస్కరమ్, కిముత పితరి క్లేశవివశే; అతః ప్రాణపరిత్యాగే నాపి మానశౌర్య మేవ ప్రతిష్ఠాపనీయే, అన్యథా మహా నపవాద స్స్యా దితి భావః. అ త్రోద్గారశబ్దస్య గౌణత్వా న్న గ్రామ్యతాదోషః, ప్రత్యుత సౌన్దర్యాతిశయ మే వాపాదయతి, త దుక్తం దణ్డ్యాచార్యైః -

'నిష్ఠ్యూతోద్గీర్ణ వాన్తాది గౌణవృత్తివ్యపాశ్రయమ్
అతిసున్దర, మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే.' ఇతి.

పురా కిల భూమణ్డలోపద్రవకారిణాం పర్వతానాం కోపవశా త్పక్షచ్ఛేదోద్యతే శక్రే భయవిహ్వలో మైనాకః సముద్రమధ్యే నిమజ్జ్యాతిష్ఠ దితి పౌరాణికీ కథాఽత్రాను సంధేయా. శిఖరిణీ వృత్తమ్.

---

అవ.—తేజస్వంతులు తిరస్కారమును సహింపరు.

యదచేతనోఽపి పాదైః స్పృష్టః ప్రజ్వలతి సవితు రినకాన్తః
తత్ తేజస్వీ పురుషః పరకృతనికృతిం కథం సహతే! 29

టీక.—యత్ = ఎందుచేత, అచేతనః అపి = తెలివిలేనిదయ్యును, ఇన కాన్తః = సూర్య కాంతము, సవితుః = సూర్యునియొక్క, పాదైః = కిరణములచేత (కాళ్లచేత అనియు), స్పృష్టః = తాఁకఁబడినదై (తన్నఁబడినదై అనియు), ప్రజ్వలతి = మండునో (కోపగించునో అనియు), తత్ = అందుచేత, తేజస్వీ = తేజముగల, పురుషః = పురుషుఁడు (చేతనుఁడు అని వ్యంగ్యము), పర...నికృతిం - పర = ఒరులచేత - కృత = చేయఁబడిన - నికృతిం = తిరస్కారమును, కథం సహతే = ఎట్లు ఓర్చును (ఓర్వఁడనుట).

తా.—అచేతనమైన సూర్యకాంతమే సూర్యునిపాదములు తగిలినందులకు మండిపడుచున్నది. మానియు శూరుఁడు నగు పురుషుఁడు పరులవలని పరాభవమును బొత్తిగా సహింపఁడు.

గీ. అర్కకాంత మచేతనం బయ్యు సవితృ। పాదములు సోఁకినంతనే ప్రజ్వరిల్లుఁ,
గాన నభిమానవంతుఁ డెం దైన శత్రు। కృతతిరస్కార మెట్లు సహింప నేర్చు!

వ్యా.—అథ మానినాం పరనికారాసహనం సదృష్టాన్త మాహ - య దితి.—య ద్యస్మా త్కారణా, దచేతనః చేతనరహితః నిర్జీవోఽపీతి యావత్ - పాషాణత్వా దితి భావః, ఇనకాన్త స్సూర్యకాన్తమణిః, స్సవితు స్సూర్యస్య, పాదైః రశ్మిభి - రఙ్ఘ్రిభిశ్చ, స్పృష్టః సంవలిత స్తాడిత శ్చేతి ధ్వన్యతే, ప్రజ్వలతి జాజ్వల్యమానో భవతి - కోపోద్రిక్త శ్చేతి గమ్యతే, త త్తస్మా త్కారణాత్, తేజస్వీ తేజశ్శాలీ మానశౌర్యసంపన్నః పురుషః సచేతన ఇతి శేషః, పరై శ్శత్రుభిః కృతనికృతిం విహితాపకారం, కథం సహతే క్షమతే - న కథంచి దిత్యర్థః; మైనాక స్తు నైవ మితి భావః - ని. 'పాదా రశ్మ్యఙ్ఘ్రితుర్యాంశాః' ఇ త్యమరః. ఆర్యావృత్తభేదః.

---



అవ.—తేజస్వుల పరాక్రమమునకు వయస్సు గారణము గా దనుట.

సింహః శిశు రపి నిపతతి మదమలినకపోలభిత్తిషు గజేషు;
ప్రకృతి రియం సత్త్వవతాం; న ఖలు వయ స్తేజసాం హేతుః.

టీక.—సింహః = సింగము, శిశుః అపి = పిల్ల అయ్యును, మద...భిత్తిషు - మద - మద (జల) ముచే - మలిన = మురికియైన - కపోల భిత్తిషు = గోడలవంటి చెక్కిళ్లుగల, గజేషు = ఏనుఁగులమీఁదికి, నిపతతి = దుముకును; ఇయం = ఇది (ఇట్లు పరాక్రమించుట), సత్త్వవతాం = బలవంతులకు, ప్రకృతిః = స్వభావము; వయః = వయస్సు, తేజసాం = తేజస్వినాం = శూరులకు, (తేజశ్శబ్దము తేజస్విపరము, మహాతేజస్కు లని వ్యంగ్యము), హేతుః = కారణము, న ఖలు = కాదు గదా.

తా.—పిల్లతనమందు సయితము సింహము అతిబలిష్ఠములును భయంకరములును అగుమదపుటేనుఁగులమీఁదికి వాని కుంభస్థలములను జీల్చుటకు దుముకును. పరాక్రమము బలవంతులకు స్వభావమేగాని వయస్సుచే వచ్చునది కాదు.

క. విదళింప నుఱుకు సింగపుఁ। గొదమయు మదమలినగండ కుంజరములపై;
నిది బలశాలికి నైజము। గద; తేజోనిధికి వయసు కారణ మగునే?

వ్యా.—విక్రాన్తత్వే వయోఽపి న హేతు రితి వినిగమయతి - సింహ ఇతి.—శిశు ర్బాలోఽపి విక్రాన్తత్వయోగ్యతారహితావస్థోఽపీ త్యర్థః, సింహః, మద మలినాః దానపయః పఙ్కిలాః - కపోలాః భిత్తయ ఇవ యేషాం తేషు గజేషు - మాతఙ్గేషు, నిపతతి కుమ్భస్థలవిదారణార్థ మితి భావ, ఇయం బాల్యేఽపి విక్రాన్తతా, సత్త్వవతాం బలాఢ్యానాం, ప్రకృతిః స్వభావః, కుతః, వయో బాల్యాది, తేజసాం ప్రతాపశాలినా మితి - తేజ స్తద్వతో రభేదాధ్యవసాయోఽత్యన్తతేజస్విత్వ ప్రకాశనార్థకః, హేతుః కారణం - న భవతి ఖలు - 'తేజసాం హి న వయః సమీక్ష్యతే' ఇతి న్యాయాదితి భావః - ని. 'వయః పక్షిణి బాల్యాదా వి' త్యమరః. అయ మప్యార్యావృత్తభేదః.

ఇతి నీతిశతకే మానశౌర్య పద్ధతి వర్ణనం నామ తృతీయం దశకమ్.

---

అర్థపద్ధతిః.

జాతి ర్యాతు రసాతలం, గుణగణ స్తత్రా ప్యధో గచ్ఛతాత్,
శీలం శైలతటాత్ పత, త్వభిజనః సందహ్యతాం వహ్నినా,
శౌర్యే వైరిణి వజ్ర మాశు నిపత, త్వర్థోఽస్తు నః కేవలం,
యే నైకేన వినా గుణా స్తృణలవప్రాయాః సమస్తా ఇమే. 31.

టీక.—జాతిః = బ్రాహ్మణత్వము మొదలైనజాతి, రసాతలం = పాతాళమునకు, యాతు = పోవునుగాక, గుణగణః = (ఔదార్యాది) గుణముల సమూహము, తత్రాపి = అంతకన్నను - అధః = క్రిందికి, గచ్ఛతాత్ = పోవునుగాక, శీలం = మంచినడత, శైలతటాత్ = కొండ దరినుండి, పతతు = పడునుగాక, అభిజనః = వంశము, వహ్నినా = నిప్పుచేత, సందహ్యతాం = చక్కఁగ కాల్పఁబడునుగాక, వైరిణి = (ధనార్జనకు ప్రతిబంధక మగుటచే) శత్రువు అయిన, శౌర్యే = పరాక్రమమునందు, ఆశు = శీఘ్రముగా, వజ్రం = పిడుగు, నిపతతు = పడునుగాక; యేన ఏకేన వినా = ఏది యొక్కటి లేక, ఇమే = ఈ (చెప్పఁబడిన), సమస్తాః గుణాః = అన్ని గుణములు. తృణలవప్రాయాః = గడ్డి తునుకలతో సమానములో, (అట్టిదైన), అర్థః కేవలమ్ = ధనము మాత్రమే, నః = మాకు, అస్తు = కలుగునుగాక.

తా.—జాతి గుణ శీల వంశ శౌర్యములు ధనము లేనిచో నిష్ప్రయోజనములు. కావున అవి యెల్లను పోయి ధనము మాత్ర మున్న చాలును.

ఉ. జాతి దొలంగఁగాత, గుణశక్తి రసాతలసీమకుం జనుం
గాతఁ, గులంబు బూది యగుఁ గాత, నగంబుననుండి శీలముం
బాతముఁ జెందుఁ గాత, బహు భంగుల విత్తమె మాకు మేలు వి
ఖ్యాతగుణంబు లెల్లఁ దృణకల్పము లొక్క ధనంబు లేవడిన్.

వ్యా.—మానశౌర్యయో ర ప్యర్థమూలత్వాత్ తన్నిరూపణానన్తర మర్థపద్ధతిం నిరూపయతి.—తత్ర ప్రథమ మర్థైకతత్పరాణాం మత మభిసంధాయ త మాహ - జాతి రితి.—జాతిః బ్రాహ్మణత్వాదిః, రసాతలం నా మాధోలోకం, యాతు గచ్ఛతు భ్రశ్య త్వి త్యర్థః, గుణగణో శౌర్యౌదార్య గామ్భీర్యాదిగుణసమూహః, తత్రాపి రసాతలాపేక్షయాఽ, ప్యధః పాతాళలోకం, గచ్ఛతాత్ ప్రాప్నుయాత్, శీలం సత్స్వభావః, శైలతటాత్, పతతు పరిక్షీణం భవ త్వి త్యర్థః, అభిజనో వంశః - ని. 'అభిజనాన్వయౌ వంశౌ' ఇ త్యమరః, వహ్నినా, సందహ్యతాం భస్మీక్రియతాం, వైరిణి సంక్షోభకారిత్వా చ్ఛత్రుభూతే, శౌర్యే శూరత్వమూర్ధ్ని ఇ త్యర్థః, ఆశు శీఘ్రం, వజ్ర మశని - ర్నిపతతు - అశని నిపాతేన త దపి విధ్వస్తం భవ త్వి త్యర్థః, ఏవం పూర్వోక్త జాతి కులోచితాభిమాన శౌర్యాదినాశేఽ ప్యస్మాకం న కించి దపి చ్ఛిన్న మితి భావః, తథాఽపి కిం యుష్మ దభిలషిత మి త్యత ఆహుః, నోఽస్మాకమ్, అర్థః కేవలం విత్త మేవాస్తు సంభవ - త్వయ మే వాస్మాకం పరమార్థ ఇతి భావః, న నూత్కర్షావహత్వేన ప్రసిద్ధానా ముక్తగుణానాం విధ్వంస మఙ్గీకృత్య ఏకేన విత్తేన కిం కరిష్య థేతి నాశఙ్కనీయం - యత స్త ద్వినా తేషా మ ప్యత్యన్తాకించిత్కరత్వ మే వే త్యాహుః, ఏకేన కేవలేన - ని. 'ఏకే ముఖ్యాన్యకేవలాః' ఇ త్యమరః, యేన అర్థేన వినా -



*'పృథగ్వినే' త్యాదినా వికల్పా త్తృతీయా, ఇమే పూర్వోక్తాః, సమస్తా అపి గుణాః జాతికులశీలాభిమానాదయ, స్తృణకణకల్పా స్తద్వన్నిస్సారా ఇ త్యర్థః, అతో గుణమహత్త్వాయా అ ప్యేతన్మూలకత్వా దయ మేవ సంపాదనీయ ఇతి భావః.

'ధన మార్జయ కాకుత్స్థ, ధనమూల మిదం జగత్,
అన్తరం నాభిజానామి నిర్ధనస్య మృతస్య చ.'

ఇతి లక్ష్మణవాక్య మేవ సిద్ధాన్తీకుర్మః;

'అర్థానా మర్జనే దుఃఖ, మర్జితానాం చ రక్షణే,
రక్షితానాం వ్యయే దుఃఖం, ధి గర్థం దుఃఖభాజనమ్.'

ఇతి మనుస్మరణం త్వశక్తవిషయం మన్యామహ ఇతి తాత్పర్యమ్.

శార్దూలవిక్రీడితం - లక్షణం తూక్తమ్.

---

అవ.—ఎల్లగుణములును ధనము నాశ్రయించును.

యస్యాస్తి విత్తం స నరః కులీనః, స పణ్డితః, స శ్రుతవాన్గుణజ్ఞః,
స ఏవ వక్తా, స చ దర్శనీయః, సర్వే గుణాః కాఞ్చన మాశ్రయన్తి. 32

టీక.—యస్య = ఎవనికి, విత్తమ్ = ధనము, అస్తి = కలదో, స నరః = ఆమనుష్యుఁడు, కులీనః = గొప్పకులమునఁబుట్టినవాఁడు, సః, పణ్డితః = విద్వాంసుఁడు, సః, శ్రుతవాన్ = శాస్త్రజ్ఞుఁడు - లేక (ధర్మాధర్మముల)వినికి కలవాఁడు, స ఏవ = అతఁడే, గుణజ్ఞః = గుణములను గ్రహించువాఁడు, స ఏవ, వక్తా = వాగ్మి, సః, దర్శనీయః చ = చూడఁదగినవాఁడును (అందగాఁడును అనుట), సర్వే = అన్ని, గుణాః = గుణములు, కాఞ్చనమ్ = బంగారమును, ఆశ్రయన్తి = ఆశ్రయించును.

తా.—విత్తము గల వానియందు కులము, పాండిత్యము, శాస్త్రజ్ఞానము, గుణజ్ఞత, వాగ్మిత, సౌందర్యము, మొదలైన గుణములు లేక పోయినను, ఉన్నట్లే లోకులు వ్యవహరింతురు.

క. ఏనరునకు విత్తముగల । దానరుఁడు కులీనుఁ డధికుఁ డార్యుఁ డతండే
ధీనిధి ధన్యుఁడు నేర్పరి, । నానాగుణగణము కాంచనంబున నిలుచున్.

వ్యా.— నను తథాఽపి గుణాభావేఽపి కేవలవిత్త స్యాకించిత్కరత్వ మే వే త్యాశఙ్క్య త స్యై వాశేషగుణావహత్వం తావ దాహ - య స్యేతి.—యస్య నరస్య, విత్తం, మస్తి సంభవతి, స నరః, కులే జాతః కులీనః మహాకుల ప్రసూతః * 'కులాత్ఖః' ఇతి ఖ ప్రత్యయః, స ఏవ పణ్డితో విద్వాన్, స ఏవ శ్రుతవాన్ శాస్త్రజ్ఞః-య ద్వా- శ్రుతం శ్రవణం నపుంసకే భావే క్తః - త ద స్యా స్తీతి శ్రుతవాన్ ధర్మశాస్త్రాద్యాకర్ణనచతురోఽ పీ త్యర్థః, స ఏవ గుణజ్ఞో గుణగ్రాహీ-అత్ర*'ఆతోఽనుపసర్గే క'

ఇత్యాదివ్యాఖ్యాతం ప్రాక్, స ఏవ, వక్తా వాగ్మీ, స చ స ఏవ, దర్శనీయ స్సుందరశ్చ - ఉక్తగుణరాహిత్యేఽపీతి భావః, నన్వేవం చేత్పురుష స్యైకేన విత్తేన ఈదృగ్గుణసాకల్యసంపన్నత్వం కుత ఇత్యాశఙ్క్యాహ - సర్వే, గుణాః పూర్వోక్తకులీనత్వాదయః, కాఞ్చనం విత్తం, మాశ్రయన్తి, అతోఽనేనైవ సకల గుణసంపత్తిసంభవే కిమన్యైః ప్రత్యేక ప్రయాస సాధ్యై రితి భావః.

అత్ర విత్తస్యైతావద్గుణసంపాదకత్వాసంబన్ధేఽపి తత్సంబన్ధాభిధానా దసంబన్ధే సంబన్ధరూపాతిశయోక్తిః. వృత్త ముపజాతిః.

---

అవ.—ధననాశమునకు కారణమును చెప్పుచున్నాఁడు.

దౌర్మన్త్ర్యా న్నృపతి ర్వినశ్యతి, యతిః సఙ్గాత్, సుతో లాలనా,
ద్విప్రోఽనధ్యయనాత్, కులం కుతనయా, చ్ఛీలం ఖలోపాసనాత్,
హ్రీ ర్మద్యా, దనవేక్షణా దపి కృషిః, స్నేహః ప్రవాసాశ్రయా,
న్మైత్రీ చాప్రణయాత్, సమృద్ధి రనయాత్, త్యాగాత్ ప్రమాదా ద్ధనమ్.

టీక.—నృపతిః = రాజు, దౌర్మన్త్ర్యాత్ = దుష్టులైన మంత్రులు కలవాఁడగుటవలన, వినశ్యతి = చెడును; యతిః = యోగి, సఙ్గాత్ = సాంగత్యమువలన, విన...; సుతః = కొడుకు, లాలనాత్ = బుజ్జగించుటవలన, విన...; విప్రః = బ్రాహ్మణుఁడు, అనధ్యయనాత్ = వేదము చదువమివలన, విన...; కులం = వంశము, కుతనయాత్ = దుష్టపుత్త్రునివలన, విన...; శీలం = మంచినడత, ఖల ఉపాసనాత్ = దుష్టులయొక్క కొలువువలన (అనఁగా దుష్టులను గొలుచుటవలన), విన...; హ్రీః = లజ్జ, మద్యాత్ = సారాయివలన, విన...; కృషిః = సేద్యము, అనవేక్షణాత్ = పై విచారణ లేమివలన, విన...; స్నేహః = కూరిమి, ప్రవాస ఆశ్రయాత్ = విదేశవాసముయొక్క అవలంబనమువలన(స్వదేశము వదలి పోవుటచేత), విన...; మైత్రీ = చెలిమి, అప్రణయాత్ = విశ్వాసము లేమివలన, విన...; సమృద్ధిః = సంపద అనయాత్ = నీతిలేమివలన, విన...; ధనం = ద్రవ్యము, త్యాగాత్ = ఇచ్చుటవలనను, ప్రమాదాత్ = పరాకువలనను, విన....

తా.—దుర్మంత్రులచేత రాజు, సంగముచేత యోగి, బుజ్జగముచేత కొడుకు, వేదాధ్యయనము లేమిచే బ్రాహ్మణుఁడు, కుపుత్త్రునిచేత కులము, దుష్టులకొలువుచేత మంచినడవడి, సారాయిచే లజ్జ, పైపరామర్శలేమిచే పయిరు, (ఎడఁబాసి) పోవుటచేత ప్రేమ, విశ్వాసములేమిచేత మైత్త్రి, నీతిలేమిచే సంపద, ఈవిచేతను ఏమాఱుటచేతను ధనము, చెడును.



మ. యతి సంగంబున, బాలుఁడాదరముచే, జ్యాభర్త దుర్మంత్రిచే,
శ్రుతిహానిన్ ద్విజుఁ, డన్వయంబు ఖలుచేఁ, గ్రూరాప్తిచే శీల ము,
ద్ధతిచే మిత్రత, చూపులేమిఁ గృషి, మద్యప్రాప్తిచే సిగ్గు, దు
ర్మతిచే సంపదలున్, నశించుఁ, జెడు నర్థంబుల్ ప్రమాదంబునన్.

వ్యా.—అథ ద్వాభ్యా మర్థస్య వినాశప్రకార మాహ - దౌర్మన్త్ర్యా దితి.—నృపతిః రాజా, దుష్టో న సులక్షణ ప్రయుక్తో మన్త్రః షాడ్గుణ్యాచిన్తనం యస్య తస్య దుర్మన్త్రిస్య భావో దౌర్మన్త్ర్యం తస్మా ద్ధేతోః, ర్నశ్యతి వినష్టో భవతి - మన్త్రివైకల్యే పరేషా మవకాశసంభవాత్ రాజ్యాపహరణా దితి భావః - యద్వా - దుష్టా మన్త్రిణః ప్రధానాని యస్య తస్య భావ స్తస్మా న్నశ్యతి - అదణ్డ్యదణ్డనా ద్వ్యపదేశేన లక్ష్మ్యాది రహితో భవ తీ త్యర్థః.—

'సన్మన్త్రిణా వర్ధయతే నృపాణాం లక్ష్మీ ర్మహీధర్మయశస్సమూహః;
దుర్మన్త్రిణా నాశయతే తథైవ లక్ష్మీ ర్మహీధర్మయశస్సమూహః.'

ఇతి వచనా దితి భావః; యతి ర్యోగీ, సఙ్గా త్సమాగమా న్నశ్యతి - సఙ్గస్యకామక్రోధాది హేతుత్వాత్ - తదుత్పత్త్యా భ్రష్టయోగో భవ తీ త్యర్థః -

'సఙ్గా త్సంజాయతే కామః కామా త్క్రోధోఽభిజాయతే,
క్రోధా ద్భవతి సంమోహః, సమ్మోహాత్ స్మృతివిభ్రమః.'

ఇతి గీతా వచనా దితి భావః; సుతో లాలనా, న్నశ్యతి గుణహీనో భవతి -

'లాలనా ద్బహవో దోషా, స్తాడనా ద్బహవో గుణాః,
తస్మా త్పుత్త్రం చ శిష్యం చ తాడయే న్న తు లాలయేత్.'

ఇతి న్యాయా దితి భావః; విప్రో బ్రాహ్మణో, ఽనధ్యయనాత్ వేదశాస్త్రాధ్యయనాభావాత్, నశ్యతి నీచో భవతి –

'వేదవేదాఙ్గతత్త్వజ్ఞో విప్ర స్సర్వత్ర పూజ్యతే,
అనధీతశ్రుతి ర్విప్రః సభామధ్యే న శోభతే.' ఇతి;

కులం వంశః, కుతనయా త్కుపుత్త్రా, న్నశ్యతి -

'కోటరాన్తర్భవో వహ్ని స్తరు మేకం దహిష్యతి,
కుపుత్త్ర స్తు కులే జాతః స్వకులం నాశయే త్వరమ్.'

ఇతి న్యాయాత్; శీలం సత్స్వభావః, ఖలోపాసనా ద్దుర్జనసమాగమా, న్నశ్యతి - తేషా మత్యన్తానర్థమూలకత్వా దితి భావః -

'ఛాదయిత్వాఽఽత్మభావం హి చరన్తి శఠబుద్ధయః,
ప్రహరన్తి చ రన్ధ్రేషు, సోఽనర్థ స్సుమహా న్భవేత్.'

ఇతి వాక్యాత్; హ్రీః జుగుప్సితకర్మాచరణా న్నివృత్తిః, మద్యాత్ మద్యపానా న్నశ్యతి -

'అయుక్తం బహు భాషన్తే, యత్ర కుత్రాపి శేరతే,
నగ్నా విక్షిప్య గాత్రాణి తే జాల్మా ఇవ మద్యపాః.'

ఇత్యుక్తత్వాత్, కృషి స్సస్య మనవేక్షణా న్నశ్యతి - నిత్యమపరామర్శా న్నశ్యతి -

'కృషిం చ పత్నీ మనవేక్ష్య యః పుమా నన్యాని కార్యాణి సమాచరే చ్చ,
తే త్వేవ మేవం చ సమాకులే ద్వే త థేతి బాధానిచయం చ యాతః.'

ఇతి స్మరణాత్; స్నేహః పుత్త్రదారాదిష్వుత్పన్నో మోహః, ప్రవాసాశ్రయా ద్దేశా న్తర సంచార సమాశ్రయణా, న్నశ్యతి -

'సుతాఙ్గనాబన్ధుషు సోదరేషు నృపేషు భృత్యేషు చ జాతమోహః,
ప్రవాసమాత్రేణ హి నశ్యతేఽఖిలః, చిరం ప్రవాసేన హర త్యశేషమ్.'

ఇతి వచనాత్; మైత్త్రీ మిత్త్రభావః, అప్రణయా దననురాగా, న్నశ్యతి -

'మృద్ఘట ఇవ సుఖభేద్యో దుస్సంధాన శ్చ దుర్జనో భవతి,
సుజన స్తు కనకఘట ఇవ దుర్భేద్య శ్చాశు సంధేయః.'

ఇతి వచనాత్, సమృద్ధి స్సంపత్తి, రనయా న్నీతిరాహిత్యా, న్నశ్యతి -

'రక్షాయాం స్వ మతిక్షిప, త్యధికరం శిక్షాగుణై ర్లభ్యతే,
విద్వేష్టి స్వజనం, త్యజ త్యవనతిం, మృద్నాతి మార్గస్థితాన్,
భూతిం నేచ్ఛతి, యోజనా త్ప్రతిభయం దుర్వర్త్మనా గచ్ఛతి,
క్రూరాగ్రం వినయాఙ్కుశం న సహతే భూపాలమత్తద్విపః.'

ధనం తు త్యాగా దర్థిసా త్కరణాత్ - 'ద్యూతా ది' తి పాఠే - ద్యూతా దక్షక్రీడాయాః - ప్రమాదా దనవధానతాయా వా - నశ్యతి 'శ్రుతినిష్పీడనా చ్చైవ నాథానస క్తధియా నృణా మ్' ఇతి - ప్రమాదా న్నాశ స్త్వనుభవసిద్ధ ఏవ - దానా న్నాశ స్సమన న్తరశ్లోక ఏవ వక్ష్యతే - 'శిష్టానాం గర్హణా న్నాశః సదాచార వివర్జనాత్.' శార్దూల విక్రీడితమ్.

---

అవ.—ధనమునకు మూఁడు పోకడలు.

దానం భోగో నాశ, స్తిస్రో గతయో భవన్తి విత్తస్య,
యో న దదాతి న భుఙ్క్తే, తస్య తృతీయా గతి ర్భవతి. 34.

టీక.—దానం = ఇచ్చుట భోగః = అనుభవించుట, నాశః = పరులపాలగుట, (అని), విత్తస్య = ధనమునకు, తిస్రః = మూఁడు, గతయః = పోకడలు - భవన్తి = కలుగును. యత్ = దేనిని (ఏధనమును), (ధనికుఁడు), న దదాతి = ఈయఁడో, న



భుఙ్క్తే = అనుభవింపఁడో, తస్య = దానికి (ఆధనమునకు) - తృతీయా గతిః = మూఁడవ పోకడ - అనఁగా నాశము, భవతి = కలుగును.

తా.—ఇచ్చుట, అనుభవించుట, నాశము, అని ధనమునకు మూఁడు పోకడలు; ఈయక అనుభవింపక కూడఁబెట్టిన ధనమునకు నాశమే గతి.

క. దానము భోగము నాశము । పూనికతో మూఁడుగతులు భువి ధనమునకున్,
దానము భోగము నెఱుఁగని । దీనునిధనమునకుఁ గతి దృతీయమె పొసఁగున్.

వ్యా.—అథ విత్త స్యోత్తమాదిభేదేన త్రైవిధ్య మాహ - దాన మితి.— దానం సత్పాత్రత్యాగః, భోగః స్వచ్ఛన్దనాదిద్వారాఽనుభవః, నాశః దాన ధర్మాద్యభావే చోరాదినా విలయ శ్చ - త దుక్తమ్ -

'చత్వారో ధనదాయాదా ధర్మాగ్ని నృప తస్కరాః,
తేషాం జ్యేష్ఠావమానేన త్రయః కుప్యన్తి సోదరాః.' ఇతి,

ఏవ ముత్తమ మధ్య మాధమ భేదేన విత్తస్య, గతయో గమనోపాయా, భవన్తి; తత్ర యః పుమాన్, న దదాతి అర్థిభ్యో న ప్రయచ్ఛతి విత్త మితి శేషః, అథ వా న భుఙ్క్తే నానుభవతి, తస్య దానభోగాభ్యాం విత్తవ్యయ మకుర్వతః పురుషస్య సంబన్ధినో విత్త స్యేతి శేషః, తృతీయా గతి ర్నాశావస్థా భవతి - సా త్వత్యన్తకష్టే త్యర్థః. అయ మత్ర నిష్కృష్టోఽర్థః - విత్తస్య దానేన గతి రుత్తమా, ఆత్మభోగేన మధ్యమా, చోరాదినా నాశగతి రధ మేతి; అతో దానశౌణ్డేన నైవ భవితవ్యం ధనాఢ్యేనేతి భావః. ఆర్యాభేదః.

---

అవ.—ఈపవలనఁ గలిగిన పేదఱికము శోభనే కలిగించును.

మణి శ్శాణోల్లీఢః, సమరవిజయీ హేతిదళితో,
మదక్షీణో నాగః, శరది సరి దాశ్యానపులినా,
కలాశేష శ్చన్ద్రః, సురతమృదితా బాలవనితా,
తనిమ్నా శోభన్తే, గళితవిభవా శ్చార్థిషు నరాః. 35.

టీక.—శాణ ఉల్లీఢః = సానచే ఒరయఁబడిన (సానఁబెట్టఁబడిన యనుట), మణిః = రత్నము, హేతి దళితః = ఆయుధములచే గాయపఱుపఁబడిన, సమర విజయీ = రణములో గెలుపుగలవాఁడు, మద క్షీణః = మదజలము (ఓడుట) చేత కృశించినట్టి, నాగః = ఏనుఁగు, శరది = శరదృతువునందు, ఆశ్యాన పులినా = కొంచెముగా నెండినయిసుకతిన్నెగల, సరిత్ = ఏఱు, కలాశేషః = (పదునేను కళలు దేవతలు భక్షింపఁగా) (ఒక్క) కళ (మాత్రము) మిగతగాఁగల, చన్ద్రః =

చంద్రుఁడు, సురత మృదితా = మన్మథ క్రీడచే నలఁపఁబడిన, బాల వనితా = లేఁబ్రాయపు స్త్రీయును, అర్థిషు = యాచకులయందు (యాచకుల కిచ్చి), గళిత విభవాః = పోయిన ధనముగలవారైన (కలధనమెల్ల దానముచేసిన యనుట), నరా శ్చ = జనులును, తనిమ్నా = కృశత్వముచేత, శోభన్తే = సొంపెక్కుదురు.

తా.—సానఁ బట్టిన రత్నమును, ఆయుధపు గంట్లతోఁడి రణవిజయియు, మదధారలచే కృశించిన యేనుఁగును, శరత్కాలమందు ఇసుకతిన్నెలు ఎండిననదియును, ఏకకళగానున్న చంద్రుఁడును, రతిక్రీడలందు నలఁగియున్న లేజవరాలును, ధన మెల్ల యాచకుల కిచ్చి బీద లైనదాతలును, ఆకృశత్వముచేత శోభింతురు.

ఉ. శాణవిఘృష్టరత్నమును శస్త్రహతుం డగుశూరుఁడున్ మద
క్షీణగజంబు సైకతవిశిష్టశరన్నదియున్ నవక్షపా
ప్రాణవిభుండు చండసురతాలస బాలికయున్ ధనైకవి
శ్రాణనశూరులుం గడుఁ గృశత్వమునం బ్రభఁ గాంతు రిద్ధరన్.

వ్యా.—అథ దానశీలస్య విత్తవ్యయజనిత తనుత్వ మపి శోభావహ మేవే త్యాహ - మణి శ్శాణ ఇతి.—శాణ శ్శస్త్రోత్తేజనసాధనోపల విశేషః - తే నోల్లీఢః సంఘృష్టో, మణి శ్చ, హేతిదళితః శస్త్రక్షతః, సమరవిజయీ రణశూర శ్చ * 'జిదృక్షి' త్యాదినా ఇనిః - ని. 'హేతి శ్శస్త్రే తు నృస్త్రియో రి'తి కేశవః, మదేన దానవర్షేణ, పరిక్షీణః కృశో, నాగ శ్చ - ని. 'గ్రహోభాహిగజా నాగా' ఇతి వైజయన్తీ, శరది శరత్కాలే, ఆశ్యానాని ఈషచ్ఛుష్కాణి - పులినాని సైకతాని - యస్యా స్సా, సరిత్ నదీ చ * 'సంయోగాదే రాతో ధాతో ర్యణ్వత' ఇతి నిష్ఠానత్వం, కళాశేషః షోడశాంశమాత్రావశిష్టః, శ్చన్ద్ర శ్చ - ని. 'కళా తు షోడశో భాగ' ఇ త్యమరః - 'ప్రథమాం పిబతే వహ్ని రి' త్యాదీతిహాసక్రమే ణేతరకళానా మగ్న్యాదిదేవై గ్రసితత్వా దితి భావః, సురతేన రతిరణేన - మృదితా విహ్వలీకృతా, బాలవనితా ముగ్ధాఙ్గనా పాఞ్చాలవనితేతి పాఠే వేశ్యా చోచ్యతే, తథా, అర్థిషు విషయే - గళిత విభవా వ్యపగతార్థసంపదః - నిశ్శేష మర్థిసాత్కృతధనా ఇ త్యర్థః - ని. 'అర్థా రై విభవా అపీ' త్యమరః, నరా దాతృజనా శ్చ, తనిమ్నా తనుత్వే నైవ * పృథ్వాదిత్వా దిమనిచ్, శోభన్తే - ఏవంభూతతనుత్వ స్యైవ తేషాం శోభాహేతుత్వా దితి భావః.

అత్ర ప్రస్తుతానాం నరాణాం చ సామస్త్యేన శోభారూప తుల్యధర్మే ణౌపమ్యస్య గమ్యమానత్వా ద్దీపకాలంకారః -

'ప్రస్తుతానాం తథాఽన్యేషాం సామస్త్యే తుల్యధర్మతః,
ఔపమ్యం గమ్యతే యత్ర, దీపకం త న్నిగద్యతే.'

ఇతి లక్షణాత్ - శిఖరిణీ వృత్తమ్.

---



అవ.—కలిమిలేములనుబట్టి వస్తువులయందుఁ గలుగునట్టి యాదరానాదరములు.

పరిక్షీణః కశ్చిత్ స్పృహయతి యవానాం ప్రసృతయే,
స పశ్చాత్ సంపూర్ణః కలయతి ధరిత్రీం తృణసమామ్,
అత శ్చానేకాన్తా గురులఘుతయాఽర్థేషు ధనినా,
మవస్థా వస్తూని ప్రథయతి చ సంకోచయతి చ. 36.

టీక.—కశ్చిత్ = ఒకానొకఁడు, పరిక్షీణః = పేదవడినవాఁడై, యవానాం = యవలయొక్క - ప్రసృతయే = చేరెఁటికొఱకు (చేరెఁడు యవలకు అనుట), స్పృహయతి = ఆసపడును; సః = వాఁడు, పశ్చాత్ = పిమ్మట, సంపూర్ణః = నిండినవాఁడై (ధనికుఁడై), ధరిత్రీం = భూమిని, తృణ సమాం = గడ్డిపరకతో సమానమునుగా, కలయతి = తలఁచును; అత శ్చ = అందువలన, అర్థేషు = ధనములయందు, గురులఘుతయా = అధికము అల్పము అనుభావముచేత (కలిమిలేములచే ననుట), అనేకాన్తా = పెక్కువిధములుగలదైన, ధనినామ్ అవస్థా = ధనికుల దశ, వస్తూని = వస్తువులను. ప్రథయతి చ = గొప్పవానినిగా చేయును, సఙ్కోచయతి చ = అల్పములనుగాను చేయును.

తా.—లేనివాఁడు చేరెఁడు యవలు బంగారము, కలవాఁడు భూమండలము తృణప్రాయము. అట్లు కలిమిలేములంబట్టి వస్తువులయందు ఆదరానాదరము లేర్పడుచుండును.

ఉ. చేరి యొకండు నెవ్వఁ బడి చిక్కుచుఁ జేరెఁడుశాలిధాన్యమే
కోరు, నతండు పిమ్మట నకుంఠధనోన్నతుఁడై వసుంధరం
బూరికి సాటిగాఁ దలఁచు, భూరిధనాఢ్యులచొప్పనేకమై
గౌరవమున్ లఘుత్వమును గైకొను వస్తువులందు నెల్లెడన్.

వ్యా.—అథ పుంసాం ధనాభావతత్సద్భావసమయావస్థా మాహ - పరిక్షీణ ఇతి.—కశ్చి ద్ధనికః పుమాన్, యవానాం శితశూకాఖ్యధాన్యానాం ప్రసృతయే స్పృహయతి ప్రసృతి మాత్రయవాన్ గురుతయా కాఙ్క్షత ఇ త్యర్థః * 'స్పృహే రీప్సిత' ఇతి సంప్రదానత్వా చ్చతుర్థీ - ని. 'శిత శూకయవౌ సమా వి' త్యమరః, స పరిక్షీణః పుమాన్, పశ్చా దనన్తరం - కాలాన్తర ఇత్యర్థః, సంపూర్ణో దైవవశా ద్ధనసంపన్న స్సన్, ధరిత్రీం భువం, తృణసమాం తృణకల్పాం తద్వ ల్లఘ్వీ మి త్యర్థః, కలయతి మనుతే - ధనమదేన తథాఽఽలోకయ తీ త్యర్థః - కవీనాం కలిః కామధేనుః, అత శ్చాత ఏవ హేతో, రర్థేషు యవధరిత్ర్యాదిషు వస్తుషు విషయే, గురులఘుతయా మహత్త్వాల్పత్వభావేన, అనేకాన్తాఽప్రతినియతా - సర్వథా గురుణి గురుత్వ మేవ లఘుని లఘుత్వ మే వేతి నియమాభావవ తీ త్యర్థః, ధనినాం సంబన్ధి, న్యవస్థా వ్యాపారః,

వస్తూని యవధరిత్యాత్రి ద్యల్పమహత్తర వస్తూని, ప్రథయతి చ ధనాభావదశాయాం నీచ మపి వస్తు గురూకరో తీ త్యర్థః, తథా సంకోచయతి చ తత్సద్భావదశాయాం మహ దపి వస్తు నిరాకరో తీ త్యర్థః. నిర్ధన ధనికయో రిత్థంభూతాఽవస్థా ప్రత్యక్షసిద్ధా; అతో వివేకినా నైవం విపర్యస్తబుద్ధినా భవితవ్య మితి భావః. శిఖరిణీ వృత్తం - లక్షణం తూక్తమ్.

---

అవ.—రాజులకు ధనాద్యాగమోపాయము.

రాజన్ దుధుక్షసి యది క్షితిధేను మేతాం,
తే నాద్య వత్స మివ లోక మముం పుషాణ;
తస్మిం శ్చ సమ్య గనిశం పరిపుష్యమాణే,
నానాఫలం ఫలతి కల్పలతేవ భూమిః. 37.

టీ.—రాజన్ = రాజా, ఏతాం = ఈ, క్షితిధేనుం = ఆవువంటిభూమిని, దుధుక్షసి యది = పిదుకఁగోరుదు వేని, తేన = అందుకై, అద్య = ఇప్పుడు, అముం = ఈ, లోకం = జనమును, వత్సమ్ ఇవ = దూడనుం బోలె, పుషాణ = పెంపుము; (కిం) చ= మఱి, తస్మిన్ = ఆజనము, అనిశం = సర్వదా, సమ్యక్ = చక్కఁగా, పరి పుష్యమాణే సతి = పెంపఁబడునది అగుచుండఁగా, భూమిః = రాష్ట్రము, కల్ప లతా ఇవ = కల్పవృక్షపుఁ గొమ్మ వలె, నానా ఫలం = పలువిధములయిన ఫలమును, ఫలతి = ఫలించును.

తా.—దూడ చక్కఁగా నెదుగుచు కుడుచుచుండిన, ఆవు చేఁపి గొల్లవానికి సమృద్ధిగా పాలు ఇచ్చునట్లు, జనులు వర్ధిల్లుచు కృష్యాదులు సేయుచుందురేని, భూమి యేలికి నానాఫలములను కల్పవల్లియుంబోలె నొసంగును. కావున భూమివలన ఫలము గోరినవాఁడు జనులను చక్కఁగా పోషించుకొనవలయును.

తే. ధరణిధేనువుఁ బిదుకంగఁ దలఁచితేని । జనుల బోషింపు మధిప వత్సములమాడ్కి;
జనులు పోషింపఁబడుచుండ జగతి కల్ప । లత తెఱంగున సకలఫలంబు లొసఁగు.

వ్యా.—అథ రాజానం సంబోధయం స్త స్యార్థసాధనోపాయ మతిదిశతి - రాజ న్నితి.—హే రాజన్ త్వ మితి శేషః-అన్యథా * 'శేషే ప్రథమ' ఇతి ప్రథమపురుషః స్యాత్, ఏనా మేతాం త్వద్ధస్తగతా మి త్యర్థః * అత్రాన్వాదేశాభావా దేనాదేశ శ్చిన్త్యః, క్షితి ర్ధేను రి వే త్యుపమితిసమాసః - న తు క్షితి రేవ ధేను రితి రూపకం - వత్స మి వేతి స్పష్టోపమాలిఙ్గాత్, తాం క్షితి ధేనుం, దుధుక్షసి యది దోగ్ధు మిచ్ఛసి చేత్ - అర్థ మితి శేషః * దుహే స్సన్నన్తాత్ సిచ్ * దుహ్యాదే ర్ద్వికర్మకత్వాని



యమాత్, తర్హి తేన దుధుక్షాహేతునా, అ ద్యేదానీ ముపలభ్యమానం, లోకం జనం, వత్సం తర్ణక మివ - ని. 'వత్సో నా కుటజే వర్షే తర్ణకే తనయాదిక' ఇతి వైజయన్తీ - పుషాణ పోషయ - ని. 'లోక స్తు భువనే జన' ఇ త్యమరః - వత్సనాశే క్షీర స్యేవ లోకనాశే ఽర్థ స్యాసంభవా దితి భావః, పోషణఫల మాహ, తస్మిన్ లోకే, చానిశం సర్వదా, సమ్య గసంబాధం, పరిపుష్యమాణే-పరిపాల్యమానే సతి, భూమిః క్షితిః, కల్పల తేవ కల్పవృక్షశా ఖేవ - ని. 'సమే శాఖాలతే' ఇ త్యమరః - యద్వా కల్పయ త్యభీప్సితా నీతి కల్పా - సా చ సా లతా చ * 'స్త్రియాః పుంవ' దిత్యాదినా పుంవద్భావః - సేవ కల్పవ ల్లీవ, నానావిధఫలం ధనధాన్యాది బహురూపఫలం, ఫలతి నిష్పాదయతి - 'ఫలనిష్పత్తా' వి'తి ధాతో ర్లట్. యతో లోకపరిపాలనవ్యతిరేకేణ న తేఽర్థః సంభవిష్యతి - తద్ద్వా రైవ భూమే ర ప్యఖిలఫలదోగ్ధృత్వాత్ - తస్మా దశేషలాభార్థం తత్పరిపోషణ మావశ్యక మితి భావః.

అత్ర పూర్వవాక్యస్థోపమయా నిర్వ్యూఢో త్తరవాక్యస్థోప మే త్యనయో రఙ్గాఙ్గి భావేన సంకరః. వసంతతిలకావృత్తమ్.

---

అవ.—రాజనీతి.

సత్యాఽనృతా చ, పరుషా ప్రియభాషిణీ చ,
హింస్రా దయాళు రపి, చార్థపరా వదాన్యా,
నిత్యవ్యయా ప్రచురనిత్యధనాగమా చ,
వారాఙ్గనేవ నృపనీతి రనేకరీతిః. 38.

టీక.—నృప నీతిః = రాజ నీతి, వార అఙ్గనా ఇవ = బోగపుఁ జాన వలె, (సమయమునకుఁ దగినట్లు), సత్యా = సత్య, అనృతా చ = అసత్య యు, పరుషా = నిష్ఠుర (ముగా పలుకునది), ప్రియ భాషిణీ చ = ఇచ్చకము ఆడునది యు, హింస్రా= ఘాతుక, దయాళు రపి = కనికరముగలది యు, అర్థ పరా = ధనమందు ఆసక్త, వదాన్యా చ = ఇచ్చునది యు, నిత్య వ్యయా = సదా వ్యయము గలది, ప్రచుర...చ - ప్రచుర =మిక్కిలి - నిత్య = నిత్యమును - ధన=ధనముయొక్క - ఆగమా చ = రాబడి గలదియు, (ఇట్లు), అనేక రీతిః = బహు విధములుగలది.

తా.—వేశ్యాంగన, సమయోచితముగా, నిజమాడుటగాను కల్లలాడుటగాను, పరుసములాడుటగాను ఇచ్చకములు పలుకుటగాను, క్రూరముగాను కనికరముగాను, పిసిడితనముతోను ఈవితోను, సదా వెచ్చముతోను సదా మిక్కిలిరాబడితోను, పెక్కుతీరులుగా నుండును; అట్లే రాజనీతియు, సమ...నుండును.

తే. సత్య మనృతంబు పరుషోక్తి సరసభాష । ప్రాణిహింసయు దయయు లోభంబు నీగి
కనకసంగ్రహవ్యయములు గలుగు వార । రమణికైవడి బహురీతి రాజనీతి.

వ్యా.—యతో రాజానం సంబోధితవా, నపి తన్నీతిః కీదృశీ త్యాశఙ్కాయాం తస్యా బహువిధత్వ మిత్యాహ - స త్యేతి.—సత్యా యథార్థభాషిణీ, అనృతా అసత్యవాదినీ చ, తథా పరుషా కఠోరభాషిణీ, ప్రియభాషిణీ మధురాలాపినీ చ, తథా హింస్రా ఘాతుకా - ని 'శరారు ర్ఘాతుకో హింస్ర' ఇత్యమరః, * 'నమి కమ్పి' త్యాదినా రప్రత్యయః, దయాలు రపి కారుణికా చ - ని. 'స్యా ద్దయాలుః కారుణిక' ఇత్యమరః. * 'స్పృహి గృహి' త్యాదినా ఆలుచ్ప్రత్యయః, తథా అర్థపరా ధనలుబ్ధా, వదాన్యా దానశౌణ్డా చ, క్వచి ద్విషయ ఇతి సర్వత్రా ప్యధ్యాహార్యం - ని. 'స్యు ర్వదాన్య స్థూలలక్ష దానశౌణ్డా బహుప్రద' ఇత్యమరః, తథా నిత్యం ప్రతిదినం - వ్యయో ధనత్యాగో యస్యా స్సా తథోక్తా, ప్రచురనిత్యధనాగమా - ప్రచురం ప్రభూతం యథా తథా - నిత్యం-ధనస్య-ఆగమః ప్రాప్తి ర్యస్యా స్సా తథోక్తా చ, అతో వారాఙ్గనా వే శ్యేవ - ని. 'వారస్త్రీ గణికా వే శ్యే' త్యమరః, నృపనీతిః రాజవృత్తిః, అనేకరూపా బహుప్రకారా - న త్వైకాన్తికీ త్యర్థః; వారాఙ్గనాయా మపి విశేషణాని సమాని.

అత్ర సత్యా నృతేత్యాది పదశ్రవణమాత్రేణ ఝుడితి విరోధః స్ఫురతి, తస్య స్వాభావ్యే నాభాసీకరణా దలంకార స్సన్, వారాఙ్గనే వే త్యుపమయాఽఙ్గాఙ్గిభావేన సంకీర్యతే.

---

అవ.—గుణసంపన్నునే యాశ్రయింపఁ దగు ననుట.

ఆజ్ఞా, కీర్తిః, పాలనం బ్రాహ్మణానాం,
దానం, భోగో, మిత్త్రసంరక్షణం చ,
యేషా మేతే షడ్గుణా న ప్రవృత్తాః,
కోఽర్థ స్తేషాం పార్థి, వోపాశ్రయేణ? 39.

టీక.—పార్థివ = ఓరాజా, ఆజ్ఞా = శాసనము, కీర్తిః = యశస్సు, బ్రాహ్మణానాం పాలనం = బ్రాహ్మణులను రక్షించుట, దానం = ఇచ్చుట, భోగః = అనుభవించుట, మిత్త్రసంరక్షణం చ = చెలికాండ్రను కాపాడుట యు, - ఏతే షట్ గుణాః = ఈ యాఱు గుణములు, యేషాం = ఎవరికి (ఏరాజులకు), న ప్రవృత్తాః = కలుగవో, తేషాం = వారియొక్క (వారిని), ఉపాశ్రయేణ = ఆశ్రయించుటచేత, కః అర్థః = ఏమి ప్రయోజనము.



తా.—ఆజ్ఞ, కీర్తి, బ్రాహ్మణపరిపాలన, ఈవి, అనుభవము, చెలికాండ్రను బ్రోచుట - ఈ యాఱుగుణములును ఏరాజులందు లేవో వారిని ఆశ్రయించుటవలన ప్రయోజనము లేదు.

తే. ఆజ్ఞయును గీర్తియును భూసురావనంబు । దానమును భోగ మిత్త్రసంత్రాణనములు,
షడ్గుణంబులు గలుగవేజనులయందు, । వారిఁ గొల్చిన ఫల మేమి వసుమతీశ?

వ్యా.—సోఽపి గుణాఢ్య ఏవ సమాశ్రయణీయో న తు నిర్గుణ ఇతి రాజానమేవ సంబోధయతి - ఆజ్ఞేతి.—ఆజ్ఞా మర్యాదా పరిపాలనాత్మకశాసనం, కీర్తిః దానక్షాత్త్రోద్భవా సత్సమాఖ్యా, బ్రాహ్మణానాం పాలనం నిరుపద్రవం బ్రాహ్మణసంతర్పణం, దానం సత్పాత్రే త్యాగః, భోగః స్రక్చన్దనాది జనిత సుఖానుభవః, మిత్త్రసంరక్షణం సుహృత్సముద్ధరణం, చే త్యేతే షడ్గుణా, యేషాం రాజ్ఞాం, న ప్రవృత్తాః న ప్రవర్తన్తే - కర్తరి క్తః, పృథివ్యా ఈశ్వరః పార్థివః తస్య సంబుద్ధిః - హే పార్థివ రాజన్ - * 'త స్యేశ్వరః,' 'సర్వభూమి పృథివీభ్యా మణ్' ఇత్యణ్ప్రత్యయః - తేషా ముపాశ్రయేణ సమాశ్రయేణ, కోఽర్థః కో లాభః న కోఽపీ త్యర్థః; తస్మా దుక్తగుణసంపన్న ఏవ రాజా సమాశ్రయణీయః, న తు కుక్షిమ్భరి రితి భావః.

శాలినీవృత్తం - 'శాలి న్యుక్తా మ్తౌ తగౌ గోఽబ్ధిలోకై రి' తి లక్షణాత్.

---

అవ.—ధనముకై ధనికుల నాశ్రయింపం బని లేదనుట.

యద్ధాత్రా నిజఫాలపట్టలిఖితం స్తోకం మహ ద్వా ధనం,
తత్ ప్రాప్నోతి మరుస్థలేఽపి నితరాం మేరౌ చ నాతోఽధికమ్;
త ద్ధీరో భవ, విత్తవత్సు కృపణాం వృత్తిం వృథా మా కృథాః,
కూపే పశ్య పయోనిధా వపి ఘటో గృహ్ణాతి తుల్యం జలమ్. 40

టీక.—(మనుష్యుఁడు), ధాత్రా = బ్రహ్మచేత, స్తోకం = కొంచెముగాని, మహత్ వా = గొప్పదిగాని, యత్ ధనం = ఏ ధనము, నిజ ఫాల పట్ట లిఖితం = తన నొసలనెడు పలకయందు వ్రాయఁబడినదో, తత్ = దానిని, మరుస్థలేఽపి = ఎడారిప్రదేశమందు సయితము, నితరాం = తప్పక, ప్రాప్నోతి = పొందును, మేరౌ చ = బంగారుకొండయందు సయితము, అతః = ఆ లిఖితముకంటె, అధికం = ఎక్కువను, న ప్రాప్నోతి = పొందఁడు; తత్ = కావున, ధీరః = దిగులులేనివాఁడవు, భవ = కమ్ము, విత్తవత్సు = ధనవంతులయెడల, కృపణాం వృత్తిం = దీన వర్తనమును, వృథా = వ్యర్థముగా, మా కృథాః = చేయకుము; ఘటః = కుండ, కూపే = నూతియందు, పయో

నిధౌ అపి = సముద్రమునందును, తుల్యం = సమమైన, జలం = నీటిని, గృహ్ణాతి=గ్రహించును, పశ్య = చూడుము.

తా.—నొసట బ్రహ్మ వ్రాసినధనము, అల్పముగాని అధికముగాని, ఎడారిలో కూడ అంతయు తప్పక దొరకును, మేరువునందు నయితము ఆ లిఖితముకన్న ఎక్కువ దొరకదు. కనుక దిగులు మానుము, వృథాగా ధనికులను నీచముగా ఆశ్రయింపవలదు. కుండ బావిలోనైనను సముద్రములోనైనను కుండెడు నీళ్లే పట్టును.

ఉ. వనజభవుండు పెన్నొసట వ్రాసినసొమ్ము ఘనంబొ కొంచెమో,
విను మరుభూమి కేగిన లభించును, మేరువుఁ జేరఁ బోయినన్
ఘన మధికంబు రాదు, కడు దైన్యము మాను ధనాఢ్యులందు, న
వ్వననిధి నూతఁ దుల్యముగ వారి గ్రహించుఘటంబు సూడుమా.

వ్యా.—అథాతికార్పణ్యం మా కురు, లాభాలాభయో ర్దైవాయత్తమూలకత్వమిత్యాహ - యదితి.—ధాత్రా బ్రహ్మణా, స్తోక మల్పం, మహ ద్బహుళం వా, యద్ధనం, నిజఫాలం నిజనిటిలతట మేవ పట్టం తత్ర-లిఖితం లేఖనేన నిర్దిష్టం, త ద్బ్రహ్మలిఖితం ధనం, మరుస్థలే ఊషరదేశేఽపి - కి ము తాన్య త్రేతి భావః, నితరా మతిశయేన, ప్రాప్నోతి లభతే - అన్యూన మితి శేషః - ని. ‘ సమానౌ మరుధన్వానా వి ’త్యమరః, మేరౌ కనకాచలే, ఽప్యతో బ్రహ్మలిఖితా, దధికం, న ప్రాప్నోతి, త త్తస్మా త్కారణా, ద్ధీరః స్థిరచిత్తో, భవ, విత్తవత్సు ధనాఢ్యేషు విషయే, కృపణాం దీనాం, వృత్తిం వ్యాపారం, వృథా వ్యర్థం, మాకృథాః మాకార్షీః, స్తేన కార్పణ్యజనితనిన్దామాత్రాశ్రయత్వమేవ న త్వధికధనప్రాప్తి రితి భావః. * కృఞో లుజి థాస్ - తనాదిత్వేఽపి సిచో నిత్యలోపవిధానా న్నసిచ్ - ‘ న మా జ్యోగ ’ ఇ త్యట్ప్రతిషేధః. తత్ర దృష్టాన్త మాహ - కూపే ఽల్పజలాధారే గర్తే ఽపి, పయోనిధౌ సముద్రేఽపి, ఘటః కలశః, స్తుల్యమాత్రపరిమితం, జలం గృహ్ణాతి స్వీకురుతే - ప శ్యేతి కృపణసంబోధనం - న తు కూపే ఽల్పం పయోనిధౌ వధిక; మత ఏతద్దృష్టాన్తేన సమాహితచిత్తేన భవితవ్యం, న తు కార్పణ్య పర్యాకులే నేతి తాత్పర్యమ్.

ఇతి నీతిశతక వ్యాఖ్యానే అర్థపద్ధతిర్నామ చతుర్థం దశకమ్.

---

## దుర్జనపద్ధతిః.

---

అకరుణత్వ, మకారణవిగ్రహః, పరధనే పరయోషితి చ స్పృహా,
సుజనబన్ధుజనే ష్వసహిష్ణుతా, ప్రకృతిసిద్ధ మిదం హి దురాత్మనామ్.



టీక. అకరుణత్వమ్ = కనికరము లేమి, అ కారణ విగ్రహః = కారణము లేని కలహము, పర ధనే = ఇతరుల ధనమునందు, పర యోషితి చ=ఒరుల స్త్రీలయందును, స్పృహా = ఆశ, సుజన = సజ్జనులయెడలను - బన్ధుజనేషు = చుట్టములయెడలను, అసహిష్ణుతా = ఓర్వలేమి, (అనెడి), ఇదం = ఇది (అకరుణత్వాదికము), దురాత్మనాం=దుష్టహృదయులకు, ప్రకృతి సిద్ధం హి = స్వభావ ప్రాప్తము గదా.

తా. కనికరములేమి, కారణములేకయే జగడించుట, పరధనములను పరస్త్రీలను ఆసించుట, సానువులయెడలను బంధువులయెడలను చూపోపమి, అను నివి యన్నియు దుర్జనులకు సహజగుణములు.

తే. కారణములేనికలహంబు గరుణలేమి । పరవధూపరధనవాంఛ బంధుసాధు
జనములం దసహిష్ణుత్వ మనఁగ జగతిఁ । బ్రకృతిసిద్ధంబు లివి దుష్టనికరమునకు.

వ్యా.—అథార్థాదిసంపన్నోఽపి దుర్జనో నోపాదేయ ఏ వేత్యాశయే నార్థపద్ధతి నిరూపణానన్తరం దుర్జనపద్ధతిం నిరూపయతి - తత్ర తేషా మవగుణం గణయతి- అకరుణత్వమితి.—పరదుఃఖప్రహాణేచ్ఛా కరుణా - తద్రాహిత్య మకరుణత్వం - దయాహీనత్వం చ, అకారణవిగ్రహో నిష్కారణకలహ శ్చ - ని. ‘అస్త్రియాం సమరానీకరణాః కలహవిగ్రహా వి’త్యమరః, పరధనే పరద్రవ్యే, పరయోషితి పరదారేషు, స్పృహా చ - ఏక త్రాపహరణేచ్ఛా - అన్యత్ర సంభోగాభిలాష శ్చ, సుజనేషు బన్ధుజనేషు చ, అసహిష్ణుతా అసహనశీలత్వం చే, తీదం సర్వం * ‘నపుంసక మనపుంసకే నే’త్యాదినా నపుంసకైకశేషః, దురాత్మనాం దుర్జనానాం, ప్రకృతిసిద్ధం స్వభావసిద్ధం హి, అతస్తే నోపాదేయా ఇతి భావః - ని. ‘ప్రకృతిః ప్రపఞ్చభూతే ప్రధానే మూలకారణే, స్వభావ’ ఇతి విశ్వః.

ద్రుతవిలమ్బితవృత్తం - ‘ద్రుతవిలమ్బిత మాహ నభౌ భరా వి’ తి లక్షణాత్.

---

అవ.—విద్వాంసునైనను దుర్జనుని చేర్పఁదగదు.

దుర్జనః పరిహర్తవ్యో, విద్యయాఽలఙ్కృతోఽపి సన్
మణినా భూషితః సర్పః, కి మసౌ న భయఙ్కరః. 42.

టీక. దుర్జనః = దుష్టుఁడు, విద్యయా = విద్యచేత, అలంకృతః సన్ అపి = అలంకరింపఁ బడినవాఁడైనను, పరిహర్తవ్యః = విడువవలసినవాఁడు; సర్పః = పాము, మణినా = రత్నముచేత, భూషితః (సన్ అపి) = అలంకృతము ఐనను, అసౌ = ఇది (పాము), భయఙ్కరః న కిమ్ = వెఱపుగొలుపునది కాదా యేమి?

తా.—శిరమున రత్నముగలదైనను పాము ఘాతుకమే, కావున త్యజింపవలసినదే; అట్లే దుర్జనుఁడు విద్యగలవాఁడైనను ద్రోహియే, కాన వానిని త్యజింపవలసినదే.

తే. విద్యచే భూషితుం డయి వెలయుచున్నఁ । దొడరి వర్జింప నగుఁ జుమీ దుర్జనుండు;
చారుమాణిక్యభూషిత శస్తమస్త । కం బయినపన్నగము భయంకరము గాదె?

వ్యా.—ఆస్తాం తావత్ దుర్జనమాత్రస్య పరిత్యాజ్యత్వకథనమ్ - అశేషావగుణావమార్జకసంపన్నో ఽపి దుర్జనః పరిత్యాజ్య ఏ వేతి సదృష్టాన్త మాహ - దుర్జన ఇతి.— దుర్జనో, విద్యయా వేదవేదాఙ్గాద్యాత్మికయా, ఽలంకృతో భూషిత స్స న్నపి - సకలవిద్యాపారీణ స్స న్న పీ త్యర్థః, పరిహర్తవ్య స్త్యాజ్యః, కుత ఇ త్యత ఆహ - సర్పః ఆశీవిషః, మణినా ఫలకస్థమాణిక్యేన, భూషితో ఽలంకృత స్స న్నపి, అసౌ సర్పో, న భయంకరః కిం భయంకర ఏ వే త్యర్థః, అతో మణిభూషితసర్పప్రాయో విద్యావా నపి దుర్జనో దూరత స్త్యాజ్య ఏవ - 'దుర్జనం దూరత స్త్యజే' ది'తి న్యాయా దితి భావః * 'మేఘర్తిభయేషు కృఞః' ఇతి ఖశ్ - ఖశి 'అరుర్ద్విష' ది'త్యాదినా ముమాగమః.

అత్రబిమ్బప్రతిబిమ్బన్యాయేన ధర్మధర్మిణో ర్వాక్యద్వయే పృథఙ్నిర్దేశా ద్దృష్టాన్తాలంకారః -

'బిమ్బానుబిమ్బన్యాయేన నిర్దేశో ధర్మధర్మిణోః
దృష్టాన్తాలంకృతి ర్జ్ఞేయా భిన్నవాక్యార్థసంశ్రయా.' ఇతి లక్షణాత్.

వృత్త మానుష్టుభమ్.

---

అవ. దుర్జనుఁడు సర్వదూషకుఁ డనుట.

జాడ్యం హ్రీమతి గణ్యతే, వ్రతశుచౌ దమ్భః, శుచౌ కైతవం,
శూరే నిర్ఘృణతా, మునౌ విమతితా, దైన్యం ప్రియాలాపిని,
తేజస్విన్యవలిప్తతా, ముఖరతా వక్తర్యశక్తిస్థిరే,
తత్ కో నామ గుణో భవేత్స గుణినాం యో దుర్జనై ర్నాఙ్కితః?

టీక. హ్రీమతి = సిగ్గరియందు, జాడ్యం = మాంద్యము, వ్రత శుచౌ - వ్రత = (చాంద్రాయణాది) నియమములచేత - శుచౌ = శుద్ధునియందు, దమ్భః = డంబము, శుచౌ = నిర్మలునియందు, కైతవం = కపటము, శూరే = శూరునియందు, నిర్ఘృణతా = దయలేమి, మునౌ = మననశీలునియందు, విమతితా = బుద్ధిలేమి, ప్రియ ఆలాపిని = ఇంపుగా పలుకువానియందు, దైన్యం = దీనత్వము, తేజస్విని = పరాక్రమవంతునియందు, అవలిప్తతా = గర్వము, వక్త...స్థిరే - వక్తవ్య = చెప్పవలసిన విషయములందు - శక్తి = నేర్పుచేత - స్థిరే = నిలుకడగలవానియందు - (మంచి వాగ్మియం దనుట), ముఖరతా = ప్రేలుడుగాయతనము, (దుర్జనైః = దుర్జనులచేత), గణ్యతే = భావింపఁ



బడును ; తత్ = కావున, దుర్జనైః = దుర్జనులచేత, యః న అఙ్కితః = ఏది మచ్చపెట్టఁబడనిదో - దూషింపఁబడనిదో, గుణినాం = గుణవంతులయొక్క, సః గుణః = ఆ గుణము, కో నామ భవేత్ = ఏది గా నుండునో.

తా.—దుర్జనులు సిగ్గరిని జడునిఁగాను, వ్రతశుద్ధుని డాంబికునిఁగాను, స్వభావశుద్ధుని కపటినిగాను, శూరుని దయాహీనునిఁగాను, ఆత్మైక్య మననశీలుని బుద్ధిహీనునిఁగాను, ఇంపుగా మాటాలాడువానిని దీనునిఁగాను, పరాక్రమవంతుని గర్వినిగాను, మంచివాగ్మిని ప్రేలుడుగాయనుగాను గణింతురు. ఇట్లు గుణవంతుల గుణములలో దుర్జనులు దోషముగా కల్పింపనిది ఏదియు నుండదు.

శా. హ్రీరమ్యుం జడుఁగాఁగ, సువ్రతుని మాయింగా, శుంచి దంభిఁగా,
శూరున్ నిర్దయుగా, మునిన్ విమతిఁగా, శ్రోత్రప్రియాలాపు ని
స్సారుంగా, బలవంతు గర్వితునిఁగా, సద్వక్త వాచాలుఁగాఁ,
గ్రూరుం డెన్ని సుధీగుణంబు దురితారూఢంబు జేయుం గదా.

వ్యా.—అ థాస్య సర్వదూషకత్వ మాహ - జాడ్యమితి.—హ్రీమతి లజ్జావతి పుంసి, జాడ్యం మాన్ద్యం * 'గుణవచన బ్రాహ్మణాదిభ్యః కర్మణి చే'తి ష్యఞ్ ప్రత్యయః, గణ్యతే సంఖ్యాయతే - దుర్జనై రితి శేషః - న తు జుగుప్సితకర్మాచరణపరాఙ్ముఖత్వం, వ్రతై స్తపశ్చాన్ద్రాయణాది నియమైః - శుచౌ శుద్ధే, దమ్భో ధర్మధ్వజత్వం, గణ్యతే - న త్వనుష్ఠాతృత్వం, శుచౌ స్వభావా దేవ బాహ్యాన్తరశుద్ధే, కైతవం కపటం, గణ్యతే - న తు పారమార్థికత్వం, శూరే, నిర్ఘృణతా దయారాహిత్యం, గణ్యతే - న తు విక్రాన్తత్వం, మునౌ మననశీలే విమతితా బుద్ధిహైన్యం, గణ్యతే న త్వాత్మైకాన్యనుసంధాన తత్పరత్వం, ప్రియాలాపిని మధురవాదిని, దైన్యం గణ్యతే - న తుశ్రవణానన్దకరత్వం, తేజః ప్రాగల్భ్యం - ప్రభావిశేషో వా తద్వ, త్యవలిప్తతా గర్వగ్రస్తత్వం, గణ్యతే - న తు స్వభావః - ని. 'అవలేప స్తు గర్వే స్యా ల్లేపనే దూషణే ఽపి చే'తి విశ్వః, వక్తవ్యే ష్వర్థేషు - శక్తిః ప్రతిభాపరపర్యాయ స్సామర్థ్య విశేషః - తయా స్థిరే, ముఖ మ స్యా స్తీతి ముఖరో దుర్ముఖః - ని. 'దుర్ముఖే ముఖరాబద్ధముఖా వి' త్యమరః * 'ఖ ముఖ కుఞ్జేభ్య శ్చే'తి రప్రత్యయః - తస్య భావ స్తత్తా అసంబద్ధప్రలాపిత్వ మి త్యర్థః, గణ్యతే - న తు వాగ్మిత్వం, తస్మా త్కారణాత్, గుణినాం గుణసంపన్నానాం, స కో నామ గుణో భవేత్, యో గుణః, దుర్జనై, ర్నాఙ్కితః న దూషితః - దుర్జనాదూషితో గుణ స్సుగుణినాం న కో ఽ ప్య స్తీ త్యర్థః, 'యో దుర్జనానాం మత' ఇతి పాఠే యో గుణః దుర్జనానాం మతః ఇష్టః స్యాత్ స కో నామ భవే దితి సంబన్ధః, దుర్జనాభిమతో గుణ స్తు గుణినాం న కో ఽ ప్య స్తీ త్యర్థః.

శార్దూలవిక్రీడితం వృత్తం - లక్షణం తూక్తమ్.

---

అవ.—గుణదోష ప్రణాళిక.

లోభ శ్చే దగుణేన కిం? పిశునతా య ద్యస్తి కిం పాతకైః?
సత్యం చే త్తపసా చ కిం? శుచి మనో య ద్యస్తి తీర్థేన కిమ్?
సౌజన్యం యది కిం బలేన? మహిమా య ద్యస్తి కిం మణ్డనైః?
సద్విద్యా యది కిం ధనై? రపయశో య ద్యస్తి కిం మృత్యునా? 44.

టీక.—లోభః=పిసినితనము, (అస్తి) చేత్ = కలదేని, అగుణేన కిమ్=దుర్గుణము ఏల, పిశునతా = కొండీనితనము, అస్తియది = కలదేని, పాతకైః కిం = పాతకములు ఏల, సత్యమ్ = నిజము పలుకుట, అస్తిచేత్..., తపసా చ కిం = తపస్సు ఏల, శుచి= పవిత్ర మైన, మనః = మనస్సు, అస్తి యది..., తీర్థేన కిం = (గంగాది) తీర్థము ఏల, సౌజన్యం = సాధుత్వము - మంచితనము, (అస్తి) యది..., బలేన కిం = బలఁగము ఏల, మహిమా = గొప్పతనము, అస్తి యది..., మణ్డనైః కిం = అలంకారములు ఏల, సద్విద్యా = మంచివిద్య, అస్తి యది..., ధనైః కిమ్ = ధనములు ఏల, అపయశః=అపకీర్తి, అస్తి యది..., మృత్యునా కిమ్ = మరణమేల.

తా.—లోభము సకల సుగుణములను చెఱుపును. కొండెము చెప్పుటకంటె పాతకము లేదు. సత్యముకంటె తపస్సు లేదు. మనశ్శుద్ధికంటె తీర్థము లేదు. మంచితనమే పరిజనము. గొప్పతనమే యలంకారము. మంచివిద్యయే ధనము. అపకీర్తియే చావు.

చ. వగ గొనులోభముం బిశున భావము సత్యము చిత్తశుద్ధియుం
దగుసుజనత్వముం సుమహితత్వము విద్యయు లోకనిందయుం
దగిలిన, దుర్గుణంబు దురితంబు దపంబును దీర్థసేవ భృ
త్యగణము సొమ్ములుం ధనచయంబును జావును వేఱ యున్న వే?

వ్యా.—అథ గుణావగుణప్రణాళికా మాహ - లోభ ఇతి.—లోభో ధనాదివాఞ్ఛా, ఽస్తి చే, దగుణేన దుర్గుణేన, కిం న కించి ద పీ త్యర్థః - త స్యైవా త్యన్తనిన్దావహత్వా దితి భావః, పిశునతా పరోక్షే పరదోషసూచకతా, అస్తి యది, పాతకైర్బ్రహ్మహత్యాదిభిః, కిం తస్యా ఏవ నిరయపాతన దక్షత్వా దితి భావః, సత్యం యథార్థభాషణం సమదర్శిత్వం వా, ఽస్తి చే, త్తపసా చాన్ద్రాయణాదినా, కిం త స్యైవపరిశోధకత్వా దితి భావః, శుచి ద్రోహచిన్తాది రాహిత్యేన శుద్ధం, మనోఽస్తి యది, తీర్థేన ప్రయాగాదినా, కిం త స్యై వాపవర్గ మూలకత్వా దితి భావః -

'యస్త్వాత్మతీర్థం భజతే వినిష్క్రియస్స సర్వవి త్సర్వగతో ఽమృతో భవేత్.'

ఇతి స్మరణ మత్రమూలం, సౌజన్యం సుజనభావో, ఽస్తి యది, బలేన పరిజనేన, కిం త స్యై వాశేషకార్య నిర్వాహకత్వాదితి భావః, మహిమా మాహాత్మ్య, మస్తి యది,



మణ్డనైః కుణ్డలహారాద్యలంకరణైః, కిం త స్యై వోపస్కారహేతుభూతత్వా దితి భావః అపయశః అపకీర్తి, రస్తి యది మృత్యునా మరణేన, కిం తద్వత్ మృతిప్రాయత్వా దితి భావః; ఏవం విచార్య సద్గుణార్జనతత్పరేణ భవితవ్యం నిపుణేన, అన్యథా దౌర్జన్య మనాయాససాధ్య మితి వాక్య శేషత్వే నోన్నేయమ్.

---

అవ.—ఏడు మనశ్శల్యములు.

శశీ దివసధూసరో, గళితయౌవనా కామినీ,
సరో విగతవారిజం, ముఖ మనక్షరం స్వాకృతేః,
ప్రభు ర్ధనపరాయణః, సతతదుర్గతి స్సజ్జనో,
నృపాఙ్గణగతః ఖలో, మనసి సప్తశల్యాని మే. 45.

టీక.—దివసధూసరః - దివస = పగటియందు - ధూసరః = మాసిన, శశీ = చంద్రుఁడును, గళిత యౌవనా = జాఱిన యౌవనముగల, కామినీ = కాముకురాలును, విగత వారిజం = పోయిన తామరలుగల (తామరలు పోయిన), సరః = కొలనును, సు ఆకృతేః = మంచిరూపము గలవానియొక్క, అనక్షరం = అక్షరములేని - (చదువులేని) ముఖం = ముఖమును, ధనపరాయణః = ధనమందు అత్యాసక్తుఁడయిన, ప్రభుః = రాజును, సతతదుర్గతిః = ఎల్లప్పుడు పేదటికముగల, సజ్జనః = సత్పురుషుఁడును, నృప అఙ్గణ గతః = రాజుయొక్క ఇంటిని పొందిన (చేరిన) - ఖలః= దుర్జనుఁడును (రాజునకు దుర్బోధనలు సేయువాఁ డనుట), (ఈ), సప్త = ఏడును, మే = నాయొక్క, మనసి = మనస్సునందు, శల్యాని = శూలములు, (మిక్కిలి దుఃఖకరము లనుట).

తా.—పగలు మాసినచంద్రుఁడును, యౌవనము గడచిన కాముకురాలు, తామరలు పోయిన కొలఁకును, చదువులేని రూపరియు, పిసిడిగ్రైన రాజును, నిరంతర దరిద్రుఁడైన సజ్జనుఁడును, రాజునకు దుర్బోధనలు సేయుచుండు దుర్జనుఁడును, - ఈ యేడుగురును మనస్సున నాటిన శూలములవలె మిక్కిలి దుఃఖకరులు.

ప. దినమలినాంగుఁడైనహిమ దీప్తియుఁ, బ్రాయము దప్పు నాతియుం,
వనరుహశూన్య మౌ కొలను, వర్ణితరూపు నిరక్షరాస్యముం,
ధనపరుఁడైనరాజు, సతతంబును లేమిని గుందు సాధువుం,
జనపతిచెంత దుర్జనుఁడు, శల్యము లే డివి నామనంబునన్.

వ్యా.—కస్యచి దనుభవినో నిజకష్టాభివేదన మభినీ యాహ - శశీతి.—దివసేఽహ్ని, ధూసరో నిస్తేజస్కః, శశీ చన్ద్రశ్చ, గళిత యౌవనా భ్రష్టనూతనవయస్కా, కామినీ కాన్తా చ, విగతవారిజం పుణ్డరీకషణ్డహీనం, సరః కాసారశ్చ, శోభనా

ఆకృతి ర్యస్య సున్దర పురుషస్య, అనక్షరం శాస్త్రవిభిన్నం ముఖం చ, ధన పరాయణో, ధనలుబ్ధః, ప్రభుః రాజా చ, సతతదుర్గతిః నిరన్తరదారిద్ర్యవాన్, సజ్జన శ్చ, నృపాఙ్గణగతో రాజగృహాన్తర్వర్తీ, ఖలో దుర్జన శ్చ - తస్య విఘాతుకత్వా దితి భావః, ఇ త్యేవం, సప్త, శల్యాని శూలాని - తథా దుస్సహ దుఃఖ జనకత్వా దితి భావః; ఇద మే వాత్యన్త కష్టనివేదనవచన మితి తాత్పర్యమ్.

అ త్రాప్రకృతానాం ప్రకృతస్య ఖలస్య చ దుఃఖహేతుత్వసామ్యే నౌపమ్యస్య గమ్యమానత్వా ద్దీపకాలంకారః - లక్షణం తూక్తమ్. గత మిదం పృథ్వీవృత్తమ్.

---

/ అవ.—దుష్టరాజలక్షణము.

న కశ్చి చ్చణ్డకోపానా, మాత్మీయో నామ భూభుజామ్
హోతార మపి జుహ్వానం, స్పృష్టో దహతి పావకః. 46.

టీక.—చణ్డకోపానాం = తీక్ష్ణమైన కోపముగలవారగు, భూభుజాం = రాజులకు, కశ్చిత్ = ఎవఁడును, ఆత్మీయః = తమవాఁడు (తమప్రేమకుఁ బాత్రుఁడై యుండునట్టివాఁ డనుట), న నామ=కాఁడు గదా, - జుహ్వానమ్ అపి = (నేయి పురోడాశము మొదలయిన వానిని) వేల్చుచున్న వానినైనను, హోతారం = యజమానుని, పావకః = అగ్ని, స్పృష్టః సన్ = తాఁకఁబడినవాఁడై, దహతి = దహించును.

తా.—అగ్ని తనకు ఆజ్యాదు లర్పించి తృప్తి నొందించుయజమానుని సయితము తగిలినమాత్రాన దహించును. అట్లే అత్యంతకోపముగల రాజులకు స్థిరప్రేమాస్పదుఁ డొకఁడును ఉండఁడు. వారు ఎంతటి హితకారినైనను ఇంచుక తప్పిన చంపింతురు.

క. మనుజులలో నెవ్వఁడు దగఁ । దనవాఁ డనువాఁడు దుష్ట ధరణీశునకుం?
దనకయి వ్రేలిమి వ్రేల్చెడు । జనునితనువుఁ గాల్చు వాయు సఖుఁ డదయుండై.

వ్యా.—అథ దుష్టరాజలక్షణం సదృష్టాన్త మాహ..—చణ్డకోపానామ్ ఉగ్రక్రోధానాం, భూభుజాం రాజ్ఞాం, కశ్చి దపి పుమాన్, ఆత్మీయో నామ ఆత్మీయత్వేన ప్రసిద్ధః, న భవతి - కిం తు సర్వోఽప్యనాత్మీయ ఏ వే త్యర్థః; నను యథా కథంచి ద్ధిత మాచర న్నభివిష్య త్యేవ ఆత్మీయ ఇ త్యాశఙ్క్య దృష్టాన్తముఖేన నిరాకరో న్నాహ—జుహ్వాన మాజ్యపురోడాశాది దానే నోపచర న్త మపి * 'హు దానాదనయో' రితి ధాతోః కర్తరి శానచ్, హోతారం యజమానం, పావకోఽగ్నిః, స్పృష్ట స్సన్, దహతి సంతాపయ తీ త్యర్థః; అతోఽగ్నిదృష్టాన్తే నేదృశో రాజా న సమాశ్రయణీయ ఇతి భావః.

---



అవ.—రాజసేవ మిక్కిలి కష్ట మనుట.

మౌనా న్మూకః, ప్రవచనపటు ర్వాతులో జల్పకో వా,
ధృష్టః పార్శ్వే భవతి చ వసన్, దూరతోఽప్యప్రగల్భః,
క్షాన్త్యా భీరు, ర్యది న సహతే ప్రాయశో నాభిజాతః;
సేవాధర్మః పరమగహనో యోగినా మ ప్యగమ్యః; 47.

టీక.—మౌనాత్ = పలుకమివలన, మూకః = మూఁగ (యని చెప్పఁబడును), ప్ర వచన పటుః = చక్కఁగా చెప్పుటయందు నేర్పు గలవాఁడు, వాతులః=వాతరోగి (మతిభ్రమగలవాఁడు) (అని...), జల్పకః వా = ప్రేలుడుగాఁడు (అని యేని...), పార్శ్వే = ప్రక్కలో, వసన్ = నెలకొనువాఁడు, ధృష్టః = దిట్టఁడు (భయములేనివాఁడు) (అని...), దూరతః = దూరముగా, (వసన్) అపి = (ఉన్నవాఁడు) ఐనను, అప్రగల్భః = గోల (అని...), క్షాన్త్యా = ఓర్పుచేత, భీరుః = పిఱికి (అని...), న సహతే యది = (అవమానాదులను) ఓర్చుకొనఁ డేని, ప్రాయశః = బహుశః, అభిజాతః = మంచికులమునఁ బుట్టినవాఁడు, న = కాఁడు (అని...), (ఈతీరున), సేవా ధర్మః= కొలువుయొక్క స్వరూపము, పరమగహనః - పరమ = మిగుల - గహనః = దుర్బోధము, యోగినామ్ అపి = యోగులకు సయితము, అగమ్యః = తెలియరానిది.

తా.—కొలువు నేర్పుట యసాధ్యము. దొరలు సేవకుని - పలుకకుండిన - మూఁగయనియు, చక్కఁగా చెప్ప నేర్చిన - వెఱ్ఱివాఁడనియుఁ ప్రేలువాఁ డని గాని, ప్రక్కను చేరిన - భయహీనుఁ డనియు, దూరమున నెలకొనిన - ప్రౌఢ కాఁ డనియు, తిరస్కారము నోర్చుకొనిన - పిఱికి యనియు, ఓర్చుకొనఁ డేని బహుశః దుర్జాతుఁ డనియు నిందింతురు. అతీంద్రియార్థముల నెఱుఁగుయోగులకు సయితము ఈవిద్య యసాధ్యము.

ఉ. మౌనముచేత మూఁగయు, స మంచితవక్త ప్రలాపి, చెంగటం
బూని వసింప దిట్ట, దమ ముందట దవ్వగ నుండ నేసి శా
లీనుఁడు, దాల్మి భీరుఁ, డవ లిప్తుఁడు దాలిమి లేనిబంటు; భూ
జానులసేవ దుష్కర, మ సాధ్యము యోగుల కైన నిద్ధరన్.

వ్యా.—కథం న సమాశ్రయణీయ ఇ త్యాశఙ్క్య త త్సేవాయా దుష్కరత్వా ది త్యాహ మౌనా దితి.—మౌనా త్తూష్ణీంభావా, న్మూకో నిర్వచో - భవతి సేవక ఇతి శేషః, ప్రవచనపటుః ప్రగల్భ శ్చాతివక్తా, వాచకో బహుభాషీ, జల్ప తీతి జల్పకోఽసంబద్ధ ప్రలాపీ-భవతి, ఉభయ త్రాపి * 'ణ్వుల్ తృచా వి'తి కర్తరి ణ్వుల్ప్రత్యయః-ణిత్వా ద్వృద్ధిః-'జల్పాక' ఇతి పాఠే జల్ప తీతి జల్పకః - పచా ద్యచ్ - స్వార్థే క ప్రత్యయః - అన్యథా * 'జల్పభిక్ష' త్యాదినా షాకన్ప్రత్యయే జల్పాక ఇతి స్యాత్-

యదాహామరసింహః - ని. 'స్యాజ్జల్పాకస్తు వాచాల' ఇతి, పార్శ్వే సమీపే చ, వసన్, ధృష్టో నిర్భీకో-భవతి, దూరతో విప్రకృష్టదేశే, వసన్, అప్రగల్భః అప్రౌఢో - భవతి, క్షాన్త్యా పరిభవాది ష్వాత్మద్యమానేషు క్రోధ ప్రతిబన్ధలక్షణ యోపలక్షిత శ్చే, ద్భీరు ర్భయశీలో - భవతి * 'భియః క్రుక్లుకనా వి'తి క్రుప్రత్యయః, న సహతే పరిభవాదికం న క్షమతే, యది తర్హి, ప్రాయశో బాహుళ్యేన, అభిజాత స్సత్కులీనో, న న భవతి, అతః, పరమగహనోఽత్యన్తదురవగాహః, సేవాధర్మః పరిచర్యాత్మకం కర్మ, యోగినా మపి కాలత్రయజ్ఞానా మప్యతీన్ద్రియవస్తు పరిజ్ఞానవతా మిత్యర్థః - కిము తాన్యేషామితి భావః, అగమ్యో జ్ఞాతు మశక్యః - సర్వే గత్యర్థాః జ్ఞానార్థా - యతః పరబ్రహ్మోఽపి ధ్యానాదినా సాక్షాత్క్రియతే న త్వయ మితి భావః; ధ్యానాదివ్యతిరిక్త ధర్మస్య గగనారవిన్ద ప్రాయత్వా త్తస్య బ్రహ్మణోఽపి దుర్విజ్ఞేయతయాఽత్యన్తదుష్కరత్వ మితి తాత్పర్యమ్.

అత్ర సేవాధర్మస్య యోగిగమ్యత్వే ఽప్యగమ్యత్వోక్తే స్సంబన్ధే అంసబన్ధరూపాతిశయోక్తిః. మన్దాక్రాన్తావృత్తమ్ - 'మన్దాక్రాన్తాజలధి షడగై ర్మ్భౌ నతౌ తాద్గురూ చే'తి లక్షణాత్.

———

అవ.—దుష్టప్రభువులయొుక్కయొ నుండుటచేత సయితము చేటుకలుగును.

ఉద్భాసితాఖిలఖలస్య విశృఙ్ఖలస్య
ప్రోద్గాఢ విస్మృత నిజాధమకర్మవృత్తేః
దైవా దవాప్తవిభవస్య గుణద్విషో ఽస్య
నీచస్య గోచరగతైః సుఖ మాస్యతే కైః? 48.

టీక.—ఉద్భాసిత = ప్రకాశితులైన - అఖిల ఖలస్య = సకల దుర్జనులు గల వాఁడును (దుర్జనులనెల్ల గొప్ప స్థితికి తెచ్చినవాఁ డనుట), విశృఙ్ఖలస్య = అడ్డులేనివాఁడును, ప్రోద్గాఢ...వృత్తేః - ప్రోద్గాఢ = బొత్తిగా = మఱవఁబడిన - నిజ = తనదైన- అధమ కర్మ వృత్తేః = మునుపటి నీచపుఁబనుల బ్రదుకుఁ దెరువుగలవాఁడును - (తాను మునుపు ఏ నీచవృత్తిచే బ్రదికినాఁడో దానిని ఇపుడు బొత్తిగా మఱచినవాఁడనుట), దైవాత్ = అదృష్టమువలన, అవాప్త విభవస్య = పట్టిన నైశ్వర్యముగల వాఁడును, గుణ ద్విషః = సుగుణములను రోయువాఁడును, (అగు), అస్య నీచస్య = ఈనీచుని యొక్క, గోచర గతైః = ఎఱుకయందు పడినట్టి, కైః సుఖమ్ ఆస్యతే = ఎవరు సుఖముగా నుందురు.

తా.—ఎల్లదుర్జనులను గొప్పస్థితికి తెచ్చి, మంచిది చెడ్డది అను భేద మెంచక ఇచ్చకు వచ్చిన పని యెల్ల చేయుచు, తనతొంటి నీచపుఁ బ్రదుకును బొత్తిగా మఱచి, అదృష్టము



వలన ఇపుడు కలిగిన నైశ్వర్యముచేత పొగరెక్కి, మంచిగుణములను రోయుచుండు నీచుని కంటి కగపడినవా రెవ్వరును సుఖపడరు. అట్టివానికి గోచరింపక బ్రదుకుట మంచిదని యుపదేశము.

చ. ఖలు లగువారి నెల్ల నధికారసమర్థులఁ జేసి, తా నిర
ర్గళగతి నైు నికృష్ట నిజకర్మము విస్మృతిపాలొనర్చి, ని
శ్చలగుణవైరి యై విధివశంబున సంపద గాంచి త్రుళ్ళుచున్
మెలఁగున్నృపాలుదేశమున మేలు లభించునె యెట్టివారికిన్?

వ్యా.—కిం బహునాఽస్య పురస్తాన్న కేనచిత్ స్థాతు మపి శక్యత - ఇత్యాహ - ఉద్భాసి తేతి.—ఉద్భాసితాః ప్రకాశితాః - అఖిలాః ఖలాః యేన తస్య అధికారప్రదానేన పురస్కృతాశేష దుర్జన స్యే త్యర్థః - తస్య సుజన విద్వేషిత్వాదితి భావః, తథా, విశృఙ్ఖలస్య విధినిషేధాతీతతయా స్వచ్ఛన్దగతే రి త్యర్థః, తథా, ప్రోద్గాఢ మతితరాం - విస్మృతా స్మరణావిషయీకృతా - నిజా స్వకీయా - అధమకర్మవృతిః ప్రాక్తననీచకృత్యవ్యాపారో - యేన తస్య - 'ప్రాగేవ విస్మృతే'తి పాఠే ప్రాక్ ప్రథమమ్ ఆచరణసమయ ఏ వే త్యర్థః - ఏతేన లజ్జాహీనత్వ ముక్తం, తథా, దైవా దదృష్టవశా, దిదానీ, మవాప్తః ప్రాప్తో - విభవః ఐశ్వర్యం సంపత్తి - ర్యస్య, గుణద్విష స్సుగుణనిన్దక, స్యాస్య పూర్వోక్తస్య నీచస్య రాజ్ఞః, గోచరగతైః విషయవాసిభిః, కై ర్జనై, స్సుఖ మక్లేశేన, ఆస్యతే స్థీయతే, న కైర పీ త్యర్థః, అతో న నీచాశ్రయః కర్తవ్య ఇతి భావః * 'ఆస ఉపవేశనే' - భావే లట్.

అత్రోద్భాసి తే త్యాదిపదార్థస్య విశేషణగత్యా సుఖస్థిత్యభావపదార్థహేతుత్వా త్పదార్థహేతుకం కావ్యలిఙ్గ మలంకారః. వసన్తతిలకావృత్తమ్.

———

అవ.—దుర్జనులయొక్కయు సుజనులయొక్కయు స్నేహముల రీతులు.

ఆరమ్భగుర్వీ క్షయిణీ క్రమేణ । లఘ్వీ పురా వృద్ధి ముపైతి పశ్చాత్,
దినస్య పూర్వార్ధపరార్ధభిన్నా । ఛాయేవ మైత్రీ ఖలసజ్జనానామ్. 49.

టీక.—ఖల సజ్జనానాం = దుర్జనులయొక్కయు సుజనులయొక్కయు, మైత్రీ= చెలిమి, దినస్య = పగటియొక్క, పూర్వార్ధ...భిన్నా - పూర్వార్ధ = మొదటిసగము చేతను-పరార్ధ = తరువాతి సగముచేతను - భిన్నా =మాఱిన - ఛాయా ఇవ = నీడవలె, ఆరమ్భగుర్వీ - ఆరమ్భ = మొదటను - గుర్వీ = గొప్పది, క్రమేణ = క్రమముగా, క్షయిణీ = తగ్గునది, పురా = మొదట, లఘ్వీ = చిన్నది, పశ్చాత్ =తర్వాత, వృద్ధిమ్= పెంపును, ఉపైతి = పొందును.

తా.—దుర్జనుల చెలిమి పగటి తొలిసగమునందలి నీడవలె మొదట పెద్దదిగా నుండి క్రమముగా తగ్గును. సజ్జనులమైత్త్రి పగటి రెండవసగమునందలి నీడవలె మొదట చిన్నదిగా నుండి తర్వాత క్రమముగా పెరుఁగును.

తే. మొదలఁ జూచినఁ గడు గొప్ప పిదపఁ గుఱుచ,
యాదిఁ గొంచెము తర్వాత నధిక మగుచుఁ,
దనరు, దిన పూర్వ పర భాగ జనిత మయిన
చాయపోలికఁ గుజన సజ్జనులమైత్త్రి.

వ్యా.—అథ దుర్జన సుజన మైత్త్రీప్రకార మాహ - ఆరమ్భేతి.—పూర్వార్ధప రార్ధాభ్యాం పూర్వాహ్ణాపరాహ్ణాభేదేన - భిన్నా పృథగ్విధా, ఛాయా అనాతపఇవ - ని. 'ఛాయా త్వనాతపే కాన్తౌ ప్రతిబిమ్బార్కజాయయో రి'తి వైజయన్తీ, ఆరమ్భే ప్రారమ్భసమయే - గుర్వీ గురుః వర్ధిష్ణురి త్యర్థః * 'వోతో గుణవచనా ది' తి వికల్పాత్ జీష్, క్రమేణ కాలక్రమేణ, క్షయిణీ క్షయిష్ణు శ్చ - 'జిదృక్షీ'త్యాదినా ఇనిః, తథా, పురా ప్రారమ్భే, లఘ్వీ లఘుః ప్రా స్వే త్యర్థః - పూర్వవత్ జీష్, పశ్చా దనన్తరం, వృద్ధి, ముపైతి ప్రాప్నో తీతి భావః.—అయ మర్థః—దుర్జనమైత్త్రీ పూర్వాహ్ణచ్ఛా యేవ ప్రారమ్భగుర్వీ క్రమేణ క్షయిణీ చ భవతి, సుజనమైత్త్రీ తావ దపరాహ్ణచ్ఛా యే వాదౌ లఘ్వీ తతో వర్ధిష్ణు శ్చ భవ తీతి. అతోఽత్ర య దుక్తం తత్కర్తవ్యం కుశలే నేతి భావః.

అత్ర యథాసంఖ్యసంకీర్ణోపమాలంకారః. ఉపజాతివృత్త ముక్తమ్.

---

అవ.—కొండీఁడు సాధువులకు నిష్కారణవైరి.

మృగ మీన సజ్జనానాం । తృణ జల సన్తోష విహితవృత్తీనామ్
లుబ్ధక ధీవర పిశునా । నిష్కారణ మేవ వైరిణో జగతి. 50.

టీక.—తృణ...వృత్తీనాం - తృణ = గడ్డిచేతను - జల = నీటిచేతను - సన్తోష = తృప్తిచేతను - విహిత = నెఱవేర్పఁబడిన - వృత్తీనాం = బ్రదుకుగల, మృగ మీన సజ్జనానాం - మృగ = లేళ్లకును - మీన = చేపలకును - సజ్జనానాం = సాధువులకును, లుబ్ధ...పిశునాః = లుబ్ధక = వేఁటగాండ్రును - ధీవర = జాలరులును - పిశునాః = కొండెగాండ్రును, జగతి = లోకములో, నిష్కారణమ్ ఏవ = కారణములేక యే, వైరిణః = పగవారు.

తా.—తిండికై యింతరజంతువులను చంపక గడ్డితో పొట్టపోసికొను లేళ్లకు బోయలు, నీళ్లచేత జీవించుచేపలకు జాలరివాండ్రును, దొరకినదానితోఁ దృప్తిపొందియుండు సజ్జనులకుఁ గొండెగాండ్రును, లోకములో నిష్కారణ శత్రువులు.



తే. కసవుచే నీటిచే మోదకలనచేత । బ్రతుకు మృగ మీన సజ్జన ప్రకరమునకు
శబర కైవర్త సూచక జనులు జగతిఁ । గారణము లేని పగవారు గారె తలఁప?

వ్యా.—య దుక్తం 'మకరుణత్వ మకారణవిగ్రహ' ఇతి త దేవ ప్రకటయ న్నుపసంహరతి - మృ గేతి.—సంతోషో దైవవశా ల్లబ్ధేన మనస్సంతుష్టిః - తృణజలసంతోషై - ర్విహితా కల్పితా - వృత్తి ర్జీవనం - యేషాం తేషాం - న తు పరోపతాపోపజీవినా మిత్యర్థః - ని. 'వృత్తి ర్వర్తనజీవన' ఇ త్యమరః, మృగాణాం హరిణాదీనాం - మీనానాం మత్స్యానాం - సజ్జనానాం సాధూనాం చ, లుబ్ధకో వ్యాధః - ధీవరో దాశః - జాలిక ఇ త్యర్థః - పిశున స్సూచక శ్చ - ని. 'వ్యాధో మృగవధాజీవో మృగయు ర్లుబ్ధక శ్చ సః,' 'కైవర్తే దాశ ధీ వరా వి' తి చామరః, ఏతే, జగతి భువి, నిష్కారణం నిర్హేతుక మేవ, వైరిణో విద్వేషిణః ఘాతుకా ఇ త్యర్థః.

తృణేన విహితవృత్తీనాం మృగాణాం లుబ్ధకా నిష్కారణవైరిణ ఇ త్యాది యథాక్రమ మన్వయా త్క్రమాపరనామా యథాసంఖ్యాలంకారః - త దుక్తం విద్యానాథేన -

'ఉద్దిష్టానాం పదార్థానాం పూర్వం పశ్చా ద్యథాక్రమమ్
అనూద్దేశో భవే ద్యత్ర త ద్యథాసంఖ్య ముచ్యతే.' ఇతి.

ఆర్యావృత్తమ్.

ఇతి నీతిశతకే సవ్యాఖ్యానే దుర్జనపద్ధతివర్ణనం నామ పఞ్చమదశకమ్.

---

## సుజనపద్ధతిః.

---

అవ.—సాధువులకు నమస్కరించుట.

వాఞ్ఛా సజ్జనసఙ్గతౌ, పరగుణే ప్రీతి, ర్గురౌ నమ్రతా,
విద్యాయాం వ్యసనం, స్వయోషితి రతి, ర్లోకాపవాదా ద్భయమ్,
భక్తిః శూలిని, శక్తి రాత్మదమనే, సంసర్గముక్తిః ఖలై,
రేతే యేషు వసన్తి నిర్మలగుణా, స్తేభ్యో నమః కుర్మహే. 51.

టీక.—సజ్జన సంగతౌ = సాధువులతోడి సాంగత్యమున, వాఞ్ఛా = కోరిక, పరగుణే = ఒరుల గుణమునందు, ప్రీతిః = సంతోషము, గురౌ = ఒజ్జ(ల)యందు, నమ్రతా = అడఁకువ, విద్యాయాం = విద్యయందు, వ్యసనం = ఆసక్తి, స్వ యోషితి = తన స్త్రీయందు, రతిః = మదనక్రీడ, లోక అపవాదాత్ = లోకుల నిందనుండి, భయం = భయము, శూలిని = శివునియందు, భక్తిః = పరమానురాగము, ఆత్మ దమనే = మనో నిగ్రహమందు, శక్తిః = సామర్థ్యము, ఖలైః = దుర్జనులతోడ, సంసర్గ ముక్తిః =

కూడికయొక్క (కూడికను) వదలుట, ఏతే = ఈ, నిర్మల గుణాః = మంచి గుణములు, యేషు = ఎవరియందు, వసన్తి = కలవో, తేభ్యః మహద్భ్యః = ఆ గొప్పవారికి, నమః కుర్మహే = మ్రొక్కుచున్నాము (మ్రొక్కుచున్నాను.)

తా.—సత్సాంగత్యమును కోరుట, ఒరులగుణములకు సంతోషించుట, గురువుల కడ నణఁకువ, విద్య నేర్వ నాసక్తి, భార్యతోమాత్రము సంభోగము, లోకులు నిందింతురను భయము, శివునియందు భక్తి, తనమనస్సును నిగ్రహించుట, దుస్సాంగత్యమును మానుట, ఈపరిశుద్ధగుణములుగల మహాత్ములకు నమస్కారము.

మ. సుకృతిశ్రేష్ఠులగోష్ఠియుం బరగుణ స్తోమంబునం బ్రీతి దే
శికసంసేవయు విద్యయందు రుచి స్వస్త్రీకేళి లోకాపవా
దకథాభీతియు శంభుభక్తి దమనోద్యచ్ఛక్తియుక్ సాధుమా
షకసాంగత్యవిముక్తియుం గలమనీషావంతులం గొల్చెదన్.

వ్యా.—అథైతద్వైలక్షణ్యేన సుజనపద్ధతిం నిరూపయతి - తత్రాదా వాదరాతిశయాత్తాన్నమస్కరోతి - వాఞ్ఛేతి.—సజ్జనసంగతౌ సాధుసమాగమే, వాఞ్ఛా అభిలాషః - న తు జిహాసా - తస్య మోక్షసాధకత్వా దితి భావః - తదుక్తం జ్ఞానవాసిష్ఠే -

'మోక్షద్వారే ద్వారపాలా శ్చత్వారః పరికీర్తితాః,
శమో విచార స్సంతోష శ్చతుర్థ స్సాధుసంగమః.' ఇతి -

తథా చోక్తం శ్రీమద్భాగవతే - 'మహత్సేవాం ద్వార మాహు ర్విముక్తే' రితి - స్వేనా ప్యుక్తమ్ -

'చేతః ప్రసాదయతి, దిక్షు తనోతి కీర్తిం;
సత్సంగతిః కథయ కిం న కరోతి పుంసామ్.' ఇతి,

పరేషాం గుణే - ప్రీతి స్సంతోషః - న తు దోషాపాదనమ్ -

'పరగుణపరమాణూ న్పర్వతీకృత్య నిత్యం
నిజహృది వికసన్త స్సన్తి సన్తః కియన్తః.'

ఇతి వక్ష్యమాణత్వా దపీతి భావః, గురౌ విద్యోపదేష్టరి, నమ్రతా భక్తిశ్రద్ధాభరేణ ప్రహ్వీభావః - న తు గర్వోద్రిక్తతా -

'యస్య దేవే పరా భక్తి, ర్యథా దేవే తథా గురౌ,
తస్యైతే నిఖిలా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః.'
'గురు ర్బ్రహ్మా గురు ర్విష్ణు ర్గురు ర్దేవో జనార్దనః.
గురు స్సాక్షా త్పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః.'

ఇతి శ్రుతిస్మృతీ, విద్యాయాం వేదాన్తాదివిద్యాభ్యాసే, వ్యసన మాసక్తిః - న తు ద్యూ



తకేళ్యాదౌ - తస్య మోక్షసాధన బ్రహ్మజ్ఞాన జనకత్వా దితి భావః, స్వయోషితి నిజదారేషు, రతి స్సంభోగః - న తు పరదారేషు - 'రమ్యం కులస్త్రీరత మి' తి భావః, లోకాపవాదాత్ లోకనిన్దాయాః * 'భీత్రార్థానాం భయహేతు రి' త్యపాదానత్వా త్పఞ్చమీ - భయం న తు నిర్లజ్జత్వం * 'లోకాపవాదో బలవా నితి సత్యవతీ శ్రుతి రి' త్యాదివచనా త్తస్యబలిష్ఠత్వా దితి భావః, శూలిని పరదేవతాయాం భగవతి, భక్తి రనురాగః, న తు క్షుద్రదేవతాయాం * 'శివే భక్తి శ్శివే భక్తి రి' త్యాదివచనే ష్వావృత్త్యా తస్యాః ప్రాశస్త్యశ్రవణా దితి భావః, ఆత్మదమనే స్వపరిభవే సతి, శక్తి స్సామర్థ్యం పరాక్రమ ఇతి యావత్ - న తూపశమే నౌదాసీన్యమ్! -

'అన్యదా భూషణం పుంసాం శమో లజ్జేవ యోషితామ్,
పరాక్రమః పరిభవే, వైయాత్యం సురతే ష్వివ.'

ఇతి వచనా దితి భావః, ఖలై ర్దుర్జనై - స్సహ సంసర్గముక్తి స్సఙ్గత్యాగః - న తు తత్సహవాసాభిలాషః * 'దుర్జనం దూరత స్త్యజే ది' తి - 'దుర్జనః పరిహర్తవ్య' ఇత్యాదివచనా దితి భావ, ఇత్యేతే - నిర్మలాః నిష్కళఙ్కాః - గుణా స్సజ్జన సంగతివాఞ్ఛాదయో, యేషు పురుషేషు వసన్తి, తేభ్యో మహద్భ్యో నమః - ఇత్థం భూతగుణవిశిష్టానా మేవ నమస్కారార్హత్వా దితి భావః * 'నమ స్స్వ స్తీ' త్యాదినా చతుర్థీ; 'తై రేవ భూ ర్భూషితే' తి పాఠే తై ర్నిర్మలగుణసంపన్నై రేవ భూ రలంకృతా న త్వన్యై స్తేషా మేవ చారుత్వా ద్యతిశయ హేతుత్వా దితి భావః.
శార్దూలవిక్రీడితమ్.

---

విపది ధైర్య, మథాభ్యుదయే క్షమా,
సదసి వాక్పటుతా, యుధి విక్రమః,
యశసి చాభిరతి, ర్వ్యసనం శ్రుతౌ,
ప్రకృతిసిద్ధ మిదం హి మహాత్మనామ్. 52.

టీక.—ఆపదయందు, ధైర్యం = కలంగమి, అథ = పిదప, అభ్యుదయే = సంపదయందు, క్షమా = ఓర్పు, సదసి = సభయందు, వాక్పటుతా = మాటనేర్పు, యుధి = పోరాటమందు, విక్రమః = పరాక్రమము, యశసి = కీర్తియందు, అభిరతిః = కోరిక, శ్రుతౌ = వేదమునందు (వినుటయందు ఒండే), వ్యసనమ్ = ఆసక్తి, ఇదం = ఇది, మహాత్మనాం = గొప్పమనస్సుగలవారికి, ప్రకృతి సిద్ధం హి = స్వభావ సిద్ధము గదా.

తా.—ఆపదయందు ధైర్యము, సంపద కలిగినప్పుడు ఓర్పు, సభలందు మాటనేర్పు, రణమునందుఁ బరాక్రమము, కీర్తిపొందఁగోరిక, వేదశాస్త్రములు నేర్వ నాసక్తి, ఈ గుణము లన్నియు గొప్పవారికి సహజములు.

ఉ. ఆపదలందు ధైర్యగుణ, మంచితసంపదలందుఁ దాల్మియుక్,
భూపసభాంతరాళమునఁ బుష్కలవాక్చతురత్వ, మాజి బా
హాపటుశక్తియుక్, యశమునం దనురక్తియు, విద్యయందు వాం
ఛాపరివృద్ధియుక్, బ్రకృతి సిద్ధగుణంబులు సజ్జనాళికిన్.

వ్యా.—అథైషాం నిసర్గసిద్ధగుణాం - గణయతి - విప దీతి.— విపద్యాపత్కాలే, ధైర్యం నిర్వికారచిత్తత్వం - న తు దైన్యం, - 'మనసో నిర్వికారత్వం ధైర్యం సత్స్వపి హేతుష్వి' తి, అథానన్తరం వాక్యారమ్భే వా, అభ్యుదయే సంపది, క్షమా సహిష్ణుత్వం - న తూచ్చణ్డతా, సదసి రాజవిద్వత్సభాయాం, వాక్పటుతా వాగ్మిత్వం - సరసవచన రచనా చాతుర్య మితి యావత్ - న తు మూక భావః, యుధి రణరఙ్గే, విక్రమః పరాక్రమో - న తు పలాయనం, యశ, స్యభిరతిః సంగ్రహేచ్ఛా - న త్వనాదరః, శ్రుతౌ వేద శాస్త్రాభ్యసనే, వ్యసన మాసక్తి - ర్నతు నిర్వేద, ఇతీదం సర్వం * 'నపుంసక మనపుంసకే నే' త్యాదినా నపుంసకైక శేషః, మహాత్మనాం మహానుభావానాం, ప్రకృతి సిద్ధం స్వభావ సిద్ధం హి - ని. 'సంసిద్ధి ప్రకృతీ సమే' 'స్వరూపం చ స్వభావ శ్చ నిసర్గ శ్చే' త్యమరః. ద్రుతవిలమ్బితవృత్తమ్ - లక్షణం తూక్తమ్.

---

అవ.—సజ్జనుల భూషణములు ఏవి యనిన.

కరే శ్లాఘ్య స్త్యాగః, శిరసి గురుపాదప్రణయితా,
ముఖే సత్యా వాణీ, విజయి భుజయో ర్వీర్య మతులం,
హృది స్వచ్ఛా వృత్తిః, శ్రుత మధిగతం చ శ్రవణయో,
ర్వినాఽ ప్యైశ్వర్యేణ ప్రకృతిమహతాం మణ్డన మిదమ్. 53.

టీక.—కరే = చేతియందు, శ్లాఘ్యః = పొగడఁదగిన, త్యాగః = ఈవి, (మణ్డనం = ఆభరణము); శిరసి = తలయందు, గురు...ప్రణయితా - గురు = గురువుయొక్క - పాద = అడుగులందు - ప్రణయితా = అనురక్తి, (మణ్డ.); ముఖే = ముఖమున, సత్యా వాణీ = నిజమైన మాట, (మణ్డ.); భుజయోః = బాహువులందు, అతులం = సాటిలేనిదియు, విజయి = గెలుచునట్టిదియు, (అగు), వీర్యం = బలము, (మణ్డ.); హృది = మనస్సునందు (ఱొమ్మునందు అని యాభరణపరము), స్వచ్ఛా వృత్తిః = నిర్దోషమైన వ్యాపారము, (మణ్డ.); శ్రవణయోః = చెవులయందు, అధిగతం = నేర్వఁబడిన, శ్రుతమ్ = శాస్త్రము, (మణ్డ.); ఇదం = ఇది (ఈత్యాగాదికము), ఐశ్వర్యేణ వినా అపి = సంపద లేక పోయినను, ప్రకృతి మహతాం = స్వభావముచేత మహాత్ములైనవారికి, మణ్డనమ్ = ఆభరణము.



తా.—ఐశ్వర్యవంతులకు హారకంకణాద్యాభరణము లుండును, ఐశ్వర్యము లేని ప్రకృతిమహాత్ములకు అవి లేకున్నను వేఱాభరణములు ఉండును; అవి యెవ్వియనిన.— చేతులకు మంచి యీవి, శిరమునకు గురుచరణప్రణామము, ముఖమునకు సత్యవాక్కు, భుజములకు గెలుపుగొనుమహాబలము, హృదయమునకు నిర్దోషవృత్తి, వీనులకు పెద్దలవలన శాస్త్రములవినికియు; హారాదులచే ఐశ్వర్యము తెల్లమగునే గాని గొప్పతన మేర్పడదు, గొప్పతనము త్యాగాదులచేఁ దెలియ నగును.

చ. కరమున నిత్యదానము, ముఖంబున సూనృతవాణి, యాదలం
గురుచరణాభివాదన, మకుంఠితవీర్యము దోర్యుగంబునన్,
వరహృదయంబునన్ విశద వర్తన, యంచితవిద్య వీనులన్,
సురుచిరభూషణంబు లివి శూరులకున్ సిరి లేనియప్పుడున్.

వ్యా.—అథైషాం ప్రసిద్ధవిలక్షణమణ్డనసంపత్తి మాహ - కర ఇతి.—కరే హస్తే, శ్లాఘ్య స్సకలలోక ప్రశస్త, స్త్యాగో దానం, మణ్డనం - న తు కఙ్కణం - 'దానేన పాణిర్న తు కఙ్కణే నే' తి స్వేనైవాగ్రే వక్ష్యమాణత్వాత్, శిరసి గురుపాదయోః, ప్రణయితా అభివాదన తాత్పర్యం, మణ్డనం - న తు మణి హిరణ్మయకోటీరాదిః, ముఖే వక్త్రే, సత్యా వాణీ సూనృతభాషణం, మణ్డనం - న తు తామ్బూలచర్వణాది, భుజయో, రతులం నిరుపమానం, విజయి జయశీలం చ * 'జి దృక్షి' త్యాదినా ఇనిః, వీర్యం బలం, మణ్డనం - న తు కేయూరాది, హృ ద్యన్తరఙ్గే, స్వచ్ఛా వృత్తిః నిష్కళఙ్కవ్యాపారో, మణ్డనం - న తు హారరుచకాది - హృచ్ఛబ్దస్య వక్షః స్థలవాచకత్వ మపి సంభవ తీతి కృత్వా అభేదేన నిర్దేశః, శ్రవణయోః, కర్ణయో రధిగతం శ్రుతం శాస్త్ర మేవ - ని. 'శ్రుతం శాస్త్రావధృతయో రి' తి విశ్వః, మణ్డనం - న తు కుణ్డలే - 'శ్రోత్రం శ్రుతే నైవ న కుణ్డలే నేతి' వక్ష్యతి, ఇదం పూర్వోక్తదానాదికం సర్వ, మైశ్వర్యేణ ధనరత్న సంపత్త్యా, వి నాపి * 'పృథగ్వినే'త్యాదినా వికల్పా త్తృతీయా, ప్రకృత్యా స్వభావేన, మహతాం మహాత్మనాం - సౌజన్య సంపన్నానా మి త్యర్థః * 'ప్రకృత్యాదిభ్య స్తృతీయే' తి తృతీయాసమాసః, మణ్డనం భూషణం - తస్యైవ లోకోత్తర రామణీయకాదిహేతుత్వా దితి భావః. శిఖరిణీవృత్తమ్.

---

అవ.—మేలునకు దారి.

ప్రాణాఘాతా న్నివృత్తిః, పరధనహరణే సంయమః, సత్యవాక్యం,
కాలే శక్త్యా ప్రదానం, యువతిజనకథామూకభావః, పరేషామ్

తృష్ణాస్రోతోవిభఙ్గో, గురుషు చ వినయః, సర్వభూతానుకమ్పా,
సామాన్యం సర్వశాస్త్రేష్వనుపహతవిధిః శ్రేయసామేష పన్థాః. 54.

**టీక.**—ప్రాణ ఆఘాతాత్ = ప్రాణ హింసనుండి (ప్రాణి హింసనుండియని ఫలితార్థము), నివృత్తిః = తొలఁగుట, పర ధన హరణే = ఇతరుల ధనమును హరించుటనుండి, సంయమః = (మనస్సును) కట్టివేయుట, సత్య వాక్యం = నిజమయిన మాట (చెప్పుట), కాలే = వలసినసమయమందు, శక్త్యా = యథాశక్తిగా, ప్రదానం = ఇచ్చుట, పరేషాం = ఇతరులయొక్క, యువ...భావః - యువతిజన = జవరాండ్రయొక్క (జవరాండ్రను గూర్చిన) - కథా = ప్రశంసలయందు - మూక భావః = మూఁగతనము (అప్రశంసలు చేయకుండుట), తృష్ణా...భఙ్గః - తృష్ణా = ధనాశయొక్క - స్రోతః = పాఱుదలయొక్క (పాఱుదలను) - విభఙ్గః=అడ్డగించుట, గురుషు = గురువులయెడ, వినయం చ = అడఁకువ యు, సర్వ...కమ్పా - సర్వ = సమస్త - భూత = ప్రాణులందు - అనుకమ్పా = దయ, ఏషః = ఇది (ప్రాణాఘాతనివృత్తిప్రభృతి), శ్రేయసాం = శ్రేయస్సులకు, సర్వశాస్త్రేషు = ఎల్లశాస్త్రములందును, సామాన్యమ్ = సమానముగా నుండునదియు, అనుపహతవిధిః = కొట్టఁడని యాచరణముగలదియు, (నయిన), పన్థాః = దారి.

తా.—ప్రాణిహింస చేయమి, పరధనమును హరింప నిచ్ఛగింపమి, నిజము పలుకుట, యథాశక్తి ఇచ్చుట, అన్యులయువిదలను గూర్చి పలుకకుండుట, ఆశను హద్దులోనుంచుట, గురువులయెడ నమ్రత, సకల భూతంబులందును దయ, ఇది యెల్లశాస్త్రములందును ఏకగ్రీవముగా చెప్పఁబడి ఆచరణమందు భంగమొందక ఫలించుచున్న శ్రేయోమార్గము.

మ. పరహింసా పరకీయవిత్తహరణాభావంబు సత్యవ్రతా
దరముం దానపరత్వ మన్యవనితోదంతోక్తిమూకత్వముం
బరతృష్ణార్ఝరభంజనంబు గురునమ్రత్వంబునుం బ్రాణభృ
త్కరుణా శాస్త్రసమత్వసద్విధులు భద్రప్రాప్తికిన్ మార్గముల్.

వ్యా.—గుణాఢ్యత్వే కో లాభ ఇత్యాశఙ్క్య తేషాం శ్రేయోహేతుత్వమాహ - ప్రాణేతి.— ప్రాణాఘాతాత్ప్రాణిహింసాయాః, నివృత్తిర్నివర్తనం చ - 'మా హింస్యాత్సర్వభూతాని' 'అహింసా పరమో ధర్మస్త్వధర్మః ప్రాణినాం వధ' ఇత్యాదినాఽగ్నీషోమీయపశ్వాలమ్భనవ్యతిరిక్తహింసాయా నిషేధ శ్రవణాత్, పరధన హరణే సంయమో మనోనిరోధ శ్చ 'పరద్రవ్యాణి లోష్టవ ది' తి న్యాయా దితి భావః, కాలే సమయే సత్యవాక్యం యథార్థభాషణం చ - తథా ధర్మోపదేశ శ్రవణా దితి భావః - అత్ర 'బ్రాహ్మణార్థే గవార్థే' ఇత్యాది ష్వసత్యవచన స్యాపి నిషేధాభావ



శ్రవణాత్కాల ఇత్యుక్తం, శక్త్యా ప్రదానం విత్తానుసారేణ త్యాగ శ్చ- 'విత్తశాఠ్యం న కారయే ది' తి వచనా దితి భావః, యువతి జన కథాయాం పరస్త్రీవృత్తాన్త కథనే - మూకభావ స్తూష్ణీంభావశీలత్వం చ -'స్వప్నేఽప్యన్యవధూకథాం మి' తి వచనాత్, పరేషా మన్యేషాం - యాచకానా మిత్యర్థః, తృష్ణా ధనలిప్సా - తస్యా ఏవ - స్రోతసః ప్రవాహస్య - విభఙ్గో నిరోధః - అభీప్సితదానేన మనోరథపరిపూరణం చేత్యర్థః -

'యాచమానజనమానసవృత్తేః పూరణాయ బత జన్మ న యస్య
తేన భూమి రతిభారవతీయం న ద్రుమై ర్న గిరిభి ర్న సముద్రైః.'

ఇతి శ్రవణా దితి భావః, గురుషు విషయే, నమ్రత్వం చ - 'గురౌ నమ్రతే' త్యుక్తత్వా దితి భావః, సర్వభూతే ష్వశేషప్రాణి - ష్వనుకమ్పయా దయయా - సామాన్యం సమదర్శిత్వం చ, సర్వశాస్త్రేషు వేదవేదాన్తాది సకలాగమే, ష్వనుపహతః అవిచ్ఛిన్నః - విధి రధ్యయనవిధానం చ - యద్వా 'సర్వభూతాను కమ్పే' తి పృథక్పదం, తథా సర్వశాస్త్రేషు సామాన్య మవైషమ్యేణ తత్తత్సిద్ధాన్తానువర్తిత్వమ్, అనుపహత విధి రలుప్తకర్మానుష్ఠానం చే, త్యేష గుణసముదాయః, శ్రేయసాం పన్థా అఖణ్డితైశ్వర్యాది శ్రేయః ప్రాప్తి మార్గః - న త్వేతద్వ్యతిరిక్తోఽన్యోఽస్తీ త్యర్థః; ఏతాదృశగుణసంపత్తి స్సుజనానామేవేతి కృత్వా త ఏవ శ్లాఘ్యా ఇతి భావః; అథవా శ్రేయసాం ప్రశస్యానాం సుజనానాం సంబన్ధీ, పన్థాః తత్ప్రవృత్తిమార్గ ఇత్యర్థః-ప్రశస్యశబ్దా దీయసుని *'ప్రశస్యస్య శ్రః' ఇతి శ్రాదేశః. అత్ర 'వాఞ్ఛాసజ్జనసంగతా' విత్యాదిశ్లోకే షూక్తగుణాః ప్రాయేణ దైవసంపత్ - అభిజాతానామేవ సంభవతి న త్వన్యేషాం - త దుక్తం భగవద్గీతాసు -

'అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః
దానం దమ శ్చ యజ్ఞ శ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవం
అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాన్తి రపైశునమ్
దయాభూతే ష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలమ్
తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా
వదన్తి సంపదం దైవీ మభిజాతస్య భారత.' ఇతి.

స్రగ్ధరావృత్తం—'మ్రభ్నై ర్యానాం త్రయేణ త్రిమునియతియుతా స్రగ్ధరా కీర్తితేయమ్.' ఇతి లక్షణాత్.

---

సంపత్సు మహతాం చిత్తం భవే దుత్పలకోమలమ్,
ఆపత్సు చ మహాశైల శిలాసఙ్ఘాతకర్కశమ్. 55.

టీక.—మహతాం = గొప్పవారియొక్క, చిత్తం - మనస్సు, సంపత్సు = సంపదలందు, ఉత్పల కోమలం = కలువవలె మెత్తనిది, భవేత్ = అగును, కించ = మఱి, ఆపత్సు = ఆపదలందు, మహా శైల శిలా సఙ్ఘాత కర్కశం = పెద్దకొండయొక్క రాల సమూహమువలె కఠినము, (భవేత్).

తా.—మహాత్ముల మనస్సు సంపదలు కలిగినప్పుడు కలువవలె మృదువుగా, అనఁగా కరుణామయముగా నుండును. ఆపదలు సంభవించినపుడు ఱాతిబండవలె వానికి అభేద్యమగును.

తే. సంపదలు గల్గుతఱి మహా జనుల హృదయ । మభినవోత్పలకోమం బగుచు వెలయు,
నాపదలు వొందునపుడు మహామహీధ । రాశ్మసంఘాతకర్కశం బై తనర్చు.

వ్యా.—అథాపత్సంపదో స్సుజనమనోవృత్తి మాహ - సంపత్స్వితి.—సంపత్సు ధనధాన్యవస్తువాహనాది సమృద్ధిషు, మహతాం మహాత్మనాం సజ్జనానాం, చిత్త, ముత్పలవ, త్కోమలం మృదులం, భవేత్ న తు కఠిన మిత్యర్థః, విపత్సు దారిద్ర్యాద్యనర్థసంకటేషు, మహాశైలశిలాసంఘాతః పాషాణకూటః - తద్వ త్కర్కశం కఠోరం చ భవేత్ - న త్వధైర్యవిశ్లథ మిత్యర్థః - న కదాఽప్యుక్తవైపరీత్య - మన్యథా మాహాత్మ్యభఙ్గప్రసఙ్గా దితి భావః, వివేకినా మవివేకినాం చాయ మేవ పన్థాః ఆదరణీయ ఇతి తాత్పర్యమ్; అత్ర శైలస్య మహత్త్వవిశేషణం తచ్ఛిలాసంఘాత స్యాత్యన్తదుర్భేద్యత్వద్యోతనార్థమ్ - ఉక్తం చైత దన్యత్రాపి -

'సౌజన్యామృతసిన్ధవః పరహిత ప్రారబ్ధ వీరవ్రతా
వాచాలాః పరవర్ణనే నిజగుణాలాపే తు మౌనవ్రతాః
ఆప త్స్వ ప్యవిలుప్తధైర్యనిలయా స్సంప త్స్వనుత్సేకినో
మాభూవన్ ఖలవక్త్రనిర్గతవిషమ్లానాననా స్సజ్జనాః.' ఇతి.

ఉపమాలంకారః.

---

అవ.—సుజన వర్తనము.

ప్రియా న్యాయ్యా వృత్తి, ర్మలిన మసుభఙ్గే ఽప్యసుకరం,
త్వసన్తో నాభ్యర్థ్యాః, సుహృ దపి న యాచ్యః కృశధనః,
విప ద్యుచ్చై ర్ధైర్యం, పద మనువిధేయం చ మహతాం,
సతాం కే నోద్దిష్టం విషమ మసిధారావ్రత మిదమ్? 56

టీక.—న్యాయ్యా = న్యాయమును వీడని (న్యాయమైన), వృత్తిః = వర్తనము, ప్రియా = ఇష్టము; అసు భఙ్గే అపి = ప్రాణాపాయమందును, మలినం = చెడుపని,



అసుకరం = చేయఁదగనిది; అసన్తః తు = దుష్టులన్ననో, అభ్యర్థ్యాః న = వేఁడఁదగినవారు కారు; సుహృత్ అపి = మిత్త్రుఁడైనను, కృశధనః = సన్నగిల్లిన ధనముగలవాఁడు (పేదవాఁడు), యాచ్యః న = యాచింపఁదగినవాఁడు కాఁడు; విపది = ఆపదయందు, ఉచ్చైః ధైర్యం = గొప్ప ధీరత్వము; మహతాం = మహాత్ములకు, అనువిధేయం = అనుకూలమైన, పదం = పూనిక ;—ఇదం = ఈ, విషమం = దుష్కరమైన, అసిధారావ్రతం = (కాలు తెగకుండ) కత్తివాదర (మీఁదనడచు) వ్రతము వంటినడవడి, సత్పురుషులకు, కేన = ఎవనిచేత, ఉద్దిష్టమ్ = ఉపదిష్టమ్ = నేర్పఁబడినది.

—న్యాయ్యమయిన జీవికనే కోరవలసినది, ప్రాణము దక్కించుకొనుటకైనను చెడుపనిని చేయఁగూడదు, దుష్టులను వేఁడఁగూడదు, మిత్త్రుఁడేనియు పేదవడిన యాచింపఁగూడదు, ఆపద వచ్చినప్పుడు మిక్కిలి ధైర్యము కలిగి యుండవలసినది, అనుకూలములగు పనులు పూనవలసినది; కత్తియంచుమీఁద నడచుటవలె యీనడవడి సత్పురుషులకు స్వాభావికము.

అసమానప్రియనీతివర్తనము, ప్రాణాంతంబునందున్ మలీ
మస మగ్రాహ్య, మదుష్టయాచన, మసంపన్మిత్త్రనాభావమున్,
వ్యసనావాప్తిని ధైర్యమున్, బుధజనాత్యంతానుకూలత్వ;—మీ
యసిధారావ్రత చర్య యెవ్వఁడు మహార్యశ్రేణికిం దెల్పెనో!

వ్యా.—అథ ద్వాభ్యా మేవ తద్వృత్త స్యాసాధారణ్య మాహ - ప్రియేతి. న్యాయాదపేతా న్యాయ్యా నీతిప్రవణా, వృత్తి ర్జీవనం - ని. 'వృత్తి ర్వర్తన జీవన' ప్రీణాతీతి ప్రియా ఇష్టా-న త్వన్యాయ్యా-తస్యా ఏవ శ్రేయస్కరత్వాదితి 'ఇగుపధ జ్ఞాప్రీ కిరః క' ఇతి కప్రత్యయః, అసుభఙ్గేఽపి ప్రాణప్రయాసేఽపి దేతి భావః, మలినం దుష్కర్మ అసుకర మకర్తవ్యం - న 'త్వాపత్కాల్యా దే' తి న్యాయా త్సుకరం - త స్యై హికాముష్మికఫలదత్వా దితి 'ఈషద్దుః సుషు కృచ్ఛ్రాకృచ్ఛ్రార్థేషు ఖల్' ఇత్యాదినా ఖల్ప్రత్యయః - తతో నఞ్సమాసః, అసన్తః కుహార్థ్యాః కస్మింశ్చి ద్విషయేఽపి న ప్రార్థనీయాః - కిం తు సన్త ఏవ - తేషా దితి భావః, య ద్యపి * 'న పదాదౌ ఖల్వాదయ' ఇత్యాహ వామనః-సౌధ్యా తుశబ్దస్య పాదాదౌ ప్రయోగః, సుహృ దపి ప్రాణప్రియబన్ధు; ఇతి భావః * 'సుహృద్దుర్హృదౌ మిత్త్రామిత్త్రయో' రి' తి నిపాతకృశధనః ధనహీన శ్చేత్, న యాచ్యః యాచితుం న యోగ్యః - ధనా - కిం తు ధనపరిపూర్ణా ఏవ - తథావిధయాచ్ఞాయా అనుచితత్వా దితి అనర్థసంకటేఽప్యుచ్చైః ధైర్యం మహాధైర్యం న తు భయవిహ్వలత్వం-అవిలుప్తధైర్యనిధయః' 'విపది ధైర్య మ థాభ్యుదయే క్షమే' తి చో

త్వా దితి భావః, మహతాం పూజ్యానాం, మనువిధేయ మనుకూలం, పదం వ్యవ ం చ-
న త్వననుకూలం - తథాభూత స్యైవ శ్లాఘ్యత్వా దితి భావః - ని 'పదం వ్యవ త్రాణ
స్థానలక్ష్మాఙ్ఘ్రివస్తు ష్వి' త్యభిధానాత్, ఇ తీద మేతత్, విషమ మసాధారణ యా దు
ష్కర, మసిధారావ్రత మవ్యభిచరితవ్రతం, సతాం సత్పురుషాణాం, కే నోద్దిః ముపది
ష్టం - నకేనా పీ త్యర్థః - స్వతస్సిద్ధత్వా దితి భావః. అ త్రాసిధారావ న్నిశిత త్వా దసి
ధారాసంచార వత్సావధానే నైకాగ్రతయా విధేయత్వా ద్వా అసిధారావ్రత - య
ద్వా అసిధారయా వ్యవహరతాం వ్రతం వీరవ్రత మి త్యర్థః - అథవా -

'యువా యువత్యా సార్ధం య న్ముగ్ధభర్తృవ దాచరేత్
అన్తర్నివృత్తసఙ్గ స్స్యా దసిధారా వ్రతం స్మృతమ్.'

ఇ త్యుక్త మి త్యవధేయమ్. శిఖరిణీవృత్తమ్.

---

అవ.—వెండియు సుజనవర్తనము.

ప్రదానం ప్రచ్ఛన్నం, గృహ ముపగతే సంభ్రమవిధిః,
ప్రియం కృత్వా మౌనం, సదసి కథనం చా ప్యుపకృతే
అను త్సేకో లక్ష్మ్యాం, నిరభిభవసారాః పరకథాః,
సతాం కేనోద్దిష్టం విషమ మసిధారావ్రత మిదమ్!

టీక.—ప్రచ్ఛన్నం = గుప్తమైన, ప్రదానం = ఈవి, గృహమ్ = ఇ
గతే = వచ్చినవానింగూర్చి, సంభ్రమ విధిః = ఆదరము సేయుట, ప్రియం
కృత్వా = నెఱవేర్చి, మౌనం = (దానిని) చెప్పకొనకుండుట, అపి చ =
సదసి = సభలో, ఉపకృతేః = (ఒరులు తమకు చేసిన) యుపకారముయొక
చెప్పుట, లక్ష్మ్యాం = సంపదయందు, అనుత్సేకః = గర్వములేమి, నిరభి
నింద లేమి సారముగాఁ గలవైన, పర కథాః = ఇతరులనుగూర్చిన ముచ్చటలు
మిదమ్ - 57 వ శ్లోకముక్రింద చూ.]

తా.—గుప్తదానము, ఇంటికి వచ్చిన వానిని ఆదరించుట, ఒకరి
చేసి చెప్పకొనకుండుట, తనకు ఒరులు చేసిన యుపకారమును నలువురఁ
టు, సిరి వచ్చిన గర్వింపకుండుట, ఇతరులం గూర్చిన ప్రస్తావములలో వా
డుట,—[కర్త్రియంచు ... 57 వ శ్లోకముక్రింద చూ.]

మ. పొసఁగం దానము గుప్త, మర్థి భవనంబుం జేరుచో సంభ్ర-
మ్లసదుత్థానవిధానముం, బ్రియవిధుల్ గావించి మౌనంబు, రం



జసభఁ మిత్త్రకృతిప్రకాశనము, గుత్సాకర్మవై ముఖ్య, మి
యసిధారావ్రతచర్య యెవ్వఁడు మహార్యశ్రేణికిం దెల్పెనో.

వ్యా.—ప్రదానమితి.— ప్రచ్ఛన్నం ప్రదానం గుప్తదానం - న తు ప్రకాశం -
తథాభూతదానస్య మహాఫలశ్రవణా దితి భావః, గృహం నిజమన్దిరం, ప్ర త్యుపగతే
సతి అర్థినీతి శేషః, సంభ్రమవిధిః ప్రత్యుత్థానాభివాదనాది సత్వర వ్యాపారవిధానం
చ న తు వైముఖ్యం - త స్యైవ శాస్త్రోదితాచారత్వా దితి భావః, ప్రియం త దభీష్టం,
కృత్వా, మౌనం తూష్ణీంభావ - శ్చాపరికీర్తన మితి యావత్ - న తు ప్రకటనం -
'కృత స్యాపరికీర్తనం,' 'న దత్త్వా పరికీర్తయే' ది తి మనుస్మరణా దితి భావః, సదసి
రాజవిద్వత్సభాయా ముపకృతేః, కథనం పరోపకారప్రఖ్యాపనం చ - న తు తత్ర
తూష్ణీంశీలత్వం - అన్యథా కృతఘ్నత్వప్రసఙ్గా దితి భావః, లక్ష్మ్యాం సంపత్త్యా, మను
త్సేకో గర్వరాహిత్యం - న తు మదాన్ధత్వం - 'సంప త్స్వనుత్సేకిన' ఇ త్యుక్తత్వా
దితి భావః నిరభిభవసారా అనిన్దాపరాః, పరకథాః పురుషాన్తరప్రసఙ్గా శ్చ - న తు
గర్హణపరాః - 'ఆత్మప్రశంసాం పరగర్హా మితి చ వర్జయే' ది' త్యాది స్మరణాత్,
సతాం కే త్యాది వృత్తం చ పూర్వవత్.

---

అ —అధములు, మధ్యములు, ఉత్తములు, అగువారి వృత్తిభేదములు.

సంతప్తాయసి సంస్థితస్య పయసో నా మాపి న శ్రూయతే,
ముక్తాకారతయా త దేవ నలినీపత్త్రస్థితం దృశ్యతే,
అన్తస్సాగరశుక్తిమధ్యపతితం త న్మౌక్తికం జాయతే,
ప్రాయే ణాధమమధ్యమోత్తమజుషా మేవంవిధా వృత్తయః.

టీక.—సంతప్త అయసి = చక్కఁగా కాల్పబడిన యినుమునందు, సంస్థిత
ఉన్నట్టి (చల్లినట్టి యనుట), పయసః = నీటియొక్క, నామ అపి = పేరు అయిన
శ్రూయ = వినఁబడదు, తత్ ఏవ = అది యే (నీరే), నలినీ పత్త్రస్థితం సత్ =
రాకున ఉన్నదై, ముక్తా ఆకారతయా = ముత్తెముయొక్క రూపముగలదిగా.
తే పడును, తత్ = అది (నీరు), అన్త...పతితం సత్ - అన్తస్సాగర
రి - శుక్తి = ముత్తెపుఁజిప్పయొక్క - మధ్య = లోపల - పతితం
మౌక్తికం = ముత్యము, జాయతే = అగును, ప్రాయేణ = త
మ ఉత్తమ జుషాం = అధములను మధ్యములను ఉత్తములను ఆ
, వృత్తయః = దశలు. ఏవంవిధాః = ఇట్టివి (గా నున్నవి).
—ఎట్లుగాఁ గాలియున్న యినుముపై నీరు చల్లిన అది నిశ్శేషమ

చును. నీరే తామరాకుమీఁద నున్నప్పుడు ముత్యమువలె ప్రకా ంచును. సముద్రము
లోని ముత్తెపుఁజిప్పలోపల పడిననీరు ముత్యమే యగును. ఇట్లే అధ ములను మధ్యములను
ఉత్తములను ఆశ్రయించువారికి తలుచుగా (వరుసగా) సర్వనాశము సౌఖ్యాభాసమును
వాస్తవసౌఖ్యమును కలుగును.

ఉ. నీరము తప్తలోహమున నిల్చి యనామకమై నశించు, న
నీరమె ముత్యమట్లు నళినీదళసంస్థితమై తనర్చు, నా
నీరమె శుక్తిలోఁ బడి మణిత్వము గాంచు సమంచితప్రభం;
బౌరుషవృత్తు లిట్లధము మధ్యము నుత్తముఁ గొల్చువారికిన్.

వ్యా.—అథాధమమధ్యమోత్తమ వృత్తి మాహ సంతప్తాయ ౹తి.—సంతప్తా
యసి సమ్యగగ్నితప్తాయఃపిణ్డే సంస్థితస్య నిక్షిప్తస్యే త్యర్థః, పయసో జలస్య,
నామాఽపి నామధేయ మాత్ర మపి, న శ్రూయతే మూలతో ధ్వస్త మేవ భవతీ త్య
ర్థః - స్వరూపదర్శనం తు కిము వక్తవ్య మితి భావః, తదేవ పయః, సి పత్త్రి
స్థితం పద్మినీ పత్త్రగతం సత్, ముక్తాకారతయా మౌక్తికరూపేణ, దృశ్యతే తు మౌ
క్తికత్వే నే త్యర్థః, తదేవ పయః, అన్తస్సాగరే సాగరాన్తరాళే - అ త్యవ్య
యం - యా శుక్తిః ముక్తాస్ఫోటః-తస్యాః - మధ్యే ఉదరే - పతితం సత్ మౌక్తికం
జాయతే మౌక్తికత్వేన పరిణమ తీత్యర్థః * 'జ్ఞా జనోర్జ్జా'తి జాదేశః-ముక్తౌ మౌక్తిక
మితి విగ్రహః * వినయాదిత్వా త్స్వార్థే ఠక్; అతః ప్రాయేణ భూమ్నా అధమ మ
ధ్య మోత్తమ గుణానాం నికృష్ట సాధారణోత్కృష్టాశయా నాశ్రితవతాం, మే నం విధాః
సమాశ్రవణాదిరూపా, వృత్తయో వ్యాపారా, భవన్తీతి యథాక్రమ మన యా ద్య
సంఖ్యాలంకారః. అతః మహదాశ్రయ ఏవ కర్తవ్యః - 'నీచాశ్రయో న కర్తవ్యః
కర్తవ్యో మహదాశ్రయ' ఇతి వచనాత్. అత్రోత్తమమధ్యమాధమా ఇతి లో ప్రసిద్ధో
క్రమః కవినా న వివక్షిత ఇతి జ్ఞేయమ్. శార్దూలవిక్రీడితమ్.

ను.

———

కవ.—మంచి పుత్త్రమిత్త్రకళత్రములు జన్మాంతరసుకృతమునఁ గాని ంపరు.

యః ప్రీణయేత్ సుచరితైః పితరం స పుత్త్రో,
య ద్భర్తు రేవ హిత మిచ్ఛతి తత్ కళత్రమ్,
త న్మిత్త్ర మాపది సుఖే చ సమక్రియం య,
దేతత్ త్రియం జగతి పుణ్యకృతో లభన్తే.

ప.—యః = ఎవ్వఁడు, సు చరితైః = మంచి నడవడులచేత, పిః
యేత్ = సంతోషపెట్టునో, సః పుత్త్రః = వాఁడు పుత్త్రుఁడు



భర్తుః = పెనిమిటికి, హితం = మేలును, ఇచ్ఛతి = కోరునో, తత్ ఏవ = ఆమెయే, కళ
త్రం = భార్య; యత్ = ఎవఁడు, ఆపది = ఇడుమయందును, సుఖే చ = సేమమందును,
సమక్రియం = సమానమైన యుపకారముగలవాఁడో (ఒక్కతీరుననే ప్రేమించునో),
తత్ ఏవ = అతఁడే, మిత్త్రమ్ = చెలికాఁడు; ఏతత్ త్రయం = ఈ మూఁటిని, జగతి =
లోకములో, పుణ్యకృతః = పుణ్యము చేసికొనియున్నవారలు, లభన్తే = పొందుదురు.

తా.—మంచినడవడిచే తండ్రిని సంతోషపెట్టువాఁడే పుత్త్రుఁడు. పెనిమిటికి హి
తము గోరునదియే భార్య. ఆపదయందును సంపదయందును ఏకరీతిగా ప్రేమించువాఁడే
చెలికాఁడు. లోకమున నిట్టి యీముగ్గురును పుణ్యముచేసికోనివారికి లభింపరు.

చ. జనకునిఁ బూటలం గడుఁ బ్రసన్నుని, జేయునతండు పుత్రుఁ, డే
వనిత మెలంగు భర్తృవశవర్తినియై యది సత్కళత్ర, మే
జనుఁడు విపత్తి సౌఖ్య సదృశక్రియుఁ డాతఁడు మిత్త్రుఁ, డీత్రయం
బును జగతిన్ లభించుఁ గడుఁ బుణ్యముఁ జేసినయట్టివారికిన్.

వ్యా.—అథ సత్పుత్త్ర కళత్ర మిత్త్ర సంపత్తిః పుణ్యకృదధీనే త్యాహ - య
ఇతి.— యః పుత్త్ర స్సుచరితైః వాక్యకరణాదిసదాచారైః, పితరం, ప్రీణయేత్ సం
తోషయేత్ * 'ప్రీఞ్ తర్పణ' ఇ త్యస్మా ద్ధాతో ర్ణ్యన్తా ల్లిఙ్ * 'ధూఞ్
ప్రీఞో ర్నుగ్వక్తవ్య' ఇతి నుగాగమః, స పుత్త్రః 'పున్నామ్నో నరకా త్త్రాయత'
ఇతి వ్యుత్పన్న ఇతి పుత్త్రశబ్దవాచ్యః న తూత్పన్నమాత్రః -
'జీవతో ర్వాక్యకరణాత్, ప్రత్యబ్దం భూరిభోజనాత్,
గయాయాం పిణ్డదానేన, త్రిభిః పుత్త్రస్య పుత్త్రతా.' ఇతిస్మరణాత్,
యా, ద్భర్తుః పత్యుః, హిత మిచ్ఛతి భయభక్తిభ్యాం హితాచరణ తత్పరం భవతి, త
దేవ, కళత్రం భార్యా - న తు యాదృచ్ఛికం - 'పతిభక్తిపరా సాధ్వీ కాన్తా సా
సత్యభాషిణీ' తిపతివ్రతాధర్మత్వాత్ - ని. 'కళత్రం శ్రోణి భార్యయో రి' త్యమరః,
య, దాపది అనర్థ సంకటే, సుఖే సంపది చ, సమక్రియ మవిషమాచార మిత్యర్థః-తుల్య
వృత్తి, త దేవ, మిత్త్రం సుహృత్ - న త్వాపత్సంపదోః త్యాగానువర్తనతత్పరమ్ -
'ఆపద్గతం చ న జహాతి దదాతి కాలే సన్మిత్త్రలక్షణ మిదం ప్రవదన్తి సన్తః.'
ఇతి వక్ష్యమాణత్వా, దేత త్త్రియ ముక్తసత్పుత్త్రాది త్రితయం, జగతి భువి, పుణ్యకృ
తో ధన్యా, లభన్తే ప్రాప్నువన్తి - న త్వకృతసుకృతా ఇ త్యర్థః. ఏవంవిధ త్రితయ
లాభస్య మహాపుణ్యఫలత్వా దితి భావః. వసన్తతిలకావృత్తమ్.

———

నమ్రత్వే నోన్నమన్తః, పరగుణకథనైః స్వాన్ గుణాన్ ఖ్యాపయన్తః,
స్వార్థాన్ సంపాదయన్తో వితతపృథుతరారమ్భయత్నాః పరార్థే,

క్షాన్త్యై వాక్షేపరూక్షాక్షరముఖరముఖాన్ దుర్జనాన్ దుఃఖయన్తః,
సన్తః సాశ్చర్యచర్యా జగతి బహుమతాః కస్య నాభ్యర్చనీయాః?

టీక.—నమ్రత్వేన = వంగునట్టివారగుటచేత (అణఁకువచేత నని భావము), ఉన్నమన్తః = లేచుచు (గౌరవమును పొందుచున్న వారును), పర గుణ కథనైః = ఇతరుల సుగుణముల వర్ణనలచేత, స్వాన్ గుణాన్ = తమవైన గుణములను, ఖ్యాపయన్తః = ప్రకటించువారును, పరార్థే = ఇతరులకార్యమందు, వితత...యత్నాః - వితత = విస్తరింపఁబడినదై - పృథుతర=మిక్కిలి గొప్పదైన - ఆరమ్భ = కార్యములయందలి - యత్నాః సన్తః = పూనికగలవారై, స్వార్థాన్ = తమప్రయోజనములను, సంపాదయన్తః = నెఱవేర్చుకొనువారును, ఆక్షే...ముఖాన్ - ఆక్షేప = దూషణచేత - రూక్ష = క్రూరములైన - అక్షర=మాటలచేత - ముఖర = మ్రోఁగుచున్న - ముఖాన్= నోరుగల, దుర్జనాన్=దుష్టులను, క్షాన్త్యా ఏవ = ఓర్పుచేతనే, దుఃఖయన్తః = దుఃఖపెట్టువారును, (ఐ), (ఈవిధముగా), సాశ్చర్య చర్యాః = ఆశ్చర్యముతోఁగూడిన నడవడిగలవారై, బహుమతాః = గౌరవింపఁబడుచున్న, సన్తః = సత్పురుషులు, జగతి= లోకమునందు, కస్య = ఎవనికి, అభ్యర్చనీయాః న = పూజ్యులు కారు.

తా. పెద్దలు అణఁకువ గలిగి వర్తింతురు, అయ్యణఁకువవలన లోకులు వారిని గొప్ప దశలో నుంతురు. ఇతరుల సుగుణములను వారు ఉగ్గడింతురు, అందుచేత తమసుగుణములు తెల్లంబగును. వారు ఒరులకార్యములను ఎంతకష్టమైనఁ బడి సాధించుచుందురు. ఆమంచితనమునకు ఇతరులు వారికార్యములను నెఱవేర్చుచుందురు. తమ్ము దూషించు వాకిని వారు మన్నింతురు, అటు మన్నించినకొలఁదియు ఆదుష్టులకు వీరిపై దుఃఖము హెచ్చుచుండును. ఇట్టివింతనడవడి గలవారై గౌరవ మొందు పెద్దలు ఎల్లవారికిని పూజ్యులు.

చ. నతు లగుచున్ మహోన్నతిఁ దనర్చుచు, నన్యగుణోక్తిచే గుణో
న్నతిఁ బ్రకటించుచుం, బరజనప్రియకార్యసమర్థతన్ సమం
చితనిజకార్యసంగ్రహముఁ జేయుచు, నిష్ఠురవాదులన్ క్షమా
ధృతి నిరసించుచుం, బరఁగు ధీరులు పూజ్యులు గారె యేరికిన్?

వ్యా—అథ సతాం తావ దసాధారణగరిమాస్పదత్వే నాశేషోపాదేయత్వమాహ - నమ్ర త్వేతి.—నమ్రత్వేన ప్రహ్వత్వేనైవోన్నమన్త ఔన్నత్యం ప్రాప్నువన్త-స్తథాభావ స్యైవౌన్నత్య హేతుత్వా దితి భావః, పరేషాం - గుణ కథనైస్సద్గుణ వర్ణనైః, స్వాన్ స్వకీయాన్, గుణాన్ సౌజన్యాదీన్, ఖ్యాపయన్తః ప్రకటయన్తః - న త్వాత్మప్రశంసయా - తాదృగ్భావస్యైవ నిజగుణప్రకటనహేతుత్వా దితి భావః, పరార్థే పరప్రయోజననిర్వహణే - వితతా విస్తృతా - పృథుతరా - చారమ్భయత్నా



ప్రారమ్భోత్సాహా - యేషాం తే తథోక్తాః, సన్త ఏవ, స్వార్థాం స్స్వప్రయోజనాని, సంపాదయన్తో నిష్పాదయన్తః, పరకార్యసాధన పురస్కారేణైవాత్మీయకార్యసాధనతత్పరాః న త్వేకాన్తత ఇత్యర్థః - తథాభూతత్వస్యైవ వాత్మార్థకత్వా దితి భావః, క్షాన్త్యా సహనశీలత్వేనైవ, వాక్షేపేణ నిన్దయా - రూక్షాక్షరాణి పరుషవాక్యాని - తైః ముఖరాణి వాచాలాని - ముఖాని యేషాం తాన్ పరుషభాషిణ ఇత్యర్థః, దుర్జనాన్ ఖలాన్, దుఃఖయన్తః - నతూచ్ఛృణ్ఖలతయా - తథావిధత్వస్యైవ తేషాం హృచ్ఛల్యప్రాయత్వా దితి భావః, అత ఏవ సాశ్చర్యచర్యా అత్యన్తాశ్చర్యకరచరిత్రాః, సన్త స్సత్పురుషాః, జగతి లోకే, బహుమతాః బహుమానితా స్సన్తః, కస్య వా పుంసో, నాభ్యర్చనీయాః న పూజనీయా ఇతి కాకుః; సర్వేషా మప్యభ్యర్చనీయా ఏ వే త్యర్థః.

ఇతి నీతిశతకవ్యాఖ్యానే సుజనపద్ధతివర్ణనం నామ షష్ఠదశకమ్.

---

## పరోపకారపద్ధతిః.

---

భవన్తి నమ్రా స్తరవః ఫలోద్గమైః,
ర్నవామ్బుభి ర్దూరవిలమ్బినో ఘనాః,
అనుద్ధతా స్సత్పురుషా స్సమృద్ధిభిః;
స్వభావ ఏ వైష పరోపకారిణామ్. 61.

టీక.—తరవః = చెట్లులు, ఫల ఉద్గమైః = పండ్ల కాపులచేత, నమ్రాః = వంగునవి, భవన్తి = అగును; ఘనాః = మేఘములు, నవామ్బుభిః = క్రొత్తనీళ్లచే, దూర విలమ్బినః = మిక్కిలిక్రిందికి వ్రేలాడునవి, (భవ...); సత్పురుషాః = సజ్జనులు, సమృద్ధిభిః = సంపదలచేత, అనుద్ధతాః = గర్వములేనివారు, (భవన్తి = అగుదురు); పర ఉపకారిణాం = పరులకు హితముసేయువారికి, ఏష = ఇది (ఈనమ్రత్వాదిము), స్వభావ ఏవ = సహజమే.

తా.— వృక్షములు ఫలములకాపుచే వంగును; మేఘములు క్రొత్తనీళ్లచే క్రింకి వ్రేలును; ఇట్లే సజ్జనులు సంపదలచే అడఁకువ వహింతురు. అడఁకువ పరోపకారులకు సహజగుణము.

తరువు లతిరసఫలభార గురుతఁ గాంచు, । నింగి వ్రేలుచు నమృత మొసంగు మేఘుఁ,
డుద్ధతులు గారు బుధులు సమృద్ధిచేత, । జగతి నుపకర్తలకు నిది సహజగుణము.

వ్యా.—అథ సౌజన్యస్య పరోపకార ఫలకత్వా త్తన్నిరూపణానన్తరం పరోప కారపద్ధతిం వర్ణయతి - భవన్తీతి.-తరవః పనసరసాలాదివృక్షాః, ఫలోద్గమైః ఫలభారైః, నమ్రాః అవనతాః, భవన్తి, ఘనా మేఘాః, నవామ్బుభి ర్నూతనోదకై రుపలక్షితా స్సన్తః, దూరవిలమ్బిన స్సర్వత్ర ప్రవర్షణార్థ మన్తరీక్షసంచారిణో భవన్తి, సత్పురుషా స్సమృద్ధిభి రుపలక్షితా అపి, అనుద్ధతా అనుచ్ఛ్రితా భవన్తి - తీక్ష్ణస్వభావా న భవన్తీ త్యర్థః - 'అనర్థితా' ఇతి పాఠే - అయాచితా భవన్తి - యాఞ్చాం వి నైవ పరహిత మాచరన్తీ త్యర్థః, తథా ఏష ఉక్తనిజనమ్రత్వాదివ్యవహారః, పరోపకారిణాం పరహితాచరణతత్ప రాణాం, స్వభావో నిసర్గసిద్ధ ఏవ న త్వాహార్యక ఇత్యర్థః; మహాన్తో హి పరోపకారార్థ క్లేశం క్లేశత్వేన న గణయన్తి - తేషాం తస్య స్వాభావ్యా దితి భావః; త దుక్తం-

'పరోపకారాయ ఫలన్తి వృక్షాః, పరోపకారాయ వహన్తి నద్యః,
పరోపకారాయ చరన్తి గావః, పరోపకారార్థ మిదం శరీరమ్.' - ఇతి.

అర్థాన్తరన్యాసోఽలంకారః. వంశస్థవృత్తమ్ - 'జతౌ తు వంశస్థ ముదీరితం జరౌ.'

---

అవ.—దయావంతుల ముఖ్యాలంకారములు.

శ్రోత్రం శ్రుతే నైవ న కుణ్డలేన, దానేన పాణి ర్న తు కఙ్కణేన,
విభాతి కాయః కరుణాపరాణాం, పరోపకారేణ న చన్దనేన. 62.

టీక.—కరుణాపరాణాం = దయాసక్తులకు, శ్రోత్రం = చెవి, శ్రుతేన ఏవ = (శాస్త్రములు) వినికిచేత నే, విభాతి = ప్రకాశించును, కుణ్డలేన తు = కుండలము(ల)చేత నన్ననో, న = కాదు; పాణిః = చేయి, దానేన = ఇచ్చుటచేత, (విభా...), కఙ్కణేన తు న = కడియముచేత నన్ననో కాదు. కాయః = దేహము, పర ఉపకారేణ = ఇతరులకు ఉపకారముచేత, (విభా...), చన్దనేన న = గంధముచేత కాదు.

తా.—చెవులకు శాస్త్రశ్రవణము ఆభరణము గాని పోగులు గావు, చేతికి ఈవి యాభరణము గాని కడియము గాదు, దేహమునకు పరోపకారము ఆభరణము గాని, చందనము గాదు.

తే. అమరుఁ జెవి శాస్త్రమునఁ, గుండలమునఁ గాదు;
వలయమున నొప్పు, దీవిచే వెలయుఁ బాణి;
యురుదయాధ్యుల మేను పరోపకార
కలన రాణించు, గందంబువలనఁ గాదు.

వ్యా.—అథైషాం ముఖ్యమణ్డనసంపత్తి మాహ - శ్రోత్ర మితి.—కరుణా పరాణాం దయాళూనాం - పరోపకారిణా మిత్యర్థః, శ్రోత్రం కర్ణః - ని. 'కర్ణశబ్ద గ్రహౌ శ్రోత్ర మి' త్యమరః, శ్రుతేన ధర్మశాస్త్రశ్రవణే నైవ, విభాతి ప్రకాశతే, కుణ్డ



లేన సువర్ణమణిమయకర్ణభూషణేన, న తు విభాతి; పాణి ర్హస్తః, దానేన సత్పాత్ర త్యాగేన, విభాతి, కఙ్కణేన కనకవలయేన న తు విభాతి; కాయో దేహః, పరోపకా రేణ పరేషాం హితాచరణేన, విభాతి, కస్తూరీ ఘనసార విమిశ్రిత పటీరపఙ్కలేపేన తు న విభాతి; మహాత్మనాం శ్రవణాదిక మేవ స్వాభావిక మణ్డనం న త్వన్యత్, తస్య నశ్వరత్వా దితిభావః. వృత్త ముపజాతిః.

---

పద్మాకరం దినకరో వికచం కరోతి,
చన్ద్రో వికాసయతి కైరవచక్రవాలమ్,
నాభ్యర్థితో జలధరోఽపి జలం దదాతి;
సన్తః స్వయం పరహితే విహితాభియోగాః. 63.

టీక.—దినకరః = సూర్యుఁడు, న అభ్యర్థితః అపి = యాచింపఁబడకయే, పద్మా కరం = తామరకొలనిని, వికచం = విరిసినదానినిగా, కరోతి = చేయును; చన్ద్రః = చంద్రుఁడు, (న అభ్య...), కైరవచక్రవాలం - కైరవ = తెల్లగలువలయొక్క - చక్ర వాలం = సమూహమును, వికాసయతి = వికసిల్లఁజేయును; జలధరః = మేఘుఁడు, (న అభ్య...), జలం = నీటిని, దదాతి = ఇచ్చును; సన్తః = సత్పురుషులు, స్వయ మ్ = తమంతట తామే (ఒకరు తమ్ము యాచింపకయే యనుట), పర హితే = ఇతరుల మేలుకై, విహిత అభియోగాః = చేయఁబడిన ( = వహింపఁబడిన) పూనిక గలవారు.

తా.—తమ్ము వికసిల్లఁ జేయు మని సూర్యుని తామరలు యాచింపవు, అతఁడే వానిని వికాస మొందించును; చంద్రుఁడును కలువలను వానివేఁడికోలు లేకయే వికసిలఁ జేయును; లోకుల ప్రార్థన లేకయే మేఘుఁడు వర్షించును. ఇట్లే సత్పురుషులు ఇతరుల ప్రార్థన లేకయే వారికి హితము చేయుచుందురు.

తే. ద్యుమణి పద్మాకరము వికచముగఁ జేయుఁ, । గుముదషండంబు గావించు నమృతసూతి,
యర్థితుఁడు గాక జల మిచ్చు నంబుధరుఁడు, । సజ్జనులు దారె పరహితాచరణమతులు.

వ్యా.—య దుక్త 'మనర్థితా స్సత్పురుషా' ఇత్యాది త దేవ ప్రపఞ్చయతి - పద్మాకర మితి.—దినం దివసం కరోతీతి దినకర స్సూర్యః* 'కృఞో హేతు' త్యాదినా టప్రత్యయః, అభ్యర్థితో న భవతీతి నాభ్యర్థితః - అయాచిత స్సన్నిత్యర్థః * నఞ్ శబ్దస్య సుప్సు పేతి సమాసః, పద్మాకరం పద్మవనం, వికచం వికసితం, కరోతి - ని. 'ప్రఫు ల్లోత్ఫుల్లసంఫుల్ల వ్యాకోచ వికచ స్ఫుటాః - ఫుల్లశ్చైతే వికసితే' ఇ త్యమరః, తథా చన్ద్రోఽపి, కైరవచక్రవాళం కుముదషణ్డం - ని. 'సితే కుముద కైరవే' ఇ త్యమరః, వికాసయతి వ్యాకోచయతి, తథా జలధరో వారివాహోఽపి * పచాద్యచ్, నాభ్య

స్థితస్సన్నేవ, జలం దదాతి ప్రవర్షతి, తథా హి, సన్తస్సత్పురుషాః, స్వయమయాచితా ఏ వేత్యర్థః, పరేషాం, హితే హితాచరణే, విహితాభియోగాః కృతాభినివేశాః - నత్వభిబోధితా ఇత్యర్థః; అతో యుక్త మేవం హితాచరణ మేతేషా మితి భావః.

సామాన్యేన విశేషసమర్థనరూపోఽర్థాన్తరన్యాసః - 'సామాన్యవిశేష కార్యకారణ భావాభ్యాం సద్వృత్తప్రకృత కార్యసమర్థన మర్థాన్తరన్యాస' ఇతి సర్వస్వ సూత్రమ్. వసన్తతిలకావృత్తమ్.

---

అవ.—ఉత్తమ మధ్య మాధముల నడవడులు.

ఏతే సత్పురుషాః పరార్థఘటకాః స్వార్థాన్ పరిత్యజ్య యే,
సామాన్యాస్తు పరార్థ ముద్యమభృతః స్వార్థావిరోధేన యే,
తేఽమీ మానుషరాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నన్తి యే,
యే తు ఘ్నన్తి నిరర్థకం పరహితం తే కే న జానీమహే. 64.

టీక.—యే = ఏజనులు, స్వార్థాన్ = తమప్రయోజనములను, పరిత్యజ్య = వదలి, పరార్థఘటకాః - పర = ఇతరులయొక్క - అర్థ = ప్రయోజనములను - ఘటకాః = సాధించువారో, ఏతే = వీరు, సత్పురుషాః = ఉత్తమజనులు; యే తు = ఎవరైన, స్వార్థావిరోధేన - స్వార్థ = తమప్రయోజనములకు - అవిరోధేన = భంగము లేకుండ - పరార్థమ్ = అన్యులకొఱకు, ఉద్యమ భృతః = పూనిక వహించువారో, (వారు), సామాన్యాః = సాధారణులు, (మధ్యము లనుట); యే = ఎవరైన, స్వార్థాయ = తమ ప్రయోజనముకొఱకు, పర హితం = ఇతరుల మేలును, నిఘ్నన్తి = చెఱుపుదురో, తే అమీ = ఆ వీరు, మానుష రాక్షసాః = మనుష్యులగు (మనుష్యరూపులగు) రాక్షసులు; యే తు = ఎవరైన, నిరర్థకం = నిష్ప్రయోజనముగా (తమకు కలుగు ప్రయోజనము ఏమియు లేకున్నను), పర హితం = ఇతరుల మేలును, ఘ్నన్తి = చెఱుపుదురో, తే = వారు, కే = ఎవరో - ఎట్టివారో, న జానీమహే = ఎఱుఁగము.

తా.—ఉత్తములు తమకార్యములను విడిచి పరులకార్యములను సాధింతురు. మధ్యములు తమకార్యములకు భంగము రానీకయే యితరులకార్యములను నెఱవేర్తురు. అధములు రాక్షసులవంటివారు, వారు తమ ప్రయోజనముకై యితరులమేలును చెఱుపుదురు. మఱి తమకు కేఫలమును లేకయే యితరులకార్యములను జెఱుచువారిని ఎవరని చెప్పఁదగునో తెలియకున్నది.

మ. తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్,
దమకార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్,



దమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్, వృథాస్వార్థభం
గము గావించెడువార లెవ్వరో యెఱుంగన్ శక్యమే యేరికిన్?

వ్యా.—అథ వ్యాపారతారతమ్యేన పురుషాణా ముత్తమాదిభేద మాహ - ఏత ఇతి.—యే పుమాంసః, స్వార్థాన్ స్వప్రయోజనాని - ని 'అర్థోఽభిధేయరై వస్తు ప్రయోజన నివృత్తిష్వి' త్యభిధానాత్, పరిత్యజ్య త్యక్త్వా, పరార్థఘటకాః పర ప్రయోజన సంఘటన శీలాః, ఏతే, సత్పురుషాః పురుషోత్తమాః, సత్త్వస్యై తే నైవాభివ్యక్తత్వా దితి భావః, యే తు స్వార్థస్యావిరోధే నావైషమ్యేణ - స్వార్థ నిర్వాహతత్పరత్వే నైవే త్యర్థః, పరార్థం పరప్రయోజన నిర్వాహార్థమ్, ఉద్యమభృత ఉద్యోగభాజః, తే సామాన్యాస్సాధారణా - మధ్యమపురుషా ఇత్యర్థః, యే తు, స్వార్థాయ స్వార్థనిష్పత్త్యర్థం, పరహితం, నిఘ్నన్తి నాశయన్తి, తేఽమీ, మానుష రాక్షసాః మానుష శబ్దవాచ్య రాక్షసాః - తథా క్రూరాచార తత్పరత్వా త్పురుషాధమా ఇత్యర్థః, యే తు నిరర్థకం నిష్ఫలం ప్రయోజననిష్పత్తి రాహిత్యే నాపీతి యావత్, పరహితం ఘ్నన్తి, తే పుమాంసః, కే వా కథంభూతా వా, న జానీమహే ఉక్త త్రివిధ పురుష విలక్షణత్వా త్తాన్ జ్ఞాతుం న శక్నుమ ఇత్యర్థః - అత ఏవ పరమనీచా ఇత్యర్థః; ఉక్తపక్షేషు యః శ్రేయాన్ తత్పక్షాశ్రయణం కర్తవ్య మాయుష్మతేతి భావః. శార్దూలవిక్రీడితమ్.

---

అవ.—సన్మిత్రలక్షణము.

పాపాన్నివారయతి, యోజయతే హితాయ,
గుహ్యం నిగూహతి, గుణాన్ ప్రకటీకరోతి,
ఆపద్గతం చ న జహాతి, దదాతి కాలే,
సన్మిత్రలక్షణ మిదం ప్రవదన్తి సన్తః. 65.

టీక.—(మంచిమిత్త్రుఁడు), పాపాత్ = పాపమునుండి, నివారయతి = తప్పించును, హితాయ = మేలుకై, యోజయతే = ప్రేరేచును, గుహ్యం = రహస్యమును, నిగూహతి = దాఁచును, గుణాన్ = (మంచి) గుణములను, ప్రకటీకరోతి = వెల్లడి చేయును, ఆపద్ గతం చ = ఇక్కట్టును పొందినవాని నైనను, న జహాతి = విడువఁడు, కాలే = (అవశ్యమయిన) సమయమునందు, దదాతి = ఇచ్చును. ఇదం = దీనిని (ఈచెప్పినదానిని), సన్తః = పెద్దలు, సన్మిత్రలక్షణం - సన్మిత్ర = మంచిచెలికానియొక్క - లక్షణం = స్వరూపమునుగా, ప్రవదన్తి = చెప్పుదురు.

తా.—మంచిమిత్త్రుఁడు పాపమును చేయనీయఁడు, మేలు కలిగించుపనులను చేయించును, మిత్త్రునిగుట్టును దాఁచును, సుగుణములను ప్రకటించును, ఇక్కట్టులోఁ

బడిన వానిని సయితము విడువఁడు, అవశ్య మయినప్పుడు మిత్త్రునికి ఇచ్చును. ఇదే మంచి మిత్త్రుని ధర్మ మని పెద్దలు చెప్పుదురు.

తే. అఘమువలన మరల్చు, హితార్థకలితుఁ
జేయు, గోప్యంబు దాఁచుఁ, బోషించు గుణము,
విడువఁ డాపన్ను, లేవడివేళ నిచ్చు,
మిత్త్రుఁ డీలక్షణంబుల మెలఁగుచుండు.

వ్యా.—అథ సన్మిత్త్రలక్షణ మాహ - పాపా దితి.—పాపా త్పాపాచరణా, న్నివారయతి నివర్తయతి - ధర్మోపదేశేన దుష్కర్మప్రవృత్తేః విరమయ తీ త్యర్థః. * 'జుగుప్సా విరా మే' త్యాదినా పఞ్చమీ, హితాయ యోజయతే సత్కర్మాచరణాయ ప్రవర్తయత ఇ త్యర్థః - య ద్వా శ్రేయస్సంగ్రహార్థం ప్రోత్సాహయ తీ త్యర్థః; గుహ్యం గోప్యం, నిగూహ త్యాచ్ఛాదయతి - న కుత్రాపి ప్రకటయ తీ త్యర్థః, గుణాన్ సౌశీల్యాదిసద్గుణాన్, ప్రకటీకరోతి ప్రఖ్యాపయతి - న తు నిగూహ తీ త్యర్థః, ఆపద్గత మతిసంకటస్థ, మపి, న జహాతి న త్యజతి - 'త న్మిత్ర మాపది సుఖే చ సమక్రియం య ది' త్యుక్తత్వా దితి భావః, కాలే వ్యసనాది సమయే, దదాతి వాఞ్ఛితం దిశతి, త దిదం పాపనివారణాదికం సర్వం, స న్త స్సత్పురుషా, స్స న్మిత్త్ర స్యైతత్ సుహృదః, లక్షణం స్వరూపం, ప్రవద న్తి. వస న్తతిలకావృ త్తమ్.

---

అవ.—స న్మిత్త్రులు క్షీరనీరన్యాయమున నుందురు.

క్షీరే ణాత్మగతోదకాయ హి గుణా దత్తాః పురా తేఽఖిలాః,
క్షీరోత్తాప మవేక్ష్య తేన పయసా స్వాత్మా కృశానౌ హుతః,
గన్తుం పావక మున్మన స్త దభవ ద్దృష్ట్వా తు మిత్త్రాపదం,
యుక్తం తేన జలేన శామ్యతి, సతాం మైత్త్రీ పున స్త్వీదృశీ. 66.

టీక.—క్షీరేణ = పాలచేత, ఆత్మ...కాయ - ఆత్మ = తమ్ము - గత = పొందిన (తమతోఁగలసియున్నయనుట, తమతోఁచెలిమిచేసిన అని ధ్వని)-ఉదకాయ = నీటికి పురా = ముందుగా, తే = ప్రసిద్ధములైన, అఖిలాః = సకలమైన, గుణాః = (తీయఁదనము, తెల్లఁదనము మొదలైన తమ) గుణములు, దత్తాః హి = ఇయ్యఁబడినవి గదా, క్షీర =పాలయొక్క-ఉత్తాపం = కాఁగుటను (దుఃఖమును అని ధ్వని), అవేక్ష్య=చూచి, తేన పయసా = ఆనీటిచేత, స్వాత్మా = తన శరీరము, కృశానౌ = అగ్నియందు, హుతః = వేల్వఁబడినది (ఆవిరి యాయె నని భావము - అగ్నిప్రవేశము చేసె నని ధ్వని), తత్ తు = ఆక్షీరమును, మిత్త్రాపదం = మిత్త్రము(అగునీటి)యొక్క (అవిరి యగుటయనెడి)



యాపదను, దృష్ట్వా = చూచి, పావకం = అగ్నిలో, గన్తుం = పడుటకు, ఉన్మనః = ఉద్యుక్తము, అభవత్ = ఆయెను, తేన జలేన = ఆ నీటితో, యుక్తం సత్ = కూడినదై, శామ్యతి = శమించుచున్నది (పొంగు తగ్గు నని భావము - దుఃఖము తీఱి ఆత్మహత్యాప్రయత్నము మానుకొను నని ధ్వని), సతాం = సాధువుల, మైత్త్రీ = చెలిమి, ఈదృశీ పునః = ఇటువంటిది సుమా.

తా.—పాలు తమతోఁగలసి చెలిమిచేసికొన్న నీటికి తీఁపు తెలుపు మొదలైన తమ గుణముల నన్నిటిని వెంటనే ఇచ్చినవి. పిదప ఆపా లగ్నిలో మిక్కిలి తపించుటను చూడనోర్లక నీరు తనకు నిప్పుపెట్టుకొని ఆవిరియై పోయెను. తమమీఁది ప్రేమచే నీరు తెచ్చుకొన్న యా యాపదం జూడనోర్లక పాలును అగ్నిప్రవేశమునకై పొంగినవి. ఇంతలో నీటిని తెచ్చి కూర్పగాఁ దుఃఖము తీఱి (ఆపొంగును, అనఁగా) ఆయాత్మహత్యాప్రయత్నమును మానినవి. మంచిస్నేహితులు ఇట్లే అన్యోన్యాపదలను ఓర్వరు.

ఉ. క్షీరము మున్ను నీటి కొసఁగెన్ స్వగుణంబులు దన్నుఁ జేరుటన్,
క్షీరము దప్త మౌట గని చిచ్చుటికెన్ వెతచే జలంబు, దు
ర్వారసుహృద్విపత్తిఁ గని వహ్నిఁ జొరం జనె దుగ్ధ, మంతలో
నీరముఁ గూడి శాంత మగు, నిల్చు మహాత్ములమైత్త్రి యీగతిన్.

వ్యా.—పున స్త దేవ క్షీరనీర దృష్టాన్తేన వర్ణయతి.—క్షీరే ణేతి.—క్షీరేణ కర్త్రా, ఆత్మానం - గత ముపగతం ప్రాప్తం - య దుదకం జలం - తస్మై స్వాత్మమిశ్రిత జలా యే త్యర్థః, పురా పూర్వం, తే ప్రసిద్ధాః, అఖిలా స్సమస్తా, శ్చ, గుణా నిజ మాధుర్యధావళ్యాది గుణా, దత్తా హి వితీర్ణాః ఖలు - స్వగుణప్రదానద్వారా మైత్త్రీ సంపాది తే త్యర్థః, అతః క్షీరోత్తాపం - క్షీరస్య శ్రపణార్థ మగ్నౌ నిక్షిప్తస్య దుగ్ధస్య - ఉత్తాపం సంతాప, మవేక్ష్య, తేన క్షీరమిశ్రితేన, పయసా ఉదకేన - ని. 'పయః క్షీరం పయోఽమ్బు చే' త్యమరః, స్వాత్మా స్వశరీరం, కృశానౌ వహ్నౌ, హుతః మిత్త్రసంతాపాసహనా త్సంశోషిత ఇ త్యర్థః, తత స్తత్ క్షీరం కర్తృ, మిత్త్రస్య జల, స్యాపదం సంశోషరూపాం విపత్తిం, దృష్ట్వా, పావకం వహ్నిం, గన్తు, మున్మనః ఉద్యుక్త, మభవత్ * 'ఉత్క ఉన్మనా' ఇ తి నిపాతనా త్సాధుః - జల సంశోషణే క్షీరాణాం బహి ర్నిర్గమనసంభవా దితి భావః, తదన న్తరం తేన జలేన, యు క్తం మిశ్రితం సత్, శామ్యతి ప్రశా న్తం భవతి * 'శమా మష్టానా మి' తి దీర్ఘః, తథా హి, సతాం మైత్త్రీ సౌహార్దం - మైత్త్రీ వ్యాఖ్యాతా, ఈదృశీ పునః పరస్పరవ్యసనాసహనశీలా ఖలు, అత ఏత ద్యుక్త మితి భావః.

అత్ర స్వభావసిద్ధస్య క్షీరనీరవ్యవహారస్య పరస్పరసంతాప దర్శనహేతుకత్వేం

నూత్ప్రేక్షణా త్క్రియానిమిత్త క్రియాస్వరూపోత్ప్రేక్షా, సా చోక్తార్థాన్తరన్యాసనిర్వ్యాజ్య థే త్యనయో ర్విజాతీయసంకరః. వృత్త ముక్తమ్.

---

ఇతః స్వపితి కేశవః, కుల మిత స్తదీయద్విషాం,
మిత శ్చ శరణార్థినాం శిఖరిణాం గణాః శేరతే,
ఇతోఽపి బడబానలః సహ సమస్తసంవర్తకై;
రహో వితత మూర్జితం భరసహం చ సిన్ధో ర్వపుః! 67.

టీక.—ఇతః = ఇచ్చట (ఒక్కెడ), కేశవః = విష్ణువు, స్వపితి = నిద్రించుచున్నాఁడు, ఇతః = ఇంకొక్కెడ, తదీయద్విషాం - తదీయ = తత్సంబంధులగు (అతనియొక్క) - ద్విషాం = (కాలకేయాది) శత్రువులయొక్క, కులం = సమూహము, (వసించుచున్నది), ఇతః, శరణ అర్థినాం = రక్షకునిఁ గోరినట్టి, శిఖరిణాం = కొండలయొక్క, గణా శ్చ = సమూహములును, శేరతే = నిద్రించుచున్నవి, ఇతః, సమస్త సంవర్తకైః సహ = సకలమైనప్రళయాగ్నులతోఁ గూడ, బడబానలః అపి = బడబాగ్నియును, (వసించుచున్నది), సిన్ధోః = సముద్రముయొక్క, వపుః = శరీరము, వితతం = విరివియైనదియు, ఊర్జితం = వర్ధిల్లునదియు, భర సహం చ = బరువును ఓర్చునదియును, అహో = ఆశ్చర్యము.

తా.—సముద్రము పలువిధముల ఆశ్చర్యకరముగా నున్నది. ఎట్లన ఒకప్రక్కను మహావిష్ణువు పవ్వళించుటయును, మఱియొక్క ప్రక్క ఆయనవలన భయమెఱుఁగక ఆయనకు దూరముగా తదీయద్వేషులయిన కాలకేయాదిరాక్షసుల సమూహములు కాఁపురముండుటకును తగినంత విరివిగానున్నది; ఒకయెడ ఇంద్రునివలననుండి తమ్ముం గాపాడుకొనుటకు వచ్చి చొచ్చినపర్వతముల గుంపులయొక్క బరువును మోచుచున్నది, మఱియొకయెడ ప్రళయాగ్నులతోడి బడమానలము చేరి నీటిని ఎంత పీల్చుచున్నను అంత వర్ధిల్లుచున్నది. అట్లే మహాత్ములు ఎంతెంతవారికో అనేకులకు ఆశ్రయభూతులుగా వర్తింతురు.

చ. ఒకయెడఁ బవ్వళించు హరి, యొక్కయెడన్ వసియించు రాక్షస
ప్రకరము, లొక్కచో నడఁగుఁ బర్వతసంఘము, లొక్కెడన్ వలా
హకములతోడ నుండు బడబాగ్నియు, విస్తృత మూర్జితంబునుం
బ్రకటభరక్షమం బగుచు భాసిలు నౌర సముద్ర మెంతయున్!

వ్యా.—అ థైతస్య మాహాత్మ్య మాహ - ఇత ఇతి - ఇతోఽస్మి న్ప్రదేశే, కేశవో విష్ణుః కుక్షిస్థాఖిలభువన ఇతి భావః, స్వపితి యోగానుసంధానేన నిద్రాతి * 'రుదాదిభ్య స్సార్వధాతుక' ఇ తీడాగమః, ఇతోఽస్మి న్ప్రదేశే, తస్య కేశవస్య ఇమే తదీయాః



* త్యదాదివృద్ధా చ్ఛః - యే ద్విషో హిరణ్యాక్ష రావణాదయ స్తేషాం, కులం సమూహ స్తిష్ఠ తీతి శేషః, ఇత స్తతోఽన్యస్మి న్ప్రదేశేఽపి, శరణార్థినో రక్షణాభిలాషిణః- ని. 'శరణం గృహరక్షిత్రో రి' త్యభిధానాత్, తేషాం శిఖరిణాం మైనాకాదిపర్వతానాం గణా శ్చ, శేరతే స్వపన్తి * 'శీఙో రుట్' ఇతి రుడాగమః, ఇత స్తస్మా దప్యన్యస్మి న్ప్రదేశే, సమస్తా యే సంవర్తకాః ప్రళయకాలప్రవర్షి మేఘవిశేషాః - అత ఏవ పుష్కలావర్తకసంజ్ఞయా చ వ్యవహ్రియన్తే - తై స్సహ, బడబానలోఽపి వసతి - తస్మాత్, సిన్ధో స్సముద్రస్య, వపు శ్శరీరం, వితతం కేశవాధారత్వేన విస్తృతం, ఊర్జితం బడబానలాశ్రయత్వేఽప్యతివర్ధిష్ణు, భరసహం పర్వతభరణేన భారోద్వహనక్షమం చ, అహో అప్రమేయానుభావత్వే నాత్యన్తాశ్చర్య మి త్యర్థః.

అత్ర లక్షయోజనపరిచ్ఛిన్నస్య సముద్ర స్యాపరిచ్ఛిన్న కేశవా ద్యాధారత్వకథనా దధికప్రభేదోఽలంకారః - 'ఆధారాధేయయో రానురూప్యాభావోఽధికో మత' ఇతి లక్షణాత్. పృథ్వీవృత్తమ్.

---

జాతః కూర్మః స ఏకః పృథుభువనభరా యార్పితం యేన పృష్ఠం,
శ్లాఘ్యం జన్మ ధ్రువస్య భ్రమతి నియమితం యత్ర తేజస్విచక్రమ్,
సంజాతవ్యర్థపక్షాః పరహితకరణే నోపరిష్టా న్నచాధో
బ్రహ్మాణ్డోదుమ్బరాన్త ర్మశకవ దపరే జన్తవో జాతనష్టాః. 68.

టీక.—యేన = ఎవనిచేత, పృథు... రాయ - పృథు = గొప్ప - భువన = లోకముల - భరాయ = బరువునకు, పృష్ఠమ్ = వీఁపు, అర్పితం = ఒగ్గఁబడినదో, సః కూర్మః ఏకః = ఆ తాఁబేలు ఒకటియే, జాతః = పుట్టినది (సార్థకజన్మము గలది), యత్ర = ఎవనిచుట్టు, తేజస్వి చక్రం - తేజస్వి = వెలుఁగుగలవానియొక్క (నక్షత్ర తారాగ్రహములయొక్క) - చక్రం = మండలము, నియమితం సత్ = ఏర్పఱుపఁబడినదై, భ్రమతి = సుడియుచున్నదో, (ఆ), ధ్రువస్య = ధ్రువునియొక్క, జన్మ = జన్మము, శ్లాఘ్యమ్ = పొగడఁదగినది, అపరే జన్తవః = కడమ ప్రాణులు, పర హిత కరణే = పరులకు మేలు చేయుటయందు, సం...పక్షాః - సంజాత = పుట్టి - వ్యర్థ = నిష్ప్రయోజన మయిన - పక్షాః = పక్షముగలవారు (పుట్టి వ్యర్థులయిన వారిలో చేరినవారు), ఉపరిష్టాత్ న = (ధ్రువునికి) మీఁదను లేరు, అధ శ్చ న = (కూర్మమునకు) క్రిందను లేరు, (మఱి), బ్రహ్మ... న్తః - ఉదుమ్బర = మేఁడిపండువంటి - బ్రహ్మాణ్డ = బ్రహ్మాండముయొక్క = అన్తః = లోపల, మశక వత్ = దోమల వలె, జాత నష్టాః = పుట్టి కిట్టినవారు.

తా.—ఎల్లలోకములను వీఁపుపై మోచుచున్నాఁడు గావున కూర్మరాజు ఒకఁడు

పార్థకజన్ముఁడు; తనచుట్టును అమర్పఁబడియున్న తారాగ్రహసప్తర్షిమండలములు లోనగు తేజోమూర్తుల చక్రమును యథానియమముగా త్రిప్పుచున్నాఁడు గావున ధ్రువుఁడును శ్లాఘనీయజన్ముఁడు. కావుననే వీ రిద్దఱే బ్రహ్మాండమునకు కట్టకడలందు ఉన్నారు. పరహితము చేయనేరక వ్యర్థజన్ములయిన కడమ ముక్కుడులు బ్రహ్మాండమునకు పైకిఁగాని క్రిందికిఁగాని పోనేరక దాని కడుపులోనే మేఁడిపండుపొట్టలో దోమలు ఎట్లో అట్లు పుట్టుచుఁ గిట్టుచు ఉన్నారు.

చ. వితతజగద్భరంబు దన వీఁపునఁ దాల్చినకూర్మనాథుఁడుఁ
సతతము చంద్రభాస్కరుల చక్రముఁ ద్రిప్పుధ్రువుండు సజ్జనుల్;
ప్రతిభ నజాండ జంతుఫల రంధ్ర వస న్మశకంబులట్ల నిం
దితవిఫలార్థసంగతి జనించి నశించుఁ దదన్యజంతువుల్.

వ్యా.—అథ పరహితాచరణపరకాష్ఠయా ద్వయో రేవ జన్మ సఫలం నత్వన్యేషామి త్యాహ - జాతఇతి.—కిం బహునా, అవతారే ష్వ పీ త్యధ్యాహార్యమ్,—ఏకః కేవల, స్స కూర్మః ఆదికూర్మావతార ఏవ, జాతః జన్మలాభవా ని త్యర్థః, కుతః యేన కూర్మేణ, పృథు ర్మహాణ్ - యో భువనభర శ్చతుర్దశ విష్టపభార - స్తస్మై తద్వహనార్థ మి త్యర్థః - పృథు విపుల మితి పృథక్పదం వా, పృష్ఠం నిజకర్పరతల, మర్పితం దత్తం - నిరన్తర మధః ప్రదేశే స్థిత్వా దుర్భరభువనభారేణ జనితః క్లేశ స్సోఢ ఇ త్యర్థః, తథా, ధ్రువ స్యౌత్తానపాదే, ర్జన్మ, శ్లాఘ్యం సకలలోకప్రశస్తం, కుతః, యత్ర యస్మిణ్ ధ్రువే, తేజస్వినామ్ గ్రహనక్షత్రాదీనాం - చక్రం శింశుమారాఖ్యం గ్రహనక్షత్రమణ్డలం వా, నియమితం నియుక్తం స, ద్భ్రమతి పర్యావర్తతే - తత్రభవా న్భగవదను గ్రహవశా త్సకలలోకోన్నత మేరుశిఖర శిఖామణి ర్ధ్రువః స్వాయత్తత్వేన తేజస్విచక్రం ప్రవర్తయ తీతి శ్రీవిష్ణుపురాణ భాగవతాది కథా౽నుసంధేయా; తతః కి మత ఆహ— పర హిత కరణే పరోపకారాచరణే విషయే, వ్యర్థో నిరర్థః అప్రయోజక ఇలియావత్ - యః పక్షః - సంజాతో యేషాం తే సంజాతవ్యర్థపక్షాః - న తు సంజాతపరహితకరణ సమర్థపక్షా ఇ త్యర్థః * సాపేక్షత్వే౽పి గమకత్వా త్సమాసః, అపరే ఉక్తాభ్యామన్యే, జన్తవః ప్రాణినః - నైచ్యోద్భావనార్థకో౽యం జన్తుశబ్దప్రయోగః, ఉపరిష్టా న్న ధ్రువవ దుపరిభాగే వర్తమానా న భవ న్తీ త్యర్థః, అథ శ్చ న కూర్మవ దధస్తా ద్వా వర్తమానా న భవ న్తీ త్యర్థః, కిం తు ఉదుమ్బరః జన్తుఫలాఖ్య వృక్షవిశేషః - తస్య ఫల ముదుమ్బరం - ని. 'ఉదుమ్బరో జన్తుఫలో యజ్ఞాఙ్గో హేమదుగ్ధక' ఇ త్యమరః * 'ఫలే లు గి' తి లుక్ - బ్రహ్మాణ్డ ముదుమ్బరం త స్యా న్తః అన్తరాళే - అవ్యయ మేతత్, యే మశకా స్తై స్తుల్యం తద్వత్ *! తేన తుల్యం క్రియా చే ద్వతి రి' తి వతి ప్రత్యయః, జాతా ఉత్పన్నా శ్చ తే నష్టా శ్చ జాతనష్టా భవ న్తీతి



శేషః * స్నాతానులిప్తవ త్పూర్వకాలసమాసః; యతో న తైః కి మపి సాధిత-మతో మశకవ న్నిష్ఫలజన్మభిః కి మన్యై రితి భావః.

రూపకోపమయో స్సంకరః. స్రగ్ధరావృత్తమ్.

---

అవ.—సచ్చేష్టితము.

తృష్ణాం ఛిన్ధి, భజ క్షమాం, జహి మదం, పాపే రతిం మా కృథాః,
సత్యం బ్రూ, హ్యనుయాహి సాధుపదవీం, సేవస్వ విద్వజ్జనం,
మాన్యాణ్ మానయ, విద్విషో౽ప్యనునయ, ప్రఖ్యాపయ ప్రశ్రయం,
కీర్తిం పాలయ, దుఃఖితే కురు దయా, మేతత్ సతాం చేష్టితమ్.

టీక.—తృష్ణాం=ఆశను, ఛిన్ధి=కోయుము; క్షమాం=ఓర్పును, భజ=వహింపుము; మదం = గర్వమును, జహి = అణంపుము ; పాపే = పాపమునందు, రతిం = ప్రీతిని, మాకృథాః = చేయకుము (వహింపకుము) ; సత్యం = నిజమును, బ్రూహి = వచింపుము; సాధు పదవీం = పెద్దల మార్గమును, అను యాహి = అను సరింపుము; విద్వత్ జనం = పండిత సమూహమును, సేవస్వ = శుశ్రూషింపుము; మాన్యాణ్ = పూజ్యులను, మానయ = గౌరవింపుము ; విద్విషః అపి = శత్రువుల నైనను - అనునయ = ఉపలాలింపుము; ప్రశ్రయం = అడఁకువను, ప్రఖ్యాపయ = ప్రకటింపుము (చూపు మనుట); కీర్తిం పాలయ =కీర్తిని కాపాడుకొనుము ; దుఃఖితే = దుఃఖముగలవారియందు (జాత్యేక వచనము), దయాం కురు = కనికరము దాల్పుము, ఏతత్ = ఇది (ఈ చెప్పినది), సతాం = సజ్జనులయొక్క, చేష్టితమ్ = నడవడి.

తా.—ఆసను త్రుంచుట, ఓర్పు దాల్చుట, గర్వమును అణఁచుకొనుట, పాపము రోయుట, నిజమాడుట, పెద్దలప్రకారము ననుసరించుట, పండితులను శుశ్రూషించుట, పూజ్యులను గౌరవించుట, పగఱను సయితము ఉపలాలించుట, వినయము చూపుట, కీర్తిని కాపాడుకొనుట, దుఃఖములపాలయినవారిని కనికరించుట,—ఇది సజ్జనులనడవడి.

శా. ఆశాసంహరణంబు నోర్మియు మదత్యాగంబు దుర్దోషవాం
ఛానూన్యత్వము సత్యముఖ్ బుధమతాచారంబు సత్సేవయుఁ
వైశద్యంబును శత్రులాలనము మాన్యప్రీతియుం బ్రశ్రయ
శ్రీశాలిత్వము దీనులందు గృపయుఁ శిష్టాలికిణ్ ధర్మముల్.

వ్యా.—అథ విధేయలోకం సంబోధయం త్సదాచారం శిక్షయతి - తృష్ణామితి.—హే జ నే త్య. ధ్యాహార్యం సర్వ త్రాపి - మధ్యమపురుష ప్రయోగ సంభవాత్, అలభ్యేషు పరధనేషు లాభాభిలాష స్తృష్ణా - తాం ఛిన్ధి వైరాగ్య శస్త్రేణ విదా

రయ - అన్యథా అనేకాశాపాశనిబద్ధత్వేన క్లేశభాగిత్వం స్యా దితి భావః, పరిభవాది ష్వాత్మద్యమానేషు క్రోధ ప్రతిబన్ధః క్షమా - తాం - భజ సేవస్వ - అన్యథా ఉగ్రభావేన కార్యహాని స్స్యా దితి భావః, మదం విద్యాజనితదర్పం, జహి విజ్ఞానేన వినాశయ - అన్యథా వివేకశూన్యతయా అకార్య కరణప్రవృత్త్యా అనర్థప్రాప్తి స్స్యా దితి భావః, పాపే పాపకర్మాచరణే, రతిం ప్రీతిం, మాకృథాః అజ్ఞానేన మాకార్షీః- కిం తు 'ధర్మం చ రే'త్యాద్యుపదేశవచనేన సత్కర్మాచరణ ఏవ రతిం కుర్వి త్యర్థః- అన్యథా నిరయపాత స్స్యా దితి భావః * కరోతే ర్లుఙి థాసి 'న మాఙ్యో గ'ఇ త్యట్ ప్రతిషేధః, సత్యం సూనృతం, బ్రూహి 'సత్యం వ దే'తి వచనేన యథార్థ మేవ వచనం వ దే త్యర్థః- అన్యథా 'నానృతా త్పాతకం పర మి'తి న్యాయా దవివేకిత్వప్రసక్తి స్స్యా దితి భావః, సాధుపదవీం సన్మార్గం, మనుయాహి ధర్మశాస్త్రానురోధే నానుసర - అన్య థోత్పథ ప్రతిపన్నత్వే వచనీయతాది దోషాపత్తి స్స్యా దితి భావః, విద్వజ్జనమ్ ఉపదేశేన కృతార్థీకరణశీలం పణ్డిత మణ్డలం, సేవస్వ

'య స్తు పర్యటతే దేశాన్ య స్తు సేవేత పణ్డితాన్
తస్య విస్తారితా బుద్ధి స్తైలబిన్దురి వామ్భసి.'

ఇతి వచనా ద్బుద్ధివైశద్యార్థం శుశ్రూషస్వ - అన్యథా బుద్ధ్యవైశ ద్యాశిక్షితత్వాదవ్యభియోగ స్స్యా దితి భావః, మాన్యాన్ పూజ్యా న్మానయ యథార్హం పూజయ-అన్యథా

'సమాస మాభ్యాం విషమసమే పూజా'ఇతి గౌతమసూత్రాత్,
'అపూజ్యా యత్ర పూజ్యన్తే పూజ్యా శ్చా వావమానితాః,
అయశో మహ దాప్నోతి ధనా ద్ధర్మా చ్చ హీయతే.'

ఇత్యాది స్మరణా చ్చ కీర్తి సుకృత ధన హీయమానత్వ రూ పాశ్రేయఃప్రాప్తి స్స్యా దితి భావః, కిం బహునా, విద్విష శ్శత్రూ నపి కి ముతాన్యాన్, అనునయ - 'సమ శ్శత్రౌ చ మిత్త్రే చే'తి భగవద్వచనా త్ప్రసాదయ - అన్యథా రన్ధ్రేషు పాతయిష్య న్తీతి భావః, ప్రశ్రయం గుర్వాచార్యాదిషు నమ్రత్వం వినయ మితి యావత్, ప్రఖ్యాపయ 'గురౌ నమ్ర తే' త్యుక్తత్వా త్ప్రకటయ - అన్యథా దుర్వినీతత్వాపవాద ప్రసఙ్గ స్స్యా దితి భావః, కీర్తిం పాలయ జన్మసాఫల్యార్థం కీర్తినిర్వాహణే ప్రయత్నం కు ర్విత్యర్థః - అన్యథా 'క్షితితలే కిం జన్మ కీర్తిం వి నే'తి వచనా జ్జీవన్మృతత్వాపత్తి స్స్యా దితి భావః, దుఃఖితే సంజాతదుఃఖేషు భూతే ష్విత్యర్థః * తారకాదిత్వా దితచ్ - జాతా వేకవచనం, దయాం దుఃఖ ప్రహాణేచ్ఛాలక్షణాం, కురు 'దుఃఖిషు కరుణే'తి శాస్త్రానురోధా ద్విధేహి - అన్యథా చిత్తశు ద్ధ్యసంభవా దితి భావః, కుతః, ఏత త్సర్వం తృష్ణాచ్ఛేదాదికం, సతాం సజ్జనానాం చేష్టితం వ్యాపారః, యది సౌజన్య యశఃకామీ త దైవం ప్రవర్తస్వ - అన్యథా పురుషార్థలా భాసంభవా దితి భావః.

---



**అవ.—సత్పురుషులు అరుదు.**

మనసి వచసి కాయే పుణ్యపీయూషపూర్ణా
స్త్రిభువన ముపకారశ్రేణిభిః ప్రీణయన్తః
పరగుణపరమాణూన్ పర్వతీకృత్య నిత్యం
నిజహృది వికసన్తః సన్తి సన్తః కియన్తః. 70.

టీక.—మనసి=తలంపులోను, వచసి=మాటలోను, కాయే=చేష్టలోను, పుణ్య... పూర్ణాః - పుణ్య = పుణ్యమనెడి - పీయూష = అమృతముతో - పూర్ణాః = నిండినవారు, త్రిభువనం = మూడులోకములను, ఉపకార శ్రేణిభిః = ఉపకారముల వరుసల చేత, ప్రీణయన్తః = సంతోషపెట్టువారును, పర...అణూన్ - పర = ఇతరులయొక్క - గుణ పరమాణూన్ = మిక్కిలి చిన్నగుణములను, పర్వతీకృత్య = కొండలుగాచేసి, నిత్యం=ఎప్పుడును, నిజ హృది = తమ మనస్సులో, వికసన్తః = సంతోషించువారును, (అగు), సన్తః = పెద్దలు, కియన్తః = కొలదిమంది, సన్తి = కలరు.

తా.—తమయొక్క తలఁపులును, మాటలును, పనులును, అమృతము వంటిదైన పుణ్యముతో నిండియుండునట్లు వర్తించుచు, ముల్లోకములవారిని నిరంతరోపకారములతో సంతోషపెట్టుచు, పరమాణువులంత స్వల్పములగు నొరుల గుణములను కొండలంత గొప్పలనుగా భావించి తమ హృదయములందు సదా ఆనందించుచుండు సజ్జనులు అరుదు.

చ. హృదయవచశ్శరీరముల వెంతయుఁ బుణ్యసుధాప్రపూర్ణులై,
ముదము బహూపకారముల మూఁడుజగంబులకున్ ఘటించుచున్,
వదలక సాధు సద్గుణ లవంబులు గొండలు సేసి మెచ్చుచున్,
మదిని వికాసయుక్తు లగు మాన్యులు గొందఱె వొల్తు రిద్ధరన్.'

వ్యా.—ఈదృశా విరళా ఏ వేతి నిగమయతి - మన సీతి.— మనసి వచసి కాయే మనోవాక్కాయేషు, పుణ్య మేవ - పీయూష మమృతం - తేన పూర్ణాః - కరణత్రితయే నాపి సత్కర్మాచరణ తత్పరా ఇత్యర్థః * ని. 'పీయూష మమృతం సుధే' త్యమరః, త్రయాణాం భువనానాం సమాహార స్త్రిభువనం - లక్షణయా త్రిభువనస్థజనా నిత్యర్థః * 'తద్ధితార్థే'త్యాదినా సమాసః * పాత్రాదిత్వా న్న స్త్రీత్వమ్, ఉపకారశ్రేణిభి ర్హితాచరణపరమ్పరాభిః, ప్రీణయన్త స్సంతోషయన్తః * 'ప్రీఞ్ ప్రీణన' ఇతి ధాతోః శ్ర్యాదికా ణ్ణిచి శతృప్రత్యయః * 'ధూఞ్ ప్రీఞో ర్నుగ్వక్తవ్య' ఇతి నుగాగమః, పరేషాం గుణపరమాణూ నత్యల్పగుణా న పీ త్యర్థః - యతోఽణు ర్నాస్తి స పరమాణు రి త్యాహుః, పర్వతీకృత్య మహత్తరాన్ కృత్వా * అభూతతద్భావే చ్విః * 'ఊర్యాది చ్విడాచ శ్చే'తి గతి సంజ్ఞాయాం * 'కుగతిప్రాదయ' ఇతి సమాసః, నిత్యం

ఖ్యాపయన్తః నిరన్తరం ప్రశంసన్తః, తథా నిజహృది స్వాన్తః కరణ ఏవ, వికసన్తః సంతుష్యన్త, స్సన్తః సత్పురుషాః, కియన్తః కతిపయే విరళా ఏ వేత్యర్థః, సన్తి - న తు సాన్ద్రాః ఏతాదృశగుణసంపత్తే రసాధారణ్యా దితి భావః, నిజహృది వికసన్త స్సన్తి, సన్తః కియన్త ఇ త్యేవ పాఠః - తథాచోక్తం - సౌజన్యామృతసిన్ధవ ఇత్యాది. మాలినీవృత్తమ్.

ఇతి నీతిశతకవ్యాఖ్యానే పరోపకారవర్ణనం నామ సప్తమదశకమ్.

---

## ధైర్యపద్ధతిః.

---

రత్నైర్మహార్ధే స్తుతుషుర్న దేవా, । న భేజిరే భీమవిషేణ భీతిమ్,
సుధాం వినా న ప్రయయు ర్విరామం,। న నిశ్చితార్థాద్విరమన్తి ధీరాః.

టీక.—దేవాః = వేల్పులు, మహోర్ధేః = మహాసముద్రముయొక్క; రత్నైః = (కౌస్తుభము మొదలయిన) మణులచేత - లేక (ఐరావతము, ఉచ్చైశ్శ్రవము, కామధేనువు, మొదలయిన) తత్తజ్జాతి శ్రేష్ఠవస్తువులచేత, న తుతుషుః = తనియరైరి; భీమవిషేణ = భయంకరమైన (కాలకూట) విషముచేత, భీతిం = భయమును, న భేజిరే = పొందరైరి; సుధాం వినా = అమృతము లేక (అమృతమును పొందక), విరామం = (చిలుకుట) మానుటను, న ప్రయయుః = పొందరైరి - (అమృతము పుట్టువఱకు చిలుకుచునే యుండిరి), ధీరాః = దిట్టలు, నిశ్చిత అర్థాత్ = పూనుకొన్న ప్రయోజనమును, న విరమన్తి = మానుకొనరు.

తా.—అమృతముకై పాలసముద్రమును జిలుక దొరఁకొన్న దేవతలు మునుముందుగా అందు దొరకినరత్నములకు తనియలేదు, అందుండి వెడలిన కాలకూట విషయమునకు వెఱవలేదు; మఱి యమృతమును కనుఁగాంచి అనంతరము చిలుకుటను మానిరి. ధీరులు కోరిన ప్రయోజనము నెఱవేఱువఱకును యత్నమును మానరు.

తే. తనిసిరే వేల్పు లుదధి రత్నములచేత ? । వెఱచిరే ఘోరకాకోల విషముచేత ?
విడిచిరే యత్న మమృతంబు వొడము దనుక? । నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు.

వ్యా.—రత్నై రితి - దేవా అమరాః, మహోర్ధేః క్షీరార్ణవస్య సంబన్ధిభిః, రత్నైః కౌస్తుభాదిమణిభిః - ని. 'రత్నం శ్రేష్ఠే మణా వపీ'తి విశ్వః - యద్వా - రత్నైః - ని. 'జాతౌ జాతౌ చ య చ్ఛ్రేష్ఠం తద్రత్న మభిధీయత' ఇతి వచనాత్ - ఐరావతోచ్చైశ్శ్రవః కల్పవృక్షాది శ్రేష్ఠ జాతీయవస్తుభిః హేతుభిః, న తుతుషు స్తుష్టిం న ప్రాపుః - మథనసమయ ఇతి శేషః, తథా, బిభ్య త్యస్మా దితి భీమం * 'భీమాదయోఽపాదాన' ఇ త్యపాదానార్థే భియః మ్రుప్రత్యయ ఔణాదికః - తథాభూతం య



ద్విషం కాలకూటాఖ్యం - తేన హేతునా తస్మా ది త్యర్థః, భీతిం, న భేజిరే న ప్రాపు రితి ధైర్యాతిశయోక్తిః * విషే ణేత్యత్ర 'భీత్రార్థానాం భయహేతు రి' త్యపాదానే పఞ్చమ్యా భావ్యం - తథాఽపి హేతుత్వమాత్రవివక్షయాఽయం నిర్దేశ ఇతి మన్తవ్యం, కిం తు, సుధా మమృతం - వినా * 'పృథగ్వి నే' త్యాదినా ద్వితీయా, విరామ మవసానం, న ప్రయయుః మథనా దితి శేషః - సుధోత్పత్తిం వినా న విరతా ఇ త్యర్థః - అనేన శీలసంపత్తి రుక్తా, తథాహి - ధీరా మనస్వినః, నిశ్చితార్థా, న్న విరమన్తి విరామం న ప్రాప్నువన్తి - కిం త్వాఫలోదయం ప్రయతన్త ఏ వే త్యర్థః. అతో ధైర్యశీల సంపన్నానాం దేవానా మ పీదం యుక్త మే వేతి భావః * 'జుగుప్సా విరా మే' త్యాదినా పఞ్చమీ * 'వ్యాఙ్పరిభ్యో రమ' ఇతి పరస్మైపదమ్.

అర్థాన్తరన్యాసోఽలంకారః. వృత్త ముపజాతిః.

---

అవ.—ఉత్తమాదుల ధైర్యతారతమ్యము.

ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః,
ప్రారభ్య విఘ్నవిహతా విరమన్తి మధ్యాః,
విఘ్నైర్ముహుర్ముహు రపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధ ముత్తమగుణా న పరిత్యజన్తి. 72

టీక.—నీచైః = అధములు, విఘ్నభయేన = విఘ్నములవలని భయముచేత, న ప్రారభ్యతే ఖలు = ఆరంభింపనే ఆరంభింపరు; మధ్యాః = మధ్యములు, ప్రారభ్య = ఆరంభించి, విఘ్న నిహతాః సన్తః = విఘ్నములచే కొట్టఁబడినవారై, విరమన్తి = మానుదురు; ఉత్తమగుణాః = శ్రేష్ఠగుణములు గలవారు, విఘ్నైః = అంతరాయములచేత, ముహుర్ముహుః = మాటిమాటికి, ప్రతిహన్యమానాః అపి = కొట్టఁబడుచునే, ప్రారబ్ధం = తొడంగినదానిని, న పరిత్యజన్తి = వదలరు.

తా.—విఘ్నములు కలిగెడు నని యెన్నుకొనుచు అధములు ఆరంభమే చేయరు; మధ్యములు ఆరంభింతురుగాని విఘ్నము సోఁకినమాత్రాన వదలివేయుదురు. విఘ్నములు మాటిమాటికి తాఁకుచున్నను ఉత్తములు తొడంగినదానిని సాధింపక వదలరు.

శా. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై,
యారంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్,
ధీరుల్ విఘ్ననిహన్యమాను లగుచుఁ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.

వ్యా.—ఉక్త మే వార్థం నీచాదివృత్తికథనద్వారా ద్రఢయతి - ప్రారభ్యత

ఇతి.—నీచై రధమైః, విఘ్నేభ్యోఽన్తరాయేభ్యో - యద్భయం తేన హేతునా, న ప్రారభ్యతే ఖలు - నోపక్రమ్యతే కార్య మితి శేషః - ని. 'విఘ్నోఽన్తరాయః ప్రత్యూహ' ఇత్యమరః, మధ్యాః మధ్యమా స్తు, కార్యం ప్రారభ్యోపక్రమ్య, విఘ్నై - ర్విహతా విహ్వలీకృతా, స్సన్తో, విరమన్తి, విరతాభవన్తీత్యర్థః, ఉత్తమాః ఉత్కృష్టాః - గుణా ధైర్యశీలాదయో - యేషాం తే తథోక్తాః పురుషశ్రేష్ఠాస్తు, విఘ్నైః, ర్ముహుర్ముహుః పౌనఃపున్యేన, ప్రతిహన్యమానాః బమ్భజ్యమానా, అపి, ప్రారబ్ధ ముపక్రాన్తం కర్మ, న పరిత్యజన్తి; అతః కాలకూట బడబానలాది విఘ్నా ద్యుపహతత్వేఽపి ఉక్తగుణసంపన్నతయా దేవానాం సుధోత్పత్తిపర్యన్తం మథనం యుక్త మితి శ్లోకద్వయ స్యాపి తాత్పర్యమ్. అత్ర ప్రకరణే కుత్రచిద్ ధైర్యస్య కుత్రచి చ్ఛీలస్య కుత్రచి దుభయ స్యాపి ప్రాధాన్యనిర్దేశ ఇతి ద్రష్టవ్యమ్ - 'మనసో నిర్వికారత్వం ధైర్యం స త్స్వపి హేతుష్వి' త్యుక్తలక్షణం ధైర్యం - శీలం తు నియతకులోచితసత్స్వభావ ఇతి వివేకః - 'శీలం స్వభావే సద్వృత్తా' వి త్యభిధానాత్.     వసన్తతిలకావృత్తమ్.

---

అవ.—కార్యార్థి సుఖదుఃఖములను గణింపఁడు.

క్వచిత్ పృథ్వీశయ్యః, క్వచి దపి చ పర్యఙ్కశయనః,
క్వచి చ్ఛాకాహారః, క్వచి దపి చ శాల్యోదనరుచిః,
క్వచి త్కన్థాధారీ, క్వచి దపి చ దివ్యామ్బరధరో,
మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖమ్. 73

టీక.—క్వచిత్ = ఒకచోట - లేక - ఒకప్పుడు, పృథ్వీ శయ్యః = నేలయే సెజ్జగాఁ గలవాఁడును, క్వచిత్ చ, పర్యఙ్క శయనః అపి = మంచమున పవ్వళించుట కలవాఁడును, క్వచిత్, శాక ఆహారః = కూరగాయలే భోజనముగాఁ గలవాఁడును, క్వచిత్, శాల్యోదనరుచి రపి - శాలి ఓదన = వరియన్నమునందు - రుచిః అపి = రుచిగలవాఁడును (వరియన్నము తినువాఁడును), క్వచిత్, కన్థా ధారీ = బొంతను ధరించువాఁడును, క్వచిత్, దివ్యామ్బరధరోఽపి = శ్రేష్ఠమయిన వలువలను ధరించువాఁడును, (అగు), కార్యార్థీ = కార్యమునుగోరునట్టి, మనస్వీ = ధీరుఁడు, దుఃఖం చ = దుఃఖమును, న గణయతి = సరకుసేయఁడు, సుఖం చ = సుఖమును, న గణయతి.

తా.—ధీరుఁడు కార్యము సాధించునప్పుడు నడుమఁ గలుగు సుఖదుఃఖములను సరకుసేయఁడు ; —ఎట్లన —సమయోచితముగా నేలఁగాని మంచముమీఁదఁగాని పరుండును. కాయగసురు గాని వరిబియ్యపుటన్నమును గాని భుజించును, బొంత గాని మేలి వలువలు గాని ధరించును.



ఉ. ఒకచో నేలను బవ్వళించు, నొకచో నొప్పారుఁ బూసెజ్జపై,
నొకచో శాకము లారగించు, నొకచో నుత్కృష్టశాల్యోదనం,
బొకచోఁ బొంత ధరించు, నొక్కొకతఱిన్ యోగ్యాంబర శ్రేణి, లె
క్కకు రానీయఁడు కార్యసాధకుఁడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్.

వ్యా.—అథోక్తగుణసంపన్నస్య కృచ్ఛ్రాకృచ్ఛ్రయో ర్దుఃఖసుఖాపరిగణనయా కార్యసాధనత్వ మాహ - క్వచిదితి.—క్వచి త్కుత్రచి ద్దేశే కాలే వా, పృథ్వీ శయ్యా యస్య స తథోక్తః - కఠినతరస్థణ్డిలశయనోఽపీత్యర్థః, క్వచి చ్చ, పర్యఙ్కే - హంసతూలికాతల్పే - శయనం స్వాపో - యస్య స తథోక్తః - మృదులతరశయ్యోఽపీత్యర్థః - ని. 'శయనం మఞ్చపర్యఙ్కపల్యఙ్కాః ఖట్వయా సమాః' - 'స్యాన్నిద్రా శయనం స్వాప' ఇత్యుభయత్రాఽప్యమరః, క్వచి చ్ఛాక ఏవాహారో యస్య నీరసాహారోఽపీత్యర్థః, క్వచి చ్చ, శాల్యోదనే శాల్యన్నే - రుచిః స్వాదో యస్య స తథోక్తః - షడ్రసోపేత మృష్టాన్న భోజన సంతుష్టోఽపీత్యర్థః, క్వచి త్కన్థాం జీర్ణవస్త్రశకలనిర్మితాచ్ఛాదనం ధారయతీతి కన్థాధా ర్యపి, క్వచి చ్చ దివ్యామ్బరధరః కనత్కనకపీతామ్బరధరోఽపి, కార్యార్థీ కార్యనిష్పత్త్యభిలాషీ - అర్థః అభిలాషః - తద్వానర్థీతి విగ్రహః * 'కృద్వృత్తే స్తద్ధితవృత్తి ర్బలీయసీ' తి మహాభాష్యే, మనస్వీ మహామనాః ధీరః * ప్రశంసాయా మినిః, పృథ్వీశయ్యాదినా దుఃఖం చ న గణయతి, పర్యఙ్కశయనాదినా సుఖం చ న గణయతి, కింతు సుఖదుఃఖయో స్సమానావస్థ యైవ కార్యసాధనతత్పరో భవ తీ త్యర్థః.

---

అవ.—ధీరులు ఎప్పాటను న్యాయమార్గమును వదలరు.

నిన్దన్తు నీతినిపుణా, యది వా స్తువన్తు,
లక్ష్మీః సమావిశతు, గచ్ఛతు వా యథేష్టమ్,
అద్యైవ వా మరణ మస్తు, యుగాన్తరే వా,
న్యాయ్యాత్ పథః ప్రవిచలన్తి పదం న ధీరాః. 74

టీక.—నీతినిపుణాః = నీతియందు నేర్పరులైనవారు, నిన్దన్తు = దూషింతురుగాక, యదివా = ఒండె, స్తువన్తు = పొగడుదురుగాక, లక్ష్మీః = సిరి, సమావిశతు వా = పట్టునుగాక, యథేష్టం = ఇచ్చవచ్చినట్లు, గచ్ఛతు వా = పోవును గాక, మరణం = చావు, అద్య ఏవ వా = ఇప్పుడే కాని, యుగ అన్తరే వా = మఱియొక యుగమందుఁగాని, అస్తు = కలుగుఁగాక, ధీరాః = ప్రాజ్ఞులు, న్యాయ్యాత్ = న్యాయహీనముకాని, పథః = మార్గమునుండి, పదం = అడుగు (మాత్రము దూరమయినను), న ప్రవిచలన్తి = తొలఁగరు.

తా.—నీతిజ్ఞులు తప్పన్నను సరి యన్నను, సిరి వచ్చినను పోయినను, మరణ మిప్పుడే కలిగినను యుగాంతరమునఁ గలిగినను, ధీరులు సన్మార్గమును ఇంచుకేనియుఁ బాయరు.

శా. నీతిప్రౌఢవిహారులైన నిపుణుల్ నిందింపనీ మెచ్చనీ,
ఖ్యాతిం జెందినసంపదల్ నిలువనీ గాఢంబుగా పోగనీ,
ఘాతం బప్పుడ పొందనీ నియతిమైఁ గానీ యుగాంతంబునన్,
నీతిశ్లాఘ్యపదంబు దప్పరుగదా నిత్యంబు ధీరోత్తముల్.

వ్యా.—అథ ధీరాః లోకనిన్దా స్తుతి ప్రాప్తా అపి న్యాయమార్గా న్న భ్రశ్యన్తీత్యాహ - నిన్దన్త్వితి.—నీతినిపుణా నయవిశారదాః, నిన్దన్తు కథంచి ద్దూషయన్తు, వా ఇతి అథవా, స్తువన్తు భూషయన్తు వా, లక్ష్మీ స్సంపత్, సమావిశతు ప్రాప్నోతు, వా ఉత, యథేష్టం నిరర్గళం, గచ్ఛతు వా, అద్యైవ వేదానీ మేవ, మరణం నిధన, మస్తు వా, ఉత యుగాన్తరే కల్పాన్తరే వాఽస్తు, తథాఽపి, ధీరా ధైర్యశాలినః, న్యాయ్యా న్న్యాయ్యా దనపేతా, త్పథో మార్గాత్, పద మేకపాదవిన్యాసమాత్ర మపి, న ప్రవిచలన్తి న భ్రశ్యన్తి, తేషాం న్యాయమార్గాపరిత్యాగ ఏవ పరమార్థో - న నిన్దాస్తుత్యాదిరితి భావః.

---

అవ.—ధీరస్వరూపము, తన్మహిమయు.

కాన్తాకటాక్షవిశిఖా న ఖనన్తి యస్య
చిత్తం, న నిర్దహతి కోపకృశానుతాపః,
కర్షన్తి భూరివిషయా శ్చ న లోభపాశై
ర్లోకత్రయం జయతి కృత్స్న మిదం స ధీరః. 75.

టీక.—యస్య = ఎవనియొక్క, చిత్తం = మనస్సును, కాన్తా కటాక్ష విశిఖాః - కాన్తా = స్త్రీలయొక్క - కటాక్ష = కడగంటిచూపులనెడి - విశిఖాః = బాణములు - న ఖనన్తి = గాడవో, కోప...తాపః - కోప = క్రోధమనెడి - కృశాను = నిప్పుయొక్క - తాపః = వేఁడి, న నిర్దహతి = కాల్పదో, భూరి విషయాః చ = పెక్కులైన యింద్రియార్థములు ను, లోభ పాశైః = ఆశలనెడు త్రాళ్లచేత, న కర్షన్తి = లాగవో, సః ధీరః = ఆధీరుఁడు, కృత్స్నం = సర్వమైన, లోకత్రయం = మూఁడులోకములను, జయతి = గెలుచును.

తా.—కామ క్రోధములను పంచేంద్రియములను జయించినవాఁడు ధీరుఁడు. ఆతనికి ఎల్ల లోకములును వశ మగును.

ఉ. మానవతీకటాక్ష శితమార్గణముల్ విదలింపఁ జాలవె
వ్వానిమనంబు, కోపమయ వహ్ని దహింపదు, లోభపాశసం
తానము మాల్యచందన వితానములున్ వెత సేయ నోపక
వ్వానివశంబునన్ మెలఁగు, వాఁడు జయించు జగంబు లన్నియున్.



వ్యా.—నను కో ధీర స్స వా కిం సాధయతీ త్యాశఙ్క్యాహ - కాన్తేతి.—యస్య చిత్తం, కాన్తా కటాక్షాః -

'యద్గతాగతవిశ్రాన్తి వైచిత్ర్యేణ వివర్తనమ్
తారకాయాః కళాభిజ్ఞా స్తం కటాక్షం ప్రచక్షతే.'

ఇతి భావప్రకాశోక్తలక్షణలక్షితకామిన్యపాఙ్గాలోకనాని - త ఏవ విశిఖా బాణా, న ఖనన్తి న భిన్దన్తి న సమ్మోహయన్తీతి యావత్, తథా కోపకృశానుతాపః క్రోధాగ్నిసంతాప శ్చ, న నిర్దహతి న వ్యాకులయతి, తథా భూరయో బలవత్తరా - విషయాః శబ్దాదీన్ద్రియార్థా శ్చ, లోభః పరస్వాపహరణే ప్రయత్నః - ఏతేన కామాదయోఽ ప్యుపలక్ష్యన్తే - తథా చ - లోభా ఏవ పాశా రజ్జవ శ్చ-బన్ధనహేతుత్వా త్తేషాం పాశత్వారోపణం, న తఙ్షన్తి తృష్ణాయుక్తం న కుర్వన్తి - కర్ష న్తీతి పాఠే న స్వాయత్తీకుర్వన్తీ త్యర్థః, స ధీరః, కృత్స్న మశేషం, లోకత్రయం స్వర్గాదిలోకత్రితయ మపి, జయతాత్మాధీనం కరోతీ త్యర్థః, తస్య న కించి దప్యసాధ్య మి త్యర్థః.

---

అవ.—ధైర్యగుణమును మాన్పఁదరముగాదు.

కదర్థిత స్యాపి హి ధైర్యవృత్తే। ర్న శక్యతే ధైర్యగుణః ప్రమార్ష్టుమ్;
అధోముఖ స్యాపి కృతస్య వహ్నే। ర్నాధః శిఖా యాతి కదాచి దేవ.

టీక.—కదర్థిత స్యాపి = వంచితుఁ డయినను (నీచ స్థితియం దుంపఁబడినను), ధైర్య వృత్తేః = ధైర్యముతోడి వర్తనగల వానియొక్క, ధైర్య గుణః = ధైర్యమనెడి గుణము, ప్రమార్ష్టుం = తుడిచివైచుటకు, న శక్యతే హి = సాధ్యపడదు సుమా; (ఇందులకు దృష్టాంతము)—అధోముఖస్య = తలక్రిందు, కృత స్యాపి = చేయఁబడినవాఁడైనను, వహ్నేః = అగ్నియొక్క, శిఖా = జ్వాల, కదాచి దేవ = ఒకప్పుడు ను, అధః = (తల) క్రిందుగా, న యాతి = ప్రసరింపదు.

తా.—నిప్పును తలక్రిందు చేసినను దానిజ్వాల మీఁదికే ప్రసరించునట్లు ధీరుని నీచ పఱచినను వాని ధీరత కొఱవడక ప్రకాశించుచునే యుండును.

తే. నియతిచేతఁ గదర్థితుం డయిన ధైర్య। పరుని ధైర్యగుణంబు మాన్పంగఁ దరమె?
క్రింద సేయంగఁ బడినట్టి కృష్ణపథుని। కీల యెందైన మీఁదుగాఁ గెరలుఁ గాదె.

వ్యా.—ధైర్యగుణస్యక్కాఽరః కథంచి దపి న యుజ్యత ఇతి సదృష్టాన్త మాహ - కదర్థిత స్యేతి.—కుత్సితోఽర్థః కదర్థః * 'కోః క త్తత్పురుషేఽ చీ'తి కుశబ్దస్య కదాదేశః - కదర్థీకృతః కదర్థితః - తస్య నీచైః కృత స్యాపి సతః, ధైర్యేణ వృత్తి ర్వర్తనం

యస్య తస్య సంబన్ధి ధైర్య మేవ గుణః, ప్రమార్ష్టు మధః కర్తుం, న శక్యతే; తత్ర దృష్టాన్తః - అధోముఖస్య కృత స్యావాఙ్ముఖీకృత స్యాపి సతో, వహ్నేః, శిఖా జ్వాలా, కదాచి దేవ కదాచి ద, ప్యధో న యాతి - కింతూర్ధ్వ మేవ ప్రసర తీ త్యర్థః, తద్వద్ధీర స్యాపి ధైర్యగుణ ఇతి వివేకః. ఉపజాతివృత్తమ్.

---

అవ.—శీలభంగముకంటె మరణము మేలు.

వరం తుఙ్గా చ్ఛృఙ్గా ద్గురుశిఖరిణః క్వాపి విషమే
పతిత్వాఽయం కాయః కఠినదృషద న్తే విదలితః,
వరం న్యస్తో హ స్తః ఫణిపతిముఖే తీక్ష్ణదశనే,
వరం వహ్నౌ పాత, స్త దపి న కృతః శీలవిలయః. 77.

టీక.—అయం కాయః = ఈ ఒడలు, గురుశిఖరిణః = గొప్ప కొండయొక్క, తుఙ్గాత్ = ఎత్తయిన, శృఙ్గాత్ = శిఖరమునుండి, క్వ అపి = ఒకానొక, విషమే = చదునుగాని, కఠినదృషత్ అన్తే = గట్టి ఱాతి యంచున, పతిత్వా = పడి, విదలితః = చదిసినది (అగుట), వరం = కొంచెము మేలు; హస్తః = చేయి, తీక్ష్ణదశనే = వాఁడి కోఱలుగల, ఫణి పతి ముఖే = పాప ఱేని నోటను, న్యస్తః = పెట్టఁబడినది (అగుట యేని), వరమ్; వహ్నౌ = నిప్పులో, పాతః = పడుట, వరమ్; తత్ అపి = అటులైనను, శీల విలయః = మంచినడతయొక్క నాశము, కృతః = చేయఁబడినది (అగుట), న వరమ్ = కొంచెమైనను మంచిదికాదు.

తా.—ఎత్తయిన కొండ కొమ్మునుండి కర్కశ మయిన గట్టిఱాతిబండకొనంబడి చదిసియేని, పాప ఱేని నోట చేయి పెట్టి దాని వాఁడికోఱలకాటుచే విష మెక్కియేని, అగ్నిలో దుమికియేని, మడియుట యైనను కొంచెము మేలుగాని, మంచినడవడిని చెఱుపుకొనుట మాత్రము బొత్తిగా మేలుగాదు.

ఉ. ఉరుతరపర్వతాగ్రముననుండి దృషం బగుఱాతిమీఁద స
త్వరముగఁ ద్రెళ్లి కాయము హతంబుగఁ జేయుట మేలు, గాలిమే
పరిదొరవాతఁ గే లిడుట బాగు, హుతాశనమధ్యపాతముఁ
వర మగుఁ, జారుశీలగుణ వర్జన మర్హము గాదు చూడఁగన్.

వ్యా.—మరణో ప్యోగో వా వరం న తు శీలవిలయ ఇ త్యాహ - వర మితి.— అయం కాయో దేహః గురుశిఖరిణోఽ త్యున్నతపర్వతస్య శృఙ్గోత్సఙ్గా చ్ఛృఙ్గో పరిభాగా, త్క్వాపి కస్మింశ్చి, ద్విషమే వికటే, కఠినదృషద న్తే కర్కశపాషాణా న్తరాళే, పతిత్వా, విగళితః శకలిత శ్చే, ద్వరం మనాక్ప్రియం, తథా హ స్త, స్తీక్ష్ణదశనే విషాన



లోగ్రదంష్ట్రే, ఫణిపతేః - ముఖే వక్త్రే, న్యస్త శ్చే ద్వరం, తథా వహ్నౌ పాతోఽగ్నిప్రవేశోఽపి, వరం, కిం తు శీలవిలయ స్సత్స్వభావత్యాగః, కృత శ్చే త్త దపి వర మపి మనాక్ప్రియ మపి, న భవ తీ త్యర్థః, ప్రాణప్రయాసేఽపి శీలం న త్యాజ్య మితి తాత్పర్యం - 'దైవా ద్వృతే వరః శ్రేష్ఠే త్రిషు క్లీబం మనాక్ప్రియ' ఇ త్యమరః.

---

అవ.—శీల ప్రభావము.

వహ్ని స్తస్య జలాయతే, జలనిధిః కుల్యాయతే, తత్క్షణా
న్మేరుః స్వల్పశిలాయతే, మృగపతిః సద్యః కురఙ్గాయతే,
వ్యాలో మాల్యగుణాయతే, విషరసః పీయూషవర్షాయతే,
య స్యాఙ్గేఽఖిలలోకవల్లభతమం శీలం సమున్మీలతి. 78.

టీక.—యస్య = ఎవనియొక్క, అఙ్గే = దేహమందు, అఖి...తమం - అఖిలలోక = సమస్త జనులకును - వల్లభతమం = మిక్కిలి ప్రియమయిన, శీలం = మంచినడవడి, సమున్మీలతి = ఉల్లసిల్లునో, తస్య = వానికి, వహ్నిః = అగ్ని, జలాయతే = నీటివలె నుండును, జలనిధిః = సముద్రము కుల్యాయతే = కాలువవలె నగును, తత్క్షణాత్ = ఆక్షణముననే, మేరుః = బంగారుకొండ, స్వల్పశిలాయతే = చిన్నఱాతివలె నగును, మృగపతిః = సింహము, సద్యః = అప్పుడే, కురఙ్గాయతే = జింకవలె నగును, వ్యాలః = పాము, మాల్యగుణాయతే = పూలసరమువలె నగును, విష రసః = విష ద్రవము, పీయూష వర్షాయతే = అమృతపు వానవలె నగును.

తా.—ఎల్లవారును మెచ్చుకొనునడవడి గలవానికి—నిప్పు చల్లఁబడును, సముద్రము దాఁట శక్యమగును, మేరు నెక్కయత్నము గానేరదు, సింహము నిర్బాధక మగును, పాము అలంకార మగును, విషము ప్రాణ మిచ్చును; అనఁగా బాధకము లెల్ల సాధకములగును.

చ. అతనికి వార్ధి కుల్య యగు, నగ్ని జలం బగు, మేరుశైల మం
చితశిలలీల నుండు, మద సింహము జింక తెఱంగుఁ దాల్చుఁ, గో
పితఫణి పూలదండ యగు, భీష్మవిషంబు సుధారసం బగుఁ,
క్షితి జనసమ్మతం బగుసుశీల మ దెవ్వనియందు శోభిలున్.

వ్యా.—న న్వేవం శీల స్యాత్యన్తావశ్యకత్వ ముక్తం, తద్భావే కో లాభ ఇ త్యాశఙ్కాయా మాహ వహ్ని రితి.—తస్య పుంసః, వహ్ని ర్దాహకోఽపీతి భావః, జలాయతే జల మివాచరతి - తద్వ చ్ఛీతలో భవ తీ త్యర్థః * 'కర్తుః క్య ఙ్సలోప శ్చే'తి క్యఙ్ * 'అకృత్సార్వధాతుకయో రి'తి దీర్ఘః - ఏవం సర్వత్ర యోజ్యం

జలనిధి ర్దుస్తరోఽపీతి భావః, కుల్యాయతే అల్పనదీ వాచరతి, తస్యేతి సర్వత్రాన్వయోఽవగన్తవ్యః, తత్క్షణా త్తస్మిన్నేవ క్షణే - న తు విలమ్బే నేత్యర్థః, మేరుః స్వల్పశిలాయతే అల్పదృషదివాచరతి, మృగపతి స్సింహః - హింస్రోఽపీతి భావః, సద్యః కురఙ్గాయతే హరిణ ఇవాచరతి, వ్యాళ స్సర్పః - విషరోషభీషణోఽపీతి భావః, మాల్యగుణాయతే పుష్పస్రగివాచరతి, విష మేవ - రసో ద్రవః ప్రాణప్రయాసహేతు రితి భావః, పీయూషవర్షాయతే అమృతవృష్టి రివాచరతి, కస్యేత్యాకాఙ్క్షాయా మాహ - యస్య పుంసోఽఙ్గేఽఖిలలోకానా మశేషజనానాం - వల్లభతర మత్యన్తమనోహరం, శీలం సత్స్వభావః, సమున్మీలతి సముల్లసతి, తస్యేతి సంబన్ధః, శీలసంపన్నస్య దుఃఖహేతవోఽపి సుఖహేతవ ఏవ భవన్తి, అయ మేవ పరమలాభ ఇతి భావః.

అత్ర క్యజర్థా దౌపమ్యప్రతీతే రుపమాభేదః-
'ఇవాదిలోపే ద్వివిధే ణముల్ క్యచి చ క్యఙి
తథా వాక్యే సమాసే చ సప్తధైషా ప్రకీర్తితా.' ఇతి
(ఏషా ఉపమేత్యర్థః.)

---

ఛిన్నోఽపి రోహతి తరుః, । క్షీణోఽప్యుపచీయతే పున శ్చన్ద్రః,
ఇతి విమృశన్త స్సన్తః, । సంతప్యన్తే న విప్లుతా లోకే. 79.

**టీక.**—తరుః = చెట్టు, ఛిన్నః అపి = నఱకఁబడియును, పునః = మరల, రోహతి = ఎదుగును, చన్ద్రః = చంద్రుఁడు, క్షీణః అపి = కృశించియును, పునః = మరల, ఉపచీయతే = పెరుఁగును, ఇతి = ఇట్లని, విమృశన్తః = తలపోయుచు, సన్తః = సత్పురుషులు, లోకే = లోకమునందు, విప్లుతాః సన్తః = కష్టమునొంది (నప్పుడు), న సంతప్యన్తే = దుఃఖింపరు.

**తా.**—శీలవంతులు తమకు కష్టములు సంభవించెనేని, కొట్టినచెట్టు మరల ఎదుగుటయు, క్షీణచంద్రుఁడు వెండియు నిండుకొనుటయుం, దలపోసికొని, తమకును అట్లే మరల నభివృద్ధి కలుగు నని యూహించి యూఱడిల్లుదురు.

గీ. ఖండితం బయ్యు భూజంబు వెండి మొలచు,
క్షీణుఁ డయ్యును నభివృద్ధిఁ జెందు సోముఁ,
డివ్విధమున విచారించి యొడ లుడిగిన
జనములకుఁ దాప మొందరు సాధుజనులు.

**వ్యా.**—అథైషాం కదాఽపి సంతాపో న ప్రవర్తత ఇత్యాహ - ఛిన్న ఇతి.— తరుః ఛిన్న స్సన్నపి, పునా, రోహ త్యుద్గచ్ఛతి, చన్ద్రః, క్షీణః కృష్ణపక్షే దినక్రమేణ



కృశ స్సన్నపి, పున, రుపచీయతే ప్రవర్ధతే, ఇత్యేవం, విమృశన్తో మన స్యనుసందధానా, స్సన్తః శీలసంపన్నా, లోకేషు బన్ధుజనేషు, విప్లుతేషు విహ్వలేషు సత్స్వపి, న సంతప్యన్తే, కింతు తరుచన్ద్రదృష్టాన్తే నాభివృద్ధి మాశంసన్త ఏవ సన్తీత్యర్థః. ఆర్యాభేదః.

---

ఐశ్వర్యస్య విభూషణం సుజనతా, శౌర్యస్య వాక్సంయమో
జ్ఞాన స్యోపశమః, శ్రుతస్య వినయో, విత్తస్య పాత్రే వ్యయః,
అక్రోధ స్తపసః, క్షమా ప్రభవితు, ర్ధర్మస్య నిర్వ్యాజతా,
సర్వేషా మపి సర్వకారణ మిదం శీలం పరం భూషణమ్. 80.

**టీక.**—ఐశ్వర్యస్య = దొరతనమునకు, సుజనతా = మంచితనము, విభూషణం = అలంకారము; శౌర్యస్య = పరాక్రమమునకు, వాక్ సంయమః = మాట నియమము (విభూ.); జ్ఞానస్య = తెలివికి, ఉపశమః = శాంతి, (విభూ.); శ్రుతస్య = శాస్త్రమునకు, వినయః = అడఁకువ, (విభూ.); విత్తస్య = ధనమునకు, పాత్రే = పాత్రమునందు, వ్యయః = వినియోగము, (విభూ.); తపసః = తపస్సునకు, అక్రోధః = కోపములేమి, (విభూ.); ప్రభవితుః = సమర్థునికి, క్షమా = ఓర్పు, (విభూ.); ధర్మస్య = పుణ్యకర్మాచరణమునకు, నిర్వ్యాజతా=దంభములేమి, (విభూ.); సర్వకారణమ్ = (ఈ చెప్పిన) సమస్తమునకు మూలమగు, ఇదం శీలం = ఈ మంచినడవడి, సర్వేషా మపి = అన్నిటికిని, పరం = మేలైన, భూషణమ్ = అలంకారము.

**తా.**—ఐశ్వర్యము మంచితనముచేతను, శౌర్యము పొగడుకొనమిచేతను, జ్ఞానము శాంతిచేతను, శాస్త్ర పాండిత్యము వినయముచేతను, ధనము సద్వినియోగముచేతను, తపము కోపింపమిచేతను, చెల్లుబడి సహనము చేతను, ధర్మము డంబము లేమిచేతను, శోభించును. వీని కన్నిటికి కారణమయిన శీలము వీని కన్నిటికిని శోభను తెచ్చును.

ఉ. జానుగ భూతికిం దొడవు సజ్జనభావము, శౌర్యలక్ష్మికిన్
మౌనము, నీతి విద్యకు, శమంబు సుబుద్ధికి, విత్తవృద్ధికిన్
దానము, దాల్మి శక్తికిని, ధర్మనిరూఢి కదంభవృత్తియుం,
బూనికతోడ సర్వగుణ భూషణ మెన్నఁగ శీలమే సుమీ.

**వ్యా.**—శీల మేవాశేషభూషణ మిత్యాహ - ఐశ్వర్య స్యేతి.—ఐశ్వర్యస్య స్వామ్యస్య, సుజనతా విభూషణం - న తు దౌర్జన్యం, శౌర్యస్య విక్రాన్తత్వస్య వాక్సంయమో వాఙ్నియమో, భూషణం న త్వసంబద్ధప్రలాపిత్వం, జ్ఞానస్య కర్తవ్యాకర్తవ్యవివేక స్యాత్మవిషయకస్య వా, ఉపశమో విషయోపరతిః, విభూషణం న తు లోలుపత్వం, శ్రుతస్య శాస్త్రస్య, వినయో విభూషణం - న తు గర్వోద్రిక్తతా,

విత్తస్య పాత్రే వ్యయః సత్పాత్రే ప్రతిపత్తిః, విభూషణం - న తు విటనటాదిషు, తపసశ్చాద్రాయణాదే రక్రోధః క్రోధరాహిత్యం * క్వచిత్ప్రసజ్యప్రతిషేధేఽపి నఞ్ సమాస ఇష్యతే, విభూషణం - న తు కోపశీలత్వం, ప్రభవితుః సమర్థస్య, క్షమా సహిష్ణుత్వం, భూషణం - న తూచ్చండతా, ధర్మస్య సత్పాత్రదానస్య, నిర్వ్యాజతా వ్యాజరాహిత్యం, విభూషణం - న తు ద్రవ్యనాశదుఃఖం, తథా సర్వకారణమ్ ఐశ్వర్యాది సమస్తనిదాన, మిదం పూర్వోపవర్ణిత మేవ శీలం, సర్వే షా మపి సర్వపుంసాం, పరం సౌజన్యాద్యపేక్షయాఽప్యుత్కృష్టం, భూషణ మలంకారః. అత స్సర్వథాఽపి శీల మేవాశ్రయణీయ మితి తాత్పర్యమ్.

ఇతి నీతిశతకవ్యాఖ్యానే ధైర్యశీలపద్ధతి వర్ణనం నామ అష్టమం దశకమ్.

---

## దైవపద్ధతిః.

---

అవ.—పురుషకారమునకన్న దైవమే బలీయము.

నేతా యస్య బృహస్పతిః, ప్రహరణం వజ్రం, సురాః సైనికాః,
స్వర్గో దుర్గ, మనుగ్రహః ఖలు హరే, రైరావణో వారణః,
ఇత్యాశ్చర్యబలాన్వితోఽపి బలభి ద్భగ్నః పరైః సంగరే,
త ద్వ్యక్తం నను దైవ మేవ శరణం ధిగ్ధిగ్ వృథా పౌరుషమ్. 81.

టీక.—యస్య = ఎవనికి, నేతా = నేర్పువాఁడు, బృహస్పతిః = సురగురువో, ప్రహరణం=ఆయుధము, వజ్రం = దంభోళియో, సైనికాః = బంట్లు, సురాః = వేల్పులో, దుర్గం = కోట, స్వర్గః = స్వర్గలోకమో, అనుగ్రహః = ప్రాపు, హరేః ఖలు = విష్ణువుదిగదా, వారణః = ఏనుఁగు, ఐరావణః = ఇరావణ(సముద్ర)మునొక్క కొడుకో, ఇతి = ఇట్లు, ఆశ్చర్యబలాన్వితోఽపి = అబ్బురమయిన శక్తితోఁ గూడినవాఁడయ్యును, సంగరే = పోరియందు, పరైః = శత్రువుచేత, భగ్నః = ఓర్వఁబడినాఁడు. తత్ = కావున, వ్యక్తం = స్పష్టముగా, దైవ మేవ = దైవ మే, శరణం నను = రక్షకము కదా, వృథా = వ్యర్థమగు, పౌరుషం = పురుషప్రయత్నము, ధిక్ ధిక్ = ఛీ ఛీ (నింద్యమనుట).

తా. ఇంద్రునికి మంత్రి బృహస్పతి, ఆయుధము వజ్రము, బంట్లు దేవతలు, దుర్గము స్వర్గము, అనుగ్రహించినవాఁడు విష్ణువు, గజము ఐరావతము, స్వయము బలాసురుని కూల్చినవాఁడు ; ఇట్లాశ్చర్యకరమైన శక్తిగల యింద్రుఁడు యుద్ధములో రాక్షసులకు



ఓడెను. కావున, దైవమే ప్రధాన మనుట స్పష్టము. ఛీ! ఛీ! దైవముముందఱ పౌరుషము వ్యర్థము.

చ. గురుఁడు గురుండు, వాలు శతకోటి, సుపర్వులు వాహినీపతుల్,
సురభవనంబు గోట, మధు సూదనుఁడుఙ్ సయిదోడు, దంతి ది
క్కరిపతి గాఁగ నొప్పుబలఘాతియు దాయల కోడె నాజిలో ;
శరణము దైవమే, పురుష శక్తి నిరర్థక మెన్నిభంగులన్.

వ్యా.—అథ ధైర్యశీలయో రపి దైవాయత్తత్వా త్తన్నిరూపణానన్తరం దైవపద్ధతిం నిరూపయతి - నే తేతి.—యస్య బలభిదః, నేతా శిక్షకః హితాహితోపదేశకర్తా, బృహతాం వాచాం పతి ర్బృహస్పతిః - న తు యఃకశ్చిత్ * 'తద్బృహతోః కరపత్యో శ్చోరదేవతయో స్సు ట్తలోప శ్చే'తి సుడాగమ తలోపౌ, ప్రహరణమ్ ఆయుధం ప్రహారసాధనం తు, వజ్రం వజ్రాయుధం - పర్వతపక్షచ్ఛేదనేఽప్యకుణ్ఠితమితి భావః - న తు యత్కించి దయోమయం, సైనికా స్సురాః - న తు దుర్బలలౌకికాః, దుర్గం గుప్తిస్థానం, స్వర్గః స్వర్గలోకః - న తు మృత్పాషాణాదినిర్మితమ్, అనుగ్రహః పరిపాలనతాత్పర్యం, హరేః ఖలు సకలలోకాధీశ్వరస్య విష్ణోః నను - తస్యావరజభావే నావతీర్ణత్వా దితి భావః - న తు క్షుద్రదేవతాయాః, వారణో గజః, ఐరావణః న తు యః కశ్చి త్కలభః, ఇత్యనేన ప్రకారేణ స బలభి దిన్ద్రః, ఆశ్చర్యబలాన్వితోఽసాధారణత్వా దద్భుతకరశక్తిసహితోఽపి, సంగరే రణే, పరై ర్దానవై, ర్భగ్నో విదారితః, త త్తస్మా త్కారణా, ద్వ్యక్తం స్ఫుటం యథా తథా, దైవ మేవ, శరణం రక్షకం, నను, పురుషస్య కర్మ పౌరుషం * 'హాయనాన్త యువాదిభ్యోఽణి'తి యువాదిత్వా దణ్ - ని. 'పౌరుషం పురుష స్యోక్తే భావే కర్మణి తేజసీ'తి విశ్వః - పౌరుషం పురుషకారం, ది గ్ధిక్ పౌనఃపున్యేన నిన్ద్య మిత్యర్థః, వృథా వ్యర్థ మప్రయోజకత్వా దితి భావః, ధిగ్ధిగితి * 'నిత్యవీప్సయో రి'త్యాభీక్ష్ణ్యే ద్విరుక్తిః, తద్యోగా త్పౌరుష మితి ద్వితీయా ; అతః పౌరుష స్యాకించిత్కరత్వ మేవాశ్రయణీయ మితి భావః.

ఉద్యోగినం పురుసింహ ముపైతి లక్ష్మీ,
ర్దైవం ప్రధాన మితి కాపురుషా వదన్తి,
దైవం నిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా,
యత్నే కృతే యది న సిధ్యతి కోఽత్ర దోషః ?
ఇత్యాదివచనస్య అయ మేవ దత్తజలాఞ్జలి రితి వేదితవ్యమ్.

అత్ర సాభిప్రాయవిశేషణత్వా త్పరికరాలంకారః - తదుక్తం - 'సాభిప్రాయవిశేషణం పరికర' ఇతి.

---

అవ.—వృద్ధిక్షయములకు దైవమే కారణము.

భగ్నాశస్య కరణ్డపిణ్డితతనో ర్మ్లానేన్ద్రియస్య క్షుధా
కృత్వాఽఽఖు ర్వివరం స్వయం నిపతితో నక్తం ముఖే భోగినః ;
తృప్త స్తత్పిశితేన సత్వర మసౌ తేనైవ యాతః పథా ;
స్వస్థా స్తిష్ఠత, దైవ మేవ హి పరం వృద్ధౌ క్షయే కారణమ్. 82.

టీక.—ఆఖుః = ఎలుక, నక్తం = రాత్రి, (పాముపెట్టెలోనికి), వివరం = బొక్కను, కృత్వా = చేసికొని, కరణ్డ పిణ్డిత తనోః = పెట్టెలో ముద్దసేయఁబడిన (చుట్టచుట్టుకొనియున్న) దేహముగలదై, భగ్న ఆశస్య = భంగమొందిన (తప్పించుకొను) కోరికగలదై, క్షుధా = ఆఁకటిచేత, మ్లాన ఇన్ద్రియస్య = వాడినయింద్రియములుగలదై, (ఉన్న), భోగినః = పాముయొక్క, ముఖే = నోట, స్వయ మేవ = తానే, నిపతితః = పడినది; అసౌ = ఇది (పాము), తత్ పిశితేన = దాని (ఎలుకయొక్క) మాంసముతో, తృప్తః సన్ = తనిసినదై, తేన పథా ఏవ = ఆ దారి నే - (ఆ బొక్కగుండనే), సత్వరం = త్వరగా, యాతః = (పాటి) పోయినది; స్వస్థాః తిష్ఠత = నెమ్మదిగా ఉండుఁడు, హి = ఏలనఁగా, వృద్ధౌ = మేలునకును, క్షయే = కీడునకును, దైవ మేవ = అదృష్టమే, పరం = ఉత్కృష్టమైన, కారణమ్ = నిమిత్తము.

తా.—ఒకరాత్రి యెలుక యొకటి తిండికై యొక పాము పెట్టెలోనికి బొక్కచేసికొని చొచ్చి పాము నోటఁ బడెను. పాముఅందు తగులుకొని యుండి వెలువడునాశ లేక చోటుచాలమిచే ఒడలెల్ల చుట్టచుట్టుకొని ఆఁకటికి ఇంద్రియములు సొమ్మసిల్లఁగా పడియున్నట్టిది ఆ యెలుకను తిని తనిసి ఆ బొక్కగుండ వెంటనే వెడలిపోయెను. ఈ వృత్తాంతమువలన వృద్ధిక్షయములకు దైవమే ఉత్కృష్టకారణ మని గ్రహించి జనులు తమకు కష్టములు వచ్చినప్పుడు నిశ్చింతగా నుండఁదగును.

ఉ. రాతిరి మూషకంబు వివరం బొనరించి కరండబద్ధమై
భీతిలి చిక్కి యాస చెడి పెద్దయు డస్సినపామువాత సం
పాతముఁ జెందె, దానిఁ దిని పాము దొలంగె బిలంబుత్రోవనే;
యేతటి హానివృద్ధులకు నెక్కటి దైవమ కారణం బగున్.

వ్యా.—అథ బద్ధమోక్షయో ర్హానివృద్ధ్యో శ్చాపి దైవ మేవ కారణ మి త్యాహ - భగ్నేతి.—ఆఖు ర్మూషకః కర్తా, నక్తం రాత్రౌ, వివరం బిలం, కరణ్డస్యే తి భావః, కృత్వా, భగ్నాశస్య భుగ్నత్వాద్భగ్నమనోరథస్య, కరణ్డే పిణ్డికాయాం-పిణ్డితా పుఞ్జీకృతా - తను ర్యస్య తథోక్తస్య - విహారప్రసారశూన్యతయాఽతికృచ్ఛ్రదశా మాపన్న స్యే త్యర్థః, క్షుధా బుభుక్షావ్యసనేన, మ్లానేన్ద్రియస్య వినష్టేన్ద్రియపాటవస్య, భోగినః సర్పస్య, ముఖే, స్వయ మేవ దైవవశా, న్నిపతితః, తతోఽసౌ



భోగీ, తత్పిశితేన మూషకమాంసేన, తృప్త స్సన్, తేనైవ పథా వివరేణ, సత్వరం శీఘ్రం, యాతః బహి ర్నిర్గత్య పలాయితః, హే జనా ఇతి శేషః, స్వస్థాః స్థిరచిత్తా స్సన్తః, తిష్ఠత, యతః వృద్ధౌ క్షయే చ దైవ మేవ, పర ముత్కృష్టం, కారణం, హి, న త్వన్య, దతో మూషకభోగిదృష్టాన్తేన స్వస్థై ర్భావ్యం, న తు వృథా పౌరుషై రితి భావః.

యథా కన్దుకపాతే నోత్పత త్యార్యః పత న్నపి,
తథా త్వనార్యః పతతి మృత్పిణ్డపతనం యథా. 83.

టీక.—ఆర్యః = సజ్జనుఁడు, పతన్ అపి = పడుచున్నను, కన్దుక పాతేన యథా = బంతి పాటుగా, ఉత్ పతతి = పైకి ఎగయును, తథా = అట్లే, అనార్యః తు = దుర్జనుఁడయిననో, పతన్ = పడుచు, మృత్ పిణ్డపతనం యథా తథా = మట్టిముద్దపాటు ఎట్లో అట్లు, పతతి = పడును.

తా.— సజ్జనుఁడు అధోదశలో పడెనా, క్రిందఁబడిన బంతి పైకి ఎగయునట్లు, మరల ఉన్నతదశకు వచ్చును; దుర్జనుఁడు గనుక అధోగతిలో పడెనా, మట్టిముద్ద పడినట్లే మరల మంచి దశకు రాలేక అట్లు పడియే యుండును.

క. కందుకము వోలె సుజనుఁడు । గ్రిందం బడి మగుడ మీఁదికి న్నెగయుఁ జుమీ,
మందుఁడు మృత్పిండమువలెఁ । గ్రిందం బడి యడఁగియుండుఁ గృపణత్వమునన్.

వ్యా.—అథ దైవాయతిక తదన్యయో రవస్థా మాహ - యథేతి.—ఆర్యో దైవాయతికః, పత న్నపి కుతశ్చి త్కారణా న్నీచై ర్భవ న్నపి, కన్దుకపాతేన దృష్టాన్తేన య, థోత్పత త్యుచ్ఛ్రియం ప్రాప్నోతి, తథా తద్వ దేవ అనార్యః మృత్పిణ్డపతనం యథా సాన్ద్రమృత్కపాల మివ 'ఇవ వ ద్వా యథాశబ్దా వి' తి దణ్డ్యాచార్యానుశాసనాత్, పతతి నిలీనో భవతీ త్యర్థః.

---

అవ.—భాగ్యహీనునికి నెక్కడను కష్టములే కలుగును.

ఖర్వాటో దివసేశ్వరస్య కిరణైః సంతాపితే మస్తకే
వాఞ్ఛన్ దేశ మనాతపం విధివశాత్ తాలస్య మూలం గతః,
తత్రా ప్యస్య మహాఫలేన పతతా భగ్నం సశబ్దం శిరః;
ప్రాయో గచ్ఛతి యత్ర దైవహతక స్తత్రైవ యా న్త్యాపదః. 84.

టీక.—ఖర్వాటః = బట్టతలవాఁడు, దివసేశ్వరస్య కిరణైః = సూర్యునివెలుఁగులచేత, మస్తకే = తల, సంతాపితే సతి = మిక్కిలి కాఁపఁబడఁగా, అనాతపం = ఎండలేనట్టి, దేశం = తావును, వాఞ్ఛన్ = కోరుచు, విధి వశాత్ = దైవ యోగమున, తాళస్య = తాటిచెట్టుయొక్క, మూలం = మొదటికి, గతః = పోయెను, తత్ర అపి =

అచ్చటను, పతతా = పడుచున్న, మహాఫలేన = పెద్ద పండుచేత, అస్య = వీనియొక్క, శిరః = తల, సశబ్దం = (బళ్లని) శబ్దసహితముగా, భగ్నం = పగుల్పఁబడినది; దైవ హతకః = దైవముచే కొట్టఁబడినవాఁడు, యత్ర గచ్ఛతి = ఎటకు పోవునో, తత్ర ఏవ = అటకే, ఆపదః = ఇడుమలు, ప్రాయః = తఱుచుగ, యాన్తి = పోవును.

భా.—'సశబ్దమ్'-అనుటచే కడమ బాటసారులు ఆశబ్దమును విని, వాని యవస్థం గని, ఎల్ల యెడలను వెల్లడించి రని భావము.

తా.—ఎండచే నెత్తి గాలిన బట్టతలవాఁ డొకఁడు నీడను గోరఁగా, వాని దౌర్భాగ్యముచే సమీపమున తాటిచెట్టు మాత్ర మొకటి యుండెను. వాఁడు పోయి దాని క్రింద నిలువఁగానే పెద్ద తాటిపం డొకటి తలమీఁదఁ బడెను; తల బళ్లని బ్రద్ద లాయెను. తఱుచుగా, అదృష్ట హీనుఁడు ఎట కేఁగినను అటకే కడగండ్లును తఱుముకొని పోవును.

మ. ధర ఖల్వాటుఁ డొకండు సూర్యకర సంతప్తప్రధానాంగుఁ డై
త్వరతోడన్ బరువెత్తి చేరి నిలిచెన్ దాళద్రుమచ్ఛాయఁ, ద
చ్ఛిరముం దత్ఫలపాతవేగమున విచ్చెన్ శబ్దయోగంబుగాఁ;
బోరి దైవోపహతుండు వోవుకడకుం బోవుం గదా యాపదల్.

వ్యా.—దైవోపహతస్య న కుత్రాపి సుఖప్రాప్తి రిత్యాహ - ఖర్వాట ఇతి.—ఖర్వాటః స్వభావలుప్తలోమశిరస్కః - ఆన్ధ్రభాషాయాం 'బట్టతలవాఁడు,' మస్తకే నిజశిరసి, దివసేశ్వరస్య సూర్యస్య, కిరణై స్సంతాపితే సతి, అనాతప మాతపశూన్యం దేశం ప్రతి, ద్రుతగతిః శీఘ్రగమనః, గచ్ఛన్, తాళస్య తాళవృక్షస్య, మూలం గతః తాళాధస్తా త్తిష్ఠతి, తత్ర తాళమూలేఽపి, పతతా వృన్తా ద్గళితా, మహాఫలేన పృథులతరఫలేన, అస్య ఖర్వాటస్య శిరః, స్వశిరశ్ఛేదేన పటపటాయమానేన సహితం, సశబ్దం యథా తథా, భగ్నం విదళితం; నను కుత ఏత దిత్యాశఙ్క్య దైవప్రాతికూల్యా దిత్యాహ - దైవహతకో దైవోపహతః దైవానుగ్రహశూన్య ఇత్యర్థః, యత్ర యస్మిన్ దేశే గచ్ఛతి-యం దేశ ముద్దిశ్య గచ్ఛతి, తత్ర త ముద్దిశ్యైవ, వాపద ఉపద్రవా అపి, ప్రాయో భూమ్నా, యాన్తి; త దేత న్మశకభయా ద్గ్రామం విహాయ గచ్ఛతోఽరణ్యే వ్యాఘ్రగ్రహణ మభూ దిత్యర్థః. శార్దూలవిక్రీడితమ్.

———

అవ.—దైవము బలీయ మనుట.

గజభుజఙ్గవిహఙ్గమబన్ధనం, శశిదివాకరయో ర్గ్రహపీడనమ్,
మతిమతాం చ విలోక్య దరిద్రతాం, విధి రహో బలవానితి మే మతిః.

టీక.—గజ భుజఙ్గ విహఙ్గమ బన్ధనం = ఏనుఁగులు పాములు పక్షులు - వీనికి కట్టును, శశి దివాకరయోః = చంద్ర సూర్యులకు, గ్రహ పీడనం = (రాహుకేతు) గ్రహముల పీడయు, మతి మతాం = బుద్ధిమంతులకు, దరిద్రతాం చ = పేదఱికమును, విలోక్య = చూడఁగా, అహో = ఔరా, విధిః = దైవము, బలవాన్ ఇతి = బలముగలది అని, మే మతిః = నాకు తలంపు.



తా.—ఏనుఁగులు పాములు పక్షులును కట్టువడుటయు, సూర్యచంద్రులు రాహుకేతువులబారిం బడుటయు, బుద్ధిశాలులకుఁ బేదఱికమును, జూడఁగా, ఔరా! పురుషకారముకంటె దైవమే బలీయ మని నాకుఁ దోఁచుచున్నది.

తే. ఫణులు గజములుఁ బక్షులుఁ బట్టువడుట, । రవి సుధాకరులకు నైన రాహుబాధ,
బుద్ధిమంతుల లేమియుఁ, బొసఁగఁ జూచి । విధి బలాఢ్యుఁ డటంచు భావింతు మదిని.

వ్యా.—అతో దైవ మేవ బలీయ ఇతి మమ మతిః ప్రవర్తత ఇత్యాహ - గజేతి.—అయం స్పష్టార్థః. యతోఽత్యన్త దుర్గ్రహాణాం గజాదీనాం బన్ధనం, జగత్ప్రకాశకయో స్సూర్యాచన్ద్రమసో రాహుగ్రహపీడనం, మతి మతాం ప్రాజ్ఞానాం, దరిద్రతా మకించనత్వం చ, విలోక్య దృష్ట్వాఽపి, అహో ఆశ్చర్యమ్; అత స్సర్వస్యాపి దైవబలీయ స్త్వం మన్యే, దైవ మేవ మూల మితి తాత్పర్యమ్. ద్రుత విలమ్బితమ్.

———

అవ.—గుణవంతులను అల్పాయువులనుగాఁ జేయుట బ్రహ్మయొక్క మూఢత్వము.

సృజతి తావ దశేషగుణాకరం, పురుషరత్న మలఙ్కరణం భువః,
తదపి తత్క్షణభఙ్గి కరోతి చే, దహహ కష్ట మపణ్డితతా విధేః! 86.

టీక.—(విధిః = బ్రహ్మ), తావత్ = మొదట, అశేష గుణ ఆకరం = సకల సద్గుణములకును గనియును, భువః = భూమికి, అలఙ్కరణం = భూషణమును, (అగు), పురుష రత్నం = పురుష శ్రేష్ఠుని, సృజతి తావత్ = సృజించును గదా; తత్ అపి = అట్లయినను (అట్లు సృజించియు), తత్ = ఆ పురుషశ్రేష్ఠుని, క్షణ భఙ్గి = నిమిసములో నశించువానినిగా, కరోతి చేత్ = చేయు నెడల, విధేః = బ్రహ్మయొక్క, అపణ్డితతా = తెలివిలేమి, అహహ = అయ్యో, కష్టమ్ = దుఃఖకరము.

తా.—బ్రహ్మ సకలసుగుణసంపన్నుఁగా జగదలంకారభూతుఁగా ఒకానొక పురుషశ్రేష్ఠుని సృజించును గదా. అది మంచిపనియే. అట్టివానిని అల్పాయువునుగాఁ జేయుచున్నాఁడే, బ్రహ్మయొక్క యీ మూఢత్వము ఎంతయు శోచనీయము.

క. గుణమణిఖని యగుపూరుష । మణి ధరణికి రవణముగ న మర్చిన విధి యా
గుణవంతుని వెసఁ దునిమిన । గుణహీనునిఁగాఁగ నెన్నుకొనరే ధాతన్.

వ్యా.—ఏవం చే ద్విధే ర ప్రజ్ఞతా స్యా దిత్యాశయే నాహ - సృజతీతి.—విధి, ర శేష గుణాకరం సకల సద్గుణాశ్రయం, భువోఽలంకరణం మణ్డనం, పురుషరత్నం పురుషశ్రేష్ఠం, సృజతి తావ న్నిర్మాతి ఖలు, తతః కి మత ఆహ - త దపి తథాఽపి

సృజన్నపీత్యర్థః, తత్పురుషరత్నం క్షణభఙ్గి క్షణమాత్రేణ భఙ్గురం నశ్వర మిత్యర్థః, కరోతి చేత్, విధే, రపణ్డితతా మౌఢ్య, మహహ కష్ట మతి కృచ్ఛ్ర మితి విషాదాతిశయాభిద్యోతక మహ హేతి; కరోతి చే త్తత్పాణ్డిత్య మే వే త్యర్థః, తథా తాదృశపురుషరత్నస్య క్షణభఙ్గిత్వే నైవ నిర్మాణా త్తు అపణ్డిత ఏవ విధి రితి పరమ రహస్యమ్. ద్రుత విలమ్బితమ్.

---

అవ.—ఎంతవానికైనను విధి యలంఘ్యము.

అయ మమృతనిధానం, నాయకోఽప్యోషధీనాం,
శతభిషగనుయాతః, శమ్భుమూర్ధ్నోఽవతంసః;
విరహయతి న చైనం రాజయక్ష్మా శశాఙ్కం;
హతవిధిపరిపాకః కేన వా లఙ్ఘనీయః! 87.

టీ.—అయమ్ = ఇతఁడు (చంద్రుఁడు), అమృత నిధానం = అమృతపుఁ బాఁతఱ, ఓషధీనాం = (మందు) మొలకలకు, నాయకః అపి = దొర యయును, శతభిషక్ అనుయాతః - శత = నూఱులకు (నూఱులకొలది రోగులకు) - భిషక్ = వైద్యులయిన యశ్వులచే - అనుయాతః = వెంబడింపఁబడినవాఁడు (శతభిషఙ్నక్షత్రముచే ననుసరింపఁబడినవాఁడు అనివాస్తవార్థము), శంభు మూర్ధ్నః = శివుని శిరమునకు, అవతంసః = శేఖరమును; కించ = అయినను, ఏనం శశాఙ్కం = ఈ చంద్రుని, రాజయక్ష్మా = క్షయ రోగము, న విరహయతి = వదలదు. హత...పాకః - హత విధి = పాడు దైవము యొక్క - పరిపాకః = పరిణామము, కేన వా లఙ్ఘనీయః = ఎవ్వనికి దాఁటశక్యము.

తా.—చంద్రుఁడు అమృతనిధానము, సర్వరోగపరిహారకము లగు మూలికల కెల్ల రాజు, శతభిషగనుసృతుఁడు, ఇదియునుగాక శివునికి సిగపువ్వుగా నున్నాఁడు. ఇట్టి యీ చంద్రుని క్షయరోగము వదలకున్నది. దీనిం బట్టి చూడఁగా పాడుదైవము యొక్క చెయిదమును ఎంతటివారును తప్పించుకోనేర రని తెల్ల మగుచున్నది.

చ. శతభిషగాఢ్యుఁడుఁ సతత శంభువతంసము నయ్యు, నోషధీ
తతులకు నాథుఁ డయ్యును, సుధారససేవధి యయ్యుఁ, దారకా
పతి దనరాజయక్ష్మభవ బాధలఁ బాపఁగ నోపఁ డక్కటా!
హతవిధికృత్య మెవ్వనికి నైన జగంబున దాఁటవచ్చునే!

వ్యా.—కథంచి దపి దైవయోగో న లఙ్ఘ్య ఇ త్యాహ - అయ మితి.—అయం పరిదృశ్యమాన శ్చన్ద్రః, అమృతస్య, నిధానం స్థాన మితి, ఓషధీనాం సంజీవిన్యాదీనాం, నాయకో నేతాఽపి, శతభిషజా నక్షత్రేణ - శతేన భిషగ్భి ర్వైద్యై - శ్చానుయాతో ఽనుసృతోఽపి, కిం బహునా శమ్భో స్సకలలోకక్షేమఙ్కరస్య శంకరస్య, మూర్ధ్న



ఽవతంస శ్శిరోభూషణ, మ ప్యేవ ముక్తవిశేషణవిశిష్టం శశాఙ్కం, రాజయక్ష్మా క్షయ రోగో, న విరహయతి న త్యజతి ఖలు, అతో హతవిధే ర్నష్టదైవస్య - పరిపాకో నియోగః, కేన వా పుంసా, లఙ్ఘనీయో న కే నాఽపీ త్యర్థః; హ తేతి నిర్వేదానుసంధానార్థకః, రాజయ క్ష్మే త్యత్ర రాజ్ఞ శ్చన్ద్రస్య యక్ష్మా - రాజా చాసౌ య క్ష్మేతి వా విగ్రహః, య థాహ బాహటః-

'అనేకరోగానుగతో బహురోగపురోగమః
రాజయక్ష్మా క్షయోఽశేష రోగరా డితి చ స్మృతః.' ఇతి.

---

అవ.—ఆపదలు దైవాధీనము లనుట.

ప్రియసఖ, విపద్దణ్డా ఘాత ప్రపాత పరమ్పరా
పరిచయ బలే చిన్తాచక్రే నిధాయ విధిః ఖలః
మృదమివ బలాత్ పిణ్డీకృత్య ప్రగల్భకులాలవ
ద్భ్రమయతి మనో; నో జానీమః కి మత్ర విధాస్యతి. ౮౮.

టీక.—ప్రియసఖ = నెచ్చెలీ, ఖలః = దుష్టమైన, విధిః = దైవము, ప్రగల్భ కులాలవత్ = నేర్పరియైన కుమ్మరివలె, మనః = (నా) మనస్సును, మృదమ్ ఇవ = మట్టిని బోలె, బలాత్ = బలముతో, పిణ్డీ కృత్య = ముద్ద చేసి, విపత్...బలే - విపత్ = ఆపదలనెడి - దణ్డ = కఱ్ఱలయొక్క - ఆఘాత = ఘట్టనయొక్క - ప్రపాత = పాటుల యొక్క - పరమ్పరా = వరుసయొక్క - పరిచయ = సాంగత్యమును - అనెడు - బలే = బలము గలదైన - చిన్తాచక్రే = చింతయనెడి సారెయందు, నిధాయ = ఉంచి, భ్రమయతి = త్రిప్పుచున్నది, అత్ర = ఇందు (ఈత్రిప్పుటయందు), కిం విధాస్యతి = ఏమి చేయునో, నో జానీమః = ఎఱుఁగము.

తా.—నేర్పరియగు కుమ్మరి మట్టిని బలముతో ముద్దచేసి కఱ్ఱలతో ఘట్టించి సారె మీఁద ఉంచి గిరగిర త్రిప్పునట్లుగానే పాడువిధి నామనస్సును ఆపదల పరంపరచే బలిమి మెయి అవశముం జేసి చింతలో ఉంచి త్రిప్పుటవెట్టుచున్నది. ఇఁక నేమి చేయునో తెలియకున్నది. - ఇందు కవి— విధి, మనస్సు, ఆపదలు, అవశత కలిగించుట, చింత, చపలత - అనువానిని వరుసగా - కుమ్మరి, మట్టి, దండ ఘట్టనములు, ముద్దచేయుట, సారె, గిరగిర త్రిప్పుట - అనువానితోఁ బోల్చినాఁడు.

చ. కలిత విపత్తి దండ పద ఘట్టన సేయుచు మన్నుకైవడిఁ
ఖలుఁడు విధాత పిండితము గా నొనరించి నితాంతచింత యఁ
బలితపుసారెపై నిలిపి పాయక డెందము ద్రిప్పుచున్నవాఁ
డలమి కులాలురీతిఁ దెలియంగలవార మె యేమి సేయునో.

వ్యా.—మనోనియన్తాఽప్యయ మేవేతి సఖాయం సంబోధయతి - ప్రియఇతి.— ప్రియ శ్చాసౌ సఖా చ ప్రియసఖః - తస్య సంబుద్ధిః - హే ప్రియసఖ * 'రాజాహస్సఖిభ్య ష్టచ్', ఖల శ్శఠోఽయం విధిః, ప్రగల్భకులాలేన తుల్యం ప్రగల్భకులాలవత్ ప్రౌఢకుమ్భకార ఇ వేత్యర్థః * 'తేన తుల్యం క్రియా చే ద్వతి రి' తి వతిః, మనో మదీయచిత్తం, మృదం మృత్తికా, మివ, బలా త్సామర్థ్యా, త్పిణ్డీకృత్య కపాలీకృత్య, విపదః ఆపదః - దణ్డాఘాతాః ముద్గరఘట్టనా నీవ - తేషాం - ప్రపాతానాం చ - యా పరమ్పరా పౌనఃపున్యే నావృత్తిః - తస్యాః యః పరిచయ స్సం స్తరో నిబిడావయవపరస్పరసన్నివేశ శ్చ స ఏవ - బలం దార్ఢ్యం యస్య తస్మిన్, చిన్తా చక్ర మివ తస్మి, న్నిధాయ భ్రమయతి, అత్ర భ్రమణే, కిం విధాస్యతి కిం కరిష్యతి వా, నో జానీమః, కులాల స్తు ఘటం కరిష్య త్యయం తు కిం విధాస్యతి న జానీమ ఇ త్యర్థః.

———

అవ.—గొప్పవారికి ఎప్పుడును ధైర్యము పోదు.

విరమ విర మాయాసా దస్మా ద్దురధ్యవసాయతో,
విపది మహతాం ధైర్యధ్వంసం య దీక్షితు మీహసే;
అయి జడ విధే, కల్పాపాయేఽప్యపేతనిజక్రమాః
కులశిఖరిణః క్షుద్రా నైతే న వా జలరాశయః. 98.

టీక.—అయి జడ విధే=ఓ మూఢ దైవమా, విపది = ఆపదయందు, మహతాం= గొప్పవారియొక్క, ధైర్య ధ్వంసం = ధైర్య నాశమును, ఈక్షితుం = చూచుటకు, ఈహసే = కోరదవు, ఇతి యత్ = అనునది ఏదో, ఆయాసాత్ = శ్రమమైన, అస్మాత్ దురధ్యవసాయతః = ఈ చెడుపూనికను, విరమ విరమ = మానుము మానుము ; ఏతే కులశిఖరిణః జలరాశయో వా = కులపర్వతములు (గాని) సముద్రములు గాని, కల్పఅపాయే అపి= కల్పాంతమునందును, అపేత నిజ క్రమాః= తప్పిన తమ మర్యాదలుకల, క్షుద్రాః = ముక్కడులు, న = కావు.

తా.—ఓదైవమా, నీవు మహాత్ముల ధైర్యనాశమును పరీక్షింపఁగోరి వారిక ఇడుమ లిడుచున్నావు. ఎంత తెలివిమాలినవాఁడవు! ఈపూనికవలన నీకు కష్టమే గాని ఫలము లేదు సుమా. కులగిరులును సముద్రములును,ప్రళయములో నైనను ధైర్య మెడలి మేగ మీఱు ముక్కడులు కావు.

చ. దొసఁగులు వచ్చువేళ గుణధుర్యులధైర్యగుణంబు సర్వముం
బస చెడు నంచుఁ జూచెదవు పాపపుదైవము, యీదురాగ్రహ



వ్యసనము మాను మాను, ప్రళయంబున వీతనిజక్రమంబు లై
పసి సెడ వించు కంతయును సాగరముల్ గులపర్వతంబులున్.

వ్యా.—ఏవ మాపత్పరమ్పరాచరణే మహద్ధైర్యధ్వంసో భవిష్య తీతి న మన్తవ్య మితి విధి మలక్షీకృ త్యోపాలభతే - విర మేతి.—అ యీతి ప్రశ్నే - ని. 'అయి ప్రశ్నానునయో రి' తి విశ్వః, జ డేతి మాన్ద్యే - విధే హే దై వేతి సంబోధనత్రయమ్, అస్మా, ద్దురధ్యవసాయతో దురాగ్రహా, ద్య ఆయాస స్తస్మా, ద్విరమ విరమ అభీక్ష్ణ్యేన విరతో భవ * 'నిత్య వీప్సయో రి' త్యాభీక్ష్ణ్యే ద్విరుక్తిః, కోఽ సా వాయాస ఇ త్యాశఙ్క్యాయా మాహ - విపది త్వత్కృతాపది, మహతాం మహాత్మనాం ధైర్యధ్వంసం ధీరత్వహ్రాస, మీక్షితు, మీహసే కాఙ్క్షసే, యత్ త్వ, మస్మా దాయాసా దితి సంబన్ధః, తస్యాత్యన్తాసంభావితత్వా త్త్వదాయాస స్యై వావశిష్టత్వా దితి భావః, కుతో వాఽసంభావితత్వ మి త్యాశఙ్క్య దృష్టాన్తముఖేన ద్రఢయతి-కల్పాపాయే కల్పాన్తేఽపి అతిసంకటేఽపి కి ము తాన్య దేతి భావః, అపేతాః వినష్టాః - నిజక్రమాః స్వమర్యాదాః - యేషాం తే తథోక్తా స్సన్తః, ఏతే కులశిఖరిణో మహేన్ద్రాదిస ప్తకులాచలా వా, జలరాశయ స్సప్త సముద్రా వా, క్షుద్రా నీచాః న ఖలు - కిం త్వత్యక్తమర్యాదా ఏవ వర్తన్తే, అతః దృష్టాన్తేన ధీరధైర్యధ్వంసన స్యాతిదుష్కరత్వా త్త్వదాయాస ఏ వావశిష్టో న తు ఫలలాభ ఇతి భావః -

'మహేన్ద్రో మలయ స్సహ్య స్సానుమా నృక్షపర్వతః
విన్ధ్య శ్చ పారియాత్ర శ్చ స ప్తైతే కులపర్వతాః.'
'లవ ణేక్షు సురా సర్పి ర్దధి క్షీర జ లార్ణవాః.' ఇతి.

———

అవ.—దైవమే శరణము.

దై వేన ప్రభుణా స్వయం జగతి య ద్యస్య ప్రమాణీకృతం
త త్త స్యోపనమే న్మనా గపి మహా న్నై వాశ్రయః కారణమ్ ;
సర్వాశాపరిపూరకే జలధరే వర్ష త్యపి ప్రత్యహం
సూక్ష్మా ఏవ పత న్తి చాతకముఖే ద్విత్రాః పయోబిన్దవః. 90.

టీక.—ప్రభుణా = సమర్థమయిన, దై వేన = విధిచేత, జగతి = లోకమునందు, యస్య = ఎవనికి, యత్ = ఏది, ప్రమాణీకృతం = నిర్ణయింపఁబడినదో, తత్ = అది, తస్య = వానికి, స్వయమ్ = తనంతటతాను, ఉపనమేత్ = దొరకును, మహాన్=గొప్ప, ఆశ్రయః = ప్రాపు, మనాక్ అపి = కొంచెమైనను, కారణం = నిమిత్తము, నైవ = కానేకాదు; (ఎట్లనఁగా); సర్వా...రకే - సర్వ=ఎల్లరయొక్క - ఆశా = కోరికలను - పరిపూరకే = తీర్చునట్టి - (సర్వ = ఎల్ల - ఆశా = దిక్కులను - పరిపూరకే = నిండించు

నట్టి, అని అర్థాంతరము), జలధరే = మేఘము, ప్రత్యహం = ప్రతిదినము, వర్షతి సత్యపి = వర్షించుచున్నను, చాతకస్య = వానకోయిలయొక్క, ముఖే = నోట, సూక్ష్మాః = చిన్నవి, ద్విత్రాః = రెండు మూఁడు, పయోబిన్దవః = నీటిబొట్లు, పతన్తి = పడును.

తా.—సమర్థము దైవము ఎవరి కేమి నిర్ణయించునో వారి కది కలుగును, ఎంత గొప్పవారి నాశ్రయించినను అంతకు హెచ్చు కలుగనే కలుగదు. ఎల్ల దిక్కుల నిండ నిత్యము గురియుచున్న మేఘుని ఆశ్రయించు వానకోయిల నోట వానచినుకులు రెండు మూఁడే గదా, అవియు చిన్నవే గదా, పడును.

తే. ఎవ్వనికి నిజ్జగంబున నెంతఫలము । దైవకృత మగు నది వొందు దప్ప కతనిఁ,
గారణముగాదు పెనుఁ బ్రాపు; ఘనునిఁ జేరు।చాతకమువాతఁ బడు నల్ప జలకణములు.

వ్యా.—తథాఽపి దైవ మేవ శరణ మి త్యాహ - దైవే నేతి.—ప్రభుణా సమర్థేన, దైవేన, జగతి లోకే, యస్య పుంసో, య ద్వస్తు, ప్రమాణీకృతం నిర్దిష్టం, త ద్వస్తు త స్యోపనమేత్ స్సంగచ్ఛేత, మహా నాశ్రయో, మనా గేవ దపి, నైవ కారణం న సాధనం హి - బహుఫలప్రాప్తా వితి శేషః, తత్ర దృష్టాన్తః - స ర్వాశా పరిపూరకే సకల లోక మనోరథ పరిపూరకే - సకలదిగన్త వ్యాప్త ఫలకే వా, జలధరే ఽమ్బువాహే * పచాద్యచ్, అహ న్యహని ప్రత్యహమ్ * 'అవ్యయం విభక్తీ' త్యాదినా ఽవ్యయీభావః - అహ్న శ్చ 'నపుంసకవ దన్యతరస్యా మి' తి సమాసాన్తః, వర్షతి స త్యపి, చాతకస్య స్తోకక పక్షిణో, ముఖే చఞ్చుపుటే, సూక్ష్మా అణవ ఏ వ, తథాఽపి ద్వౌవా త్రయో వా ద్విత్రా ఏవ * 'సంఖ్యయావ్యయాసన్నే' త్యాదినా బహువ్రీహిః * 'బహువ్రీహౌ సంఖ్యేయే డజబహుగణా ది' తి డచ్ ప్రత్యయః, పయో పయోబిన్దవో జలకణాః, పతన్తి - న త్వాశ్రయమహత్తయా బహుఫలలాభ, స్తత్రాపి దైవ స్యైవ నియన్తృత్వా దితి భావః - తస్మా త్సర్వథా దైవ మేవ శరణ మితి తాత్పర్యమ్ - ని. 'స్తోకక శ్చాతక స్సమా' ఇ త్యమరః.

ఇతి నీతిశతకవ్యాఖ్యానే దైవపద్ధతి ర్నామ నవమం దశకమ్.

## కర్మపద్ధతిః.

నమస్యామో దేవా, న్ననుహతవిధే స్తేఽపి వశగా,
విధి ర్వన్ద్యః, సోఽపి ప్రతినియతకర్మైకఫలదః,
ఫలం కర్మాయత్తం; కి మమరగణైః? కించ విధినా?
నమ స్తత్కర్మభ్యో, విధి రపి న యేభ్యః ప్రభవతి. 91.

టీక.—దేవాన్ = వేల్పులను, నమస్యామః = మ్రొక్కెదము, (కాని), తే అపి = వారు సయితము, హత విధేః = పాడు దైవమునకు, వశగాః నను = స్వాధీ



నులు సుమా, (కావున), విధిః = దైవము, వన్ద్యః = మ్రొక్కఁదగినది, (అవునుగాని), సః అపి = ఆదైవము కూడ, ప్రతి...లదః - ప్రతి నియత = నిర్ణయింపఁబడిన - కర్మ = కర్మముయొక్క - ఏక = ముఖ్యమయిన - ఫల = ఫలమును - దః = ఇచ్చునది, ఫలం = ఫలము, కర్మ ఆయత్తమ్ = కర్మమునకు అధీనము, (కావున), అమరగణైః కిం = దేవతా సమూహములతోఁ (బని) ఏమి, విధినా చ కిం = విధితోడను (బని) ఏమి, తత్ = కావున, యేభ్యః = ఏకర్మములపై, విధి రపి = దైవముకూడ, న ప్రభవతి = చాలదో - కర్మభ్యః = (ఆ) కర్మములకు, నమః = మ్రొక్కు.

తా.—వేల్పులకు మ్రొక్కుదము; వలదు, ఏలయన, వారు ఫలము నీయ స్వతంత్రులుగారు, మనవలెనే పాడువిధికి వశులు. అటయిన విధికి మ్రొక్కఁదగును; తగదు, ఏలయన, విధియు ఆ యాకర్మ కేర్పడిన ఫలము నిచ్చునేగాని స్వతంత్రముగా నీయఁజాలదు. మఱి ఫల మన్ననో కర్మాధీనము; కావున వేల్పులకు మ్రొక్కనేల? విధికి మ్రొక్కనేల? దేనిమీఁద విధికిసయితము ప్రభుత్వము లేదో దానికే అనఁగా కర్మకే మ్రొక్కుదము. మంచి ఫలముకై మంచిపనులు చేసికోవలసిన దని ఇందలి యుపదేశము.

చ. శిథిలత లేనిభక్తి నతి సేయుదు వేల్పుల, కాసుపర్వులున్
విధివశ వర్తు, లావిధియు విశ్రుతకర్మఫలప్రదాత, య
య్యధికఫలంబు కర్మవశ, మట్లగుటం బనియేమి వారిచే ?
విధి కధికంబు గర్మమని వేమరు మ్రొక్కి భజింతుఁ గర్మమున్.

వ్యా.—య దుక్తం దైవేన ప్రభుణే త్యాది సందర్భేణ దైవ స్యై వాత్యన్తావశ్యకత్వం, త స్యాపి కర్మనియమ్యత్వే నాస్వాతన్త్ర్య దిత్యాశయేన దైవపద్ధతినిరూపణానన్తర్యేణ కర్మపద్ధతిం నిరూపయిష్యం, స్తత్రాపి సర్వదేవనియామకత్వే విధే - స్తన్నియామకత్వేన కర్మణః - ప్రాబల్య మితి పరమ్పరా మను విదధాతి - నమస్యామ ఇతి.- దేవా నిన్ద్రాదీ, న్నమస్యామోఽభివాదయామః, న త్వేకాన్తత యైతేషా మే వాభివాద్యత్వ, మేత న్నియామకస్య కస్యచి ద్విధేః విద్యమానత్వాత్, సోఽప్యభివాద్య ఏ వే త్యాశయే నాహ - తే దేవా అపి హతో యో విధి ర్బ్రహ్మా తస్య, వశగా నను నియమ్యాః ఖలు - అతో విధి రపి వన్ద్యః న త్వ స్యాపి స్వాతన్త్ర్య, మిత్యాహ - సోఽపి విధి రపి, ప్రతినియతం య త్కర్మణ ఏకం ఫలం త ద్దదా తీతి తథోక్తః - యత్ఫలం కర్మణః ప్రతినియతం తత్ప్రదో న తు స్వతన్త్ర ఇ త్యర్థః, తథా చ ఫలం కర్మాయత్తం యది కర్మాధీనం చే, దపరైః దేవైః కిం, విధినా చ కిం న కించి ద పీ త్యర్థః - త స్యైవ ఫల దానస్వామ్యా దితి భావః, త త్తస్మా, త్కర్మభ్యో జ్యోతిష్టోమతపోదానాదిరూపేభ్యో, నమః, యతః విధి రపి, యేభ్యః కర్మభ్యో, న ప్రభవతి న సమర్థో భవతి-స్వాతన్త్ర్యేణ ప్రవృత్తే రభావా దితి భావః.

అత్ర పూర్వపూర్వస్యోత్తరోత్తరం ప్రత్యుత్కర్షావహత్వా న్మాలాదీపకాఖ్యోఽలంకారః - తల్లక్షణం తూక్తమ్.

---

అవ.—కర్మప్రాధాన్యము.

బ్రహ్మా యేన కులాలవ న్నియమితో బ్రహ్మాండభాండోదరే,
విష్ణు ర్యేన దశావతారగహనే క్షిప్తో మహాసంకటే,
రుద్రో యేన కపాలపాణిపుటకే భిక్షాటనం సేవతే,
సూర్యో భ్రామ్యతి నిత్య మేవ గగనే, తస్మై నమః కర్మణే. 92.

టీక.—యేన = దేనిచేత, బ్రహ్మా = బ్రహ్మ, బ్రహ్మా...దరే = బ్రహ్మాండభాండ = బ్రహ్మాండములనెడు కుండలయొక్క - ఉదరే = నడుమ, కులాలవత్ = కుమ్మరివలె, నియమితః = నియోగింపఁబడెనో, యేన..., విష్ణుః = విష్ణువు, మహాసంకటే = మిక్కిలి యిఱుకటమైన, దశా...హనే - దశ అవతార - పదియవతారములనెడి - గహనే= అడవిలో, క్షిప్తః = త్రోయఁబడెనో, యేన..., రుద్రః = శివుఁడు, కపాలపాణి పుటకే = పునుకయనెడి చేతి పాత్రయందు, భిక్షా అటనం = భిక్షమునకైన సంచారము, సేవతే = చేయుచున్నాఁడో (యేన...), సూర్యః = సూర్యుఁడు, గగనే = ఆకాశములో, నిత్య మేవ = ఎల్లప్పుడును, భ్రామ్యతి = సుడియునో, తస్మై = దానికి, (అనఁగా), కర్మణే = కర్మమునకు, నమః = నమస్కారము.

తా.—కుమ్మరి కుండలు చేయుచుండునట్లు బ్రహ్మకు బ్రహ్మాండములను సృజించుచుండుదురవస్థయు, విష్ణువునకు పదిచెట్ల గుబురునందుంబోలె పదియవతారములలో ఇఱుకుకొనియుండు పీడయు, రుద్రునికి పునుకకప్పెరలో బికిరమెత్తు కష్టంబును, సూర్యునికి సదా ఆకాశభ్రమణమును, దేనివలనం గలిగినవో, దానికే త్రిమూర్త్యాదులకును ప్రభువయిన యాకర్మకే నమస్కారము.

ఉ. నలువ కులాలుభంగి నలినప్రభవాండములందు దేనిచే
నిలిచె, దశావతార వన నిష్ఠితుఁ డయ్యె మురారి దేనిచేఁ,
బెలుచఁ గపాలహస్తుఁ డయి భిక్షుకుఁ డయ్యెఁ బురారి దేనిచే,
నల రవి దేనిచేఁ దిరుగు, నాఘనకర్మము వంద్యమే కదా.

వ్యా.—యదుక్తం విధిరపి న యేభ్యః ప్రభవతీతి తత్ప్రపఞ్చయతి - బ్రహ్మేతి.—యేన కర్మణా కర్త్రా బ్రహ్మా చతుర్ముఖో, బ్రహ్మాండ మేవ భాండం - తస్యోదరే, కులాలేన కుమ్భకారేణ తుల్యం కులాలవ, న్నియమితః వివిధవస్తు నిర్మాణకర్తృత్వేన నియోజితః, యేన విష్ణుః కుక్షిస్థాఖిలభువనోఽపి, మహాసంకటేఽతి కృచ్ఛ్రతరే, దశావతారా ఏవ గహన మరణ్యానీ - తత్ర క్షిప్తో నిర్దిష్టః, యేన కర్మణా, రుద్రో మృత్యుఞ్జయోఽపీతి భావః, కపాలం బ్రహ్మశిర ఏవ - పాణి పుటకే కరతలస్థభిక్షాహరణోచిత భాజనం తత్ర, భిక్షాటనం సేవతే - కపాలస్థభిక్షాన్నం భుఙ్క్త ఇత్యర్థః, కిం చ యేన సూర్యోఽపి సకలలోక ప్రకాశకోఽపీతి భావః, నియమిత ఇతి శేషః, గగనేఽన్తరిక్షే, నిత్య మేవ న తు క్షణమాత్ర మపి విశ్రమావకాశ, ఇతి భావః, భ్రామ్యతి పరివర్తతే * 'వా భ్రాశ' త్యాదినా వికల్పాత్ శ్యన్ప్రత్యయః, తస్మై సకల నియన్త్రే కర్మణే నమః - తథాభూత స్యైవాభివాదనౌచిత్యా దితి భావః.



---

అవ.—సత్కర్మాచరణోపదేశము.

యా సాధూంశ్చ ఖలాన్ కరోతి, విదుషో మూర్ఖాన్, హితాన్ ద్వేషిణః,
ప్రత్యక్షం కురుతే పరోక్ష, మమృతం హాలాహలం తత్క్షణాత్,
తా మారాధయ సత్క్రియాం భగవతీం భోక్తుం ఫలం వాఞ్ఛితం,
హే సాధో, వ్యసనై ర్గుణేషు విపులే ష్వాస్థాం వృథా మాకృథాః. 93.

టీక.—యా = ఏది (ఏసత్క్రియ), తత్ క్షణాత్ = ఆ నిముసముననే (వెంటనే), ఖలాంశ్చ = దుర్జనులను గూడ, సాధూన్ = సజ్జనులనుగాను; మూర్ఖాన్ = మూఢులను, విదుషః = విద్వాంసులనుగాను; ద్వేషిణః = పగవారిని, హితాన్ = మిత్రులనుగాను; పరోక్షం = అప్రత్యక్షమును, ప్రత్యక్షం = ప్రత్యక్షముగాను; హాలాహలమ్= విషమును, అమృతం = అమృతమునుగాను; కరోతి = చేయునో, సత్క్రియాం తాం భగవతీం = సత్కర్మమనెడి యా దేవతను, హే సాధో = ఓ సుజనుఁడా, వాఞ్ఛితం = కోరినట్టి, ఫలం = ఫలమును, భోక్తుమ్ = అనుభవించుటకై, ఆరాధయ= కొలువుము, వ్యసనైః విపులేషు = ఆపదలచేత విశాలములైన - (దుఃఖమయములయిన), గుణేషు = రజస్తమస్సులందు, వృథా = వ్యర్థముగా, ఆస్థాం = ఆసక్తిని, మాకృథాః= చేయకుము.

తా.—ఓయి సజ్జనుఁడా, నీకు అభీష్టఫలమును అనుభవింప వలయునేని దుఃఖమయము లగు రాజస తామస కృత్యములందు ఆస్థ మాని వర మిచ్చు దేవతవంటిదానిని మంచిపనిని సేవింపుము; దాని ప్రభావముచే, దుష్టులు సాధువు లగుదురు, మూర్ఖులు పండితు లగుదురు, పగతురు మిత్రు లగుదురు, అప్రత్యక్షము ప్రత్యక్ష మగును, విషము అమృత మగును.

మ. ఖలునిన్ సజ్జనుఁగాఁగ మూర్ఖజను సంఖ్యావంతునిం గాఁగ, దా
యల సన్మిత్రులఁ గా, నగోచరముఁ బ్రత్యక్షంబు గాఁ, బ్రాణహృ

తత్కాలనం బైనమహావిషం బమృతముం గాఁ, జేయు సత్కర్మము
జ్వలనిష్ఠానిధివై భజింపుము వయస్యా వాంఛితార్థాప్తికిన్.

వ్యా.—ఏవం శ్లోకద్వయేన సకలనియామకత్వకథనపూర్వక మభివాదనీయతో్వ పయోగాత్త్వయ మభివాద్య సంప్రతి బహుశ్రేయో హేతుత్వా త్తస్యోపాదేయతా మాహ - యేతి.—యా సత్క్రియా ఖలాం శ్చ దుర్జనా నపి, సాధూ న్కరోతి, మూఢా నజ్ఞానినోఽపి, విదుషః పణ్డితాన్, కరోతి, ద్వేషిణోఽపి, హితాం త్సుహృదః, కరోతి, పరోక్ష మతీన్ద్రియ మప వస్తు, ప్రత్యక్ష మిన్ద్రియ గోచరం, కురుతే, తథా, హాలాహలం విష మపి, తత్క్షణా త్సద్య ఏ, వామృతం కరోతి - తాదృక్సామర్థ్యా సంభవా దితి భావః, అతః హే సాధో సజ్జన నిపుణేతి వా - 'సాధు స్సమర్థో నిపుణో వే' తి కాశికాయాం, వాఞ్ఛిత మభిలషితం, ఫలం భోక్తు మిచ్ఛసి చే దితి శేషః, భగవతీం తాం, సత్క్రియాం సత్కర్మారాధయ - తస్యాః అశేషఫలదాయకత్వా దితి భావః, కిం తు వ్యసనై ర్విపులే ష్వాపదుఃఖాయిష్వేషు, గుణేషు, రజ స్తమః ప్రభృతిషు పృథావ్యర్థ, మాస్థా మాసక్తిం, మాకృథా మావిధేహి, తస్యాః క్లేశైకఫలకత్వా దితి భావః, కరోతే ర్లుఙ్ * 'న మాఙ్యోగ' ఇ త్యట్ప్రతిషేధః.

అత్ర ఖలాదీనాం సాధుత్వాదికరణా దశక్యవస్తుకరణరూపో విశేషాలంకారః.

---

అవ.—పుణ్యము చేసికొమ్మని యుపదేశము.

శుభ్రం సద్మ, సవిభ్రమా యువతయః, శ్వేతాతపత్రోజ్జ్వలా
లక్ష్మీ, రి త్యనుభూయతే చిర మనుస్యూతే శుభే కర్మణి;
విచ్ఛిన్నే నితరా మనఙ్గకలహక్రీడాత్రుట త్తన్తుకం
ముక్తాజాల మివ ప్రయాతి ఝడితి భ్రశ్య ద్దిశోఽదృశ్యతామ్. 94.

టీక.—శుభే కర్మణి = మంచి కర్మము (తజ్జనితమైన యదృష్ట మనుట), చిరం = దీర్ఘకాలమునుండి, అనుస్యూతే సతి = కూడఁ గ్రువ్వఁబడినది కాఁగా (కూడ వచ్చుచుండఁగా ననుట), శుభ్రం సద్మ = విమలమైన యిల్లును, స విభ్రమాః = ఒయ్యారములుగల, యువతయః = జవరాండ్రును, శ్వేతా...జ్వలా - శ్వేత ఆతపత్ర = తెల్లగొడుగుచేత - ఉజ్జ్వలా = వెలింగెడు, లక్ష్మీః = శ్రీయు - (తెల్లగొడుగు రాజచిహ్నము గాన రాజ్యలక్ష్మియని భావము), ఇతి = అనునది (శుభ్రసద్మాదికము), అనుభూయతే = అనుభవింపఁబడును ; విచ్ఛిన్నే సతి = (ఆశుభకర్మము) తెచ్చిపోఁగా, నితరామ్ = మిక్కిలి, అనఙ్గ...తన్తుకం - అనఙ్గ కలహ క్రీడా = మదన కదన (నిర్దయ రతి) క్రీడచేత - త్రుటత్ = పెరుగునట్టి - తన్తుకం = దారముగల, ముక్తా జాల మివ = ముత్తెపు సమూహ



మువలె, (ఆ శుభ్ర సద్మాదికము), ఝడితి = తత్క్షణమే, దిశః = దిక్కులకు, భ్రశ్యత్ = జారిపోయి, అదృశ్యతాం = అగపడమిని, ప్రయాతి = పొందుచున్నది.

తా.—మనుష్యుఁడు పురాకృత పుణ్యము ఉన్నంత వఱకు, పొలగచ్చుమేడలు, ఒయ్యారపు జవ్వనులు, వెల్లగొడుగుతో వెలింగెడి దొరతనము, అను నిట్టిదానినెల్ల అనుభవించుచుండును. ఆపుణ్యము ముగిసిన క్షణమందే ఆభాగ్యమెల్ల సుత్కట రతిక్రీడలో తెగిగిన పేరులోని ముత్తెములవలె ఏది యెటు పోయినదియు తెలియ రాకుండ మటుమాయమై పోవును.

చ. లలితనికేతన ప్రియవిలాసవతీ ధవళాతపత్ర స
ద్విలసితవైభవం బనుభవింపఁబడున్ సుకృతానువృత్తిచేఁ,
జెలు వగుపుణ్యకర్మము నశించిన నంగజ సంగర త్రుట
త్కలితగుణోరుమౌక్తికనికాయములట్లు దొలంగుఁ సంపదల్.

వ్యా.—వృద్ధిహాన్యో ర ప్యేతన్మూలకత్వ మే వే త్యాహ - శుభ్ర మితి.—చిరం చిరకాల మార, భ్యానుస్యూతేఽ నువర్తమానేఽపి * 'షివు తన్తుసంతానే' ఇతి నాతోః కర్తరి క్తః * 'ఛ్వోశ్శూ డనునాసికే చే' తి ఊఠ్ యణాదేశః, శుభే కర్మణి పురాకృతవిశేషే సంభవతి స తీత్యర్థః, శుభ్రం సద్మ సౌధాదికం, స విభ్రమా స్సవిలాసా, యువతయ స్తరుణ్యః, శ్వేతాతపత్రే ణైకశ్వేతచ్ఛత్రే - ణోజ్జ్వలా, లక్ష్మీ రాజ్యశ్రీ, రి త్యేత దఖిల మి త్యర్థః, అనుభూయతే ఽనుభుజ్యతే, జన్మాన్తరీయఫలహేతుత్వా త్తస్యేతి భావః, విచ్ఛిన్నే శుభకర్మణి వినష్టే సతి, నితరా మతిశయేన, అనఙ్గకలహో రతిరణ - స్స ఏవ క్రీడా కేళి - స్తయా హేతునా త్రుటన్ భిదుర - స్తన్తు ర్యస్య త త్తథోక్తం * శేషే కప్రత్యయః, ముక్తాజాలమివ భ్రశ్య త్సత్, సద్మాదిక మితి శేషః, ఝడితి ద్రా, గ్దిశో యాతి 'యత్ర యత్ర స్థితం గేహం తత్ర తత్ర వినశ్యతీ' తి న్యాయా దితి భావః, దృశ్యతాం విలోక్యతా మి త్యర్థః. అన్వయవ్యతిరేకాభ్యాం వృద్ధిహాన్యో ర స్యైవ కారణత్వం ద్రష్టవ్య మితి భావః.

---

అవ.—ఏపని చేసినను ముందు చక్కఁగా దానిపర్యవసానమును ఆలోచించుకొని మఱి చేయవలయు ననుట.

గుణవ దగుణవ ద్వా కుర్వతా కార్య మాదౌ
పరిణతి రవధార్యా యత్నతః పణ్డితేన;
అతిరభసకృతానాం కర్మణా మావిపత్తే
ర్భవతి హృదయదాహీ శల్యతుల్యో విపాకః. 95.

టీక.—గుణవత్ (వా) = మంచిదానిని గాని, అగుణవత్ వా = చెడ్డదానిని కాని, కార్యం = (ఏదేనొక) పనిని, కుర్వతా = చేయునట్టి, పణ్డితేన = వివేకిచేత, పరిణతిః = పరిపాకము, ఆదౌ = మొదట, యత్నతః = కడంకతో, అవధార్యా = ఆలోచింపఁబడవలసినది; (ఏలయన), అతి రభస కృతానాం = మిక్కిలి తొందరతోఁ జేయఁబడినట్టి, కర్మణాం = పనులకు, ఆ విపత్తేః = మరణ పర్యంతము, శల్యతుల్యః = బాణాగ్రముతోసమానమై, హృదయ దాహీ = మనస్సును కాల్చునట్టి, విపాకః = విపరీతఫలము, భవతి = కలుగును.

తా.—మంచిదిగాని చెడ్డదిగాని ఒకపని చేయువివేకి ముందుగా దానిపర్యవసానమును చక్కఁగా ఆలోచించుకొనవలసినది. ఏలయన, మిక్కిలి తొందరపడి చేసినపనులకు మరణపర్యంతము గుండెలో గ్రుచ్చుకొని బయటికిరాని బాణపుములికివలె హృదయమును కాల్చుచుండు విపరీతఫలము కలుగును.

తే. సగుణనిర్గుణకార్యముల్ సలుపుసుమతి। సేఁతపరిణతి గడుఁ బరీక్షింపఁ దగును,
బరుసకర్మవిపాకంబు ఫలముదనుక। హృదయము దహించు శల్యంబు రీతి జగతి.

వ్యా.—అథైషా మాచరణప్రకార మాహ - గుణవ దితి.—గుణవద్గుణయుక్తం, మగుణవద్గుణ రహితం, వా య త్కార్యజాతం త, త్కుర్వతాఽనుతిష్ఠతాఽ, నేన, పణ్డితేన పరిజ్ఞాత్రా, పరిణతిః పరిపాకావస్థా, యత్నతః అతిప్రయత్నేన - సావధానేనేతి యావత్, అవధార్యాఽనుసంధేయా, యత్నత ఏవ కర్మజాత మారబ్ధవ్యం సమాలోచ్య పరిణతిపర్యన్త మి త్యర్థః, అన్యథాఽ నర్థ మాహ - అతిరభసకృతానాం సహసాఽనుష్ఠితానాం, కర్మణాం గుణవతాం వేతి శేషః, ఆవిపత్తే ర్నిష్పత్తిపర్యన్తం * వికల్పా దాఙో సమాసః-వి పూర్వా త్పద్యతే ర్నిష్పత్త్యర్థత్వ ముపసర్గవశా-ద్ధాతూనా మనేకార్థత్వా దిత్యవగన్తవ్యం, హృదయదాహీ మనస్సంతాపకారీ, కుత, శ్శల్యతుల్యః శల్యప్రాయో, విపాకః పరిపాకదశా, భవతి; అత స్సావధానే నైవ కర్మజాత మారబ్ధణీయం, తథాభూత స్యైవ చిత్తసమాధాయకత్వా దితి భావః.

---

అవ.—సత్కర్మము ననుష్ఠింపనివాఁడు మూర్ఖుఁడు.

స్థాల్యాం వైదూర్యమయ్యాం పచతి తిలఖలం చాన్దనై రిన్ధనౌఘైః,
సౌవర్ణై ర్లాఙ్గలాగ్రై ర్విలిఖతి వసుధా మర్కతూలస్య హేతోః,
ఛిత్త్వా కర్పూరఖణ్డా న్వృతి మిహ కురుతే కోద్రవాణాం సమన్తాత్;
ప్రాప్యేమాం కర్మభూమిం న భజతి మనుజో య స్తపో మన్దభాగ్యః.

టీక.—ఇమాం కర్మభూమిం = కర్మ మాచరించుటకుఁదగిన యీ దేశమును, ప్రాప్య = పొంది, మన్దభాగ్యః = అదృష్టహీనుఁడైన, యః మనుజః=ఏమనుష్యుఁడు, తపః =



తపమును, న భజతి = కావింపఁడో, సః = వాఁడు, వైదూర్యమయ్యాం = పిల్లికంటిరత్నముతో చేయఁబడిన, స్థాల్యాం = కుండలో, చాన్దనైః = చందనసంబంధమైన, ఇన్ధనౌఘైః = కట్టె మోపులతో, తిలఖలం = తెలికపిండిని, పచతి = వండును; సౌవర్ణైః= బంగారపు, లాఙ్గల అగ్రైః=నాఁగేటి మొనలతో, అర్క తూలస్య హేతోః= జిల్లేడు దూదికొఱకు, వసుధాం = భూమిని, విలిఖతి = దున్నును; కర్పూరషణ్డాన్ = కప్పురపుఁజెట్ల గుబురులను, ఛిత్త్వా = నఱికి, కోద్రవాణాం = అర్లకు, ఇహ = ఇట, సమన్తాత్ = చుట్టును, వృతిం = వెలుగును, కురుతే = చేయును.

తా.—శాస్త్రోక్తకర్మకు ఫలమిచ్చున దైనయీదేశమున జనించియు నెవఁడు ఇచ్చట తపస్సుచేసికొనఁడో, ఆ భాగ్యహీనుఁడు ఎట్టి మూర్ఖుఁ డనఁగా,—వైదూర్యపు కుండలో తెలికపిండి వండుకొనువాఁడును, జిల్లేడుదూదికోసము బంగరునాఁగేళ్లతో నేలను దున్నువాఁడును, గప్పురపుటరఁటుల నఱికి వానితో నాళ్లచేనికి కంచె కట్టువాఁడును, ఎట్టి మూర్ఖులో అట్టిమూర్ఖుఁడు, అనఁగా ఉత్తమఫలసాధనమును నీచఫలార్థము ఉపయోగించుకొను మూర్ఖుఁడు.

మ. చెలువౌరత్నఘటంబునం దతఁడు సుశ్రీఖండఖండంబులం
దిలపిణ్యాకము వండె, నారుగల కర్థిన్ సప్తపర్ణావృతుల్
నిలిపెన్, జిల్లెడుదూదికై పుడమిదున్నెన్ బైఁడినాఁగేళ్ల, ని
మ్ములఁ గర్మక్షితిఁ బుట్టి యెవ్వఁడు దపంబుల్ సేయఁ డప్రాజ్ఞతన్.

వ్యా.—అథ సత్కర్మాననుష్ఠాతుః దుర్మేధస్కతా మాహ, స్థాల్యామితి.–స మనుజః ఇహ లోకే - విదూరా త్ప్రభవతి వైదూర్యం వాలవాయజమణిః - ని. 'వైదూర్యం వాలవాయజ మి' త్యమరః * 'విదూరాఞ్ఞ్యః'. ఇతి ఞ్యప్రత్యయః - అత్ర విదూర శబ్దో వాలవాయస్యాదేశః పర్యాయో వా తత్రోపచరితో వా - తేన 'వాలవాయాద్గిరే రసౌ ప్రభవతి - న విదూరా న్నగరాత్ - తత్ర సంస్కృత' ఇ త్యాక్షేపః ప్రత్యుక్తః-

'వాలవాయో విదూరం చ ప్రకృత్యన్తర మేవ వా,
న వై త త్రేతిచే ద్బ్రూయా జ్జిత్వరీవ దుపాచరేత్.' -

వైదూర్యమయ్యాం వైదూర్యమణి వికారాయాం * వికారార్థే మయట్, స్థాల్యాం పాత్రే, చాన్దనై శ్చన్దనతరుసంబన్ధిభి, రిన్ధనౌఘైః కాష్ఠభారైః, తిలఖలం తిలపిష్టం, పచతి, తథా, సౌవర్ణైః సువర్ణవికారై, ర్లాఙ్గలాగ్రై ర్హలముఖై, రర్కతూలస్య హేతో రర్కవృక్షతూలార్థ మి త్యర్థః * 'షష్ఠీ హేతుప్రయోగ' ఇతి షష్ఠీ, వసుధాం భువం, లిఖతి కర్షతి, తథా కర్పూరషణ్డాం, శ్ఛిత్త్వా, కోద్రవాణాం కోరదూషాఖ్యసస్యశేషాణాం - ని. 'కోరదూష స్తు కోద్రవ' ఇ త్యమరః, సమన్తా త్సర్వతోఽధిక మి

త్యర్థః, వృతి మావరణం, కురుతే, కోఽసౌ వీదృశో దుర్భగ ఇత్యాశఙ్కాయా మాహ- ఇమాం కర్మభూమిం కర్మాచరణయోగ్యభూమిం, ప్రాప్య మన్దభాగ్యో మనుజ, స్తపశ్చాన్ద్రాయణాది, కర్మ, న భజతి న సేవతే, స ఇతి సంబన్ధః; వైదూర్యపాత్రే తిలపిష్టపచనాదిప్రాయం కర్మభు వ్యస్యాం తపోననుష్ఠాన మి త్యర్థః, అత స్సర్వథా సత్కర్మానుష్ఠేయం శ్రేయస్కామే నేతి తాత్పర్యమ్.

అత్ర య స్తపో న భజతి స తిలఖలం పచ తీత్యాది విశిష్టభజన పచనాద్యోర్వాక్యార్థయో ర్నిర్దిష్టైకత్వాసంభవా త్సాదృశ్యలక్షణాయా మసంభవద్వస్తుసంబన్ధో వాక్యార్థవృత్తి ర్నిదర్శనాభేద ఇ త్యే తత్సర్వం మూర్ఖపద్ధతౌ వ్యాఖ్యాతమి తీ హోపరమ్యతే.

---

అవ.—పుణ్యమే సర్వము నిచ్చును గాన దానినే ఆర్జింపవలయు ననుట.

నై వాకృతిః ఫలతి, నైవ కులం, న శీలం,
విద్యాఽపి నైవ, న చ యత్నకృతాఽపి సేవా,
భాగ్యాని పూర్వతపసా ఖలు సంచితాని
కాలే ఫలన్తి పురుషస్య యథైవ వృక్షాః. 97.

టీక.—ఆకృతిః = ఆకారము (చక్కఁదనము), నైవ ఫలతి = ఫలింపనే ఫలింపదు, కులం = (మంచి) వంశము, నైవ..., శీలం = మంచి స్వభావమును, నైవ..., విద్యా అపి = విద్యయు, నైవ..., యత్న కృతా = ప్రయత్నముతోఁ జేయఁబడినట్టి, సేవా అపిచ = కొలువు సయితము, న..., (మఱి), పూర్వ తపసా = తొంటి తపస్సుచేత, సంచితాని = కూడఁబెట్టఁబడినవి, పురుషస్య = పురుషునియొక్క, భాగ్యాని = పుణ్యములు, వృక్షాః యథా = చెట్లులవలెనే, కాలే ఏవ = (నియత) సమయమునందే, ఫలన్తి ఖలు = ఫలించును జూమా.

తా.—సౌందర్యము, మంచికులము, మంచినడవడి, విద్య, మంచికొలువు, ఇవి గావు పురుషునికి ఫల మిచ్చునవి. దానిదాని ఋతువులో ఆయాచెట్లు ఫల మిచ్చునట్లు, తొంటితపస్సులచే చేకూడిన పుణ్యములు వానివానికాలము వచ్చినప్పుడు ఫలమునొసంగుచుండును. కావున తప్పక తపస్సు చేయవలసినది.

తే. రమ్యరూపంబు విద్యయు రాజసేవ । కులము శీలంబుఁ జాలవు ఫల మొసంగఁ ;
బూర్వపుణ్య సంచిత భాగ్యములు ఫలించుఁ । గాలమునఁ బనసాదివృక్షముల కరణి.

వ్యా.—పుణ్యవిశేష ఏవ సఫలం న త్వన్య దిత్యాహ—నేతి.—ఆకృతి రాకారసంపత్తి రేవ, న ఫలతి ఫలకారణం న భవ తీ త్యర్థః, కులం సద్వంశో వా, నైవ ఫలతి,



శీలం సత్స్వభావో వా, న ఫలతి, విద్యాఽపి వేదవేదాఙ్గశాస్త్రి కాఽపి, నైవ ఫలతి, యత్నకృతా ప్రయత్నానుష్ఠితా, సేవా రాజాదిపరిచర్యా న, న ఫలతి, కిం తు పూర్వతపసా పురాకృతసుకృతేన సంచితాని సంపాదితాని, పురుషస్య సంబన్ధీని, భాగ్యాని, వృక్షా యథా వృక్షా ఇ వే త్యర్థః – 'ఇవ వ ద్వా యథా శబ్దా వి' తి దణ్డ్యాచార్యానుశాసనాత్, కాలే పరిపాకసమయ ఏవ, ఫలన్తి ఖలు, తపోజనిత భాగ్యవిశేషవ్యతిరేకేణ ఫలజనకం న కించి దస్తీ త్యర్థః.

---

అవ.—మరల దైవప్రభావమే.

మజ్జ త్వమ్భసి, యాతు మేరుశిఖరం, శత్రూ న్జయ త్వాహవే,
వాణిజ్యం కృషిసేవనాది సకలా విద్యాః కలాః శిక్షతామ్,
ఆకాశం విపులం ప్రయాతు ఖగవ త్కృత్వా ప్రయత్నం పరం,
నాభావ్యం భవ తీహ భాగ్యవశతో, భావ్యస్య నాశః కుతః ?

టీక.—(పురుషుఁడు), అమ్భసి = నీట, మజ్జతు = మునుఁగును గాక, మేరు శిఖరం = మేరువు కొనకు, యాతు = పోవుఁగాక, ఆహవే = పోర, శత్రూన్ = పగఅను, జయతు = గెలుచును గాక, వాణిజ్యం = వర్తకమును, కృషి సేవనే చ = సేద్యమును కొలువును, సకలాః = సమస్తములైన, విద్యాః = (వేదాది) విద్యలను, కలాః = (ఇతిహాసాది) కళలను, శిక్షతాం = నేర్చును గాక, పరం = గొప్ప, ప్రయత్నం = జతనమును, కృత్వా = చేసి, ఖగవత్ = పక్షివలె, విపులం = విరివియైన, ఆకాశం = ఆకాశమునందు, ప్రయాతు = పోవును గాక, (ఏమి చేసినను), భాగ్యవశతః = దైవ వశమున, ఇహ = ఈ లోకమునందు, అభావ్యం = కలుఁగఁగూడ నిది, న భవతి = కలుగదు, భావ్యస్య = కలుగవలసిన దానికి, నాశః = ధ్వంసము, కుతః = ఎక్కడిది ?

తా.—మనుష్యుఁడు నీట మునిఁగినను, మేరుకొన కెగిరినను, పోరఁ బగతుర గెలిచినను, వర్తకము సేసికొన్నను, సేద్యము సేసికొన్నను, గొలువు గొల్చినను, పదునాల్గు విద్యలను అఱువదినాల్గు కళలను నేరిచినను, యోగాదులచే నాకాశగమనము సాధించినను, ఇట్లు ఇంకనెట్టి యశక్యమును శక్యముగఁజేసికొన్నను, అదృష్టము దేనికి విరుద్ధమో అది దొరకదు, దేనికి అనుకూలమో అది దొరకక మానదు.

చ. సలిలముఁ జొచ్చినం, గనక శైలముఁ జేరిన, వైరివీరులం
గెలిచిన రాజసేవఁ దిలకించిన, వేదము లభ్యసించినం,
గళలతెఱం గెఱింగిన, ఖగత్వము దాల్చినఁ, గర్మనిఘ్నతా
కలన నభావ్య మైన పని గాదు, వినాశము లేదు భావికిన్.

వ్యా.—సర్వథాఽపి భావ్యభావినో రావశ్యకత్వం కర్మవశా దే వే త్యాహ - మజ్జ త్వితి.—అమ్భసి, మజ్జతు మగ్నో భవతు - జలస్తమ్భాది నేతి భావః, మేరుశిఖరం, యాతు గచ్ఛతు - యోగానుసంధానాది నేతి భావః, ఆహవే యుద్ధే, శత్రూ న్జయతు, వాణిజ్యం క్రయవిక్రయాది, కృషిః కర్షణం - సేవనం పరిచర్యా- దౌత్యాది నేతి భావః- తే కృషిసేవనే చ-తథా సకలాః సమస్తాః, విద్యాః వేదవేదాఙ్గాదయః -

'అఙ్గాని వేదా శ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః
పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతా శ్చతుర్దశ'.—

ఇత్యేతా శ్చతుర్దశ విద్యాః, కళా ఇతిహాసాగమప్రభృతీ శ్చతుష్షష్టిం కళాః శిక్షితామ్ అభ్యస్యతు, తథా, పర ముత్కృష్టం, ప్రయత్నం పాదుకాసిద్ధ్యాత్మకం, కృత్వా ఖగవత్ఖగేన తుల్యం, విపుల మాకాశం ప్రయాతు, తథాఽపి కర్మవశతో ధర్మాధర్మాత్మకకర్మవశా దిహాస్మి ఌ్లోకే, అభావ్య మభావి, ఫలం న భవతి, తథా భావ్య స్యావశ్యమ్భావినః ఫలస్య, నాశః కుతః, తస్య బ్రహ్మణాఽపి నివారయితు మశక్యత్వాత్ - 'యద్భావి తద్భవ త్యేవ యదభావి న తద్భవే ది' తి న్యాయా దితి భావః, అత్రామ్భోమజ్జనాదీనాం చతుష్షష్టౌ కళా స్వ వాన్తర్భూతత్వ మవగన్తవ్యం, తా శ్చ కళా మదీయ శృఙ్గాటకే సంఖ్యాతా స్తత్రైవ ద్రష్టవ్యా ఇ తీ హోపగమ్యతే.

---

అవ.—పూర్వపుణ్యము ఆపదలందు రక్షించును.

వనే రణే శత్రుజలాగ్ని మధ్యే, మహార్ణవే పర్వతమస్తకే వా,
సుప్తం ప్రమత్తం విషమస్థితం వా, రక్షన్తి పుణ్యాని పురాకృతాని.

టీక.—వనే = అడవియందు, రణే = యుద్ధమందు, శత్రు జల అగ్ని మధ్యే = పగతురు నీళ్లు నిప్పు వీని నడుమ, మహత్ అర్ణవే = పెను సముద్రమున, పర్వత మస్తకే వా = కొండ శిఖరమున ను, సుప్తం = నిద్రితుని, ప్రమత్తం = మత్తుగొన్నవానిని, విషమస్థితం వా = ఆపదయం దున్నవానిని, పురాకృతాని = పూర్వకృతములైన, పుణ్యాని = సుకృతములు, రక్షన్తి = రక్షించును.

తా.—పురుషుని అడవిలో, యుద్ధములో, శత్రువులమధ్యను, నీళ్లలో, నిప్పులో, మహాసముద్రములో, కొండకొనను, నిదురలో, కైపులో, అపాయములోను, పురాకృతపుణ్యములు రక్షించును.

క. కాననమున రణమున సలి। లానలరిపుమధ్యమున మహాబ్ధి నగాగ్ర
స్థానమున మత్తు నిద్రితుఁ। బూనికతోఁ బూర్వపుణ్యములు రక్షించున్.

వ్యా.—అతిసంకటస్థ స్యాపి ప్రాచీనపుణ్యసద్భావే తు న క్షతి రి త్యాహ వన ఇతి.—అయం తు స్పష్టార్థః.

---



అవ.—పుణ్యాత్మునికి సర్వత్ర సర్వసౌఖ్యములును కలుగును.

భీమం వనం భవతి తస్య పురం ప్రధానం,
సర్వో జనః సుజనతా ముపయాతి తస్య,
కృత్స్నా చ భూ ర్భవతి సన్నిధిరత్నపూర్ణా,
య స్యాస్తి పూర్వసుకృతం విపులం నరస్య. 100.

టీక.—యస్య నరస్య = ఏ మనుష్యునకు, విపులం = విస్తారమైన, పూర్వ సుకృతం = పురాకృత పుణ్యము, అస్తి = కలదో, తస్య = వానికి, భీమం = భయంకరమైన, వనం = అరణ్యము, ప్రధానం పురం = ముఖ్య పట్టణము, భవతి = అగును, తస్య = వానికి, సర్వో జనః = ఎల్లవాఁడును, సుజనతాం = సౌజన్యమును, (పా. స్వజనతాం = బంధు భావమును), ఉపయాతి = పొందును, కృత్స్నా = సమస్తమైన, భూశ్చ = భూమియు, సన్ని...పూర్ణా - సన్నిధి = మంచినిధులతోను - రత్న = మణులతోను - పూర్ణా = నిండినది, భవతి = అగును.

తా.—విస్తారముగా పురాకృత పుణ్యముగల మనుష్యునికి—ఘోరారణ్యములో సకల భోగములును రాజధానిలో రాజునకు జరిగినట్లు జరుగును, ఎల్లవారును ఆప్తులగుదురు, ఎక్కడ అడుగిడిన నక్కడనే నిధులును రత్నములును దొరకినంత సౌఖ్యము కలుగును.

తే. భువనమునఁ బూర్వసంభృత పుణ్యరాశి। యగుచు నుదయంబు గాంచిన సుగుణనిధికి
వనము పుర మగుఁ బరు లాత్మ జనము లగుదు। రవని నిధిరత్న పరిపూర్ణ యయి ఫలించు.

వ్యా.—కిం బహునా, సుకృతిన స్తావ త్సర్వ మ ప్యానుకూల్య మేవ ప్రయాస్తీతి నిగమయతి.—భీమ మితి.—యస్య పుంసః, భీమం హింస్రాదిప్రాచుర్యేణ భయఙ్కరం, వన మరణ్యానీ కర్తృ, ప్రధానం నియతం, పురం భవతి, తద్వ దశేషభోగసాధనం భవ తీ త్యర్థః, తస్య సర్వోఽశేషోఽపి, జనః, స్వజనతాం కింకరతా, ముపయాతి, తస్య కృత్స్నా చతుస్సముద్రాన్తా, భూః, సన్నిధిభి స్సమీచీనైః రత్నై ర్మహాపద్మాదివనిధానై, ర్నిక్షేపై ర్వా - రత్నైః శ్రేష్ఠవస్తుభి శ్చ - పూర్ణా భవతి, సమస్తఫలాని ప్రసూత ఇత్యర్థః, క స్యే త్యత ఆహ - యస్య నరస్య, విపులం బహుళం, పూర్వసుకృతం పురాకృత సత్కర్మ సంజాతం పుణ్య, మస్తి వర్తతే త స్యేతి సంబన్ధః, అతస్సత్కర్మాచరణతత్పరై ర్భావ భవితవ్యం శ్రేయస్కామై ర్నేతి సందర్భాభిప్రాయః.

ఇతి నీతిశతకవ్యాఖ్యానే కర్మపద్ధతివర్ణనం నామ దశమం దశకమ్.

నీతిశతకం సమ్పూర్ణమ్.

---

మ. యమునా నీలసరోజ సౌరభరస వ్యాసంగి భృంగీసులో
పమ కంఠద్యుతి లిప్త శేషభుజగ ప్రాలంబ జాంబూనదా
ద్రి మహాకార్ముక రూఢ గూఢపద మౌర్వీ సంప్రయుక్త త్రివి
క్రమ శాతాంబక పాతి తాంబరపర క్రవ్యాత్పు రాట్టాలకా.

క. సుమనోనాయకసంస్తుత। సుమనోర్చిత పదబిసప్రసూన భవానీ
సుమనోహర సురనిర్ఝర। సుమనో దామార్ద్ర జాటజూటోద్దేశా.

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షవీక్షాపాత్ర యేనుఁగు లక్ష్మణకవి
రాజపౌత్త్రి తిమ్మనార్యపుత్త్రి వివిధవిద్వజ్జనవిధేయ లక్ష్మణకవి నామధేయ ప్రణీతం
బయినసుభాషితరత్నావళీకావ్యంబునందు నీతిశతకంబున మూర్ఖపద్ధతియు
విద్వత్పద్ధతియు మానశౌర్యపద్ధతియు నర్థపద్ధతియు దుర్జనపద్ధతియు
సుజనపద్ధతియుఁ బరోపకారపద్ధతియు ధైర్యపద్ధతియు దైవ
పద్ధతియుఁ గర్మపద్ధతియు నను ప్రకరణంబులు గలది
ప్రథమాశ్వాసము.

---

శ్రీ

# భర్తృహరి సుభాషితమ్.

## శృఙ్గారశతకమ్.

అవ.—ఇది శృంగారశతకముగాన తదనుగుణముగా మదనదేవతా నమస్కార
రూపమంగళము.

శమ్భుస్స్వయమ్భుహరయో హరిణేక్షణానాం
యే నాక్రియన్త సతతం గృహకర్మదాసాః,
వాచామగోచర చరిత్రవిచిత్రితాయ
తస్మై నమో భగవతే కుసుమాయుధాయ. 1.

టీక.—శమ్భు స్స్వయమ్భు హరయః = శివ బ్రహ్మ విష్ణువులు, యేన = ఎవనిచేత, హరిణ ఈక్షణానాం = లేడికన్నులవంటి కన్నులుగల స్త్రీలకు (పార్వతీ సరస్వతీ లక్ష్ములకు), సతతం = శాశ్వతముగా, గృహ కర్మదాసాః = ఇంటి పని బానిసవాండ్రుగా, అక్రియన్త = చేయఁబడిరో, వాచా...చిత్రితాయ - వాచాం = మాటలకు, అగోచర = అందని - చరిత్ర = చర్యలచేత - విచిత్రితాయ = చిత్రీకృతుఁడైన, తస్మై = ఆ - కుసుమాయుధాయ భగవతే = మదనదేవునికి, నమః = ప్రణామము.

తా.—త్రిమూర్తులను సయితము స్వస్వభార్యాదాసులను గావించిన యద్భుత చరిత్రునికి మదనదేవునికి నమస్కారము.

భా.—ఇట త్రిమూర్తులను చెప్పుటచేత - కడమ వారిమాట అందులోను మనుష్యమాత్రులమాట చెప్పవలయునా - యని భా. లేడికన్నుల సామ్యముచే పతి హృదయవశీకారి సౌందర్యాతిశయము సూచితము. 'గృహకర్మదాసాః' - అత్యంతవిధేయులని భా. 'భగవతే' అనుట మాహాత్మ్యము కలిమిం దెలుపుటకు. 'కుసుమాయుధాయ' - మృదువులయిన యాయుధములతో అంతటి మువ్వురమూర్తులను జయించినవాఁడని మహిమాతిశయ వర్ణనాపరము.

ఉ. శంకర పద్మగర్భ మురశాసనులన్ భువనేశులన్ నిరా
తంకధృతిన్ మృగాక్షులకు దాసులఁ జేసిన మేటికిం గురం
గాంకవసంతమిత్త్రునకు నంజలిఁ జేసెద వాగతీతని
శ్శంకచరిత్రచిత్రునకు పద్మగుణహారికి శంబరారికిన్.

వ్యా.—శంభ్వితి.—అత్ర స్వయంభుశబ్దస్య శమ్భుశబ్దవ దౌణాదిక డుప్రత్యయాన్తత్వ మవగన్తవ్యమ్ - న తు * 'భువ స్సంజ్ఞాన్తరయోః క్విబి' తి క్విప్ప్రత్యయాన్తత్వమ్ - అన్యథా 'స్వయంభూర్దేవోఽసా' విత్యాదావివ దీర్ఘప్రసఙ్గాత్, తథా చ, యేన మకరధ్వజేన, శమ్భు స్స్వయమ్భు హరయః హర విరిఞ్చి మురారయః సంహార సృష్టి స్థితి కర్తృత్వేన సకలభువనాధీశ్వరా అపీతి భావః, హరిణేక్షణానాం హరిణవన్మనోహర లోచనానాం పార్వతీ సరస్వతీ శ్రీ దేవీనాం, సతతమ్ * 'సమోవాహితతయో రి' తి వచనాత్ సమో మకారస్య లోపః, గృహే కుమ్భదాసాః జలకుమ్భభార వాహక భృత్యాః, అక్రియన్త తాసు తాదృఙ్మోహ ముత్పాద్య తథా విధేయీకృతా ఇత్యర్థః - కి ము తాన్య ఇతి భావః * కృఞః కర్మణి లఙ్ తఙ్ - అర్ధనారీశ్వరత్వా చ్ఛమ్భోః, స్వయమ్భువ శ్చ సరస్వతీనికేతనీకృతముఖత్వాత్, హరే ర్వక్షఃస్థల స్థాపితలక్ష్మీకత్వా చ్చైవ ముక్త మి త్యవగన్తవ్యమ్, అత ఏవ, వాచా మగోచర మవాఙ్మానసగోచరం - య చ్చరిత్రం మాహాత్మ్యమ్ - తేన విచిత్రవక్త్ర్పోక్తి విచిత్రితః - తస్మై అత్యన్తాశ్చర్య కారకా యే త్యర్థః - ని. 'విస్మయోఽద్భుత మాశ్చర్యం చిత్ర మి' త్యమరః * విచిత్రశబ్దా 'త్తత్కరోతీ' తి ణ్యన్తా త్కర్మణి క్తః - ణా విష్ఠవద్భావే విస్మితోక్తిః, భగవతే సకలలోకారాధ్యాయ - యద్వా - చతుర్వ్యూహ మధ్యప్రవిష్టత్వా త్ప్రద్యుమ్నరూపేణ భగవత్పుత్త్రత్వా ద్వా తద్రూపా యే త్యర్థః -

'ఆత్మా వై పుత్త్రనా మాసి'

'పతి ర్జాయాం ప్రవిశతి గర్భో భూత్వా సమాతరమ్

తస్యాం పున ర్నవో భూత్వా దశమే మాసి జాయత' ఇత్యాది శ్రుతేః,

తస్మై మకరధ్వజాయ మకరకేతనాయ కామదేవసార్వభౌమాయ, నమః * 'నమస్స్వస్తీ' త్యాదినా చతుర్థీ. వసన్తతిలకావృత్తమ్.

---

## స్త్రీ ప్రశంస.

అవ.—స్త్రీ పురుషునికి బంధనము.

స్మితేన భావేన చ లజ్జయా భియా
పరాఙ్ముఖై రర్ధకటాక్షవీక్షణైః
వచోభి రీర్ష్యాకలహేన లీలయా
సమస్తభావైః ఖలు బన్ధనం స్త్రియః. 2.

టీక.—స్మితేన = సేనగవుచేతను, భావేన = అనురాగసూచనచేతను, లజ్జయా =



సిగ్గుచేతను, భియా = బెదరుచేతను, పరాఙ్ముఖైః = పెడమొగమయిన, అర్ధకటాక్షవీక్షణైః = సగము కడకంటి చూపులచేతను, వచోభిః = మాటలచేతను, ఈర్ష్యాకలహేన = ఈసు కయ్యము (అనఁగా అన్యకాంతానురక్తుఁడైనందులకు ఈసు పూని నాయకునితోఁ కలహించుట) చేతను, లీలయా = విలాసముచేతను, సమస్తభావైః = సకలచేష్టలచేతను, స్త్రియః = స్త్రీలు, బన్ధనం ఖలు = (పురుషులకు) కట్టు సుమా.

తా.—స్త్రీలయొక్క సేఁతనవ్వు, అనురక్తి, సిగ్గు, భయము, పెడమొగంపు టరకడకంటిచూడ్కులు, మాటలు, ఈసువలనియలుక, విలాసము, ఇది యది యననేల సమస్తచేష్టలును, పురుషులను వశీకరించును.

చ. చెలువపుఁ జేటలేనగవుచేతను భావముచేత సిగ్గుచే
నలువగలీలచేత సుగుణంబులచేఁ గడఁగంటిమాపుచేఁ
గలహముచేత విందులగు కందువమాటలచే ననూయచేఁ
జెలువన నెంతవారి వలపింతురు కాంతలు పెక్కుభంగులన్.

వ్యా.—తత్ర అలమ్బనవిభావయోః స్త్రీపురుషయో ర్మధ్యే స్త్రీణాం ప్రశస్తత్వా దేకోనవింశత్యా శ్లోకైః ప్రథమం స్త్రీప్రశంసాం చికీర్షు స్తత్రాదౌ తావ త్తాసాం బన్ధనహేతుత్వ మాహ - స్మితే నేతి.— స్మితేన యౌవనాదిమదవికారజనితాకస్మికమన్దహాసేన- 'ఆకస్మికం తు హసితం యౌవనాదివికారజమి' తి వచనాత్ - బాల్య యౌవన సంధావుత్పన్నః శృఙ్గారవిషయః ప్రథమాన్తఃకరణవికారో భావ స్తేన చ - త దుక్తం -

'చిత్తస్య వికృతిః సత్త్వం వికృతేః కారణే సతి,
తత్రాఽల్పా వికృతి ర్భావో బీజ స్యాదివికారవత్.' ఇతి -

'హావేనే'తి పాఠే 'ఈషద్దృష్టవికారః స్యాద్భావో హావః ప్రకీర్తిత ఇ' త్యుక్తలక్షణేన చేష్టా విశేషేణ చ, లజ్జయా కుచకుమ్భ దోర్మూలాచ్ఛాదన వదనవినమన దర నిమీలిత నయనత్వానుభావక మనస్సంకోచనరూప వ్రీడయా చ - 'చేతస్సంకోచనం వ్రీడానఙ్గరాగస్తవాదిభి రి' తి లక్షణాత్, భియా, ఆకస్మికభయ జనితత్రాసే నేత్యర్థః - తదుక్తమ్- 'ఆకస్మికభయా చ్చిత్తక్షోభ స్త్రాసః ప్రకీర్తితః' ఇతి, 'లజ్జయా గుణై రి' తి పాఠే ఆసామే వాలమ్బనభూతానాం రూపయౌవనాది గుణై రి త్యర్థః - 'ఆలమ్బనగుణో రూపయౌవనాది రుదాహృతః' ఇ త్యుక్తత్వాత్, పరాఙ్ముఖైః హ్రియార్ధాస్ఫుటప్రసారిభి రి త్యర్థః, అర్ధకటాక్షవీక్షణైః అసమగ్రాపాఙ్గావలోకనై శ్చ - కటాక్షలక్షణం తు - సంగీతరత్నాకరే -.

'య ద్గతాగతవిశ్రాన్తవైచిత్ర్యేణ వివర్తనమ్
తారకాయాః కలాభిజ్ఞా స్తత్ కటాక్షం ప్రచక్షతే.' ఇతి,

వచోభి శ్శుకకోకిలమనోహరమ్మధురాలాపై శ్చ, ఈర్ష్యయా పరోత్కర్షాసహనరూపా

సూయయా.—యః కలహ స్తేన చ- 'పరోత్కర్షాసహిష్ణుత్వ మీర్ష్యాం ప్రాహు ర్మనీషిణః' ఇతి లక్షణాత్ - య ద్వా - ఈర్ష్యయా కలహేన ప్రణయకలహేన చేతి ద్వన్ద్వైకవద్భావః * 'సర్వో ద్వన్ద్వో విభాషైకవద్భవతీ' త్యనుశాసనాత్, లీలయా వాగాదిభిః ప్రియానుకరణరూపవిలాసవిశేషేణ చ-'లీలా ప్రియానుకరణం వాగ్భిర్గత్యాఽథ చేష్టయే' తి లక్షణాత్, కిం బహునా సమస్తభావైః స్తమ్భ రోమాఞ్చస్వేదాదిసాత్త్వికభావైః హర్షౌత్సుక్యావహిత్థాదిసఞ్చారిభావై శ్చే త్యర్థః, స్త్రియః బన్ధనం ఖలు, పుంసాం సంసారబన్ధహేతవః ఖ ల్వి త్యర్థః, లిఙ్గవచనవ్యత్యయో నిత్యనపుంసకత్వేన జాత్యభిప్రాయేణ చ - 'వేదాః ప్రమాణమ్' ఇతి వ ద్ద్రష్టవ్యః ;

అత్ర స్మితకటాక్షాలాపాః అనుభావాః - 'కార్యభూతోఽనుభావ స్స్యా త్కటాక్షాది శ్శరీరజ' ఇ త్యుక్తత్వాత్, లజ్జాభయేర్ష్యాః సంచారిభావాః, భావలీలే శృఙ్గారచేష్టావిశేషా, ఇతి ద్రష్టవ్యమ్ - త దుక్తమ్ -

'భావో హావ శ్చ హేలా చ మాధుర్యం ధైర్య మి త్యపి
లీలా విలాసో విచ్ఛిత్తి ర్విభ్రమః కిలకిఞ్చితం
మోట్టాయితం కుట్టమితం బిబ్బోకో లలితం తథా
కుతూహలం చ చకితం విహృతం హాస ఇ త్యపి
ఏవం శృఙ్గారచేష్టా స్స్యు రష్టాదశవిధా మతాః.' ఇతి;

ఈదృక్సాధనసంపన్నానాం స్త్రీణాం బన్ధహేతుత్వం కిం వక్తవ్య మితి భావః. తథా చైతాసాం శృఙ్గార నాయికానాం మధ్యే భావలజ్జాభయవత్యో ముగ్ధాః, స్మితార్ధకటాక్షమధురాలాపవత్యో మధ్యమాః, ఈర్ష్యాకలహలీలావత్యః ప్రౌఢా, శ్చేతి వివేకః.

'ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిజితమన్మథా,
లజ్జామన్మథమధ్యస్థా మధ్య మోదితయౌవనా;
స్మరమన్దీకృత వ్రీడా ప్రౌఢా సంపూర్ణయౌవనే' తి.

వంశస్థవృత్తమ్.

---

భ్రూచాతుర్యాత్ కుఞ్చితాక్షాః కటాక్షాః,
స్నిగ్ధా వాచో, లజ్జితాన్తా శ్చ హాసాః,
లీలామన్దం ప్రస్థితం చ, స్థితం చ,
స్త్రీణా మేత ద్భూషణం చాయుధం చ. 3.

టీక.—భ్రూచాతుర్యాత్ - భ్రూ = కనుబొమలయొక్క - చాతుర్యాత్ = నేర్పువలన, కుఞ్చితాక్షాః - కుఞ్చిత = ముడింపఁబడిన - అక్షాః = కన్నులుగల, కటాక్షాః =



కడకంటిచూపులును, స్నిగ్ధాః = ప్రేమతోడి, వాచః = పలుకులును, లజ్జిత అన్తాః = లజ్జచేత రమణీయములయిన, హాసా శ్చ = నవ్వులును, లీలా మన్దం - లీలా = మురువుచేత - మన్దం = మెల్లనైన, ప్రస్థితం = నడకయు, స్థితం చ = నిలుకడయు, ఏతత్ = ఇది, స్త్రీణాం = స్త్రీలకు, భూషణం = అలంకారము, ఆయుధం చ = కైదువును, (అగును).

తా. కన్నులను ముంచించి చదురుగా బొమలు త్రిప్పుచు చూచు కడకంటి చూపులు, ప్రేమతోడిపలుకులు, లజ్జారమ్యములయిన నవ్వులు, సవిలాసమందగమనములు, నిలుకడలు, ఇవి యెల్లను, స్త్రీలకు ఆభరణములుగాను పురుషుల గెలుచుటకు పోటుముట్లుగాను ఉన్నవి.

తే. భ్రూలతాక్షేపకుంచిత స్ఫురణఁ దాల్చు । కలికిచూపులు, నెయ్యంపుఁ బలుకుఁదీపు,
సిగ్గునగవులు, చెన్నగు చిన్నినడలు, । సొమ్ము లాయుధములుఁ ముద్దు గుమ్మలకును.

వ్యా.—ఉక్త మర్థం ప్రకారాన్తరే ణాహ - భ్రూచాతుర్యా దితి.—భ్రువో - శ్చాతుర్యా ల్లలితాక్షేపవైచిత్ర్యా, త్కుఞ్చితాని కుణీకృతా న్యక్షీణి యేషాం తే తథోక్తాః* 'బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్షచ్' ఇతి షచ్, కటాక్షాః అపాఙ్గేక్షణాని చ, ఏతేన రేచితభ్రుకుట్యాఖ్యౌ వ్యాపారవిశేషా వుక్తౌ, తదుక్తమ్ -

'స్యా ద్భ్రువో ర్లలితాక్షేప ఏకస్యా ఏక రేచితమ్,
ద్వయో ర్మూల సముత్క్షేపకౌటిల్యా ద్భ్రుకుటిం విదుః.' ఇతి,

స్నిగ్ధాః స్నేహ పరిప్లుతా, వాచ శ్చ - స్నేహలక్షణం తు -

'విస్రమ్భే పరమాం కాష్ఠా మారూఢే దర్శనాదిభిః,
యేనాన్తరఙ్గం ద్రవతి స స్నేహ ఇతి కథ్యతే.' ఇతి,

లజ్జిత మన్తం యేషా న్తే లజ్జితాన్తా లజ్జావసానా, హాసా శ్చ-తథాభూతహాసానా మేవ మోహనత్వాత్ - అన్యథా హాస్యర సాపర్యవసానా దితి భావః, లీలామన్దం లీలామధురం, ప్రస్థితం ప్రస్థానమ్ గమన మితి యావత్, స్థిత మవస్థానం చే త్యుభయ త్రాపి *భావే క్తః, ఇ త్యేత త్సర్వం స్త్రీణాం భూషణం చ చాతుర్యాతిశయ హేతుత్వాత్, ఆయుధం శస్త్రం చ యువజనవిషయ సాధనత్వా దితి భావః.

అత్ర కటాక్షాదీనాం లక్షణాని ప్రాగే వోక్తాని, సంచారలీలా శృఙ్గారచేష్టా, భ్రుకుట్యాదయోఽన్యే అనుభావా ఇతి జ్ఞేయమ్; తథా లీలామన్థరగమనస్య పద్మినీనియతలక్షణా త్పద్మినీయే తైతాసాం లజ్జాతిశయత్వం సూచ్యతే - త దుక్తం రతిరహస్యే-

'వ్రజతి మృదు సలీలం రాజహంసీవ తన్వీ,
త్రివళిలలితమధ్యా, హంసవాణీ సువేషా,
మృదు శుచి లఘు భుఙ్క్తే, మానినీ గాఢలజ్జా,
ధవళకుసుమవాసో వల్లభా పద్మినీ స్యాత్.'

అత్ర భ్రుకుట్యాదిసముదాయే భూషణత్వాయుధత్వరూపణా ద్రూపకాలంకారః. శాలినీవృత్తమ్.

---

అవ.—దృగ్వర్ణనము.

క్వచిత్ సభ్రూభఙ్గైః, క్వచి దపి చ లజ్జాపరిగతైః,
క్వచి ద్భీతిత్రస్తైః, క్వచి దపి చ లీలావిలసితైః,
కుమారీణా మేతై ర్మదనసుభగై ర్నేత్రవలితైః
స్ఫురన్నీలాబ్జానాం ప్రకరపరికీర్ణా ఇవ దిశః. 4.

టీక.—క్వచిత్ = ఒకయెడ, సభ్రూభఙ్గైః = బొమ ముడితోఁ గూడినవియు, క్వచి దపి చ = మఱియొకయెడను, లజ్జా పరిగతైః = సిగ్గును పొందినవియును, క్వచిత్, భీతి త్రస్తైః = భయముచే బెదరినవియు, క్వచి దపి చ, లీలావిలసితైః - లీలా = వింతలగు నడకలచే, విలసితైః = సొంపైనవియు, మదనసుభగైః - మదన = మన్మథునిచేత-సుభగైః = మనోహరములును, (అగు), కుమారీణాం = లేజవరాండ్రయొక్క, ఏతైః నేత్ర వలితైః = ఈ కంటిప్రసరణములచేత, దిశః దిక్కులు, స్ఫురత్ నీల అబ్జానాం = విరియుచున్న నల్ల గలువలయొక్క, ప్రకర పరికీర్ణా ఇవ = మొత్తములతో వెదచల్లఁబడినవో యనునట్లు, (ఉండును).

తా.—ఒకయెడ బొమముడి దాల్చి మఱియొకయెడ సిగ్గు దాల్చి, ఒకచో భయముచే బెదరి, ఇంకొకచోట విలాసముతో సొంపొంది, మదనావేశమనోహరములై పర్వముగుదలయొక్క దృగ్విభ్రమములచే దిక్కులు అరవిరి నల్లగలువలను వెదచల్లిరో యనుటు ఒప్పారును.

ఉ. భ్రూలతికావిభంగయుతముల్ సభయంబులు సత్రపంబు లు
ద్వేలవిలాసముల్ మదన దీపనముల్ రుచిరంబు లైనకాం
తాలసమాననేత్రవలితంబులచే దిశ లెల్ల విస్ఫుర
న్నీలసరోజపత్త్రములు నిండె ననం గనుపట్టె నెంతయున్.

వ్యా.—అథ శృఙ్గారానుభావదృగ్విలాసాన్ సపరికరం వర్ణయతి - క్వచిదితి.- క్వచిత్ కుత్రచిత్, సభ్రూభఙ్గైః భ్రుకుటిరేచితాఖ్యభ్రూవ్యాపారసహితైః, క్వచి దపిచ, లజ్జయా, పరిగతైః ప్రత్యాసన్నైశ్చ, స్వానుకూల్యప్రకాశకై రి త్యర్థః, తదుక్తమ్ - 'సవ్రీడాలోకనే నైవ స్వానుకూల్యప్రకాశన మి' తి, క్వచి ద్భీతిత్రస్తైః బహుళభయ సమ్భ్రాన్తైః, క్వచి దపి చ, లీలాభి గ్గత ప్రత్యాగత.విలాసవిశేషై స్తైః తునా - విలసితైః కమనీయైః ఉజ్జ్వలై ర్వా, తథా మదనేన - సుభగై ర్మనోహరైః - విర



క్త స్యాపి చిత్తక్షోభకరై రి త్యర్థః - 'యద్దర్శనా ద్విరక్తోఽపి క్షుభ్యతే త త్సుమన్మథమి' తి లక్షణాత్, ఏతై రుక్తప్రకారైః, కుమారీణాం తరుణీనామ్, ఉత్పలాక్షీణామితి భావః * 'వయసి ప్రథమే' ఇతి జీప్, నేత్రవలితై ర్నయనవిలాసైః, దిశః, స్ఫురతాం వికసితానాం నీలాబ్జానాం, నీలోత్పలానాం - ప్రకరై ర్నికురుమ్బైః, పరికీర్ణా ఇవ వ్యాకీర్ణా ఇవ, లక్ష్యన్త ఇతి శేషః. ప్రసిద్ధక్రియాధ్యాహారో న దోష ఇ త్యాహ వామనః - 'లిఙ్గాధ్యాహారా' వి త్యత్ర.

అత్ర నయనవిలాసానాం ప్రియజనాదిరమ్యవస్తుదర్శన చాపలం వినా అసమ్భవాత్కుతూహలం నామ శృఙ్గారచేష్టితం సూచ్యతే - 'కుతూహలం రమ్యదృష్టౌ చాపలం పరికీర్తిత మి' తి లక్షణాత్. భ్రుకుట్యాదీనాం లక్షణం ప్రాగేవో క్తమ్; తథా నయనవలన క్రియయా వికీర్ణత్వక్రి యోత్ప్రేక్షణాత్ క్రియానిమిత్తక్రియాస్వరూపోత్ప్రేక్షా-

'యత్రాన్య దపి సంబద్ధా దన్యత్వే నోపకీర్తితమ్,
ప్రకృతం హి భవే త్సాన్ఙ్గా స్తా ముత్ప్రేక్షాం ప్రచక్షతే.'

ఇతి లక్షణాత్; తయా చ నయనానాం నీలోత్పలసామ్యం గమ్యతే. తేన చోపమా వ్యజ్యత ఇ త్యలంకారే ణాలంకారధ్వనిః. శిఖరిణీవృత్తమ్.

---

అవ.—జవరాండ్ర సహజాలంకారము.

వక్త్రం చన్ద్రవికాసి, పఙ్కజపరీహాసక్షమే లోచనే,
వర్ణః స్వర్ణ మపాకరిష్ణు, రలినీజిష్ణుః కచానాం చయః,
వక్షోజా విభకుమ్భవిభ్రమహరౌ, గుర్వీ నితమ్బస్థలీ,
వాచాం హారి చ మార్దవం, యువతిషు స్వాభావికం మణ్డనమ్. 5.

టీక.—చన్ద్రవికాసి = చంద్రునివలె ప్రకాశించు, వక్త్రం = ముఖమును, పఙ్క... క్షమే - పఙ్కజ = తామరలయొక్క (తామరలను) - పరీహాస = పరిహసించుటయందు - క్షమే = నేర్పుగలవైన, లోచనే = కన్నులును, స్వర్ణమ్ = సంపెంగను, అపాకరిష్ణుః = తోలఁగఁద్రోయునట్టి, వర్ణః = (మేని) వన్నెయు, అలినీ జిష్ణుః = తుమ్మెదకొమ్మలయొక్క ( - కొమ్మలను) జయించు నట్టి, కచానాం చయః = తల వెండ్రుకల సమూహమును, ఇభ...హరౌ - ఇభకుమ్భ = ఏనుఁగుకుంభములయొక్క - విభ్రమ = సొబగును, హరౌ = హరించు, వక్షోజౌ = పాలిండ్లును, గుర్వీ = ఘనమైన, నితమ్బ స్థలీ = శ్రోణిప్రదేశంబును, వాచాం = మాటలయొక్క, హారి = మనోహరమైన, మార్దవం చ = మృదుత్వమును, యువతిషు = గుబ్బెతలకు, స్వాభావికం = సహజమైన, మణ్డనమ్ = సొమ్ము.

తా.—చంద్రబింబమువంటి ముఖము, తామరలవంటి నేత్రములు, సంపెంగవన్నె మేను, తుమ్మెదకొమ్మలవంటి నల్లనితలకట్టు, ఏనుఁగుకుంభస్థలములవలె సొబగారు పాలిండ్లు, విపులమయిన పిఱుంద, మనోహరమయిన వాక్మార్దవము, ఇవి జవ్వనులకు తెచ్చిపెట్టుకోని యలంకారములు.

ఉ. తమ్ముల నేలుకన్నులు, సుధానిధిఁ బోలుమొగంబు, మత్తభృం
గమ్ముల గెల్చుకొప్పు, కనకద్యుతి మీఱు మెఱుంగు, కుంభికుం
భమ్ముల నవ్వు గుబ్బచనుబంతులు, గొప్పపిఱుంద, తేనియ
ల్చిమ్మెడు ముద్దుఁబల్కులును, జేయనిసొమ్ములు సుందరాంగికిన్.

వ్యా.—అథ య దుక్త ముద్దీపనవిభావ శ్చతుర్విధ ఇతి, తత్ర ప్రథమోద్దిష్టాలమ్బన గుణకథన ముత్తరత్ర కరిష్యత ఇ త్యుపేత్య ‘స్మితేన’ ఇత్యాదిశ్లోకత్రయేణ కాశ్చి చ్ఛృఙ్గారచేష్టాః కేచి దనుభావాః సంచారిణ శ్చ వర్ణితాః. ఇదానీం తు తదలంకరణం వివక్షు స్తస్య నైసర్గికాహార్యభేదేన ద్వైవిధ్యా దాహార్యక మనుపద మేవ లక్ష్యత ఇతి మనసి కృత్వా సంప్రతి నైసర్గికం మణ్డన మాహ - వక్త్రమితి.—చన్ద్రివ ద్విశసతి తాచ్ఛీల్యే నేతి చన్ద్రివికాపి సున్దర మి త్యర్థః * తాచ్ఛీల్యే ణినిః, వక్త్రం వదనం చ, పఙ్కజానాం పద్మానాం - పరిహాసక్షమే అవహేళనసమర్థే తత్సదృశీ ఇతి యావత్, లోచనే నయనే, పరీహా సే త్యత్ర * ఉపసర్గస్య ఘ ఞ్యమనుష్యే బహుళ మి ’ తి దీర్ఘః, స్వర్ణం చమ్పకపుష్పం * ‘పుష్పమూలేషు బహుళమ్’ ఇతి లుక్ - త దపాకరిష్ణుః తత్సదృశ ఇ త్యర్థః - ఏతేన పద్మినీత్వం మాచ్యతే - ‘కాఽపి చామ్పేయగా రీ ’ తి లక్షణాత్, వర్ణో దేహకాన్తి శ్చ, తథా అలినీనాం భృఙ్గాఙ్గనానాం - జిష్ణు ర్జయశీలః - తత్సన్నిభ ఇ త్యర్థః * ‘గ్లా జి స్థ శ్చ క్స్ను రి ’ తి క్స్నుప్రత్యయః, కచానాం చయః కేశపాశ శ్చ, ఇభకుమ్భరౌ విభ్రమహరౌ విలాసహారిణౌ, కరివరశిరః పిణ్డకల్పా వి త్యర్థః - ని. ‘కుమ్భౌ తు శిరసః పిణ్డా వి ’ త్యమరః, వక్షోజౌ కుచకుమ్భౌ చ, గుర్వీ దుర్భరా * ‘ వోతో గుణవచనా ది ’ తి ఙీష్, నితమ్బస్థలీ కటీపశ్చాద్భాగ శ్చ - ని. ‘పశ్చా న్నితమ్బః స్త్రీకట్యా’ ఇ త్యమరః * ‘జానపదే’ త్యాదినా అకృత్రిమార్థే ఙీష్, హర తీతి హారి మనోహరం * పూర్వవ ణ్ణినిః, వాచాం, మార్దవం వాఙ్మాధుర్యం మధుర కోమలాలాప శ్చే త్యర్థః, ఏతత్సర్వం, యువతిషు తరుణీషు, స్వాభావికం స్వభావసిద్ధం * ‘తత ఆగత ’ ఇతి ఠక్, మణ్డనం, తరుణీనా మేత న్నైసర్గికాలంకరణ మి త్యర్థః.

అత్ర చన్ద్రివికా సీ త్యాదిశబ్దాః ప్రాయశ స్సాదృశ్యవాచకాః, అత ఏ వోపమాలంకారః - తదుక్త మాచార్యదణ్డినా-



‘స్పర్ధతే జయతి ద్వేష్టి హస తీర్ష్యతి త్యసూయతి
త దన్వే త్యనుబధ్నాతి తచ్ఛీలతి నిషేధతి
తచ్చ వాఽనుకరో తీతి శబ్దా స్సాదృశ్యవాచకాః.’ ఇతి.

---

అవ.—స్త్రీ వర్ణనము.

స్మితం కించి న్ముగ్ధం, సరళతరళో దృష్టివిభవః,
పరిస్పన్దో వాచా మభినవవిలాసో క్తిసరసః,
గతానా మారమ్భః కిసలయితలీలాపరికరః,
స్పృశన్త్యా స్తారుణ్యం కి మివ హి న రమ్యం మృగదృశః! 6.

టీక.—స్మితం = చిఱునవ్వు, కించిత్ = కొంచెమును, ముగ్ధం = సుందరమును; దృష్టి విభవః = చూపుల సొంపు, సరళతరళః - సరళ = వంకరలేక - తరళః = ప్రకాశించునది, వాచాం = మాటలయొక్క, పరిస్పన్దః = పలుకుట, అభి...సరసః—అభినవ = క్రొత్త - విలాస = సొంపుగల - ఉక్తి = పలుకులచేత - సరసః = చతురమైనది, గతానామ్ = నడకలయొక్క, ఆరమ్భః = వ్యాపారము, కిస...కరః - కిసలయిత = చిగిర్చిన (క్రొత్తగా పుట్టిన) - లీలా = విలాసములనెడి - పరికరః = పరివారముకలది, తారుణ్యం = జవ్వనమును, స్పృశన్త్యాః = అందుకొనుచున్న, మృగదృశః = లేడికన్నుల వంటి కన్నులుగల దానిది (సుందరిది), కిమ్ ఇవ = ఏది, రమ్యం = మనోహరము, న హి = కాదు.

తా.—యౌవనోదయమందు సుందరియొక్క చేష్టిత మెల్ల మోహకముగా నుండును; - చిఱునవ్వు అల్పముగాను సుందరముగాను ఉండును, చూపులసొబగు అప్పటికింకను వంకర లేక ప్రకాశించుచుండును, మాటలయందు ఒకచదురు అంకురించును, నడచునప్పుడు ఒకక్రొత్తవిలాసము పరివారమువలె నాశ్రయించియుండును.

ఉ. ఇంచుకముద్దులే నగవు, లింపగునవ్యవిలాసనూక్తు, ల
భ్యంచితలోలదృష్టియు, నవారుణపల్లవమండలంబు ని
ర్మించు సలీలయానములు, మేలుగ యౌవనలక్ష్మితోడ వ
ర్తించు మృగాక్షి చందము లతిప్రమదంబు ఘటింపఁ జాలవే!

వ్యా.—అ థాలమ్బనగుణం యౌవన మాహ-స్మితమితి.—స్మితం మన్దహాసః కించి దీష న్ముగ్ధం సున్దరం భవ తీతి యథాయోగ మధ్యాహార్యమ్ - ని. ‘ముగ్ధః సున్దర మూఢయోః’ ఇ త్యమరః, బాల్యయౌవనమధ్యస్థత్వేన తరుణ్యాః ప్రాగల్భ్యాభావాత్

స్మిత స్యేవ స్నిగ్ధత్వ ముక్త మిత్యవగన్తవ్యమ్, దృష్టివిభవో విలోకనసంపత్తిః, సరళమ్ అకుటిలం యథా తథా తరళ శ్చఞ్చలో భవతి, వాచాం పరిస్పన్దో వాగ్వ్యాపారోఽపి అభినవా నూతనా - విలాసా యాసాం తా యా - ఉక్తయో వచనాని - తాభిః సరసో రసయుక్తః రుచిర ఇతి యావత్, భవతి, గతానాం గతీనామ్ * కర్తరి క్తః। ఆరమ్భ ఉపక్రమః, కిసలయితః పల్లవితః * తారకాదిత్వా దితచ్ - లీలాపరికరో విలాససమృద్ధిర్యస్య తథోక్తః - విలాససంబన్ధబన్ధురో భవ తీ త్యర్థః, అత స్తారుణ్యం యౌవనం స్పృశన్త్యా, మృగదృశ స్తరుణ్యాః సమ్బన్ధి, కి మివ కిం వా, రమ్యం మనోహరం, న హి భవతి, సర్వ మపి రమ్య మేవ భవ తీ త్యర్థః, ఇయం ముగ్ధా నాయికా- 'ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిజితమన్మథా' ఇతి లక్షణాత్.

అత్ర శ్లోకద్వయే శ్లాఘ్యవిశేషణయోగా దుదాత్తతా నామ గుణః - 'శ్లాఘ్యై ర్విశేషణై ర్యోగో యస్యాశ్చ స్యా దుదాత్తతా' ఇతి లక్షణాత్. శిఖరిణీవృత్తమ్.

---

అవ.—సుందరి సర్వేంద్రియానందకారిణి యనుట.

ద్రష్టవ్యేషు కి ముత్తమమ్? మృగదృశః ప్రేమప్రసన్నం ముఖమ్.
ఘ్రాతవ్యే ష్వపి కిమ్? తదాస్యపవనః. శ్రావ్యేషు కిమ్? తద్వచః.
కిం స్వాద్యేషు? తదోష్ఠపల్లవరసః. స్పృశ్యేషు కిమ్? త ద్వపు.
ర్ధ్యేయం కిం? నవయౌవనే సహృదయైః సర్వత్ర తద్విభ్రమాః.

టీక.—సహృదయైః = రసికులకు, సర్వత్ర = ఎల్లయెడల, ద్రష్టవ్యేషు = చూడఁదగినవానిలో, ఉత్తమం=శ్రేష్ఠమైనది, కిమ్ = ఏది? మృగదృశః = సుందరియొక్క, ప్రేమ ప్రసన్నం = అనురాగముచే వికసిల్లిన, ముఖమ్ = వదనము; ఘ్రాతవ్యేషు = ఆఘ్రాణింపఁదగినవానిలో - కిమ్ (ఉత్తమమ్) = ఏది (శ్రేష్ఠము)? తత్ ఆస్య పవనః= సుందరియొక్క ముఖముయొక్క గాలి; శ్రావ్యేషు= వినఁదగినవానిలో, కిమ్..., తత్ వచః=దాని మాట; స్వాద్యేషు = రుచి చూడఁదగినవానిలో, కిమ్...;తదో...రసః- తత్ = సుందరి యొక్క - పల్లవ = చిగురువంటి - ఓష్ఠ = మోవియొక్క - రసః = మాధుర్యము; స్పృశ్యేషు = స్పృశింపఁదగినవానిలో, కిమ్..., తత్ వపుః = సుందరి యొక్క మేను; ధ్యేయం = ధ్యానింపఁదగినది, కిం..., నవయౌవనే = ఎలప్రాయమునందలి, తత్ విభ్రమాః = సుందరియొక్క విలాసములు.

తా.—రసికులకు సర్వత్ర చూడఁదగినవానిలో స్త్రీయొక్క అనురాగ వికసితమయిన వదనమును, ఆఘ్రాణింపఁదగినవానిలో తన్ముఖ మారుతమును, వినఁదగినవానిలో తద్వాక్కును, ఆస్వాదింపఁదగినవానిలో తదధరమాధుర్యమును, స్పృశింపఁదగినవానిలో తదీయ దేహమును, ధ్యానింపఁదగినవానిలో తదీయనవయౌవన విభ్రమములును, ఉత్తమములు.



సీ. చూడంగఁ దగినవస్తువులందు ఘనమెద్ది? తులలేక తగువెలందులమొగంబు;
వలపు గైకొనఁదగు వానిలో నెయ్యది? మగువలవదనాబ్జమారుతంబు;
వీనుల కింపైన వానియం దెయ్యది? కోమలాంగులముద్దు గులుకుపలుకు;
తనువు సోఁకిన సుఖం బొనరించు నెయ్యది? మెలఁతల సొబగైన మేనుదీవ;
తే. యతిమధుర మెద్ది? కాంతాధరామృతంబు; । సరసజనులకుఁ జింతింపఁ జాలు నెద్ది?
పువ్వుఁబోఁడులవెలలేని జవ్వనంబు; వెలయు । నెల్లెడఁ బడఁతుల విభ్రమములు.

వ్యా.—అథ చక్షుఃప్రభృతిషడిన్ద్రియాణా మప్యేవ లోకోత్తరప్రతినియతవిషయా న్వర్ణయతి - ద్రష్టవ్యే ష్వితి.—అత్ర ప్రశ్నోత్తరమాలికయాఽన్వయః కార్యః. ద్రష్టుం యోగ్యాని ద్రష్టవ్యాని - తేషు దర్శనీయేషు వస్తుషు * యోగ్యార్థే తవ్యప్రత్యయః, ఉత్తమం శ్రేష్ఠం వస్తు కి మితి ప్రశ్నః, ప్రేమప్రసన్నమ్ అనురాగవికసితం ప్రేమదాయీ త్యర్థః 'ద్రవీభూతం మనో యత్ర దర్శనే ప్రేమదాయిని' ఇతి లక్షణాత్, మృగదృశ స్తరుణ్యా, ముఖం వదన మిత్యర్థః - ఏవ ముత్తర త్రాపి - చక్షుఃప్రీతికరత్వాదితి భావః, ఘ్రాతవ్యేషు ఆఘ్రాతవ్యేషు కి ముత్తమ మితి ప్రశ్నః, తదాస్యపవన-స్తస్యాః తరుణ్యాః - ఆస్యపవనో ముఖమారుతః - త స్యైవ ఘ్రాణతర్పణత్వా దితి భావః - య ద్యపి ఘ్రాణేన్ద్రియవిషయో గన్ధః న తు పవనః - తథాఽపి తస్యాః పద్మినీజాతిత్వా త్తదాస్యపవనే తస్య సఙ్క్రమణాత్ 'వీణాః శ్రూయన్తే - భేర్యః శ్రూయన్తే - పుష్పా ణ్యాఘ్రాయన్తే' ఇత్యాదివ ద్గన్ధసమ్బన్ధిని పవనే తద్ధర్మ స్యోపచరితత్వా న్న విరోధః, శ్రావ్యేషు శ్రోతవ్యేషు - అత్ర * యోగ్యార్థే యత్ప్రత్యయః - ఏవ ముత్తర త్రాపి, ఉత్తమం కిమ్, తద్వచ స్తస్యా స్తరుణ్యా - వచః మృదుమధురభాషణమ్- త స్యైవ శ్రవణానన్దకరత్వా దితి భావః, స్వాద్యేషు అనుభవయోగ్యేషు ఉత్తమం కిమ్, తస్యా ఓష్ఠః పల్లవ ఇవ తస్య-రసః అధరామృత మిత్యర్థః - త స్యైవ రసనేన్ద్రియతృప్తిహేతుత్వా దితి భావః, స్పృశ్యేషు స్పర్శనయోగ్యేషు వస్తుషు ఉత్తమం కిమ్, తస్యా - వపుః కుసుమసుకుమారశరీర మిత్యర్థః - త స్యైవ నిరుపమత్వగిన్ద్రియసౌఖ్యావహత్వా దితి భావః, ఉత్తమం ధ్యేయం ధ్యానార్హం కిమ్ - ధ్యాతవ్యే ష్వి త్యర్థః, నవయౌవనం తరుణీనవతారుణ్య మేవ - త స్యైవాత్యన్తమనోరఞ్జకత్వా దితి భావః, అథ సర్వథా ముఖ్యం ధ్యేయ మాహ-సహృదయై ర్హృదయాలుభిః - రసికజనై రిత్యర్థః, సర్వత్ర సర్వదేశేషు సకలకాలేషు వా, తస్యా స్తరుణ్యా విభ్రమా విలాసాః, ధ్యేయా ఇతి శేషః. అత్ర తత్తత్ప్రసిద్ధవిషయాణా మేకత్ర సమష్టివర్ణనా న్మహాన్ శృఙ్గారపరిపోషాతిశయ ఉక్తః, ఏతే నాస్యా లోకోత్తర మాభిరూప్యం సూచ్యతే, తథా చోత్తమ

విషయాకాఙ్క్షిభి ర్విశిష్టతరుణీసమ్భోగ ఏవ కర్తవ్య ఇతి ఫలితార్థః. తత్ర ప్రశ్నోత్తర యో శ్చాతుర్యాతిశయార్థ మసకృన్నిబన్ధనా దుత్తరాలఙ్కారభేదః -

'ఉత్తరాత్ ప్రశ్న ఉన్నేయో, యత్ర ప్రశ్నోత్తరే తథా
బహుధా చ నిబధ్యేతే, త దుత్తర ముదీర్యతే.' ఇతి.

---

ఏతా శ్చలద్వలయసంహతి మేఖలోత్థ
ఝఙ్కారనూపుర † వాహృత రాజహంస్యః
కుర్వన్తి కస్య న మనో వివశం తరుణ్యో
విత్రస్తముగ్ధహరిణీసదృశైః కటాక్షైః. 8.

టీక.—చలత్...హంస్యః - చలత్ = కదలుచున్న - వలయ సంహతి = గాజులయొత్తముల నుండియు - మేఖలా = మొలనూలినుండియు - ఉత్థ = లేచిన - ఝఙ్కార = ఝుమ్మనుధ్వని చేతను - నూపుర రవ = అందెల రవళిచేతను - ఆహృత = ఆకర్షింపఁబడిన - రాజహంస్యః = రాయంచకొమ్మలుగలవారు, ఏతాః తరుణ్యః = ఈజవరాండ్రు, విత్రస్త...దృశైః - విత్రస్త = బెదరిన - ముగ్ధ = సుందరమైన - హరిణీ = జింక(చూపు)లతో - సదృశైః = సమానములైన, కటాక్షైః = కడకంటిచూపులతో, కస్య మనః = ఎవని మనస్సును, వివశం = స్వవశముతప్పినదానినిగా, న కుర్వన్తి=చేయరు?

తా.—కంకణగణ నిక్వాణంబును ఒడ్డాణంపు (జిఱుగంటల) ఝుంకారంబును అందెల రణితంబును విని సామ్యముచే రాజహంస ధ్వని యని భ్రమిసి రాజహంసాంగనలు తమవెంట రాఁగా, ఈ రమణీమణులు బెదరిన సోయగంపు జింకచూపులవంటి కడకంటి చూపులతో చూచినమాత్రాన ఏ మానవుఁడు బమ్మెరవోక యుండును!

మ. కరచంచన్మణికంకణ క్వణ రణ త్కాంచీగుణ స్వర్ణనూ
పుర నాదాహృత రాజహంసరమణుల్ పూర్ణేందుబింబాననల్
ధర నెవ్వానిమనంబు సేకొనరు ముగ్ధత్రస్తవల్లన్మృగీ
తరళాలోకన తుల్య విభ్రమ దృగంత స్తోమ పాతంబులన్.

వ్యా.—అథాసాం ముఖా ద్యలఙ్కారణవర్ణనద్వారా సకలలోకసమ్మోహకత్వ మాహ - ఏతా ఇతి.—చలన్త్యో గతివైచిత్ర్యా ద్వలమానే - యే వలయసంహతిమేఖలే- వలయసంహతిః కఙ్కణశ్రేణిః - మేఖలాశబ్దేన కాఞ్చీవాచినా తన్నిబద్ధాః కిఙ్కిణ్యో లక్ష్యన్తే - తదుత్థ స్తదుత్పన్నో యో - ఝంకారో ఝణఝణ స్తేన - నూపురాభ్యాం మఞ్జులనినాదమఞ్జీరాభ్యాం చ†పరాజితాః తిరస్కృతా-రాజహంస్యః కలహంసాఙ్గనా-యాభి స్తాః, కలనాదఘూర్ణగమన్దగమనరాజహంసరమణీయా ఇత్యర్థః - వి. 'రాజహంసో



నృపశ్రేష్ఠే కాదమ్బకలహంసయోః' ఇతి విశ్వః * 'జాతేరస్త్రీవిషయాదయోపధాత్' ఇతి జీష్ - శైషికస్య కషో వైభాషికత్వా న్న ప్రయోగః, ఏతాః పూర్వోక్తా స్తరుణ్యః, కించిదూనవింశతివార్షికాః స్త్రియ ఇత్యర్థః, విత్రస్తా చకితా - ముగ్ధాఽప్రౌఢా చ - యా హరిణీ కురఙ్గీ - త త్సదృశైః - త ద్విలోకనని భై రి త్యర్థః, కటాక్షై రపాఙ్గవీక్షణైః, ఏతే నైతాసాం పద్మినీత్వం సూచ్యతే - 'చకితమృగదృశాభే ప్రాన్తరక్తేచ నేత్రే' ఇతి లక్షణాత్, కస్య మనో, వివశం సమ్మోహితం, న కుర్వన్తి కుర్వ న్త్యే వే త్యర్థః. తరుణీలక్షణ ముక్తం రతిరహస్యే -

'బాలా స్యాత్ షోడశాబ్దా తదుపరి తరుణీ వింశతే ర్యావ దూర్ధ్వం,
ప్రౌఢా స్యాత్ పఞ్చపఞ్చాశదవధి, పరతో వృద్ధతా మేతి నారీ.'

వయోలక్షణ ముక్తమ్ -

'నిదాఘశరదో ర్బాలా పథ్యా విషయిణో భవేత్,
హేమన్తే తరుణీ యోగ్యా, ప్రౌఢా వర్షావసన్తయోః,
సన్తతం సేవ్యమానా పి బాలా ప్రథయతే బలమ్.' ఇతి.

అత్ర రాజహంసీపరాజయస్య సాదృశ్యపర్యవసానాదేకా ఉపమా, హరిణీసదృశై రిత్యత్ర చాన్యా, అనయోః పరస్పరనైరపేక్ష్యా త్సజాతీయసంసృష్టిః. ఏతా శ్చ మధ్యమా నాయికాః - 'లజ్జామన్మథమధ్యస్థా మధ్య మోదితయౌవనా' ఇతి లక్షణాత్. వసన్తతిలకావృత్తమ్.

---

కుఙ్కుమపఙ్కకళఙ్కితదేహా, గౌరపయోధరకమ్పితహారా,
నూపురహంసరణత్పదపద్మా, కం న వశీకురుతే భువి రామా. 9.

టీక.—కుఙ్కు...దేహా—కుఙ్కుమ = కుంకుమయొక్క - పఙ్క = చిక్కని ద్రవముచేత - కళఙ్కిత = గుఱుతుగల, దేహా = ఒడలుగలదియు, గౌర...హారా - గౌర = ఎఱ్ఱని - పయోధర = పాలిండ్లయందు - కమ్పిత = చలించుచున్న - హారాః = ముత్తెపుసరులు గలదియు, నూపు...పద్మా - నూపుర హంస = అంచలవంటి యందెల చేత - రణత్ = మ్రోఁగుచున్న - పద పద్మా = అడుగు దామరలుగలదియు, రామా = సుందరి, భువి = పుడమియందు, కం = ఎవనిని, న వశీకురుతే = వశముచేసికొనదు?

తా.—చిక్కని కుంకుమమైపూఁతదాల్చి, ఎఱ్ఱని పాలిండ్లపై ముత్యాలబన్న సరములు తూలుచుండ, అడుగుదామరలందు అందెలు హంసలవలె ధ్వనించుచున్న రమణి లోకములో ఎట్టిధీరు నయినను వశీకరించును.

చ. గొన బగుమేన సంకుమద కుంకుమపంక మెసంగ, నిబ్బెపుం
జనుఁగవ రత్నహారములు సారెఁ బెనంగఁ, బదాంబుజంబులన్

మొనసినగిల్కుటందియల మ్రోఁత చెలంగ, ననంగవైభవం
బెనయఁగఁ గుల్కుకల్కిసొబ గెవ్వని దా వలపింప దిమ్మహిన్.

వ్యా.—కుఙ్కుమేతి.—కుఙ్కుమపఙ్కేన కాశ్మీరజకర్దమేన-ని. 'అథ కుఙ్కుమం, కాశ్మీరజన్మాగ్నిశిఖమ్' - 'పఙ్కోఽస్త్రీ శాదకర్దమౌ' ఇత్యుభయత్రాప్యమరః- అథవా ఘుసృణాపరపర్యాయకుఙ్కుమకుసుమరఞ్జితచన్దనపఙ్కేన-ని. 'కుఙ్కుమం ఘుసృణమ్' ఇత్యభిధానరత్నమాలాయామ్ - యద్వా కుఙ్కుమేన పఙ్కేన-సిన్దూరాపరనామ శృఙ్గారభూషణాఖ్యద్రవద్రవ్యవిశేషేణ చ - ని. 'సిన్దూరం నాగసమ్భవమ్। చీనపిష్టం చ నాగారం పఙ్కం శృఙ్గారభూషణమ్' ఇత్యమరః - కలఙ్కిత శ్చిహ్నితో దేహో యస్యా స్సా - కుఙ్కుమసిన్దూరాది రఞ్జకద్రవ్య శృఙ్గారితాఙ్గీ త్యర్థః, అత ఏవ గౌరయో రరుణయోః - యద్వా పద్మినీత్వాత్ శ్రీఫలసచ్ఛాయయోః - 'స్తనయుగళమనిన్ద్య శ్రీఫలశ్రీ విడమ్బి' ఇతి లక్షణాత్ - పయోధరయోః కుచకుమ్భయోః - కమ్పితా శ్చలితా - హారా ముక్తావలయో - యస్యా స్సా తథోక్తా, నూపురా మఞ్జీరా - వేవ హంసౌ - హంసావివ నూపురౌ వా - తాభ్యాం రణతీ శబ్దాయమానే - పదే ఏవ పద్మే - పద్మే ఇవ పదే వా - యస్యా స్సా, అత ఏవ రూపకోపమయోః సాధకబాధకప్రమాణాభావా త్సన్దేహసఙ్కరః, రామా సున్దరీ భువి కం పురుషం, న వశీకురుతే న స్వాయత్తీకురుతే, జితేన్ద్రియ మపి స్వాయత్తీకురుత ఇ త్యర్థః - ని. 'వశ ఆయత్తతాయాం చ' ఇతి విశ్వః * 'అభూతతద్భావే చ్విః' - 'ఊర్యాదిచ్విడాచ శ్చ' ఇతి గతిసంజ్ఞాయామ్ - 'కుగతిప్రాదయః' ఇతి సమాసః అత్ర సుప్సుపే త్యననువృత్తేః.

అత్ర హారాణాం కమ్పితత్వవిశేషణేన పయోధరయో రత్యన్తపటుత్వం సూచ్యతే, అన్యథా కమ్పనాయోగాత్, తేన చా త్యుత్కటయౌవనసమ్పత్తి శ్చ గమ్యతే, పయోధరయో శ్చ గౌరత్వవిశేషణేన రూపసమృద్ధి ర్వ్యజ్యతే; ఏతే నాలమ్బనగుణలాభ ఉక్తః. ఏకం కుఙ్కుమపఙ్కేత్యనేన తటస్థోద్దీపనభావః కథితః ; తథా హారనూపురాత్మకాలమ్బనాలఙ్కరణ మభ్యుట్టఙ్కితమ్; రణత్పదప ద్మే త్యనేన సూచితో లీలాగతివిశేషరూపానుభావ శ్చ; తథా చైవంవిధసామగ్రీసముల్లసితేన -

'ఆభిరూప్య మకాఠిన్య మఙ్గానాం చాతిమార్దవమ్
ఏవమాదిగుణావస్థా ప్రథమే యౌవనే భవేత్.' ఇత్యుక్త్వా
'కృతాధరాఙ్గసంస్కారా సఖీకేళిషు లాలసా,'

ఇ త్యుక్తచేష్టావిశిష్టయౌవనపరిపూర్ణేన రమయతీతి రామేతి వ్యుత్పత్త్యా లోకోత్తరలావణ్యసమ్పన్నే నాలమ్బనవిభావే నోదితే శృఙ్గారరసార్ణవే కో వా న నిమజ్జతీతి భావః. అత్ర శ్లాఘ్యవిశేషణయోగా దుదాత్తతానామ గుణః, లక్షణం తూక్తమ్, తథా త్యన్తసుకుమారార్థసన్దర్భితత్వా త్కైశికీ వృత్తిః - 'అత్యన్తసుకుమారార్థసన్దర్భా కైశి



కీ మతా' ఇతి లక్షణాత్. దోధకవృత్తమ్ - 'దోధకవృత్త మిదం భభభా గౌ' ఇతి లక్షణాత్

---

అవ.—అబలలు ప్రబలలే అని సిద్ధాంతిరచుట.

నూనం హి తే కవివరా విపరీతవాచో
యే నిత్య మాహు రబలా ఇతి కామినీ స్తాః;
యాభి ర్విలోలతరతారక దృష్టిపాతైః
శక్రాదయోఽపి విజితా స్త్వబలాః కథం తాః? 10.

టీక.—యే = ఏకవివరులు, తాః కామినీః = ఆ (ఇట్టిప్రభావముకలవారైన) యువిదలను, అబలాః = బలహీనలు, ఇతి = అని, నిత్యమ్ = ఎప్పుడును, ఆహుః = చెప్పుదురో, తే కవి వరాః = ఆ కవి శ్రేష్ఠులు, నూనమ్ = సత్యముగా, విపరీతవాచః హి = తప్పు వచనములుగలవారు సుమా; యాభిః = ఏ స్త్రీలచేత, విలోల... పాతైః - విలోలతర = మిక్కిలి చంచలములైన - తారక = నల్లగ్రుడ్డులుగల - దృష్టి, పాతైః = చూపుల వ్రాలుటలచేత, శక్రాదయః అపి = ఇంద్రాదులు సయితము, విజితాః = గెలువఁబడిరో, తాః = ఆయువిదలు, అబలాః కథమ్ = దుర్బలలు ఎట్లు?

తా.—కామినిని అబల యని నిత్యమును చెప్పెడి కవీశ్వరులు వాస్తవమునకు విరుద్ధము చెప్పువారు సుమా. ఎవరు చంచల తారకములయిన చూపులమాత్రాన ఇంద్రాదులను సయితము గెలిచినవారో వారు అనఁగా కామినులు అబలలు అనఁగా దుర్బలలు ఎట్లగుదురు?

చ. అతివలఁ జూచి వీరబల లంచు వచించుమహాకవీంద్రు లు
ద్ధతవిపరీతవాదు, లిది దబ్బరగాదు; విలాసినీసమం
చితతరశాక్షిపాతములచే గెలువంబడి రింద్రముఖ్యులుక్,
ధృతి నటువంటివా రబల లేగతి నైరి తలంచి చూడఁగన్?

వ్యా.—అథైతాసాం ప్రాగల్భ్యం వర్ణయతి - నూన మితి.—తే కవివరాః కవీశ్వరా, విపరీతవాచో వ్యత్యస్తవచనాః, నూనం సత్యం హి, తే క ఇ త్యాకాఙ్క్షాయా మాహ - యే కవివరా, స్తాః ప్రసిద్ధాః, కామినీః, అబలాః దుర్బలా, ఇతి నిత్య, మాహుః బ్రువతే, వర్ణయ న్తీ త్యర్థః - త ఇతి సమ్బన్ధః * 'బ్రువః పఞ్చానా మాదిత ఆహో బ్రువః' ఇతి ఉసాదేశః - బ్రువ ఆహాదేశ శ్చ, కథం విపరీతవాచ ఇ త్యాకాఙ్క్షాయాం తాసాం ప్రాగల్భ్యం సాధయతి - యాభిః కామినీభి, ర్విలోలతరా అతితరళా-స్తారకాః కనీనికా-యేషు తే తథోక్తా యే -, దృష్టిపాతా లోచనప్రసారా స్తై ర్దృక్పాతైః * 'కర్తృకరణయో స్తృతీయా' ఇతి తృతీయా - 'తారకాక్ష్ణః కనీనికా' ఇ త్యమరః, శక్రాదయ

ఇన్ద్రాదయోఽపి-కిముతాన్య ఇతి భావః, విజితా నిర్జితాః-స్వాయత్తీకృతా ఇత్యర్థః, తాస్తు కామిన్యః - కథ మబలాః కుతో దుర్బలాః-కింతు ప్రబలా ఏ వే త్యర్థః, వీక్షణ మాత్రే ణైవ ఇన్ద్రాదిద్యుజ్జయినీనాం బలిష్ఠత్వం కిం వక్తవ్యమ్ - అత ఏతాసాం దౌర్బల్య ప్రతిపాదకాః కవయ ఏవ దుర్బలవాచో న తు తా ఇతి భావః.

అత్రోత్తరవాక్యార్థస్య పూర్వవాక్యార్థసమర్థకత్వా ద్వాక్యార్థహేతుకం కావ్యలిఙ్గ మలఙ్కారః - 'హేతో ర్వాక్యపదార్థత్వే కావ్యలిఙ్గ ముదాహృతమ్' ఇతి లక్షణాత్. వసన్తతిలకావృత్తమ్.

నూన మాజ్ఞాకర స్తస్యాః సుభ్రువో మకరధ్వజః
యత స్తన్నేత్రసంచార సూచితేషు ప్రవర్తతే. 11.

టీక.—మకరధ్వజః = మొసలి పిడెమువాఁడు (మన్మథుఁడు), నూనం = నిశ్చయముగా, సుభ్రువః తస్యాః = అందమయిన కనుబొమల యల్లదానికి (అలయందగత్తియకు), ఆజ్ఞాకరః = బంటు; యతః = ఎందుచేత ననఁగా, తన్నే... షు - తత్ = ఆ యందగత్తెయొక్క - నేత్ర = కన్నులయొక్క - సంచార = చలనములచేత - సూచిత = చూపఁబడిన - ఇషు = బాణములు కలుగునట్లుగా (లేక, సంచార = చలనములకు - సు + ఉచిత = మిక్కిలి యనుకూలములయిన..., లేక,...సూచిత = చూపఁబడిన వారిమీఁద - ఇషు = బాణములు గలుగునట్లుగా, లేక,...సూచితేషు = చూపఁబడిన వారియందు, లేక, పాఠమే ఇషుః అని - బాణములు గలవాఁడై), ప్రవర్తతే = మెలఁగుచున్నాఁడు.

ఇషు శబ్దవంతములయిన వివరణములయందు అందగత్తెల చూపులు మదనబాణములను బోలియున్న వని యభిప్రాయము; దొర ఎవరిని చూపి కొట్టు మనునో బంటు వారిని కొట్టునట్లు అని భా.

తా.—ఆయందగత్తియ ఏ పురుషునివైపు దృష్టులు నెఱపుచున్నదో మదనుఁడు వానిని కోలల నేసి నొంచి ఆమెకు లోఁబఱుచుచున్నాఁడు, కావున మదనుఁడు ఆ రమణికి బంటు అని తెలియ వగుచున్నది.—ఆ సుందరి ఎవనిని ఇచ్ఛగించి చూచునో వాఁడు అత్యంతము వలవంతం గూరును అని భా.

క. వారిజనముల కాజ్ఞా। కారి యగుభటుండు మరుఁడు గాఁబోలుఁ జామీ,
వారికటాక్షము సోఁకిన। వారియెడన వాఁడిఁ జూపి వర్తించుఁ గదా.

వ్యా.—అథ కామదేవస్య కామినీకింకరత్వ ముత్ప్రేక్ష్యతే - నూనమితి.—మకరధ్వజః కామదేవః, స్తస్యాః ప్రసిద్ధాయాః పూర్వోక్తాయా వా, సుభ్రువః కామిన్యాః-జాతా వేకవచనమ్ - సుభ్రువా మిత్యర్థః, ఆజ్ఞాం కరో తీ త్యాజ్ఞాకరః కింకరః



* 'కృఞో హేతు-' ఇత్యాదినా టప్రత్యయః, నూన మి త్యుత్ప్రేక్షాయామ్; కుతః - యతః కారణా, త్తస్యాః సుభ్రువో - నేత్రసంచారేణ దృష్టిప్రసారేణ - సూచితేషు సంజ్ఞాపితేషు, ప్ర వర్తతే - యథా లోకే స్వామిదృష్టిసూచితే భృత్యః ప్రవర్తతే తద్వ దిత్యర్థః - అతః కామినీనాం నూన మయం కింకర ఇతి భావః; కామినీకటాక్షమాత్రే ణైవ జనస్య మన్మథావేశసమ్భవా దియ ముత్ప్రేక్షా; సా చ నూన మితి వ్యఞ్జకసద్భావా ద్వాచ్యే - త దుక్తమ్ -

'మన్యే శఙ్కే ధ్రువం నూనం ప్రాయ ఇత్యే వమాదిభిః
ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దై రివశబ్దోఽపి తాదృశః.' ఇతి.

ఏతేన తాసా మప్రతిహతజగద్వశీకరణసామర్థ్యం వ్యజ్యతే. అనుష్టుప్.

కేశాః సంయమినః, శ్రుతే రపి పరం పారం గతే లోచనే,
అన్తర్వక్త్ర మపి స్వభావశుచిభిః కీర్ణం ద్విజానాం గణైః,
ముక్తానాం సతతాధివాసరుచిరౌ వక్షోజకుమ్భా విమౌ,
ఇత్థం తన్వి వపుః ప్రశాన్త మపి తే, రాగం కరో త్యేవ నః. 12.

టీ.—హేతన్వి = ఓకృశాంగి, తే = నీయొక్క, కేశాః = కురులు, సంయమినః = యోగ సమాధికలవి (ముడికలవి అని వాస్తవము), లోచనే అపి = కన్నులును, శ్రుతేః పరం పారం గతే = వేదముయొక్క ఉత్కృష్టమైన తుదను పొందినవి - అనఁగా వేదాంతములయిన యుపనిషత్తులను పఠించినట్టివి (చెవియొక్క యవలియంచువఱకు వ్యాపించినట్టివి - మిక్కిలి వాలికలనుట), వక్త్రమ్ = నోరు, అన్తః = లోపల, స్వభావశుచిభిః ద్విజానాం గణైః కీర్ణమ్ = ప్రకృతిచేతనే పవిత్రులయిన (తెల్లనివైన) బ్రాహ్మణుల(దంతముల) సమూహములచేత వ్యాప్తము, ఇమౌ వక్షోజ కుమ్భౌ = ఈ చను గిండులు, ముక్తానామ్ = ముక్తులయొక్క (ముత్తెములయొక్క), సత...రౌ - సతత = నిరంతరమైన - అధివాస = కాఁపురముచేత(పై యునికిచేత)-రుచిరౌ = శోభనములు (కాంతిమంతములు), ఇత్థం = ఈ విధముగా, (తే) వపుః = (నీ) శరీము, ప్రశాన్తమ్ అపి = విరాగమయ్యును, నః = మాకు, రాగమ్ ఏవ = అనురాగము నే, కరోతి = కలిగించుచున్నది.

తా.—ఓతన్వీ నీకురులు, కనులు, వక్త్రము, చనుదోయి - ఇవి (వరుసగా) సమాధిగలవి, వేదాంత పారగములు, బ్రాహ్మణబృందనివాసము, ముక్తుల నెలవును. ఇట్లు నీ దేహము విరాగ మయ్యును మాకు రాగమునే పుట్టించుట యాశ్చర్యము. ఇది విరోధము;—కాని, పూర్వోక్తావయములు (వరుసగా) ముడిగలవి, చెవితుదవఱకు వ్యాపించియున్నవి, ప్రకృతి ధవళములయిన పలువరుసలతో కూడియున్నవి, ముత్తెములు నిరంతర

ము నెలకొని యుండునందున ప్రకాశమానములును, అయియున్నవి; అందువలన నీ శరీరము రాగోత్పాదకముగా నున్నదని సమాధానము.

ఉ. వావిరిఁ గన్నుదోయి శ్రుతి పారగ, మెంతయు సంయముల్ కురుల్,
భావశుచి ద్విజప్రకర భాజన మెన్న ముఖాంతరంబు, ము
క్తావళిరమ్యముల్ కుచము, లక్కట యిట్లు ప్రశాంత మయ్యు రా
జీవదళాక్షి మేను విరచించుచున్నది మాకు రాగమున్.

వ్యా.—అథ రాగిణః శ్లేషవైచిత్ర్యా త్కామినీప్రశంసాపరం వచనం సమ్బోధన మభిధా యాహ ద్వాభ్యామ్ - కేశా ఇతి.—కేశాః శిరోరుహాః, సంయమినః సంయుతాః సమ్యఙ్నియమవన్తశ్చ, లోచనే అపి శ్రుతేః పరం పారం కర్ణాన్తవిశ్రాన్తత్వం వేదాన్తపరిశీలనతాత్పర్యం చ, గతే, అన్తర్వక్త్రం వక్త్రాభ్యన్తర మపి, స్వభావతః నిసర్గాచ్ఛుచిభిః శుభ్రైః పవిత్రైశ్చ, ద్విజానాం దన్తానాం విప్రాణాం చ - ని. 'దన్తవిప్రాణ్డజా ద్విజాః' ఇ త్యమరః, గణైః, కీర్ణం వ్యాప్తమ్, ఇమౌ ఏతౌ ఇతి హస్తనిర్దేశః, వక్షోజకుమ్భౌ కుచకుమ్భౌ, ముక్తానాం మౌక్తికహారాణాం జీవన్ముక్తానాం చ, సతతాధివాసేన నిరన్తరావస్థానేన సన్తతనివాసేన చ, రుచిరా-ని. 'ముక్తా తు మౌక్తికే ముక్తః'- 'ప్రాప్తముక్తౌ తు మోచితః' ఇ త్యుభయత్రాపి విశ్వః, అతః హే తన్వి - ఇత్థ ముక్తప్రకారేణ, తే వపుః శరీరం, ప్రశాన్తం ప్రసన్నమ్ - వైరాగ్యసాధనసంపత్తిమ దపీతి యావత్ * 'వా దాన్త' ఇత్యాదినా నిపాతః, నోఽస్మాకం, రాగ మనురక్తిమ్ - సమ్భోగాభిలాష మే వేతి యావత్, కరోతి ఉత్పాదయతి - న తు వైరాగ్య మితి విరోధః - స చోక్తరీత్యా ఆభాసితత్వా ద్విరోధాభాసోఽలఙ్కారః - 'ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఇష్యతే' ఇతి లక్షణాత్, స చ శ్లేషప్రతిభోత్థాపిత ఇతి తయో రఙ్గాఙ్గిభావేన సంకరః; లోచనే అన్తర్వక్త్ర మి త్యత్ర * ప్రగృహ్యత్వాత్ప్రకృతిభావః * 'ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్' ఇతి ప్రగృహ్యసంజ్ఞా. శార్దూలవిక్రీడితమ్.

---

ముగ్ధే ధానుష్కతా కేయ మపూర్వా త్వయి దృశ్యతే?
యయా విధ్యసి చేతాంసి గుణై రేవ న సాయకైః. 13.

టీక.—హే ముగ్ధే = ఓముగుదా, యయా = దేనిచేత, చేతాంసి = మనస్సులను, గుణైః ఏవ = నారులచేనే (రూపలావణ్యాది గుణములచేతనే), విధ్యసి = భేదించుచున్నావో, సాయకైః = బాణములతో, న (విధ్యసి) = భేదింపవో, (అట్టి యా), అపూర్వా = ముందు ఎందునులేని, ధానుష్కతా = విలునేర్పరితనము, త్వయి = నీయందు, దృశ్యతే = కనఁబడుచున్నది, ఇయం కా = ఈ నేర్పు ఏటిది?



తా.—ఓ ముద్దరాలా నీయందు ఇది ఏదో ఒక యపూర్వమయిన ధనుర్విద్య అగపడుచున్నది. ఎట్లనఁగా, ఇంతవఱకును ప్రౌఢులయిన వీరులు, కంటి కగపడునట్టి గుఱిని, బాణములతో కొట్టుటను మేము ఎఱింగియున్నాము. నీవో ముగుద వయ్యును బాణములు ప్రయోగింపకయే గుణముల (అల్లెత్రాళ్ల)తోనే కంటికి అగపడనివైన మనస్సులను కొట్టుచున్నావు. కావున నీవిలువిద్య అభూతపూర్వము అని యాశ్చర్యము. నీ యౌవనోదయదశయు నీ రూపలావణ్యాది గుణములును నినుఁ బొందని కోడెకాండ్ర మనస్సులందు అత్యంత ఖేదమును కలిగించుచున్నవను నభిప్రాయముచే సమాధానము.

క. శరములచే భేదింపక । నిరతముఁ జేసెదవు హృదయ నిర్భేదము భా
సురగుణములచే; నద్భుత । కర చాపప్రౌఢి నీకె కలదు లతాంగీ.

వ్యా.—ముగ్ధ ఇతి.—ధనుః ప్రహరణ మస్య ధానుష్కః ధన్వీ * 'ప్రహరణమ్' ఇతి ఠక్ * 'ఇసుసుక్తాన్తా త్కః' - ని. 'ధన్వీ ధనుష్మా న్ధానుష్కః' ఇ త్యమరః - తస్య భావ స్తత్తా, హే ముగ్ధే సున్దరి-ని. 'ముగ్ధ స్సున్దరమూఢయోః' ఇ త్యమరః-యద్వా హే ఉదయద్యౌవనభావే, త్వ య్యపూర్వా అదృష్టచరా-అసాధారణీతి యావత్ - ధానుష్కతా దృశ్యతే, ఇయం ధానుష్కతా, కా కీదృశీ - న జ్ఞాయత ఇత్యర్థః, కుతః - యయా ధానుష్కతయా హేతునా, చేతాంసి యువజనమనాంసి-దుర్లక్ష్యాణీతి భావః, గుణా మౌర్వ్య-రూపయౌవనాదయశ్చ-తై రేవ, విధ్యసి సంప్రహరసి, సాయకైః బాణైస్తు, న విధ్యసి, యతః లోకే ధానుష్కాః ప్రౌఢా ఏవ సులక్ష్యా ణ్యేవ లక్ష్యాణి బాణై రేవ విధ్యన్తి, త్వం తు ముగ్ధాఽపి దుర్లక్ష్యా ణ్యపి లక్ష్యాణి మౌర్వీభి రేవ విధ్య సీతి కృత్వా త్వదీయధానుష్కతాయా అపూర్వత్వా దజ్ఞేయత్వ మితి భావః; స్త్రీణాం రూపయౌవనగుణసమ్పత్తి రేవ పరప్రహరణసాధన మితి ఫలితార్థః.

అత్ర పూర్వవాక్యార్థ స్యోత్తరవాక్యార్థసమర్థితత్వా ద్వాక్యార్థహేతుకం కావ్యలిఙ్గమ్; తచ్చ గుణయోః శ్లేషభిత్తికాభేదాధ్యవసాయమూలాతిశయోక్తినిర్వ్యూఢ, మి త్యనయో రఙ్గాఙ్గిభావేన సంకరః; తేన చ ప్రసిద్ధా ద్ధానుష్కా దుపమానా దుపమేయభూతముగ్ధాయా ఆధిక్యప్రతీతే ర్వ్యతిరేకో వ్యజ్యత ఇ త్యలఙ్కారే ణాలఙ్కారధ్వనిః. అనుష్టుప్.

---

సతి ప్రదీపే, స త్యగ్నౌ, సత్సు తారా రవీన్దుషు,
వినా మే మృగశాబాక్ష్యా తమో భూత మిదం జగత్. 14.

టీక.—ప్రదీపే = దీపము, సతి = ఉన్నను, అగ్నౌ = నిప్పు, సతి = ఉన్నను, తారా రవి ఇన్దుషు = చుక్కలు సూర్యుఁడును చంద్రుఁడును, సత్సు = ఉన్నను, మృగశాబ అక్ష్యా వినా = లేడి పిల్ల కన్నులవంటి కన్నులుగలది (అయిన యా ప్రేయసి)

లేక, ఇదం జగత్ = ఈ లోకము, మే = నాకు, తమో భూతమ్ = చీఁకటి ఐనది.

తా.—వెలుఁగు నిచ్చునవి, పగటియందు సూర్యుఁడును, రాత్రియందు దీపనక్షత్ర చంద్రులును, సంధ్యలయందు అగ్నియు, ఉన్నను, ఆ యంగనామణి లేమిచే నాకు లోకమంతయు చీఁకటిగా నున్నది.—ఆ ప్రేయసి లేనిదుఃఖముచే జడుఁడనైయున్నా నని భా.

ఆ. వెక్కుదివియ లున్న జక్కవచెలి యున్న । రిక్కరాయఁ డున్నఁ జుక్క లున్నఁ
జిన్ని లేడిచూడ్కి చేడియ నెడఁబాయు । నప్పు డంధకార మయ్యె జగము.

వ్యా.—స తీతి.— ప్రదీపే అర్ధప్రకాశదీప్తార్చిషి, సతి విద్యమానేఽపి, అగ్నౌ తథా భూతే వహ్నౌ, చ సత్యపి,†‘సత్యర్కే’ ఇతి పాఠే త్రిలోకప్రకాశకే సూర్యే, సత్యపి, తథా తారా†మణీన్దుషు తిమిర నిరాసకత్వేన ప్రసిద్ధేషు నక్షత్రపద్మరాగాదిమాణిక్య చన్ద్రేషు, సత్స్వపి, తథా ప్రసిద్ధయా పూర్వానుభూతయా వా, మృగశాబస్య బాలహరిణ స్యేవాక్షిణీ యస్యా స్తయా, ప్రియతమయా వినా * ‘బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః స్వాఙ్గా త్షచ్’ * ‘షి ద్గౌరాదిభ్య శ్చ’ ఇతి జీష్ - ఇదం జగ, న్మే మమ, తమోభూత మన్ధకారమయమ్, లక్ష్యత ఇతి శేషః, తస్యా ఏవ మమ నయనజ్యోతిష్ట్వా దితి భావః.

అ త్రాన్ధకార నిరాకరణ సమర్థత్వేన ప్రసిద్ధే ప్రదీపాది కారణసముదాయే సత్యపి తన్నిరాసరూప కార్యానుత్థానా ద్విశేషో క్తి రలంకారః - ‘త త్సామగ్ర్యా మనుత్పత్తి ర్విశేషో క్తి ర్నిగద్యతే’ ఇతి లక్షణాత్; తథా ప్రదీపాదిసద్భావేఽపి తమోభూతత్వ మితి విరోధ శ్చ వ్యజ్యతే; తేన చాస్య మహామోహాన్ధత్వం వస్తు గమ్యత ఇత్యలంకారేణ వస్తుధ్వనిః. వృత్తం పూర్వవత్.

---

ఉద్వృత్తః స్తనభార ఏష, తరళే నేత్రే, చలే భ్రూలతే,
రాగాధిష్ఠిత మోష్ఠపల్లవ మిదం, కుర్వన్తు నామ వ్యథామ్;
సౌభాగ్యాక్షరప ఙ్క్తి కేవ లిఖితా పుష్పాయుధేన స్వయం
మధ్యస్థాఽపి కరోతి తాప మధికం రోమావలిః కేన సా? 15.

టీక.—ఉద్వృత్తః = గర్వించినదైన (ఉదుటును బటువును అయిన అని వాస్తవము), ఏష స్తనభారః = ఈ చనుబరువు - బరువయిన యీచనులు, తరళే = చపలములయిన (ప్రకాశమానములయిన), నేత్రే = కన్నులు, చలే = స్థిరబుద్ధిలేని (చంచలములయిన), భ్రూలతే = బొమతీఁగలు, రాగ అధిష్ఠితమ్ = మత్సరముచేత (ఎఱుపుచేత) ఆక్రమింపఁబడినదైన, ఇదమ్ ఓష్ఠ పల్లవమ్ = ఈ చిగురు మోవి, వ్యథాం = వెతను, కుర్వన్తు నామ = చేసినను చేయునుగాక; పుష్పాయుధేన = విరికైదువువానిచే - మన్మథునిచేత, స్వయం = స్వయముగా, లిఖితా = వ్రాయఁబడిన, సౌభాగ్య అక్షర పఙ్క్తికా ఇవ = భర్తృవాల్లభ్యముయొక్క యక్కరముల బంతియో యనునట్లున్న, సా రోమావలిః = ఆ (యీ) నూఁగారు, మధ్యస్థా అపి = (ఏపక్షమును అవలంబింపక) ఉదాసీనము అయ్యును - (నడుమునం దున్నదయ్యును), కేన = ఎందుచేత, అధికం తాపం కరోతి = ఎక్కువ నెగులును చేయుచున్నది?



తా.—గర్వ చాప ల్యాస్థిరత్వ మాత్సర్య వంతములయిన స్తన నేత్ర భ్రూలతాధరములు వెత గొడుపుట వింత గాదు; ఏలన దుష్టులకు ఒరులను పీడించుటయే వ్రతము. మదనుఁడు స్వయముగా వ్రాసిన సౌభాగ్యాక్షరపంక్తియో యన నొప్పుచున్న యీనూఁగారు ఏపక్షమును అవలంబింపక మాధ్యస్థ్యము చేయవచ్చిన దయ్యును ఇదియు మమ్ము మిక్కిలి నెవులు గొల్పుట ఆశ్చర్యముగా నున్నది.

నీవలుఁదచన్నుల యుదుటును బటువును, బిత్తరపుఁజూపులును, బొమతీవల విభ్రమములును, మోవికెంపును, అన్నిటికన్న నధికముగా, మరుఁడు స్వయముగా లిఖించిన సౌభాగ్యలిపియోయన నొప్పారుచున్న యీనూఁగారును మాకు నీపై అత్యంత కామావేశముం గలిగించి నినుఁ బొందఁ దడవగుచున్నందున మిక్కిలి వెతను గుడుపుచున్నవి; దయ చేసి మాం దనుగ్రహింపుము; అని భా.

చ. గరువపుఁజన్నులుం, బెళుకుఁ గన్నులు, నిల్కడలేని కన్బొమల్,
మురియుచు నెఱ్ఱవాఱు జిగిమోవియుఁ, దాపముఁ జేయఁగాఁ దగుఁ;
స్మరలిఖితోరుభాగ్య లిపిజాల మనం దగి మధ్యవర్తియై
పరఁగినరోమరాజియును బాయక తాపముఁ జేయ నాయమే?

వ్యా.— ఉద్వృత్త ఇతి.—ఉద్వృత్తో ఽత్యన్తవర్తులః ఉత్పథగత శ్చ, ఏష ఇతి పురోవర్తినో హ స్తనిర్దేశః, స్తనభార శ్చ, తరళే లీలావిలోలే-చపలే చేతి గమ్యతే, నేత్రే, చలే రేచితాది విలాస చఞ్చలే స్థిరత్వవిహీనే చ, భ్రూలతే చ, రాగేణ లౌహిత్యేన మాత్సర్యేణ - చాధిష్ఠితమ్ - తదుభయయుక్త మిత్యర్థః - ని. ‘రాగ శ్చ రక్త మాత్సర్య క్లేశాదౌ లోహితేషు చ’ ఇత్యుభయ త్రాపి విశ్వః శాశ్వత శ్చ, ఇద మితి నిర్దేశః, ఓష్ఠపల్లవం అధరకిసలయం, చేత్యేతానీతి శేషః, వ్యథాం మనఃపీడాం, కుర్వన్తు, నామేతి కుత్సాయామ్, ఖలానాం పరపీడాకరణస్య స్వాభావికత్వా దితి భావః; కింతు పుష్పాయుధేన కామదేవేన, స్వయం స్వహస్తేన, లిఖితా, సౌభాగ్యాక్షర మాలికా సౌభాగ్య వ్యఞ్జక పుణ్యవర్ణ పఙ్క్తి రివ స్థితే త్యుత్ప్రేక్షా, తథా, మధ్యస్థా అవలగ్నప్రదేశవిలగ్నా తటస్థాఽపి, సా రోమావలిః రోమరాజిః, కేన వా హేతునా, అధికం, తాపం కరోతి మన స్సంతాపయతి, విశిష్టతటస్థస్య పరసంతాపకరణానౌచిత్యా దితి భావః.

అత్ర పూర్వార్ధే ఉద్వృత్తత్వాదిపదార్థానాం శ్లేషభఙ్గ్యా స్వాభావ్యేన చ విశేషణగత్యా పీడాకరణం పదార్థం ప్రతి హేతుత్వకథనా త్పదార్థహేతుక మేకం కావ్యలిఙ్గమ్; ఉత్తరార్ధే తు తటస్థపదార్థస్య శ్లేషభఙ్గ్యైవ కేన సంతాపయతీ త్యా

క్షేపపదార్థం ప్రతి హేతుత్వకథనా దపరం చ; తచ్చోక్తో త్ప్రేక్షయా సాపేక్షత్వా త్సంకీర్ణమ్; త త్పూర్వవాక్య కావ్యలిఙ్గేన నైరపేక్ష్యా త్సంసృజ్యత ఇ త్యనయోః సజాతీయసంసృష్టిః; ఏతేన స్తనభారాదే ర్లోకో త్తరలావణ్యసంపన్నత్వ మత్య న్తజనస మ్మోహక త్వేన సూచ్యతే. శార్దూలవిక్రీడితం వృత్తమ్.

---

ముఖేన చన్ద్రకాన్తేన, మహానీలైః శిరోరుహైః,
కరాభ్యాం, పద్మరాగాభ్యాం, రేజే రత్నమయీవ సా. 16.

**టీక.**—చన్ద్రకాన్తేన = చంద్రునివలె మనోహరమైన (చంద్రకాంతమణియైన యని యర్థాంతరము), **ముఖేన** = **ముఖము**చేతను, మహానీలైః = మిక్కిలి నల్లనైన (మహానీలమణులైన), **శిరోరుహైః** = తలవెండ్రుకలచేతను, పద్మరాగాభ్యాం = **తామరల యెఱుపువంటి యెఱుపుగలవైన** (పద్మరాగమణులయిన), కరాభ్యాం = చేతులచేతను, **సా** = ఆచెలువ, రత్నమయీ ఇవ = రత్నప్రచురయో యన, రేజే = విలసిల్లెను.

**తా.**—ఆ కొమ్మ - ముఖము చంద్రకాంతము (చంద్రునివలె మనోహరము) గాను, **కురులు** మహానీలములు (మిక్కిలి నల్లనివి) గాను, చేతులు పద్మరాగములు (తామరలయెఱుపుగలవి) గాను ఉండుటంబట్టి రత్నములతో నిండినదో యనునట్లు ప్రకాశించినది.

**తే.** మిగుల శశికాంత మైనసెమ్మోముచేత । నెరి మహానీలరుచు లైన నెఱులచేత
జలజరాగము లయినహ స్తములచేత । ర్నమయ మనఁ గామినీ రత్న మమరె.

**వ్యా.**—**ముఖేన ఇతి.**— చన్ద్రకాన్తేన ఇన్దుసున్దరేణ చన్ద్రకాన్తమణిరూపేణ చేతి **గమ్యతే, ముఖేన** చ, మహానీలై రతిమేచకైః సింహలద్వీపసంభవేన్ద్రనీలైశ్చ-శిరోరుహైః కున్తలైశ్చ - 'సింహల స్యాకరోద్భూతా మహానీలా స్తు తే స్మృతాః' ఇతి భగవా నగస్త్యః, తథా పద్మస్య రాగ ఇవ రాగో యయో స్తౌ తాభ్యాం పద్మరాగరూపాభ్యాం చ, కరాభ్యామ్, సా సున్దరీ, రత్నమయీ రత్నరూపేవ, రేజే * 'తత్ప్రకృతవచనే మయట్' * 'టిడ్ఢాణఞ్-' ఇత్యాదినా ఙీప్. అనుష్టుప్.

---

గురుణా స్తనభారేణ, ముఖచన్ద్రేణ భాస్వతా,
శనైశ్చరాభ్యాం; పాదాభ్యా రేజే గ్రహమయీవ సా. 17.

**టీక.**—గురుణా = గొప్పదియైన (బృహస్పతియైన), స్తనభారేణ = చన్నులబరువుచేత, భాస్వతా = ప్రకాశముగల (సూర్యుఁడయిన), ముఖచన్ద్రేణ = ముఖమనెడి చంద్రునిచేతను, శనైశ్చరాభ్యాం = మందముగా సంచరించు (శనైశ్చరులయిన), పాదాభ్యాం = అడుగులచేతను, సా = ఆకొమ్మ, గ్రహమయీ ఇవ = గ్రహప్రచురయో (గ్రహ



ములనే ఆమెయొక్క యాయాయవయవములనుగా బ్రహ్మ అమర్చెనో) యనునట్లు, రేజే = విలసిల్లెను.

**తా.**—ఆవెలఁదికి చనుబరువు గురువు (బృహస్పతి - గొప్పది), ముఖము చంద్రుండును భాస్వంతుండును (సూర్యుఁడును - భాస్వంతము = ప్రకాశముగలదియు), పాదములు శనైశ్చరులు (శనులు - శనైశ్చరములు = మెల్లగానడచునవియు) కావున నామె గ్రహమయియో యననొప్పెను.

క. గురు వగుకుచభారంబును । సరసకశోభాస్వ దాస్యచంద్రుండు శనై
శ్చరము లగుచరణములుఁ గల । కరిగమన దనర్చె నౌర గ్రహరూప యనన్.

**వ్యా.**—గురుణేతి.—గురుణా దుర్భరేణ గీష్పతిరూపేణ చ-ని. 'గురు స్తు గీష్పతౌ శ్రేష్ఠే గురౌ పితరి దుర్భరే' ఇ **త్యుభయ** త్రాపి శబ్దార్ణవే, స్తనభారేణ చ, భాస్వతా ప్రకాశవతా భాస్కరేణ చ - ని. 'భాస్వాన్ భాస్కరసూర్యయోః' ఇతి విశ్వః, ముఖమేవ చన్ద్ర స్తేన చ, శనైశ్చరాభ్యాం మన్దగమనాభ్యాం శనైశ్చరాఖ్యగ్రహాభ్యాం చ, పాదాభ్యాం చ సా గ్రహమయీవ రేజే, ప్రక్రియా తు పూర్వవత్.

అత్ర శ్లోకద్వయేఽపి శ్లేషమహిమ్నా రత్నమయత్వగ్రహమయత్వో త్ప్రేక్షణాత్ శ్లేషసంకీర్ణేయ ముత్ప్రేక్షా; తయా చాస్యా లోకో త్తరాకార రూప లావణ్య సౌన్దర్య కాన్తివిశేష భాగ్య సౌభాగ్యాది సకలకల్యాణగుణాభిరామత్వం గమ్యతే; ఏత చ్చ మదీయశృఙ్గారశృఙ్గాటకే రుక్మిణీవల్లభవ్యాఖ్యానే 'నిధిమయీ గ్రహమయీ' ఇ త్యత్ర విస్తరేణ ప్రపఞ్చిత మి తీహోపరమ్యతే. అనుష్టుప్.

---

తస్యాః స్తనౌ యది ఘనౌ, జఘనం చ హారి,
వక్త్రం చ చారు, తవ చిత్త కి మాకులత్వమ్?
పుణ్యం కురుష్వ యది తేషు త వాస్తి వాఞ్ఛా;
పుణ్యై ర్వినా నహి భవన్తి సమీహితార్థాః. 18.

**టీక.**—తస్యాః = ఆమెయొక్క, స్తనౌ = చన్నులు, ఘనౌ = గొప్పవి (క్రిక్కిఱిసినవాఁడె), జఘనం చ = మొలయు, హారి = కమనీయము, వక్త్రం చ = మొగమును, చారు = అందము, యది = అయినందులకు, చిత్త = మనస్సా, తవ = నీకు, ఆకులత్వం = కలఁత, కిమ్=ఏల; తేషు = వానియందు, తవ వాఞ్ఛా యది=నీకు కోరిక యేని, పుణ్యం = సుకృతమును, కురుష్వ = చేసికొమ్ము, (ఏలయన), పుణ్యైః వినా = పుణ్యములు లేక, సమీహిత అర్థాః = కోరఁబడిన వస్తువులు, న భవన్తి హి = కలుగవు గదా.

**తా.**—ఆకోమలియొక్క వలుదకుచములను, సొంపెసలారు మొలను, **అందంపు**

మోమునుం, గని, ఓమనసా, ఏల కలంగెదవు? నీవు వానిపై వాంఛ యేని పుణ్యము లాచరింపుము; ఏల యన అట్టియుత్కృష్టాభిలషితములు పుణ్యముచేతనే గాని సిద్ధింపవు.

చ. సుదతిపయోధరంబు లతి సుందరముల్, జఘనంబు రమ్య, మా
వదనము హృద్య, మంచుఁ జలవర్తన మేటికి నీకుఁ జిత్తమా?
కదలక వానిపైఁ దలఁపు గల్గినఁ బున్నెము లాచరింపు; మిం
పొదవ లభించునే సుకృత యోగము లేక సమీహితార్థముల్?

వ్యా.—తస్యా ఇతి.—తస్యాస్తరుణ్యాః స్తనౌ, ఘనౌ నిబిడౌ యద్యపి, జఘనం కటిపురోభాగశ్చ, హారి మనోహారి యద్యపి -ని. 'స్త్రీకట్యాః క్లీబే తు జఘనం పురః' ఇత్యమరః, వక్త్రం చ చారు మనోజ్ఞం యద్యపి, హే చిత్త, తవ, ఆకులత్వం లోలుపత్వం, కిం కిమర్థమ్ - మాస్త్విత్యర్థః - తావన్మాత్రేణాసంభవాదితి భావః, తర్హి కిం కర్తవ్యమిత్యత ఆహ-తేషు స్తనాదిషు, తవ, వాఞ్ఛా సంభోగాభిలాషోఽస్తి యది వర్తతే చేత్, తర్హి, పుణ్యం సత్కర్మ, కురుష్వ సమాచర, కుతః, పుణ్యైర్వినా సమీహితార్థా వాఞ్ఛితార్థా, న భవన్తి హి ఖలు, జ్యోతిష్టోమాది సత్కర్మాచరణేన రమ్భాసంభోగవత్కేనచి త్పుణ్యవిశేషేణ తవాపి తత్సంభోగః సంభవిష్యతీతి భావః. అర్థాన్తరన్యాసాలంకారః. వసన్తతిలకా.

———

ఇమే తారుణ్యశ్రీనవపరిమళాః ప్రౌఢసురత
ప్రతాపప్రారమ్భాః స్మరవిజయదానప్రతిభువః
చిరం చేతశ్చోరా అభినవవికారైకగురవో
విలాసవ్యాపారాః కిమపి విజయన్తే మృగదృశామ్. 19.

టీక.—మృగదృశాం = లేడికన్నులవంటి కన్నులుగల కోమలులయొక్క, తారుణ్యశ్రీ నవ పరిమళాః = జవ్వనంపు సొంపుయొక్క క్రొత్తనెత్తావులును, ప్రౌఢ సురత ప్రతాపప్రారమ్భాః నిర్భరమైన రతికేళియందలి నేర్పుయొక్క ఉపక్రమములును, స్మర విజయ దాన ప్రతిభువః = మన్మథునికి గెలుపును ఇచ్చుటయందు పూటకాఁపులును, చిరం = చిరకాలమునుండి, చేతః చోరాః = మనస్సుయొక్క దొంగలును, అభినవ వికార ఏక గురవః = క్రొత్తలైన మనోభావములకు ప్రధానమైన యొజ్జలును, (అగు), ఇమే విలాస వ్యాపారాః = ఈ శృంగార చేష్టలు, కిమపి = వచింపనశక్యముగా, విజయన్తే = సర్వోత్కృష్టములై యున్నవి.

తా.—పుష్పమును నెత్తావులంబోలె జవ్వనంపుసిరిని క్రొత్తగా సూచించునవియు, నిర్దయరతి ప్రభావమును తొడంగించునవియు, మదనునికి తప్పక గెలు పొసంగు



నవియును, చిరకాలము తోడెకాండ్ర మనస్సులను ముచ్చిలునవియు, వారిడెందంబులందు క్రొత్తభావములను ఉప్పతిల్లం జేయునవియును, అగునట్టి హరిణేక్షణలశృంగారచేష్టలు సర్వోత్కృష్టములై యున్నవి.

చ. కనఁదగు నిండుజవ్వనపుఁ గల్మికిఁ దావులు, ప్రౌఢసంగమం
బునకు నుపక్రమక్రియలు, పుష్పధనుర్జయదానదక్షవా
ఙ్మనసిజచిత్తహారులు వికారనిదానము లైనకామినీ
జనులవిలాసకృత్యములు సంతతరమ్యతరంబు లెన్నఁగన్.

వ్యా.—అథ విలాసవర్ణనం నిగమయతి.—ఇమే ఇతి.—తారుణ్యశ్రియో యౌవనసంపదో-నవపరిమలా నూతన పరిమలప్రాయాః-తద్వదభివ్యఞ్జకా ఇత్యర్థః - యద్వా తారుణ్యశ్రియో - నవోఽపూర్వః - పరిమలః సౌభాగ్యవిశేషో - యేషాం తే తథోక్తాః, ప్రౌఢసురతం ప్రచణ్డరతి - స్తత్ర యః ప్రతాపః సామర్థ్యమ్ - తస్య - ప్రారమ్భా ఉపక్రమాః, స్మరస్య జగజ్జిత్వరస్య మన్మథస్య - విజయదానే - ప్రతిభువః లగ్నకాః - ని. 'స్యుర్లగ్నకాః ప్రతిభువః' ఇత్యమరః - యథా ప్రతిభువః అధమర్ణాత్ ధన ముద్ధృత్య ఉత్తమర్ణాయ దాతుం సమర్థాస్తథా ఇమేఽపి దిగ్విజయ మాకృష్య స్మరాయ దాతుం సమర్థా ఇత్యర్థః, చిరం చిరకాల మారభ్య, చేతశ్చోరాః చిత్తాకర్షకాః - మనోహరా ఇతి యావత్, అభినవవికారై రాకస్మిక భయకమ్పానుకరణాది ప్రత్యగ్ర యౌవనవికారైః - ఏక గురవోఽత్యన్తభూయిష్ఠా, మృగదృశాం తరుణీనాం సంబన్ధిన, ఇమే పూర్వోక్తవర్ణితా, విలాసవ్యాపారాః శృఙ్గారచేష్టావిశేషాః, కిమపి అనిర్వాచ్యతయా, విజయన్తే సర్వోత్కర్షేణ వర్తన్తే * 'విపరాభ్యాం జేః'. ఇత్యాత్మనేపదమ్. శిఖరిణీ వృత్తమ్.

———

ప్రణయమధురాః ప్రేమోద్గారా రసాశ్రయతాం గతాః
ఫణితి†మృదులా ముగ్ధప్రాయాః ప్రకాశితసంమదాః
ప్రకృతిసుభగా విస్రమ్భార్ద్రాః స్మరోదయదాయినో
రహసి కిమపి స్వైరాలాపా హరన్తి మృగీదృశామ్. 20.

టీక.—ప్రణయమధురాః - ప్రణయ = బతిమాలుటయందు - మధురాః = మనస్సును కరఁగించునవియు, ప్రేమ ఉద్గారాః = వలపును గ్రక్కునవియు, రసా...గతాః రస = భావములకు - ఆశ్రయతాం = తావై యుండుటను, గతాః = పొందినవియును (భావము లొలుకుచున్నట్టివియు), ఫణితి మృదులాః=ఫణితి - మాటల పొందికచేత-మృదులాః = కోమలములును (కోమలమైన మాటలు గలవియు), ముగ్ధప్రాయాః = తేలికనము

మెండుగాఁ గలవియు, ప్రకాశిత సంమదాః = తెలుపఁబడిన హర్షము గలవియు, ప్రకృతి సుభగాః = స్వభావముచేతనే సొంపైనవియు, విస్రమ్భ ఆర్ద్రాః = నమ్మకముచేత తడివియు (నిండు నమ్మికతోఁ గూడినవియు), కావుననే, స్మరో...దాయినః-స్మర ఉదయ= మన్మథుని పుట్టుకను - (కామవికారమును) - దాయినః = ఇచ్చునవియు, (అగు), మృగీదృశాం = హరిణీ నయనలయొక్క, రహసి=ఏకాంతమునందలి, స్వైర ఆలాపాః = చనవుతోడి సంభాషణలు, కి మపి = అనిర్వాచ్యముగా, హరన్తి=(మనస్సును) హరించును.

తా.—బతిమాలుటయందు హృదయమును కరఁగించునవియు, వలపును వెల్లిగొల్పుచు, భావములతో నిండి, మృదువయిన మాటలపొందికతో నొప్పారుచు, చేలతనము మెండుగాఁ గలిగి, హర్షమును దెలుపుచు, స్వాభావికముగానే రమణీయములై, నిండు నమ్మకముతోఁ గూడి, కామ వికారమును పుట్టించుచు, హరిణాక్షుల చనవుతోడి రహస్యాలాపములు ఇట్లు అట్లు అని చెప్పశక్యము గాక మనస్సును హరించును.

చ. ప్రణయశ్రీమధురంబు లుజ్జ్వలరస ప్రాచుర్యముల్ ప్రేమ భూ
షణముల్ దర్శితహర్షముల్ రుచిర విశ్వాసార్ద్రముల్ ముగ్ధముల్
ఫణితిశ్రావ్యము లంగజప్రభవముల్ ప్రాణేశ్వరీనర్మభా
షణముల్ నామదిఁ గొల్లలాడెడి రహస్యక్రీడలం దెప్పుడున్.

వ్యా.— ప్రణయ ఇతి.—

'విస్రమ్భే పరమాం కాష్ఠా మారూఢే దర్శనాదిభిః,
యే నాన్తరఙ్గం ద్రవతి స స్నేహ ఇతి కథ్యతే.'

ఇ త్యుక్తలక్షణః స్నేహః ప్రణయ శబ్దేన వివక్షితః - తేన - ప్రణయేన మధురాః సంతాపహరాః - 'శీతలీక్రియతే తాపో యేన తన్మధురం స్మృతమ్' ఇతి లక్షణాత్, ప్రేమ్ణా అనురాగ విశేషేణ - ఉదారా రమ్యాః - మనోహరా ఇతి యావత్, రసాశ్రయతాం శృఙ్గారాస్పదత్వం గతాః - శృఙ్గారరస ప్రసరోల్లసితా ఇత్యర్థః, ఫణిత్యా సందర్భ విశేషేణ - † మధురాః మాధుర్య గుణయుక్తాః - అమృతప్రాయా ఇత్యర్థః, ముగ్ధప్రాయాః సౌకుమార్యభరితాః - శ్రుతిరఞ్జకా ఇత్యర్థః - ప్రకాశితోఽభివ్యఞ్జితః - సమ్మదః సంభోగౌత్సుక్యం - యై స్తే తథోక్తాః, ప్రకృతిసుభగాః స్వభావరుచిరాః, విస్రమ్భార్ద్రా విశ్వాసపరిప్లుతాః, అత ఏవ, స్మరోదయదాయినో జితేన్ద్రియ స్యాపి మన్మథోద్రేకావహాః, మృగీదృశాం సంబన్ధినః, స్వైరాలాపాః నర్మోక్తయ ఇతి యావత్, రహసి కిమపి హరన్తి, యద్వా రహసి స్వైరాలాపా ఇ త్యన్వయః, కి మపి హరన్తి, యద్వా అనిర్వాచ్యతయా మనోహరా భవన్తీ త్యర్థః.

అత్ర శ్లోకద్వయేఽపి సమర్థసహిష్ణోః శృఙ్గారస్య పాకసమయేఽప్యాస్వాద్యమానత్వా దన్తర్బహిఃస్ఫురణేన ద్రాక్షాపాకోఽనుసంధేయః - 'ద్రాక్షాపాకః స



కథితో బహిరన్తఃస్ఫురద్రసః' ఇతి లక్షణాత్; తథా శ్లేషప్రసాదాదయో దణ్డ్యాచార్యోక్తా దశ ప్రాణా శ్చ ప్రాయే ణాత్ర సన్తి, నిపుణై రున్నేయా ఇతి సంక్షేపః; ప్రకరణేఽస్మి న్స్వీయకో నాయకా అనుకూలా దక్షిణా శ్చాఽనుసంధేయాః - 'ఏకాయత్తోఽనుకూలః స్యా, త్తుల్యోఽనేకత్ర దక్షిణః' ఇతి లక్షణాత్. హరిణీ వృత్తమ్.

ఇతి శృఙ్గారశతక వ్యాఖ్యానే స్త్రీప్రశంసా నామ
ప్రథమా వింశతిః.

---

## సంభోగ వర్ణనమ్.

---

విశ్రమ్య విశ్రమ్య వనే ద్రుమాణాం
ఛాయాసు తన్వీ విచచార కాచిత్
స్తనోత్తరీయేణ కరోద్ధృతేన
నివారయన్తీ శశినో మయూఖాన్. 21.

టీక.—కాచిత్ = ఒకానొక, తన్వీ = కృశాంగి, వనే = అడవిలో, కర ఉద్ధృతేన = చేతితో ఎత్తిపట్టుకొనఁబడిన, స్తన ఉత్తరీయేణ = చనులమీఁది పయ్యెదతో, శశినః = చంద్రునియొక్క, మయూఖాన్ = కిరణములను, నివారయన్తీ = అడ్డగించుచు, ద్రుమాణాం = చెట్లయొక్క, ఛాయాసు = నీడలయందు, విశ్రమ్య విశ్రమ్య = విశ్రమించి విశ్రమించి, విచచార = సంచరించెను.

తా.—ఒకానొక కృశాంగి వెన్నెల కడ్డముగా కంచెల నెత్తి గొడుగుగా పట్టుకొని అడవిలో చెట్టు చెట్టు నీడలోను అలపు దీర్చుకొనుచు తిరుగుచుండెను.

భా.—కార్శ్యమును వెన్నెల నొల్లమిని చెప్పుటచే విరహిణి యనియు, 'వనే' అనుటచే అభిసారికగా వచ్చిన దనియు, 'ద్రుమాణామ్' 'ఛాయాసు' అను బహువచనములచే విరహోత్కంఠిత యైన దనియు తెలియుచున్నది.

చ. విరహకృశాంగి యైన ఘనవేణి యొకర్తు వనంబులోపలం
దరువులనీడలందు నుచితంబుగ మాటికి విశ్రమించి బం
ధురగతి సంచరించెఁ జనుదోయిని బయ్యెదకొంగుఁ గేలఁ దా
వెరవుగఁ బూని యగ్గలపు వెన్నెలకాఁకఁ దొలంగఁ జేయుచున్.

వ్యా.—అథ సంభోగవిప్రలమ్భ భేదవిభిన్నయోః శృఙ్గారయో ర్మధ్యే సంభోగ శృఙ్గారం సప్రపఞ్చము త్తరత్ర వర్ణయిష్య న్నాదౌ విప్రలమ్భ శృఙ్గార మేకే

వ్యా.—విశ్రమ్య ఇతి - కాచి త్తన్వీ కృశాఙ్గీ, వనద్రుమాణాం, ఛాయాసు చన్ద్రాతపరహితాధఃప్రదేశేషు - విశ్రమ్య విశ్రమ్య పునః పునః శ్రమ మపనీయ * వీప్సాయాం ద్విర్భావః - ని. 'ఛాయా త్వనాతపే కాన్తౌ' ఇతి విశ్వః, విచచార సంచచార - కేళీ వన సంచారస్య విరహి జనవినోదోపాయత్వా దితి భావః, కథం భూతా సతీ? కరోద్ధృతేన హస్తోత్క్షిప్తేన, స్తనో త్తరీయేణ కుచకుమ్భచ్ఛాదనపటాఞ్చలేన, శశిన శ్చన్ద్రస్య, మయూఖా న్కిరణాన్- ఆతపా నితి యావత్, నివారయ న్తీ నిరాకుర్వ న్తీ - గ్రీష్మోష్ణో వ్యజనే నే వేతి భావః ; చన్ద్రకిరణానాం విరహిణీ జనసన్తాపకరత్వా త్త న్నివారణో క్తిః; ఏతేన దశావస్థాపక్షే షష్ఠీ మన్మథావస్థా - తథా చ చతుర్థీ జాగరావస్థా- తథా ఉ త్తరీయేణ శశిమయూఖానా మనివారణీయత్వ వివేకాభావా చ్చిత్తవిభ్రమప్రతీతేః కామ శాస్త్రోక్త ద్వాదశావస్థాపక్షే దశమీ ఉన్మాదావస్థా సూచ్యతే - త న్వీ త్యనేన కార్శ్యావస్థా చ కథితా- త దుక్తమ్—

'దృఙ్ మనస్సఙ్గ సంకల్పా, జాగరః, కృశతా, ఽరతిః,
హ్రీత్యాగోన్మాదమూర్ఛాన్తా, ఇ త్యనఙ్గదశా దశ.' ఇతి;

కామశాస్త్రోక్తా స్తు—

'చక్షుఃప్రీతి, ర్మనస్సఙ్గః, సంకల్పో, ఽథ ప్రలాపితా,
జాగరః, కార్శ్య, మరతి, ర్లజ్జాత్యాగో, ఽథ సంజ్వరః,
ఉన్మాదో, మూర్ఛనం చైవ, మరణం చరమం విదుః.' ఇతి;

ఇయం చ విరహోత్కణ్ఠితా—

'చిరయ త్యధికం కాన్తే విరహోత్కణ్ఠితోన్మనాః' ఇతి లక్షణాత్.

ఉపజాతి వృత్తమ్.

---

అవ.—సంభోగశృంగారము.

అదర్శనే దర్శనమాత్రకామా †
దృష్ట్వా పరిష్వఙ్గరసైకలోలాః ††
ఆలిఙ్గితాయాం పున రాయతాక్ష్యామ్
ఆశాస్మహే విగ్రహయో రభేదమ్. 22.

టీక.—అదర్శనే = చూచుటలేనపుడు (చూడకముందు), దర్శ...కామాః - దర్శనమాత్ర = చూచుటయందుమాత్రము - కామాః = కోరికగలవారము, (అగుదుము), దృష్ట్వా = చూచి, పరి...లోలాః - పరిష్వఙ్గ = కౌఁగిటియొక్క - రస = ఆనందమునందు - ఏక = ముఖ్యముగా - లోలాః = ఆశగలవారము, (అగుదుము), పునః = మఱి,



ఆయత అక్ష్యామ్ = వాలిక కన్నులది, ఆలిఙ్గితాయాం (సత్యాం) = కౌఁగిలింపఁబడినది కాఁగా, విగ్రహయోః = దేహములయొక్క, అభేదమ్ = వేఱుగామిని (ఐక్యమును), ఆశాస్మహే = కోరుచున్నాము.

తా.—సుందరిని చూడకముందు చూడనుమాత్రము కోరుదుము, చూచితిమా కౌఁగిలించి యానందంబుం జెందఁగోరుదుము, మఱి కౌఁగిటం బొదివితిమా రెండుదేహములును మఱి పాయక ఒకటిగానే కలసి పోవలయు నని కోరుదుము.

ఉ. బాలిక నన్నుఁ గన్గొనని పట్టున దర్శనమాత్ర మబ్బినం
జాలు నటంచుఁ గోరె మది, చక్కఁగఁ గన్నుల నన్నుఁ జూచి ప్రో
యాలు కవుంగిలింపవలె నంచుఁ దలంచెఁ, దమిం గవుంగిటన్
మేలుగఁ జేర్చుకొన్న, నిరు మేనులు నొక్కటి సేయఁ గోరితిన్.

వ్యా.—అథ సంభోగ శృఙ్గారః— స చ బాహ్యాభ్యన్తరభేదేన ద్వివిధః, వాత్స్యాయనే నా ప్యస్య ద్వివిధ స్యాఽపి ప్రకారాన్తరేణ ద్వివిధత్వ ముక్తమ్:—

'బాహ్య మాభ్యన్తరం చేతి సురతం ద్వివిధం స్మృతమ్,
తత్రాద్యం చుమ్బనాశ్లేషనఖద న్తక్షతాదికమ్,
ద్వితీయం సురతం సాక్షా న్నానాకరణకల్పితమ్.' ఇతి,

తత్ర ప్రథమ మాలిఙ్గనరూపం సోపస్కార మాహ ద్వాభ్యామ్—

అదర్శన ఇతి.—అత్ర యత్తచ్ఛబ్దాధ్యాహారే ణాన్వయః కార్యః, అదర్శనే ప్రియతమవిషయకదర్శనాభావే సతి * క్వచి త్ప్రసజ్యప్రతిషేధే ఽపి నఞ్సమాస ఇష్యతే-యథా అదర్శన మశ్రవణ మభాషణ మనుచ్చారణ మి త్యాద్యభియుక్తో క్తేః, దర్శన మాత్ర ఏవ కామోఽభిలాషో యస్యాః† సా తథోక్తా-తావన్మాత్రాభిలాషిణీ త్యర్థః, తతో దృష్ట్వా, ప్రియతమ మితి శేషః, పరిష్వఙ్గసుఖే ఆలిఙ్గనజనితసుఖే - ఏకం ముఖ్యం యథా తథా-††లోలా స తృష్ణా-ని. 'లోలశ్చలసతృష్ణయోః' ఇ త్యమరః-యా-ఆయతాక్షీతి శేషః, తస్యా మాయతాక్ష్యాం కర్ణాన్తవిశ్రాన్తలోచనాయాం ప్రియతమాయాం, పున రాలిఙ్గితాయాం సంపరిష్వక్తాయాం సత్యామ్, విగ్రహయోః శరీరయోః-ని. 'శరీరం వర్ష్మ విగ్రహః' ఇ త్యమరః, అభేదమ్ ఐక్యమ్, ఆశాస్మహే- తాదృగ్గాఢాలిఙ్గన సుఖ మనుభవితు మభిలషామహే ఇ త్యర్థః; త ద్యథా—'ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో న బాహ్యం కిఞ్చన వేద నాన్తర మే వాయం పురుషః' ఇత్యాదిశ్రుతేః ప్రియతమాగాఢాలిఙ్గన పరిష్వఙ్గే విగలితవేద్యాన్తరత్వేన బ్రహ్మానన్ద సబ్రహ్మచారి సుఖవిశేష సంభవా త్తథావిధాలిఙ్గనాశంసనం యుక్త మే వేతి భావః - తదుక్తం రతిరహస్యే-

'త త్సౌఖ్యం పరతత్త్వవేదన మహాఽఽనన్దోపమం మూఢధీః
కో వా విన్దతి సూక్ష్మమన్మథకలావైచిత్ర్య మూఢో జనః.' ఇతి;

అన్యత్రా ప్యుక్తమ్—

'ప్రౌఢాలిఙ్గన చుమ్బనామితసుఖం ప్రచ్ఛన్న వేద్యాన్తరమ్' ఇతి;

వృత్తం పూర్వవత్.

---

మాలతీ శిరసి † జృమ్భణోన్ముఖీ, చన్దనం వపుషి కుఙ్కుమావిలమ్

వక్షసి ప్రియతమా మదాలసా, స్వర్గ ఏష పరిశిష్ట †† ఆగతః. 23.

టీక.—శిరసి = సిగయందు, జృమ్భణ ఉన్ముఖీ - వికసించుటకు సిద్ధముగా నున్న, మాలతీ = జాజియు, వపుషి = మేనియందు, కుంకుమ ఆవిలం = కుంకుమపూవుతో మిశ్రమయిన, చన్దనం = గంధమును, వక్షసి = ఱొమ్మున, మద అలసా = (యౌవన) మదముచే సోలుచున్న, ప్రియతమా = ప్రేయసియు, ఏష = ఇది, ఈ చెప్పిన భోగము, పరిశిష్టః = (పుణ్య ఫలములో అనుభవించినది పోఁగా) మిగిలినదై, ఆగతః = (ఈలోకమునకు) వచ్చినట్టి, స్వర్గః = స్వర్గము (స్వర్గభోగ మనుట).

తా.—సిగయందు వికసింపనున్న జాజిసరము, మేన కుంకుమపూవు గలిపిన గంధపుఁబూఁత, ఉరంబున యౌవనమదముచే సొగయుచున్న ప్రియతమయు, ఈమూఁడును పూర్వపుణ్యములకు ఫలమయిన స్వర్గముభోగములో కొంతభాగము అనుభవ మయిన తర్వాత ఈలోకమునకు వచ్చిన యా స్వర్గభోగశేషము.

చ. తలపయి మాలతీకుసుమ దామము, నెమ్మెయిఁ గుంకుమంబుతోఁ
గలసినకమ్మదావి విరి గంధపుఁబూఁత, వెడందఱొమ్మునం
దలికులనీలకుంతల మదాలస నీలసరోరుహాక్షియుం,
గలుగుట నింద్రభోగ మనఁగాఁ దగదే? మఱి వేఱె యున్నదే?

వ్యా.—ఏవం పరమానన్దానుసన్ధాయకత్వేన పరిష్వఙ్గ స్యాపవర్గత్వ ముక్త్వా సంప్రతి స్వర్గరూపత్వ మాహ.—మాలతీ తి.—శిరసి మాలతీ జాతి కుసుమమాలికే త్యర్థః - ని. 'సుమనామాలతీ జాతిః'-'పుష్పే జాతి ప్రభృతయః' ఇ త్యుభయ త్రా ప్యమరః *'పుష్పమూలేషు బహులమ్' ఇతి లుక్, ముఖే, † జృమ్భణం మదనమదజనిత జృమ్భశ్చ- ని. 'జృమ్భ స్తు త్రిషు జృమ్భణమ్' ఇ త్యమరః - యద్వా సంభోగౌత్సుక్య సూచక రాగ విలాసస్ఫూర్తి శ్చ, వపుషి, కుఙ్కుమావిలం కాశ్మీరజ మిశ్రితం ఘుసృణరసమసృణితం వా, చన్దనం పాటీరపఙ్కం చ, వక్షసి, మదాలసా మదేన మన్థరా, ప్రియతమా గాఢాలిఙ్గితమ త్తకామినీ చ, ఇ త్యేషో ఽయం సముదాయః, స్వర్గః స్వర్గశబ్దవాచ్యః, ఆగమః ఏత ద్వ్యతిరిక్తస్వర్గాభిధాయక శాస్త్రం తు, పరిశిష్టః సదాసభిజ్ఞ త్వా దముఖ్యః, స్వర్గప దవాచ్య ముఖ్యార్థ బోధశూన్య ఇ త్యర్థః, అన్య థై త త్స్వర్గత్వే నైవ వదే దితి



భావః, స్వర్గసమాన సౌఖ్యప్రదో ఽయ మే వే తి పరమార్థః. రథోద్ధతా వృత్తమ్ - 'రాన్న రావిహ రథోద్ధతా లగౌ' ఇతి లక్షణాత్.

---

ప్రా ఙ్మా మేతి మనా గనాగతరసం, జాతాభిలాషం తతః,

సవ్రీడం, త దను శ్లథీకృతతను, ప్రత్య స్తధైర్యం పునః,

ప్రేమార్ద్రం స్పృహణీయ నిర్భర రహఃక్రీడా ప్రగల్భం, తతో

నిశ్శఙ్కాఙ్గ † విఘర్షణాధికసుఖం రమ్యం కులస్త్రీరతమ్. 24.

టీక.—ప్రాక్ = తొలుత, మనాక్ = ఇంచుక, మా మా ఇతి = వలదు వలదు అని, అనాగత రసం = రాని (ఉదయింపనితమి) కలది, తతః = పిమ్మట, జాత అభిలాషం = ఉదయించిన కోరికగలది, త దను = అటు తర్వాత, సవ్రీడం (యథాతథా) = సిగ్గుతోఁ గూడునట్లుగా, శ్లథీకృత తను = సడలింపఁబడిన యవయవములు గలది, పునః = పిదప, ప్రత్యస్త ధైర్యం = తొలఁగింపఁబడిన దిట్టతనముగలది, ప్రేమ ఆర్ద్రమ్ = అనురక్తిచే తడిది (అనురాగపూర్ణము), స్పృహ...గల్భం - స్పృహణీయ = కోరఁదగిన- నిర్భర = పెల్లయిన - రహఃక్రీడా = ఏకాంతకేళియందు - ప్రగల్భం = నెరతనముగలది, తతః = ఆటుపిమ్మట, నిశ్శఙ్క....సుఖం—నిశ్శఙ్క = జంకులేని - అఙ్గ=అవయవములయొక్క - విఘర్షణ = ఒరయికచేత - అధిక = ఎక్కువయైన - సుఖం = ఆనందము గలది, (అగు), కుల స్త్రీ రతమ్ = కుల కాంతతోడి - సంభోగము, రమ్యమ్ = మనోహరము.

తా.—తొలు దొల్త కోరిక యుదయింపక ముందు వలదు వలదు అను నిషేధోక్తులొప్పు, అనంతరము కోరిక యుప్పతిల్లుడు సిగ్గువలని యవయవముల దాఁపరికమును సడలించుచు, బిగువుచెడి అనురాగము వెల్లివిరియ కోరిక తీరిక రెత్తునట్టి యడ్డులేని క్రీడలో నేర్పు మెఱసి జంకు లేని యవయవ సమ్మర్దముచే ఆనందమయ మైన కులస్త్రీసంభోగము మనస్సును హరించును.

ఉ. ఆది మితాదరంబు, తదనంతర మంచితరాగ, మంత ల
జ్జోదయరమ్య మంత శిథిలోద్యమ, మంత నితాంతధైర్యవి
చ్ఛేదము ప్రేమపూరము విశేషవివిక్తవిహార, మంత నా
హ్లాదకరాంగసంగము కులప్రమదారత మల్పసౌఖ్యమే ?

వ్యా.— అ థాధ్య న్తర సంభోగం వర్ణయితు ముపక్రమతే.—ప్రా గితి.—ప్రాక్ ప్రారమ్భే, మనాక్ అల్పం, మా మేతి మాస్తు మాస్త్వితి నిషేధ వచనేన, అనాగతః అనుత్పన్నః రసో ఽను రాగవిశేషో యస్మిం స్తత్, పూర్వా ద్యా దితి భావః - తతో ని

షేధానన్తరం జాతోఽఙ్కురితోఽభిలాషో వాఞ్ఛా యస్మిం స్త త్తథోక్తమ్, తదన్వభిలాషానన్తరమ్ * 'అనుర్లక్షణే' ఇతి కర్మప్రవచనీయత్వా ద్ద్వితీయా, నీవీవిస్రంసనాదిషు మన్దోద్యమనభావో వ్రీడా తయా సహ సవ్రీడమ్ - * 'తేన సహ-' ఇతి తుల్యయోగే బహువ్రీహిః, * 'వోపసర్జనస్య' ఇతి సహభావస్య సత్వమ్, అథ వ్రీడానన్తరం, శ్లథోద్యమం నిరాకరణే శిథిలప్రయత్నమ్, పున రుద్యమనాభావానన్తరమ్- పునః శబ్దోఽత్రానన్తర్యార్థకః, ప్రధ్వస్తం విగలితం - ధైర్యం ప్రాతిలోమ్య లక్షణమ్ యస్మిం స్త త్తథోక్తమ్ - అఙ్గీకృతాభిముఖ్య మిత్యర్థః, తతః ప్రేమార్ద్రం ప్రణయరసపరిప్లుతమ్, తతః స్పృహణీయా అన్యోన్య మభిలషణీయా - నిర్భరా ఉద్వేలా శ్చ - యా రహఃక్రీడా ఏకాన్తకేలయః విస్రమ్భవిహారా ఇత్యర్థః - తాభిః ప్రగల్భం ప్రౌఢమ్, తతో నిస్సఙ్గే నాప్రతిబన్ధేన - అఙ్గవికర్షణేన కుచాద్యవయవమర్దనేన - అధికం సుఖం పరమానన్దో-యస్మిం స్త త్తథోక్తమ్, కులస్త్రీ రతం స్వస్త్రీసంభోగః రమ్యం సున్దరమ్ - అత్యన్త మనోహర మితి యావత్ ; ఏత చ్చ ప్రథమసమాగమపరత్వేన ద్రష్టవ్యమ్, అన్యథోక్తవ్యవహారాసంభావా దితి భావః - కులశబ్దవ్యావృత్త సంభోగస్యాదిత ఆరభ్య ప్రాగల్భ్యఘటితత్వే నోక్తవిలక్షణత్వా దన్యాదృశో ద్రష్టవ్యః.

నాయికా తు ముగ్ధా, నాయక స్తూత్తమోఽనుకూలః కామతన్త్రేషు నిపుణః, అన్యథోక్తక్రమసంభోగాసంభవా దితి మన్తవ్యమ్. సంభోగలక్షణ ముక్తం రతిరహస్యే.

'అనుకూలౌ నిషేవేతే యత్రాఽన్యోన్యం విలాసినౌ,
దర్శన స్పర్శనాదీని స సంభోగ ఉదాహృతః.' ఇతి.

అత్ర మా మేతి వాగారమ్భసూచితై రనుభావైర్జాతాభిలాష మిత్యుక్తేన రత్యాఖ్యస్థాయీభావేన, సవ్రీడ మిత్యనే నోపలక్షితైః సంచారిభావైః, అవశిష్టై ర్విశేషణై ర్యథాయథం ప్రతీయమానై రనుభావాదివిశేషైః కులస్త్రీ ఇత్యుక్తే నాలమ్బన విభావేన ప్రతీయమానో రససార్వభౌమః శృఙ్గారో నిస్సఙ్గాఽఙ్గవికర్షణాఽధికసుఖ మిత్యనేనపరిపోషాతిశయం ప్రాప్నోతీతి వేదితవ్యమ్. శార్దూలవిక్రీడితమ్.

---

ఉరసి నిపతితానాం స్రస్తధమ్మిల్లకానాం
ముకుళితనయనానాం కిఞ్చి దున్మీలితానామ్
ఉపరిసురతఖేద స్విన్నగణ్డస్థలానామ్
అధరమధు వధూనాం భాగ్యవన్తః పిబన్తి. 25.

టీక.—ఉరసి = వక్షమున, నిపతితానాం = వ్రాలినవారును - స్రస్త ధమ్మిల్లకానాం = వీడిన కొప్పుగలవారును, ముకుళిత నయనానాం = మొగిడిన కన్నులుగలవారును, కిఞ్చిత్ ఉన్మీలితానాం = కొంచెము (కన్నులు) తెఱచియున్నవారును, ఉపరి... స్థలానాం - ఉపరి సురత = పూరుషాయిత రతియందలి - ఖేద = అలయికచేత - స్విన్న = చెమర్చిన - గణ్డస్థలానాం = చెక్కిటి ప్రదేశములు గలవారును, (అగు), వధూనాం = చెలువలయొక్క, అధర మధు = మోవి తేనియను, భాగ్యవన్తః = అదృష్టవంతులు, పిబన్తి = ఆనుదురు.

తా.—కొప్పు వీడ, కను లర ముగుడ, చెక్కుల క్రొంజెమ రంకురింప, పూరుషాయిత రతాలసలై వక్షంబునం గూలిన కొమ్మల కెమ్మోవి తేనియను అదృష్టవంతు లానుదురు.

ఉ. అక్కున వ్రాలి, కొప్పు విడి యల్లల నాడఁగ, గన్నుఁదామరల్
చక్కఁగ మోడ్చి, చొక్కి, పురుషాయితసంజనితశ్రమంబునం
జెక్కుల ఘర్మబిందువులు చిందఁగ, విం దొనరించుబోట్లమే
ల్చొక్కపుమోవితేనె చవిఁ జూతురు భాగ్యముఁ గల్గునేర్పరుల్.

వ్యా.—అథ య దుక్తమ్ 'నానాకరణ కల్పితమ్' ఇతి, తత్ర నానాకరణాని ధేనుకాది బన్ధవిశేషాః, తేషాం మధ్యే ఏకం బన్ధవిశేషం వివక్షు స్త దనుకూల ముపరి సురత మాహ:—ఉరసీతి.— ఉరసి నిపతితానాం పురుషాయిత బన్ధవశా ద్వక్షఃస్థల మధిష్ఠితానామ్, అత ఏవ స్రస్తధమ్మిల్లకానాం రతి రభస విశ్లథకచప్రచయానామ్ - ని.'ధమ్మిల్లః సంయతాః కచాః' ఇత్యమరః, ముకులిత నయనానాం సుఖపారవశ్యా ల్లజ్జానుభావానుకరణా ద్వా వినిమీలితలోచనానామ్, తథాఽపి కిఞ్చిదున్మీలితానామ్ ఈష న్ముకులితలోచనానామ్-అన్యథా అనౌచిత్యా దితి భావః, అత ఏవ ఉపరిసురతే యః - ఖేదః శ్రమ - స్తేన స్విన్నాని స్వేదార్ద్రాణి - గణ్డస్థలాని యాసాం తాసామ్ - 'శ్రమః ఖేదో హి రత్యాదే ర్జాతః స్వేదాదిభూమకృత్' ఇతి లక్షణాత్, వధూనాం ప్రియతమానాం సంబన్ధి, అధర మధు అధరామృతం, భాగ్యవన్తః భాగ్యశాలినః, పిబన్తి, స్త్రీముఖస్య నిజముఖసామ్ముఖ్యా దక్లేశే నాధరం చుమ్బన్తీ త్యర్థః, ఏత చ్చ పుణ్యకృతామేవ సంభవతి, న త్వన్యేషా, మత ఏవ భాగ్యవన్త ఇత్యుక్తమ్; తథా బాహ్యసురత విశేషరూప మపి చుమ్బన మార భ్యాభ్యన్తరాఙ్గతయా కథిత మిత్యవగన్తవ్యమ్.

పురుషాయితలక్షణముక్తం రతి రహస్యే.—

'స్వేచ్ఛయా శ్రమిణి వల్లభే తథా యోషి దాచరతి పూరుషాయితమ్.' ఇతి.

నాయికా స్తు ప్రగల్భాః.—

'స్మరమన్దీకృత వ్రీడా ప్రౌఢా సంపూర్ణ యౌవనా' ఇతి లక్షణాత్.

నాయకాః కామతన్త్రే కుశలాః అనుకూలా శ్చ. స్వభావోక్తి రలంకారః.—

'స్వభావోక్తి రసౌ చారు యథావ ద్వస్తువర్ణనమ్' ఇతి లక్షణాత్.

మాలినీ వృత్తమ్.—

---

ఆమీలితనయనానాం । యః సురతరసోఽను సంవిదం భాతి
మిథునై ర్మిథోఽవధారిత । మవితథ మిద మేవ కామనిర్వహణమ్. 26.

టీక.—ఆమీలితనయనానాం = ఇంచుక మోడ్చిన కన్నులుగల స్త్రీపురుషుల యొక్క, యః = ఏ, సురత రసః = సురతముయొక్క ఆనందము, సంవిదమ్ అను = తెలివియందు, భాతి = ప్రకాశించునో (ఇది యిట్టిది యని తెలియుచు ననుభవింపఁబడునో), ఇద మేవ = ఇది యే (ఈయనుభవమే), అవితథం = వమ్ముకాని, కామనిర్వహణమ్ - కామ = కామ(పురుషార్థ)ముయొక్క - నిర్వహణం = ప్రతిష్ఠాపనము, (అని), మిథునైః = (స్త్రీపురుష)ద్వంద్వములచేత, మిథః = అన్యోన్యముగా, అవధారితమ్ = నిశ్చయింపఁబడినది.

తా.—అరమోడ్పుఁగనుఁగవలతో స్త్రీపురుషులు సురతానందమును జ్ఞానపూర్వకముగా ననుభవించుట ఏది కలదో అదే కామపురుషార్థసిద్ధి యని యన్యోన్యము నాయికానాయకుల నిశ్చయము.

తే. కన్ను లరమోడ్చి విహరించుచున్నవారి । సురతభోగంబు తెలివితోఁ బరఁగనేని,
రమ్య మగు నిది కామనిర్వహణ; మనుచు । నాయికానాయకులకు నిర్ణయముగా దె?

వ్యా.—అథ జ్ఞానపూర్వక ఏవ సురతానుభవః సార్థకః, న త్వన్య ఇత్యాహ:—ఆమీలిత ఇతి.— ఆమీలిత నయనానాం సుఖపారవశ్యా ద్దరముకులిత నయనానాం, యూనాం యః సురతరసః సురతాస్వాదః, సంవిదం అను జ్ఞాన మనుసృత్య భాతి - అయ మేతాదృశ ఇతి జ్ఞానగోచరతయా ప్రతిభాతీ త్యర్థః, ఇద మేవ జ్ఞానపూర్వక సురతానుభవ ప్రతిభాన మేవ, అవితథం అవ్యర్థమ్-సార్థక మి త్యర్థః- కామస్య మన్మథస్య కామపురుషార్థస్య వా-నిర్వహణం ప్రతిష్ఠాపనమ్ - ఉజ్జీవన మితి యావత్, న త్వన్య దాభాసత్వా దితి భావః - మిథునైః రసజ్ఞైః స్త్రీపురుషైః - ని.'స్త్రీపుంసౌ మిథునం ద్వన్ద్వమి' త్యమరః, మిథోఽన్యోన్యం, అవధారితం నిశ్చితమ్- అనుభవినా మే వార్థనిశ్చయసంభవా దితి భావః; జ్ఞానపూర్వక సురతానుభవ ఏవ కామపురుషార్థ ఇతి ఫలితార్థః, అత ఇత్థంభూతసురత మేవ కర్తవ్యమ్ - న త్వన్యాదృశమ్ - తస్య క్లేశమాత్రఫలకత్వా దితి తాత్పర్యమ్. ఆర్యావృత్తభేదః.

---

అవ.—కామవికారములకు వయోనియమము.

ఇద మనుచిత మక్రమ శ్చ పుంసాం
య దిహ జరా స్వపి మాన్మథా వికారాః,



య దపి చ న కృతం నితమ్బినీనాం
స్తనపతనావధి జీవితం రతం వా. 27.

టీక.—ఇహ = ఇట (ఈలోకమందు), పుంసాం = పురుషులకు, జరాసు అపి= ముదిదశలయందును, మాన్మథాః = మదనసంబంధములైన, వికారాః = చేష్టలు, (ఇతి) యత్ = అనునది యేదియో, నితమ్బినీనాం = స్త్రీలకును, స్తన...వధి - స్తన = కుచములయొక్క - పతన = వాలుట - అవధి = హద్దుగా, జీవితం వా = బ్రతుకుగాని, రతం వా=కామ కేళి గాని, న కృతం = చేయఁబడలేదు, (ఇతి) అపి యత్ = అనునదియు నేదియో, ఇదం = ఇది, అనుచితమ్ = తగనిది, అక్రమ శ్చ = క్రమముగానిదియు.

తా.—బ్రహ్మదేవుఁడు రెండు పొరఁబాట్లు చేసినాఁడు. ఒకటి యే దనఁగా - మగవారికి ముదిమిలో కూడ మదనవికారము కలిగించుట; రెండవది యే మనఁగా స్త్రీలకు చన్నులు వాలుటకే ఆయుస్సు వ్రాయమి, లేదా, అవి వాలినతర్వాత రతములు లేకుండునట్లయినను వ్రాయమి.—ముదిమగలకును లంబస్తనులకును మదనవికారములు తగవు.

చ. ఇది యుచితంబుగానిపని యిమ్మహిలో మగవారి కెంతయుఁ
మదనసుఖాభిలాషములు మానక యున్కి జరాభరంబునం,
గొదమమిటారిముద్దుచనుగుబ్బలు జాఱినవెన్క బోట్లకుఁ
మదనసుఖంబు జీవితము మాన్పఁడు తామరచూలి జాణయే?

వ్యా.—అథ సురతావధిం కథయ న్నిగమయతి.—ఇద మితి.— ఇ హాస్మిం లోకే, పుంసా మిద, మనుచితం అన్యాయ్యమ్, అక్రమో నిర్మర్యాద శ్చ, కి మిద మిత్యాశఙ్క్యా యా మాహ—జరాసు వార్ధకావస్థా స్వ పీ త్యర్థః, మాన్మథా వికారాః సురతవ్యాసఙ్గాః కృతా ఇతి యత్, ఇద మితి సంబన్ధః, కిం తు యౌవనావధిక సురత మేవ న్యాయ్యం మర్యాదాగోచరం చే త్యర్థః - త దుపరితన సురత స్యాభాసత్వా దితి భావః, తథా నితమ్బినీనాం స్త్రీణాం చ, త దనుచితమ్, కిం త ది త్యత ఆహ— స్తనపతనమ్ అవధిః మర్యాదా యస్య త త్తథోక్తం, జీవితం జీవనం వా, రతం వా సురతం వా, న కృత మితి యత్, బ్రహ్మ ణేతి శేషః, త దితి సంబన్ధః, స్త్రీణాం తావత్ స్తనపతనావధిక మేవ జీవనం కర్తవ్యం, సురత మపి త దవధిక మేవ, అన్యథా 'పఞ్చపఞ్చాశదవధి పరతో వృద్ధతా మేతి నారీ' ఇతి కామశాస్త్రోక్తే ర్వృద్ధానాం సంభోగానర్హత్వాత్ - 'త్యజే ద న్త్యకులోద్భూతాం వృద్ధస్త్రీం కన్యకాం త్యజేత్' ఇతి నిషేధస్మరణాత్ - 'ఆలిఙ్గనం లమ్బపయోధరాణాం స్త్రీణాం చ దుఃఖత్రయ మేవ భూమౌ' ఇతి లమ్బస్తననితమ్బినీ సంభోగస్య దుఃఖరూపత్వా చ్చే,తి భావః - యథాహ మాఘః -

'అయ మపి జరతాః ప్రకామగుర్వీ రలఘువిలమ్బిపయోధరోపరుద్ధాః,
సతత మసుమతా మగమ్యరూపాః పరిణతదిక్కరికా స్తటీ ర్బిభర్తి.' ఇతి.

అత్ర స్త్రీణాం పురుషాణాం చ యౌవనకృతసురత మేవ రమణీయ మితి తాత్పర్యమ్.

పుష్పితాగ్రా వృత్తమ్—'అయుజి నయుగ రేఫతో యకారో యుజి చ నజౌ జరగా శ్చ పుష్పితాగ్రా.' ఇతి లక్షణాత్.

---

అవ.—ప్రాయమందు కామము సేవ్యము.

రాజం, స్తృష్ణామ్బురాశే ర్న హి జగతి గతః కశ్చి దే వావసానం,
కో వాఽర్థోఽర్థైః ప్రభూతైః స్వవపుషి గళితే యౌవనే సానురాగే?
గచ్ఛామః సద్మ యావ ద్వికసితనయనేన్దీవరాలోకినీనా
మాక్రమ్యాక్రమ్య రూపం ఝడితి న జరయా లుప్యతే ప్రేయసీనామ్.

టీ. రాజన్ = రాజా, జగతి = లోకములో, కశ్చిత్ ఏవ = ఎవ్వఁడును, తృష్ణా అమ్బురాశేః = ధనాశయనెడు సముద్రముయొక్క, పారం = అవలిగట్టును, న గతో హి = పొందఁడాయెఁగదా, స్వవపుషి = తనశరీరమునుండి, స అనురాగే = వలపుతోడి, యౌవనే = ప్రాయము, గళితే సతి = జాఱినది కాఁగా, ప్రభూతైః = గొప్పవైన, అర్థైః = ధనములచేత, అర్థః = ప్రయోజనము, కో వా = ఏమి, విక...కినీనాం - వికసిత = విరిసిన - నయన ఇన్దీవర = నల్లగలువలవంటి కన్నులతో - ఆలోకినీనాం = చూచునట్టి, ప్రేయసీనాం = ప్రియతమలయొక్క, రూపం = సోయగము, జరయా = ముదిమిచే, ఆక్రమ్య ఆక్రమ్య = మాటిమాటికి పైకొనఁబడి, ఝడితి = తటాలున, న లుప్యతే యావత్ = హరింపఁబడకముందే, సద్మ = ఇంటికి, గచ్ఛామః = పోయెదము.

తా.—రాజా, లోకములో ధనాశ సముద్రమువలె మేర లేనిది. ఎంతధన మార్జించియు తనిసినవాఁడు లేఁడు. మఱి ముదిమి వచ్చి వలపు ఉడిగిన పిమ్మట ధనము లెంత విస్తారముగా నున్నను ఏమిసుఖ మనుభవింపఁగలము? కావున మాప్రియతమలయొక్క నేత్రములయందలి యిందీవరధాళధళ్యంబును దేహమందలిసోయగంబును ముదిమి పట్టువిడక ఆక్రమించి హరింపకముందే ఇండ్లకుఁ బోయెదము; సెల వొసంగుము.—సుందరీమణులకు యౌవనమందు నేత్రములకు ఇందీవరకాంతి కలిగియుండును.

శా. ఆశాసాగరపార మేరికిని శక్యం బౌనె చేరంగ? భో
గాశాయుక్తము జవ్వనంబు గళితం బైనన్ ధనం బేల? ధా
త్రీశా, యింటికిఁ బోదుమే ప్రియవధూహృద్యోల్లసద్రూపరే
ఖాశోభాతిశయంబు దుర్భరజరాక్రాంతంబు గా కుండఁగన్?



వ్యా.—యదుక్తం సురతానుగుణ్యేన యౌవన స్యాత్యన్తావశ్యకత్వం త్రిభి ర్వర్ణయతి. తత్రాదౌ చిరప్రవాసనిర్విణ్ణానాం రాజసేవా తత్పరాణాం యూనాం వచన మేతత్ - రాజ న్నితి.—హే రాజన్, జగతి అస్మిన్ లోకే, కశ్చిదేవ కశ్చిదపి పుమాన్, తృష్ణా ధనలిప్సా - సైవామ్బురాశిః సముద్ర - స్తస్య అవసానం పారం, న గతో హి న ప్రాప్తః ఖలు - కి న్తు మగ్న ఏవే త్యర్థః - తృష్ణాయా అపరిచ్ఛిన్నత్వా దమ్బురాశిత్వరూపణమ్, అథ యావత్కాఙ్క్షితార్థలాభేఽపి న తైః ప్రయోజనసిద్ధి రిత్యాహుః-ప్రభూతైః ప్రచురైః - ని. 'ప్రభూతం ప్రచురం ప్రాజ్యమ్' ఇత్యమరః-అర్థై ర్ధనైః, కో వార్థః కిం ప్రయోజనమ్ - న కి మపీ త్యర్థః - అకించిత్కరత్వా దితి భావః - ని.'అర్థోఽభిధేయరైవస్తుప్రయోజన నివృత్తిషు' ఇత్యమరః, కస్మిన్ కథం భూతే సతి? స్వవపుషి నిజశరీరే (అధికరణే), సానురాగే సంభోగేచ్ఛాజనకే అనురాగసహితే వా యౌవనే, గళితే సతి - కోఽర్థ ఇతి సంబన్ధః - ధనలాభా దపి యౌవనమే వాస్మాకం బలీయ ఇత్యర్థః, అత స్తావ త్తత్పూర్వ మేవ, సద్మ స్వగృహం ప్రతి, గచ్ఛామో యాస్యామః, యావత్ యదా, వికసితాని ఉత్ఫుల్లాని-కుముదాని కైరవాణి-ఇన్దీవరాణి నీలోత్పలాని చ - తత్సదృశా ఆలోకా నేత్రాణి - ఆసాం సన్తీ తి తథోక్తానామ్ - సితాసితాబ్జదలమనోహర నయనానా మి త్యర్థః-ని.'సితే కుముద కైరవే'- 'ఇన్దీవరం చ నీలేఽస్మిన్' ఇ త్యుభయ త్రా ప్యమరః, ప్రేయసీనాం ప్రియతమానాం సంబన్ధి, రూపం యౌవనప్రయుక్త సౌన్దర్యం, జరయా,ఆక్రమ్యాక్రమ్య అభీక్ష్ణ మాక్రమ్య, ఝడితి అఞ్జసా-ని. 'స్రాగ్ఝడిత్యఞ్జసాఽహ్నాయ' ఇత్యమరః, న లుప్యతే న హ్రియతే, తావ దితి సంబన్ధః - అన్యథా శశకాపాయే బిలఖననవ ద్గమననైష్ఫల్యా ద్వృద్ధస్త్రీగమన నిషేధా చ్చే తి భావః-ని.'యావ త్తావ చ్చ సాకల్యేఽవధౌ మానేఽవధారణే' ఇత్యమరః.

---

అవ.—యౌవనదోషములు.—

రాగ స్యాగార మేకం, నరకశతమహాదుఃఖసంప్రాప్తిహేతు,
ర్మోహ స్యోత్పత్తిబీజం, జలధరపటలం జ్ఞానతారాధిపస్య,
కన్దర్ప స్యైకమిత్త్రం, ప్రకటితవివిధస్పష్టదోషప్రబన్ధం,
లోకేఽస్మి న్న హ్యనర్థవ్రజకులభవనం యౌవనా దన్య దస్తి. 29.

టీక.—రాగస్య = అనురాగమునకు (లేక మత్సరమునకు), ఏకమ్ = ప్రధానమైన, అగారం = ఇల్లు, నరక...హేతుః - నరక శత = నరకముల నూఱులయందలి - మహా దుఃఖ = గొప్పశోకములయొక్క - సంప్రాప్తి = రాకకు - హేతుః = కారణము, మోహస్య = అజ్ఞానముయొక్క, ఉత్పత్తి బీజం = పుట్టుకకు కారణము, జ్ఞాన తారాధిపస్య - జ్ఞాన = తెలివియనెడి - తారాధిపస్య = చంద్రునికి, జలధర పటలం =

అన్యం = ఇంకొకనిని, చిన్తయన్తి = తలఁచుకొనుచుందురు; యోషితాం = స్త్రీలకు, ప్రియః = ప్రియుఁడు, కో నామ = ఎవఁడు ?

తా.—స్త్రీలకు ఒక్కనియందే ప్రీతి యనునిశ్చయము లేదు; వారు ఏకకాలమందే ఒకనిని మాటలచేతను, మఱియొకని చూపులచేతను, వశపఱుచుకొనుచు, మూఁడవవానిని మనస్సులో తలపోయుచు, ఉందురు.

తే. ఒకనితోఁగూడి భాషింతు, రొక్కనరునిఁ
జూతురు విలాససంపద సొంపు గులుక,
మఱియు నెక్కనిఁ దలఁతురు మనసులోన,
గూర్చుప్రియుఁ డెవ్వఁడో ముద్దుగుమ్మలకును!

వ్యా.—ఇతోఽపి న విశ్వాస్యాః స్త్రియ ఇత్యాహ ద్వాభ్యాం - జల్పన్తీతి- అన్యేన సార్ధ మేకేన పురుషేణ సహ, జల్పన్తి సల్లపన్తి, సవిభ్రమాః సవిలాసాః సత్యః, అన్యం పురుషం, పశ్యన్తి, హృద్గతం హృదయస్థ, మన్యం చిన్తయన్తి, అతో యోషితాం స్త్రీణాం, ప్రియతమః నియత ఇతి శేషః, కో నామ - న కోఽపీ త్యర్థః.

---

అపసర సఖే దూరా దస్మాత్ కటాక్షవిషానలాత్
ప్రకృతివిషమా ద్యోషిత్సర్పా ద్విలాసఫణాభృతః ;
ఇతరఫణినా దష్టః శక్య శ్చికిత్సితు మౌషధై,
శ్చతురవనితాభోగిగ్రస్తం త్యజన్తి హి మన్త్రిణః. 51.

టీక.—సఖే = మిత్త్రమా, కటాక్ష విష అనలాత్ = క్రేఁగంటిచూపు లనెడు విషాగ్నులు గలదియు, ప్రకృతి విషమాత్ = స్వభావముచేతనే వక్రితమును (పుట్టుకచేతనే వంకర అని సర్పపరము), విలాస...భృతః - విలాస = విభ్రమము అనెడి - ఫణా = పడగను - భృతః = తాల్చినదియు, (అయిన), అస్మాత్ యోషిత్ సర్పాత్ స్త్రీయనెడి యీ పామువలననుండి, దూరాత్ అపసర = దూరముగా తొలఁగుము, హి = ఏలనఁగా, ఇతరఫణినా = తక్కిన పాముచేత, దష్టః = కఱవఁబడినవాఁడు, ఔషధైః = మందులచేత, చికిత్సితుం = కుదుర్చుటకు, శక్యః=సాధ్యుఁడు, చతుర...గ్రస్తం - చతుర = జాణమైన - వనితా = స్త్రీయనెడి - భోగి = పాముచేత - గ్రస్తం = కఱవఁబడినవానిని (పట్టఁబడినవానిని), మన్త్రిణః= విషవైద్యులు (ఆలోచన చెప్పువారు) త్యజన్తి = వదలుదురు.

తా.—విషాగ్నులు క్రక్కుచు వంకరగా ప్రాఁకుచు పడగయెత్తుకొనియున్న పామునుండి దూరముగా తొలఁగవలసినవిషయము తెలిసినదే గదా; క్రేఁగంటిచూపులును వి



క్రితస్వభావమును విభ్రమంబును గలదైన స్త్రీనుండి అంతకన్న దూరముగా తొలఁగవలసినది. ఏలన ఆపాము కఱచినవానిని విషవైద్యులు బ్రతికింతురు గాని, ఈ గడుసుజవ్వనికి వసమైనవానిని హితోపదేశము చేయుమిత్త్రులు బాగుపఱుప శక్యముగానందున విడిచివేయుదురు.

ఉ. చూపు విషంబు, విభ్రమము సొంపు ఫణాఫలకంబు గా, వధూ
రూపము దాల్చుభోగికిని, రూఢిగ దూరముగాఁ దొలంగుమీ ;
దాపుగ సర్పదష్టునకు దప్పు విషంబు మహౌషధంబులం,
బాప వధూభుజంగ విష భగ్ను నిచెంతకుఁ బోరు మాంత్రికుల్.

వ్యా.—అథ యోషిత స్సర్పస్వరూపేణ సఖాయం భీషయన్ దూరా దపసరణ ముపదిశతి - అపస రేతి.— హే సఖే బన్ధో, కటాక్షా అపాఙ్గవీక్షణా న్యేవ-విషానలా విషాగ్నిజ్వాలా - యస్య తస్మాత్, ప్రకృత్యా విషమాత్ స్వభావత ఏవ కుటిలాత్* 'ప్రకృత్యాదిభ్య స్తృతీయా చే'తి(?)తృతీయాసమాసః, విలాసా విభ్రమా - ఏవ ఫణాః స్ఫటా-స్తా బిభర్తీతి తథోక్తాత్ - ని. 'స్ఫటాయాం తు ఫణా ద్వయో రి' త్యమరః, తస్మా, ద్యోషి త్సర్పా త్కామినీరూపవ్యాళా, ద్దూరా దపసర దూరం గచ్ఛ - యోషిత్సర్పసమాగమం మా కుర్వి త్యర్థః, అన్యథా తత్సమాగమేన దంశనప్రసఙ్గా చ్చికిత్సాయా దుష్కరత్వా దితి భావః*'దూరా న్తికార్థేభ్యో ద్వితీయా చే'తి చకారా త్పఞ్చమీ, త దేవ ప్రకటయతి ఇత రేతి - ఇతరఫణినా ప్రసిద్ధసర్పేణ, దష్టః పుమాన్, ఔషధైః మూలికా మణి మన్త్రాదిభి రి త్యర్థః, చికిత్సితుం విషాపరోపణే నోజ్జీవయితుం, శక్యః, చతురవనితాభోగినా నిపుణతరుణీసర్పేణ-గ్రస్తం దష్టం సమాక్రాన్తం చ పురుషం తు, మన్త్రిణో మాన్త్రికా విషవైద్యాః, త్యజన్తి విసృజన్తి హి-తద్గాత్రిసజనితోన్మాదస్య దురపరోపత్వా దితి భావః.

అత్రాపి సమస్తవస్తువర్తి సావయవరూపకాలంకారః; తేన చోపమానాత్ప్రసిద్ధసర్పా దుపమేయస్య యోషిత్సర్ప స్యాధిక్యప్రతీతే ర్వ్యతిరేకో వ్యజ్యత ఇత్యలంకారే ణాలంకారధ్వనిః. హరిణీవృత్తమ్ - లక్షణం తూక్తమ్.

---

విస్తారితం మకరకేతనధీవరేణ
స్త్రీసంజ్ఞితం బడిశ మత్ర భవామ్బురాశౌ;
యే నాచిరా త్తదధరామిషలోలమర్త్య
మత్స్యా న్వికృష్య స పచ త్యనురాగవహ్నౌ. 52.

టీక.—మకరకేతన ధీవరేణ = మొసలిసిడపు (మన్మథుఁడనెడి) జాలరిచేత, అత్ర భవ అమ్బురాశౌ = ఈ సంసార సముద్రమునందు, స్త్రీ సంజ్ఞితం బడిశం విస్తా

రితం = స్త్రీ (యని) పేరుగల గాలము చాఁపఁబడినది, తేన = దానిచేత (ఆగాలము చేత), అచిరాత్ = స్వల్పకాలములో, తత్ అధర ఆమిష లోల మర్త్య మత్స్యాన్ = *ఆస్త్రీలయొక్క మోవియనెడి యెరయందు ఆసగల మనుష్యులనెడి చేఁపలను, వికృష్య= లాఁగి, అనురాగ వహ్నౌ = వలపు అనెడి నిప్పునందు, సః= ఆమన్మథుఁడు, పచతి= వండును - బాధించు ననుట.

తా.—జాలరి యేవిధముగా సముద్రములో గాలములను వైచి త్వరలో అందలి యెరకై వచ్చి పడినచేఁపలను బట్టి నిప్పుతో వండుకొనునో ఆవిధముగానే, మన్మథుఁడు సంసారములో స్త్రీలను పెట్టి వారికెమ్మోవికై యాసగొనివచ్చి పడుపురుషులను వశపఱుచుకొని వలపుపాలు చేసి మాయించును.

ఉ. చేరి మనోజధీవరునిచేత భవాంబుధిలోన నంగనా
కారముఁ బూనియున్న పెనుగాలము చిమ్మఁగ నయ్యె; దానిచే
భీరుజనాధరామిషముఁ జేర్మి భుజించునరాండజంబులన్
వారక సారెకుం దిగిచి వండు మరుం డనురాగవహ్నిలోన్.

వ్యా.—పునః ప్రకారాన్తరేణ భీషయతి - విస్తారిత మితి.—మకరకేతనో మదన- ఏవ ధీవరః కైవర్త - స్తేన - కర్త్రా - ని. 'కైవర్తే దాశధీవరా వి' త్యమరః, అ త్రాస్మిన్, భవామ్బురాశౌ సంసారసాగరే; స్త్రీసంజ్ఞాఽస్యసంజాతా స్త్రీసంజ్ఞితం-యోషి ద్రూప మి త్యర్థః * తారకాదిత్వా దితచ్, బడిశం మత్స్యవేధనం - మత్స్యగళగ్రాహక సామిష వక్రాయోయ న్త్రి మి త్యర్థః - ని. 'బడిశం మత్స్యవేధనమి' త్య మరః, విస్తారితం ప్రవర్తితం, యేన స్త్రీబడిశేన, తస్య స్త్రీబడిశ స్యాధర మే - వామిషం మాంసఖణ్డం - తత్ర లోలా సతృష్ణా - యే మర్త్యా మనుజా - స్త ఏవ -మత్స్యామీనా స్తా, ననురాగ ఏవ వహ్ని స్తత్ర, విపచతి విశేషేణ పక్వాన్ కరోతి - అత్యన్తం సంతాపయ తీ త్యర్థః, మన్మథధీవర ఏ వేతి శేషః, సోఽ ప్యేతద్వా రైవ మనుజా న్పరిపీడయ తీతి భావః. అత్రాపి పూర్వవ దూపకాలంకారః. వసన్తతిలకా.

---

కామినీకాయకాన్తారే కుచపర్వతదుర్గమే
మా సంచర మనఃపాన్థ, త త్రాస్తే స్మరతస్కరః. 53.

టీక.—మనః పాన్థ = మనస్సనెడి (యో) బాటసారీ, కుచ...మే - కుచపర్వత = చనుఁగొండలచేత - దుర్గమే = పోరానిదైన, కామినీ...తారే - కామినీకాయ కాన్తారే = స్త్రీ దేహమనెడి యడవిలో, మా సంచర = తిరుగకుము, (ఏలన), తత్ర = అందు (ఆయడవిలో), స్మర తస్కరః = మరుఁడనెడు దొంగ, ఆస్తే = ఉన్నాఁడు.



తా.—దారిదొంగ అడవిలో కొండలనడుమ చొరరానికనుమలో పోయెడుబాటసారిని కొట్టి ధనము దోఁచుకొనునట్లు, మన్మథుఁడు కామినీదేహమందు చనుఁగవనడిమియిఱుకటములో దాఁగినవాఁడై అటుప్రసరించు మనస్సును కొట్టి ధైర్యమునుహరించును.

భా.—కుచములచాటున హృదయమందు నెలకొనియుండువాఁడు గావున కుచములకడఁగొట్టు నని స్వారస్యము. కుచములు క్రిక్కిఱిసియుండుట సౌభాగ్యాతిశయము. ముఖ్యముగా సమపీననిరంతరస్తనములచే పురుషుఁడు స్త్రీకి లోనగు నని భావము.

క. స్తనపర్వతదుర్గమమై । ఘన మగుకాంతా శరీర కాంతారమునం
జనఁ బోకు మనఃపాంథుఁడ; । కనలుచు మరుఁ డనెడిదొంగ గలఁ డచ్చోటన్.

వ్యా.—అథ మానసం భీషయతి - కామి నీతి —పన్థానం గచ్ఛతి నిత్య మితి పాన్థో నిత్యపథికః * 'పన్థో ణ నిత్య మి'తి ణ ప్రత్యయః పన్థాదేశ శ్చ - మన ఏవ పాన్థః తస్య సంబుద్ధిః - హే మనఃపాన్థ, కుచా వేవ పర్వతౌ తాభ్యాం - దుర్గమే గన్తు మశక్యే, కామిన్యాః - కాయో దేహ - స్స ఏవ కాన్తార మరణ్యాం - తత్ర, మా సంచర సంచారం మా కురు-న ప్రవర్తస్వ ఇ త్యర్థః, కుత, స్తత్ర కాన్తారే, స్మర ఏవ తస్కరః చోరః, ఆస్తే వర్తతే, స చ మానసర్వస్వ మపహరిష్య తీతి భావః-ని. 'చౌ రైకాగారిక స్తేన దస్యు తస్కర మోషకా' ఇ త్యమరః, * 'తద్బృహతోః కరపత్యో శ్చోరదేవతయో స్సు డ్తలోప శ్చే'తి సుడాగమతలోపౌ. అలంకార స్తు పూర్వవత్.

---

వ్యాదీర్ఘేణ చలేన వక్రగతినా తేజస్వినా భోగినా
నీలాబ్జద్యుతి నాహినా వర మహం దష్టో న త చ్చక్షుషా;
దష్టే సన్తి చికిత్సకా దిశి దిశి ప్రాయేణ ధర్మార్థినో,
ముగ్ధాక్షీక్షణవీక్షితస్య న హి మే వైద్యో న వా ప్యౌషధమ్.54.

టీక.—పూర్వార్ధమున విశేషణములు సర్పమునకును కామినీనేత్రమునకు సాధారణములు.—వ్యాదీర్ఘేణ = మిక్కిలి నిడుదయు, చలేన=చంచలంబును, వక్ర గతినా =కుటిల ప్రసారముగలదియు, తేజస్వినా = కాంతిగలదియు, భోగినా = పడగగలదియు (అని సర్ప.) - ఆభోగినా = విరివిగలదియు (అని నేత్ర.), నీల అబ్జ ద్యుతినా = నల్ల గలువకాంతి గలిగినదియు, (అయిన), అహినా = పాముచేత, అహం = నేను, దష్టః = కఱవఁబడినవాఁడను, (అగుట), వరం = కొంతమేలు, (అట్టిదే అయిన), తత్ చక్షుషా = ఆచెలువయొక్క కంటిచేత, (దష్టః) న =కఱవఁబడినవాఁడ (నగుట) ఇంచుకైనను మేలు గాదు; (ఏల యన), దష్టే (సతి) = (సర్పముచేత) కఱవఁబడిన

యెడల, దిశి దిశి = ఎల్లయెడలను, ప్రాయేణ=తఱుచుగా, ధర్మ అర్థినః = పుణ్యమును కోరువారైన, చికిత్సకాః = (విష) వైద్యులు, సన్తి = కలరు, (కాని), ముగ్ధా...వీక్షితస్య - ముగ్ధాక్షీ = అందమైన కన్నులుగల కోమరాలియొక్క - ఈక్షణ = కంటిచేత-వీక్షితస్య = చూడఁబడినట్టి [లేక, క్షణ వీక్షితస్య = క్షణము చూడఁబడినట్టి], మే = నాకు, వైద్యః=చికిత్సకుఁడు, న హి = లేఁడు గదా, ఔషధం వా అపి=మందు గాని, న = లేదు.

తా.—కామినీనేత్రము అనేకవిషయములలో పామువంటిది; రెండును నిడుదలు, చంచలములు, కుటిలప్రసారముగలవి, కాంతిమంతములు, నల్లగలువవన్నె గలవి; అందులో పాము పడగ గలది, అందులకు ఈడుగా కామినీనేత్రము వైశాల్యము గలది. అయినను ఆకంటఁబడుటకన్న పాముకాటు పడుట కొంత మేలు. ఎట్లనిన, కాటుపడినవానికి పుణ్యముకై చికిత్సచేయు వైద్యులును మాంత్రికులును తఱుచుగా నుందురు. ఆకంట క్షణమాత్ర మేనియుఁ బడినవానికి వైద్యుఁడు లేఁడు, మందును లేదు.

ఉ. ఉరగము ముట్టినా నరుల కుర్విని వెజ్జులు ధర్మశీలురై
గరళము నెక్కుడింతు, రధికంబుగ నాయతమేచకోత్పల
స్ఫురణ వహించి వక్రగతిఁ బూనినమానినిచూపు సోఁకినం
బురుషున కెందు మందులును బొంకవు పొందరు వెజ్జు లెవ్వరున్.

వ్యా.—అథ త్రిభిః కస్యచి దనుభవ మాల క్ష్యాహ - వ్యాదీర్ఘే ణేతి.—వ్యాదీర్ఘేణ అత్యాయతేన - అన్యత్ర కర్ణాన్తవిశ్రాన్తేన, చలేన చఞ్చలప్రకృతినా, వక్రగతినా నిసర్గకుటిలసంచారేణ, సమాన మేతద్విశేషణద్వయం, తేజస్వినా బలవతా అత్యుజ్జ్వలేన చ * ప్రశంసాయాం వినిః, భోగినా ఫణవతా - ని. 'భోగ స్సుఖే స్త్ర్యాదిభృతా వహే శ్చ ఫణకాయయో' రిత్యమరః - అన్యత్రాభోగి నేతి చ్ఛేదః - విశాలే నే త్యర్థః, నీలాబ్జస్య నీలోత్పలస్య - ద్యుతిరివ ద్యుతి ర్యస్య తేన - ఏకత్ర తద్వర్ణేన - అన్యత్ర తత్సదృశే నే త్యర్థః, అహినా సర్పేణ, పర మత్యన్తమ్ - అహం దష్టః, కిం తు, తచ్చక్షుషా తస్యాః కామిన్యాః చక్షుషా ఉక్తవిశేషణేన, న దష్ట ఇ త్యర్థః, చికిత్సకాః వైద్యాః, ధర్మార్థినః పరోపకార ఏవ ప్రయోజన మేషా మస్తి తథాభూతా స్సన్తః, దిశిదిశి ప్రతిదిశం * 'నిత్యవీప్సయో రి' తి వీప్సాయాం ద్విర్భావః, ప్రాయేణ భూమ్నా - సన్తి సర్వత్ర సన్తీ త్యర్థః, కిం తు, ముగ్ధాయాః ముగ్ధాఙ్గనాయాః - య దక్షి - యద్వా ముగ్ధాక్షి సున్దరావలోకనం - తేన సర్పరూపేణ - క్షణం క్షణమాత్రం - వీక్షితస్య దృష్టస్య గ్రస్త స్యే త్యర్థః - వీక్షిత స్యేతి పాఠే దష్ట స్యే త్యర్థః, మే మమ తు, వైద్యో న హి చికిత్సకో నా స్తి హి, ఔషధం విషహరభేషజ మపి చ, నా స్తీ త్యర్థః, అతో మహామోహార్ణవనిమజ్జన మేవ న తు తత్పారగమన మితి భావః.



అత్ర ప్రసిద్ధాహ్యాపేక్షయా చక్షూరూపాహే రాధిక్యకథనా ద్వ్యతిరేకాలంకారః - 'ఉపమానా ద్య దన్యస్య వ్యతిరేక స్స ఏవ స' ఇతి లక్షణాత్.

---

ఇహ హి మధురగీతం, నృత్త మేత, ద్రసోఽయం,
స్ఫురతి పరిమ ళోఽసౌ, స్పర్శ ఏష స్తనానామ్,
ఇతి హతపరమార్థై రిన్ద్రియై ర్భ్రామ్యమాణః
స్వహితకరణధూర్తైః పఞ్చభి ర్వఞ్చితోఽస్మి. 55.

టీక.—ఇహ హి = ఇందుఁ గదా (తరుణులయందుఁ గదా యనుట), మధుర=తీయని - గీతం = పాట, స్ఫురతి = ఒప్పుచున్నది; ఏతత్ = ఇదిగో, నృత్తం = నాట్యము, (ఒప్పుచున్నది), అయం రసః = ఈ యాస్వాదము (అధరమాధుర్య మనుట), (ఒప్పుచున్నది); అసౌ = ఇదె, పరిమళః = తావి, (ఒప్పుచున్నది); ఏష = ఇదె, స్తనానాం=చన్నులయొక్క, స్పర్శః = తాఁకుడు, (ఒప్పుచున్నది); ఇతి = ఇట్లు, హతపరమార్థైః = హత = కొట్టఁబడిన - పరమ = ఉత్కృష్టమయిన - అర్థైః = ప్రయోజనముకలవియు, స్వ హిత కరణ ధూర్తైః = తమకు మేలును చేసికొనుటచేత వంచకములును, (అగు), పఞ్చ ఇన్ద్రియైః = అయిదు ఇంద్రియములచేతను, భ్రామ్యమాణః సన్=త్రిప్పఁబడుచున్నవాఁడ నగుచు, వఞ్చితః = మోసపుచ్చఁబడినవాఁడను, అస్మి = అగుచున్నాను.

తా.—నా పంచేంద్రియములు కామినియందు పాట ఆట మోవిమాధుర్యము నెత్తావి స్తనస్పర్శయు కలవు అని నన్ను ఆకర్షించి వానిమీఁదికి సుడి త్రిప్పి తాము తమ తమవిషయములను అనుభవించి నాకు తగినపరమార్థమును నాకు లేకుండఁ జేసి నన్ను వంచించినవి.—విషయములయందు ఆసక్తుఁడనై స్త్రీలోలుఁడనై పరమార్థము నెఱుంగ నేరక చెడితిని - అని భావము.

ఉ. ఈమృదుగాన మీనటన మీకుచమర్దన మీసుధారసం
బీమహనీయసౌరభము నింతులయందుఁ దనర్చు నంచు న
న్నేమఱఁ జేసి యాత్మహిత మిచ్చినభంగి మెలంగి యింద్రియ
గ్రామము మోసపుచ్చె; హితకార్యవిహీనుఁడ నైతి నక్కటా.

వ్యా.—ఇ హేతి.—ఇహ హి తరుణీ ష్వే వే త్యర్థః - హి రత్రావధారణార్థకః - ని. 'హి హేతా వవధారణ ఇ' త్యమరః, మధురం సంతాపహారం శ్రోత్రసుఖావహ మి త్యర్థః, - 'శీతలీక్రియ తే తాపో యేన త న్మధురం స్మృత మి'తి వచనాత్ - తత్ - గీతం గానం స్ఫురతి, ఏత న్నయనానన్దకరం, నృత్తం నాట్యం, స్ఫురతి, అ

యం రసనేన్ద్రియస్వాదాతిశయప్రదః రసః అధరామృతం, స్ఫురతి, అసౌ ఘ్రాణతర్పణః, పరిమళః పద్మినీజాతినిమిత్తగన్ధవిశేషః ఘనసారగన్ధసారాదిలేపనప్రయుక్తామోదవిశేషో వా, స్ఫురతి, ఏష త్వగిన్ద్రియసౌఖ్యావహః స్తనానాం స్పర్శః, స్ఫురతి,* 'స్తనాదీనాం ద్విత్వవిశిష్టా జాతిః ప్రాయేణే' తి వామనసూత్రే ప్రాయగ్రహణాద్బహువచనప్రయోగః, ఇత్యేవంప్రకారేణ, హతో వినష్టః - పరమార్థస్తత్త్వార్థో యేషాం తైః - విషయపరతన్త్రైరిత్యర్థః, అత ఏవ, స్వహితకరణే - ధూర్తైః కితవైః - ఆత్మహితాచరణతత్పరైరివ స్థితైరిత్యర్థః, పఞ్చభిరిన్ద్రియైః శ్రోత్రాదిభిః, భ్రామ్యమాణస్తత్తద్విషయేష్వాసజ్యమానస్సన్ వఞ్చితః ప్రతారితోఽస్మి, న చైతత్కైతవం ప్రాగేవాజ్ఞాసిషమిత్యర్థః. మాలినీవృత్తమ్.

---

న గమ్యో మన్త్రాణాం, న చ భవతి భైషజ్యవిషయో,
న చాపి ప్రధ్వంసం వ్రజతి వివిధైః శాన్తికశతైః,
భ్రమావేశాదఙ్గే కమపి విదధద్భఙ్గమసకృత్,
స్మరాపస్మారోఽయం భ్రమయతి దృశం ఘూర్ణయతి చ. 56.

టీక.—అయం స్మర అపస్మారః = మన్మథుఁ డనెడి యీ యపస్మారరోగము, మన్త్రాణాం = మంత్రములకు, న గమ్యః = విషయము కాదు (కుదురదు), భైషజ్య విషయశ్చ = మందునకు విషయమును, న భవతి = కాదు, వివిధైః = పలు విధము లైన, శాన్తికశతైః అపి = శాంతికర్మముల నూఱులచేత ను, ప్రధ్వంసం = నాశమును, న వ్రజతి = పొందదు, భ్రమ ఆవేశాత్ = మోహమును పెట్టుటవలన, అఙ్గే = దేహమునందు, కమపి = ఎట్టిదో చెప్ప శక్యముగాని, భఙ్గం=విఱుపును, అసకృత్ = పలుమాఱు, విదధత్ = చేయుచు, దృశం = చూపును, భ్రమయతి = తడఁబఱుచుచున్నది, ఘూర్ణయతి చ = గిరగిరఁ ద్రిప్పుచున్నది.

తా.—భ్రమలు కల్పించి ఒడలియందు విఱుపులు పుట్టించుట దృష్టిని తిరుగుడువడఁ జేయుట, క్రింది గ్రుడ్డు మీఁది గ్రుడ్డుపడం జేయుట, అనెడి లక్షణములను బట్టి చూడఁగా మదనావేశము సయితము ఒకవిధమయిన యపస్మారరోగము సుమా. అయినను రెంటిలోను మదనావేశమే అధమాపస్మారము. ఎట్లన సామాన్యమయిన యపస్మారరోగము మంత్రములకును మందులకును శాంతికర్మలకును కుదురును; ఈ మదనావేశాపస్మార మన్ననో అట్టివానికి ఎన్నిటి కైనను లొంగదు, కుదురదు.

ఉ. ఆరయ మంత్రగమ్యమును నౌషధసాధ్యముఁ గాదు, శాంతికా
చారశతంబులం జెడదు, చండతరభ్రమకల్పనోద్ధతిన్



ఘూర్ణవికార మంగములఁ బూన్చుచు మన్మథజన్య మీయప
స్మారము లోచనద్వయము సారెకుఁ ద్రిప్పెడుఁ జక్రముం బలెన్.

వ్యా.—అథాఙ్గనావ్యామోహజనకం మన్మథం దూషయతి - నేతి.—మన్త్రాణాం గమ్యో మన్త్రసాధ్యో, న భవతి, భైషజ్యవిషయః ఔషధాద్యపనేయశ్చ న భవతి - భేషజమేవ భైషజ్యమితి విగ్రహః * స్వార్థే ష్యఞ్ప్రత్యయః - ని. 'భేషజౌషధభైషజ్యానీ' త్యమరః, తథా, వివిధైర్నానాప్రకారైః, శాన్తికశతైరనేకశాన్తికర్మభిః, ప్రధ్వంసం వినాశం చాపి, న వ్రజతి న గచ్ఛతి -

'పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే
తచ్ఛాన్తిరౌషధైర్దానైర్జపహోమార్చనాదిభిః.' ఇతి స్మరణాత్,

ప్రసిద్ధస్తు జపాదిభిః శామ్యతి న త్వయమితి భావః, కిం తు భ్రమావేశాన్మోహోత్పాదనాత్, అఙ్గే శరీరే, కమప్యనిర్వాచ్యం, భఙ్గం జాడ్యం, యద్వా, భ్రమావేశాన్మతిభ్రంశాపాదనాత్, అఙ్గే కరచరణాద్యవయవేష్విత్యర్థః, కమపి భఙ్గం విక్షేపాదివికార, మసకృద్బహువారం, విదధత్కుర్వన్ * దధాతేర్విపూర్వాచ్ఛతృప్రత్యయః * 'నాభ్యస్తాచ్ఛతు' రితి నుమభావః, స్మరాపస్మారః స్మరప్రయుక్తాఙ్గనావ్యామోహరూపాపస్మారరోగః, దృశం మదీయదృష్టిం, భ్రమయతి వ్యత్యాసయతి - అతస్మింస్తజ్జ్ఞానం కరోతీత్యర్థః, తథా, ఘూర్ణయతి చక్రవద్భ్రామయతి చ, కిమత్ర కరోమి కథమయం చికిత్స్య ఇతి భావః, యదాహుర్వైద్యనిదానికాః -

క్రుద్ధైర్ధాతుభిరాహతే చ మనసి ప్రాణీ తమస్సంవిశన్
దన్తాన్ ఖాదతి ఫేనముద్వమతి దోఃపాదం క్షిపన్ మూఢధీః
పశ్యన్ రూపమసత్స్థితో నిపతతి ప్రాయః కరోతి క్రియా
బీభత్సాః స్వయమేవ శామ్యతి గతే వేగే త్వపస్మారరుక్.

వ్యతిరేకాలంకారః. లక్షణం తూక్తమ్. శిఖరిణీవృత్తమ్.

---

అవ.—వేశ్యా నింద.

జాత్యన్ధాయ చ దుర్ముఖాయ చ జరాజీర్ణాఖిలాఙ్గాయ చ
గ్రామీణాయ చ దుష్కులాయ చ గలత్కుష్ఠాభిభూతాయ చ
యచ్ఛన్తీషు మనోహరం నిజవపుర్లక్ష్మీలవశ్రద్ధయా
పణ్యస్త్రీషు వివేకకల్పలతికాశస్త్రీషు రజ్యేత కః? 57.

టీక.—జాత్యన్ధాయ = పుట్టుగ్రుడ్డికి, దుర్ముఖాయ చ = రోఁతమొగమువానికి ని, జరా జీర్ణ అఖిల అఙ్గాయ చ - జరా = ముదిమిచేత సడలిన సమస్తమైన యవయవ

ములుగలవానికిని, గ్రామీణాయ చ = పల్లెటూరివానికిని, దుష్కులాయ చ = చెడుకులమువానికి ని, గళ...భూతాయ చ-గళత్ = (చీము) కాఱుచున్న - కుష్ఠ = పెద్దరోగముచేత - అభిభూతాయ చ = పీడితునికిని, లక్ష్మీ...యా - లక్ష్మీ = ధనముయొక్క-లవ = లేశమునందలి - శ్రద్ధయా = ఆశచేత, మనోహరం = సుందరమయిన, నిజ వపుః = తమ దేహమును, యచ్ఛన్తీషు = ఇచ్చువారును, వివేక...శస్త్రీషు - వివేక = (మంచిచెడుగుల) యెఱుకయనెడు - కల్పలతికా = ఈవితీఁగెకు - శస్త్రీషు = చురకత్తులును, (అగు), పణ్యస్త్రీషు = బోగముచానలను, కః = ఎవఁడు, రజ్యేత = వలచును.

తా.—బోగముచానలు ఇంచుకధనమున కాసపడి తమసుందరదేహమును పుట్టుగ్రుడ్డికి, రోఁతమొఁగమువానికి, అవయము లెల్ల సడలినముదుసలికి, పల్లెటూరి మోటుగానికి, చెడుకులమువానికి, ఒడలు చీము కాఱుచున్న పెద్దరోగమువానికిని, ఒసంగుదురు. ఈవితీఁగవలె సకలభాగ్యముల నొసంగునదైన వివేకమును చురకత్తులవోలె నాశము సేయువారైనట్టి యీవారస్త్రీలను ఎవ్వఁడును ప్రేమింపఁదగదు.

చ. విడువక పుట్టుగ్రుడ్డునకు వృద్ధశరీరికిఁ గుష్ఠరోగికిన్
జడునకు జాతిహీనునకుఁ జారునిజాంగము లొక్క రూకకై
కడువడి నిచ్చువారి గుణకల్పలతల్ విదళించుకత్తులం
బడుపుఁబడంతులం దనదుభావముఁ జేర్చునె యెవ్వఁ డేనియున్?

వ్యా.—అథ త్రిభిః పణ్యాఙ్గనాగర్హణం కుర్వ న్నిగమయతి.—జాత్యన్ధాయ జన్మప్రభృత్యవసన్నదృశే పురుషాయ చ, దుష్కులాయ చ, దుర్ముఖాయ ముఖరాయ బహుగర్హ్యభాషణదూషితవదనా యే త్యర్థః - ని. 'దుర్ముఖే ముఖరాబద్ధముఖా వి' త్యమరః, యద్వా - దుష్టం వ్యాధ్యాదినా జుగుప్సితం - దుర్గన్ధయుక్తం వా - ముఖం యస్య తస్మై, జరయా విస్రసయా - జీర్ణాని శిథిలాని కృశాని విశ్లథసన్ధిబన్ధాని చ - అఖిలాఙ్గాని కరచరణా ద్యశేషావయవా - యస్య తస్మై చ, గ్రామీణాయ గ్రామాన్తరా దాగతాయ - అజ్ఞాతకులగోత్రాయ పాన్థాయ చే త్యర్థః, కిం బహునా - గళత్ స్రంసమానం - కుష్ఠం కుష్ఠజనితపూయరక్తాది - తే నాభిభూతాయ - గర్హితాయ చ, లక్ష్మీలవశ్రద్ధయా సంపల్లేశప్రాప్త్యాశయా, మనోహర మతిసున్దరం, నిజవపుః స్వశరీరం, యచ్ఛన్తీ ష్వర్పయన్తీషు - చుమ్బనాశ్లేషణదన్తనఖవ్రణాది సంభోగార్థం తదధీనం కుర్వతీ ష్వి త్యర్థః * దదాతే 'దాణ్ దానే', ఇ త్యస్మా ద్ధాతో శ్శతరి * 'ఉగితశ్చేతి' జీప్ * 'పాఘ్రాధ్మే' త్యాదినా దాణో యచ్ఛాదేశః, తథా, వివేకః కర్తవ్యాకర్తవ్యవిచార - స్స ఏవ కల్పలతికా - తస్యా - శ్శస్త్రీషు ఛురికాసు - వివేకవిచ్ఛేదకరీ ష్వి త్యర్థః - వివేక స్యా ప్యఖిలార్థసంఘటకత్వా త్కల్పలతికారూపణ మవగన్తవ్యం - ని. 'స్యాచ్ఛస్త్రీ చాసిపుత్రీ చ చ్ఛురికా చాసిధేను కే' త్యమరః * 'బహ్వాదిభ్య



శ్చే' తి జీష్, పణ్యస్త్రీషు వేశ్యాఙ్గనాసు, కః పుమాన్ వివేకరహితోఽపీ త్యర్థః, రజ్యే తానురక్తో భవే న్నకోఽపీ త్యర్థః - ని. 'వారస్త్రీ గణికా వేశ్యా పణ్యాఙ్గనాఽపి చే' తి వైజయన్తీ. శార్దూలవిక్రీడితమ్.

---

వేశ్యాసౌ మదనజ్వాలా రూపేన్ధనసమేధితా
కామిభి ర్యత్ర హూయన్తే యౌవనాని ధనాని చ. 58.

టీక.—అసౌ = ఈ, వేశ్యా = బోగముది, రూపే...ధితా - రూప - అందమనెడి - ఇన్ధన = కట్టెలచేత - సమేధితా = చక్కఁగా పెంపఁబడిన, మదనజ్వాలా = మన్మథాగ్నిశిఖ, యత్ర = ఎందు (అందు), కామిభిః = కాముకులచేత, యౌవనాని = జవ్వనములును, ధనాని చ = ధనములును, హూయన్తే = వేల్వఁబడును.

తా.—ఆహితాగ్నులు చిదుగులచేత అగ్ని మండినంతట లేచుమంటయందు ఆజ్యమును తండులములను వేల్తురుగదా; అట్లె కాముకులు (వేశ్యాసౌందర్యముచేత) మదనుఁడు వర్ధిల్లి వహించినదీప్తిగా నొప్పుచున్న వేశ్యయందు యౌవనములను ధనములను అర్పింతురు.—వేశ్యాసంపర్కముచేత కాముకులు అల్పకాలములోనే బడుగులును దరిద్రులును అగుదురు, అని భా.

క. రూపేంధనవర్ధితవే । శ్యాపంచశరాగ్నికీలయం దంగజపూ
జాపరతంత్రులు వేల్తురు । దాపుగఁ దమజవ్వనములు ధనములుఁ గడఁకన్.

వ్యా.—వేశ్యేతి.—అసౌ వేశ్యా, రూపం సౌన్దర్య మే వేన్ధనాని - తైః సమిద్భిర్వివర్ధితా - మన్మథజ్వాలా మన్మథాగ్నిజ్వాలా - ని. 'ఇన్ధనం త్వేధ ఇధ్మ మేధ స్సమిత్స్త్రియా మి' త్యమరః, యత్ర మదనజ్వాలారూపవేశ్యాయాం, కామిభిః కాముకైః, యౌవనాని నూతనవయాంసి, * యువాదిత్వా దణ్ప్రత్యయః, ధనాని చ, హూయన్తే హవ్యరూపేణ తత్సా త్క్రియన్తే - విలుప్యన్త ఇ త్యర్థః, స్వర్గాదిఫలకాఙ్క్షిభి రాహవనీయాగ్నిజ్వాలాయాం హవీంషీ వేతి భావః.

అత్ర వేశ్యాయా మారోప్యమాణస్య జ్వాలాత్వస్య ప్రకృతహవనోపయోగిత్వా త్పరిణామాలంకారః - 'ఆరోప్యమాణస్య ప్రకృతోపయోగిత్వే పరిణామ' ఇతి లక్షణాత్, స చ రూపేన్ధ నేతి రూపకేణ సంకీర్యతే; రూపకే త్వారోపణ స్యోపరఞ్జకమాత్ర మే వేతి వివేకః.

---

కశ్చుమ్బతి కులపురుషో వేశ్యాధరపల్లవం మనోజ్ఞమపి
చారభట చోర చేటక నట విట నిష్ఠీవనశరావమ్. 59.

టీక.—మనోజ్ఞమపి = సుందరమయినను, చార...శరావమ్ - చార = వేగులు - భట = బంటులు - చోర = దొంగలు - చేటక = కుంటెనీండ్రు - నట = నట్టువాండ్రు - విట = విటకాండ్రు - వీరికి - నిష్ఠీవన = ఉమియుటకైన - శరావమ్ = మూఁకుడైనట్టి, వేశ్యా అధర పల్లవం - వేశ్యా = వెలయాలియొక్క - అధరపల్లవం = మోవి చిగురును, కుల పురుషః = మంచివంశపు మనుష్యుఁడు, కః = ఎవఁడు, చుమ్బతి = ముద్దుగొనును.

తా.— ఉత్తమకులస్థుఁ డెవ్వఁడును నానా నీచజనులు ఎంగిలి సేయు వేశ్యాధరమును ఎంతరమణీయము నైనను ముద్దుగొనఁ దగదు. — వేశ్యను స్వీకరించుట నీచుల యెంగిలిని తినుటవంటిది, అని భా.

క. జార భట చోర చేటక । చార నట ప్రభృతి నీచ జన నిష్ఠీవా
ధారశరావము వార । స్త్రీరమ్యాధరము సంస్పృశింతురె కులజుల్?

వ్యా.—మనోజ్ఞం సున్దరమపి, వేశ్యాయా - అధరః పల్లవ మివే త్యుపమిత సమాసో - నత్వధరః పల్లవ మితి రూపకం - రూపకే తూత్తరపద ప్రాధాన్యేన తత్ర చుమ్బనాయోగాత్, కః కులపురుషః సత్కులసంభవః పుమాన్ జాతినీతికులాచార ధర్మజ్ఞ ఇత్యర్థః, చుమ్బతి న కోఽపీత్యర్థః, కుత ఏత దిత్యాశఙ్కాయా మచుమ్బన హేతుభూతం విశేషణ మాహ - జారా గూఢపురుషాః - భటా యోధాః - చోరా స్తస్కరాః - చేటకా స్త్రీపురుషసంధానకుశలాః దౌత్యకర్మనిరతాః - విటా జారాః - నటా భూమికా ధారా-స్తేషాం పురుషాపశదానాం - నిష్ఠీవనశరావ ముచ్ఛిష్ట పాత్రం - పరమాపవిత్ర మిత్యర్థః - చుమ్బనసమయే తదుచ్ఛిష్టస్య తత్ర సంక్రమణా దితి భావః, అత్ర యద్యపి 'రతికాలే ముఖం స్త్రీణాం శుద్ధ మాఖేటకే శునా మి'తి స్మరణా త్సురతసమయే పవిత్రమేవ స్త్రీముఖం తథాఽప్యుక్తరీత్యా కశ్మలసంపర్కాత్ హేయతయా చుమ్బనానర్హత్వా న్నచుమ్బనీయ మితి తాత్పర్యమ్ - ని. 'శరావో వర్ధమానక' ఇత్యమరః. అత్ర రూపకోపమానుప్రాసానాం సంసృష్టిః.

---

మధు తిష్ఠతి వాచి యోషితాం, హృది హాలాహల మేవ కేవలమ్;
అత ఏవ నిపీయతేఽధరో, హృదయం ముష్టిభి రేవ తాడ్యతే. 60.

టీక.—యోషితాం = స్త్రీలకు, వాచి = నోట, మధు = తేనె, తిష్ఠతి = కలదు, హృది = హృదయమునందు, కేవలం = ముఖ్యముగా, హాలాహల మేవ = హాలాహల మను పేరివిషమే, (కలదు), అత ఏవ = కావుననే, అధరః = మోవి, నిపీయతే = ఆనఁబడును, హృదయం = ఎద, ముష్టిభి రేవ = పిడికిళ్లతోనే, తాడ్యతే = కొట్టఁబడును.



తా.—స్త్రీలకు నోట తేనెయు హృదయమున విషమును ఉండును; దానంజేసి పురుషులు వారిమోవిని ఆనుదురు, హృదయమును పిడికిటితో కొట్టుదురు.— స్త్రీలు మధురవచనలును క్రూరహృదయులును అనియు, పురుషులు వారిని గూడి యధరచుంబన స్తనస్పర్శసుఖములం బొందుదురు, అనియు, భా.

చ. కలదు గదా సుధారసము కంజదళాక్షులముద్దుఁబల్కులన్,
వెలయుఁ గదా హలాహలము వీరలచిత్తమునందుఁ; గావునం,
బలుమఱుఁ బల్లవాధరముఁ బాన మొనర్తురు నిండువేడుకన్,
బలితపుఁగొమ్మ ముష్టితల పాతములం బ్రహరింతు రెంతయున్.

వ్యా.—స్త్రియః బాహ్యమధురాః అన్తర్విషా, అత ఏవ సర్వథా త్యాజ్యా ఏవ న తు గ్రాహ్యా ఇత్యభిప్రాయే ణాహ - మధ్వితి.—యోషితాం స్త్రీణాం, వాచి, మధు క్షౌద్రం, తిష్ఠతి, హృది హృదయే, కేవలం ప్రాధాన్యేన, హాలాహల మేవ కాలకూటవిష మేవ, అత ఏవ అస్మా త్కారణా దేవ, అధరః అధరోష్ఠః, నిపీయతే అత్ర మధు వర్తత ఇతి మత్వైవ సర్వజనై రాదృత్య నితరాం పీయతే, హృదయం ముష్టిభిః తాడ్యతే అత్ర విషం వర్తత ఇతి మత్వైవ సర్వజనైః తాడనం క్రియతే, అతః స్త్రియః స్వవచనేషు కేవల మధుధారాస్రావిణ్యః - హృదయే విషతుల్యాభిప్రాయవత్యశ్చ-ఇతి పూర్వార్ధే ప్రదర్శితమ్, ఉత్తరార్ధే తు ప్రథమపాదే మధుగ్రహణం చ ద్వితీయపాదే హాలాహలస్థాన హృదయతాడనం చేతి ప్రదర్శిత మిత్యభిప్రాయః.

అత్ర ఉత్ప్రేక్షాతిశయోక్తికావ్యలిఙ్గధ్వనిభేదానాం సంసృష్టిః.

ఇతి భర్తృహరిసుభాషితశృఙ్గారశతకవ్యాఖ్యానే కామినీగర్హణం నామ
తృతీయా వింశతిః.

---

సువిరక్తపద్ధతిః.

---

ధన్యా స్త ఏవ ధవళాయతలోచనానాం
తారుణ్యదర్ప ఘన పీన పయోధరాణామ్
క్షామోదరోపరి లసత్త్రివలీలతానాం
దృష్ట్వాఽఽకృతిం వికృతి మేతి మనో న యేషామ్. 61.

టీక.—ధవళా...లోచనానాం - ధవళ = తెల్లనివియు - ఆయత = విశాలములును - (అగు) - లోచనానాం = కన్నులుగలవారును, తారుణ్య...ధరాణాం - తారుణ్య = యౌవనముయొక్క - దర్ప = మదముచేత - ఘన = క్రిక్కిఱిసినవియు -

పీన = బలిసినవియు - (అగు) - పయోధరాణాం=చన్నులుగలవారును, క్షామో...తానామ్ - క్షామ = కృశమయిన - ఉదర=కడుపుయొక్క - ఉపరి = మీఁద - లసత్ = ప్రకాశించుచున్న - త్రివళీ లతానాం = తీఁగలవంటి మూఁడుముడుతలు గలవారును, (అగుకోమలులయొక్క), ఆకృతిం = రూపమును, దృష్ట్వా = చూచి, యేషాం = ఎవరియొక్క = మనః = మనస్సు, వికృతిం = వికారమును, న ఏతి = పొందదో, తే ఏవ = వారే, ధన్యాః = పుణ్యవంతులు.

తా.—తెల్లని నిడుదకన్నులును, యౌవనంపు బిగువుతోడి యిటి గబ్బిగుబ్బలును, సన్నని నెన్నడుముమీఁద నొప్పు ముత్తఱులును, గలయెమ్మెకత్తెల రూపుం జూచి మనంబున వికృతిం జెందనివారే పుణ్యాత్ములు.

చ. కలికి మెఱుంగు వాలుఁ దెలిగన్నులు సన్నపుఁ గౌనుదీఁగపై
నలరెడుసద్వళీలతలు, నంచితయౌవనదర్పలక్ష్మిచేఁ
గులికెడుసిబ్బెపున్వలుఁదగుబ్బలునుం, గలమించుఁబోండ్ల రూ
పులఁ గని నిర్వికారు లగు పూరుషులే కృతకృత్యు లిద్ధరన్.

వ్యా.—ఏవం తావత్కామినీగర్హణం కృతం-కిం విరక్తాస్సన్తి వా న వేత్యాశఙ్కాయాం సన్త్యేవేతి మనసి నిధాయ తత్రాపి సువిరక్తదుర్విరక్తభేదేన ద్వైవిధ్యం ప్రతిపాదయిష్యన్నాదౌ సువిరక్తపద్ధతిం వర్ణయితు ముపక్రమతే - ధన్యా ఇత్యాదిభి ర్నవభిః - ధన్యా ఇతి.—త ఏవ పురుషా, ధన్యాః సుకృతశాలినః - సువిరక్తా ఇతి యావత్ - ని. 'సుకృతీ పుణ్యవాన్ ధన్య' ఇత్యమరః, తే క ఇత్యాకాఙ్క్షాయామాహ - ధవళే పుణ్డరీకదళసదృశే - ఆయతే కర్ణాన్తవిశ్రాన్తే చ - లోచనే - యాసాం తాసాం, తారుణ్యదర్పేణ యౌవనమదోద్రేకేణ - ఘనౌ నిబిడౌ - పీనౌ పీవరౌ - పయోధరౌ స్తనౌ - యాసాం తాసాం, క్షామోదర స్యాతి కృశమధ్య - స్యోప ర్యుపరిష్టా - ల్లసన్త్యః ప్రకాశమానాః - యా స్త్రీవళ్యః - తిస్రశ్చ తా వళ్యశ్చ - త్రివళ్యః * 'దిక్సంఖ్యే సంఖ్యాయా మి' తి సమాసః * సంఖ్యాపూర్వత్వేఽపి సప్తర్షయః ఇత్యాదివత్ జ్ఞేయ మిత్యుక్తం ప్రాక్ - తా లతా ఇవ - యాసాం తాసాం - తేనైవ తాసాం పద్మినీత్వం సూచ్యతే - తదుక్తం రతిరహస్యే - 'త్రివళిలలితమధ్యా హంసవాణీ సువేషే' తి - క్షామే త్యత్ర * 'క్షాయో మ' ఇతి మత్వం - తథా చేత్థంభూతరూపసంపన్నానాం కామినీనా, మాకృతి మాకారవిశేషం - దృష్ట్వా * 'ఇఙ్గితం హృద్గతో భావో బహిరాకార ఆకృతి రి' తి సజ్జనః, యేషాం పురుషాణాం మనో, వికృతిం వికారం, తత్పరతన్త్రత్వ మితి యావత్, నైతి న ప్రాప్నోతి, అత ఏవ ధన్యా ఇతి సంబన్ధః, ఏవం నిర్వికారచిత్తత్వం శమసంపన్నానా మేవ న త్వన్యేషా మితి భావః, తదుక్తం 'శమో వైరాగ్యేన నిర్వికారచిత్తత్వ మి' తి. వసన్తతిలకావృత్తమ్.

---



బాలే, లీలాముకుళిత మమీ మన్థరా దృష్టిపాతాః
కిం క్షిప్యన్తే? విరమ, విరమ; వ్యర్థ ఏష శ్రమ స్తే.
సమ్ప్రత్యన్యే వయ; ముపరతం బాల్య; మాస్థా వనాన్తే;
క్షీణో మోహః; స్తృణమివ జగజ్జాల మాలోకయామః. 62.

టీక.—హే బాలే=ఓ ముగుదా, లీలాముకుళితం-లీలా=విలాసముచేత-ముకుళితం (యథాతథా) = మొగిడునట్లుగా, మన్థరాః అమీ దృష్టి పాతాః = మెల్లని యీ చూపు ప్రసారములు, కిం = ఏల, క్షిప్యన్తే = నిగుడ్పఁబడుచున్నవి? విరమ విరమ = మాను మాను, = తే = నీయొక్క, ఏషః శ్రమః = ఈ పాటు, వ్యర్థః = వృథా, సంప్రతి = ఇప్పుడు, వయం = మేము, అన్యే = అన్యులము (మాఱితి మనుట), బాల్యం = కుఱ్ఱతనము, ఉపరతం = ఉడిగినది, వనాన్తే = అరణ్యప్రదేశమున, ఆస్థా = ఆసక్తి, (కలిగినది), మోహః = అజ్ఞానము, క్షీణః = తగ్గినది, జగత్ జాలం = లోకముల సమూహమును, తృణమివ = గడ్డిపోఁచవలె, ఆలోకయామః = చూచుచున్నారము.

తా.—ఓముగుదా, ఏల మమ్ము విలాసముకుళితనేత్రములతో మెలమెల్లనం జూచెదవు? ఈ నీపాటునకు ఫలము లేదు. మా స్వభావము మాఱినది. ఇప్పుడు, మాకు అరణ్యవాసము ఇష్టమై యున్నది, అజ్ఞానము పోయినది, లోకసమూహము గడ్డిపరకగానున్నది.

ఉ. మానిని యేల చిమ్మెదవు మాపయి మంథర దృష్టిపాతముల్?
మానుము నీశ్రమంబు విఫలం బిది, వింతల మైతి మిత్తఱిన్,
మానుగ జవ్వనం బడఁగె, మానసవృత్తి వనంబుఁ గోరె, న
జ్ఞానము నష్ట మయ్యె, యవసంబుగఁ జూచెద మెల్లలోకముల్.

వ్యా.—అథ పూర్వోపభుక్తకామినీసంబోధనవ్యాజేన సువిరక్తతాం ప్రకటయతి - బాలే లీలాముకుళిత మితి.—హే బాలే ముగ్ధే, లీలయా విలాసవైచిత్ర్యా - ముకుళితా న్యర్ధనిమీలనాని - యస్మిన్ కర్మణి తద్యథా తథా, మన్థరా అలసప్రాయాః, అమీ, దృష్టిపాతా విలోకనప్రసారాః, కిం కిమర్థం, క్షిప్యన్తే వికీర్యన్తే-న విక్షేప్యా ఇత్యర్థః, కిం తు, విరమ విరమ అభీక్ష్ణం విరమ - దృష్టివిక్షేపా దితి శేషః * ఆభీక్ష్ణ్యే ద్విర్భావః * 'వ్యాఙ్పరిభ్యో రమ' ఇతి పరస్మైపదం, కుతః - ఏషోఽయం తే, శ్రమః కటాక్షవిక్షేపజనితాయాసో, వ్యర్థో నిరర్థకః - అభిమతఫలానిష్పత్తే రితి భావః; న న్వేతావత్పర్యన్తం మదాయత్తచిత్తేషు యుష్మాసు కథం ఫలాసిద్ధి రిత్యత ఆహుః - సంప్రతీదానీం, వయ, మన్యే పరే - త్వద్విలాసలాలసత్వేన సంమోహితా స్తదానీంతనా ఇదానీం న భవామ ఇత్యర్థః, కుతః - బాల్య - ముపరతం నష్టం - బాల్య

శబ్దేన యౌవనం లక్ష్యతే-త్వత్పారతన్త్ర్యకారి యౌవన ముపరత మిత్యర్థః, యద్వా-బాల్య మవివేకిత్వ ముపరతం, కిం త్వాస్థా పరిశీలనాదరః, వనాన్తే అరణ్యమధ్యే-వర్తత ఇతి శేషః - కిం తు త్వయి రాగం పరిత్యజ్య వైరాగ్యేణ వనవాస మపేక్షామహ ఇత్యర్థః, తత్కృతః - మోహః అజ్ఞానం, క్షీణో ధ్వస్తః - త్వదాసఙ్గజనన హేతు ర్నిర్మూలో౾భూ దిత్యర్థః, అతో జగ జ్జాల మశేష ప్రపఞ్చం, తృణ మివ నిస్సార, మాలోకయామః - 'నిస్పృహస్య తృణం జగ ది' తి లక్షణా త్తథా పశ్యామః, ఇదానీం జ్ఞానోదయవశా చ్చ మనస్సుఖాతిరిక్తం సర్వం తుచ్ఛ మనుసందధ్మ ఇత్యర్థః, అత స్త్వయా న ప్రేక్షణీయ మితి భావః.

మన్దాక్రాన్తావృత్తమ్ - లక్షణ ముక్తం - 'మన్దాక్రాన్తా జలధిషడగై ర్మ్భౌ భనా తౌగురూ చేత్.'

---

ఇయం బాలా మాం ప్ర త్యనవరత మిన్దీవరదళ
ప్రభాచోరం చక్షుః క్షిపతి; కి మభిప్రేత మనయా ?
గతో మోహో౾స్మాకం, స్మరకుసుమబాణవ్యతికర
జ్వరజ్వాలా శాన్తా, త దపి న వరాకీ విరమతి. 63.

**టీక.**—ఇయం బాలా = ఈ ముగుద, మాం ప్రతి = నా కేసి, అనవరతం=ఎడతెగక, ఇన్దీ...చోరం - ఇన్దీవర దళ = నల్లగలువ రేకులయొక్క - ప్రభా = కాంతిని - చోరం = దొంగిలించునట్టి, చక్షుః = కంటిని, క్షిపతి = నిగిడించుచున్నది; అనయా = ఈ బాలచేత, కిమ్ అభిప్రేతం = ఏమి అపేక్షితము? అస్మాకం = మాకు, మోహః = అజ్ఞానము, గతః = పోయినది; స్మర...జ్వాలా - స్మర = మన్మథునియొక్క, కుసుమ బాణ = పూ ములుకులయొక్క - వ్యతికర = సంబంధముచేత(కలిగిన) - జ్వర = సంతాపముయొక్క - జ్వాలా = మంట, శాన్తా = నిమ్మళించినది; త దపి = అయినప్పటికి, వరాకీ = (ఈ) దీనురాలు, న విరమతి = మానకున్నది.

తా.—ఈ పిల్ల నన్ను ఎడతెంపు లేక నల్ల కలువ రేకులవలె ప్రకాశించు కనులతోఁ జూచుచున్నది. దీనితలం పేమో? దీని కోర్కులు ఇఁక మేము తీర్చువారము కాము. ఏల యన; మాకు జ్ఞానోదయ మైనది; విషయభోగతృష్ణ పోయినది; అయినను పాపము ఈదీనురాలు ముమ్ము వదలకున్నది.

ఉ. నీలసరోజపత్త్రికమనీయవిభాహరణప్రవీణదృ
గ్జాలము లీలతాంగి వెద చల్లెడు నాపయి; నేమి గోరెనో?
తూలె సమస్తమోహవికృతుల్ రతివల్లభభిల్ల భల్లభూ
జ్వాల లడంగె మాకుఁ; దనవైఖరి మానదు జోటి నేఁటికిన్.



వ్యా.—ఉక్త మే వార్థం భఙ్గ్యన్తరే ణాహ - ఇయ మితి.—ఇయ మేషా బాలా - ముగ్ధా, మాం ప్రతి మా ముద్ది, శ్యానవరత మవిచ్ఛిన్నం యథా తథా, ఇన్దీవరదళప్రభాచోర మిన్దీవరపత్త్రికాన్తిమోషకం-తత్కల్ప మిత్యర్థః, చక్షుః, క్షిపతి ప్రసారయతి, అనయా బాలయా, కి, మభిప్రేత మపేక్షితం-కి న్నభావా మీ త్యర్థః, నను తయా త్వత్సఙ్గ ఏ వాపేక్షిత స్తత్ కుతో న జానా సీ త్యాశఙ్కాయా మాహ - అస్మాకం మోహో, గతః ఉపరతః ఇదానీ మితి శేషః, నను పూర్వం మా మి త్యేకవచనం ప్రయు జ్యాస్మాక మి తీదానీం బహువచనప్రయోగా త్కథం సామానాధికరణ్య ముపపద్యత ఇతి చే త్తథా౾పి నివృత్తిమార్గోత్సుకిత్వప్రయుక్తాత్మసంభావనయా బహూకరణం న దోషా యేతి సమాధేయం, య ద్వా౾స్మా నితి సముదాయనిర్దేశేన వా న దోషః, తథా స్మర ఏవ - శబరః కిరాత - స్తస్య - బాణవ్యతికరేణ శరసంపర్కేణ - యో - జ్వర స్సంతాప - స్తస్య జ్వాలా, శాన్తా విర తే త్యర్థః, త దపి తథా౾పి, వరాకీ, న విరమతి విరతిం న ప్రాప్నోతి, పూర్వం పాణిప్రియతయా గరీయస్యాం బాలాయాం వరాకీశబ్దప్రయోగే ణా స్యాత్యన్తవైరాగ్యం సూచ్యతే * 'జల్పభిక్షుకుట్టలున్టే' త్యాదినా పాకన్పత్యయే షిత్వా న్జీష్ప్రత్యయే చ వరా కీతి సిద్ధమ్.

శిఖరిణీ వృత్తమ్.

---

రే కన్దర్ప, కరం కదర్థయసి కిం కోదణ్డటఙ్కారితైః ?
రే రే కోకిల, కోమలైః కలరవైః కిం వా వృథా జల్పసి ?
ముగ్ధే, స్నిగ్ధవిదగ్ధముగ్ధమధురై ర్లోలైః కటాక్షై రలం ;
చేత శ్చుమ్బితచన్ద్రచూడచరణధ్యానామృతం వర్తతే. 64.

**టీక.**—రే కన్దర్ప = ఓరి మన్మథా, కోదణ్డ టఙ్కారితైః = వింటి టంకారములచే, కరం = చేతిని, కిం = ఏల, కదర్థయసి = పీడించుకొనెదవు? రే రే కోకిల = ఓ కోరి కోయిలా, కోమలైః = మృదువులైన, కల రవైః = అవ్యక్తమధుర ధ్వనులచేత, వృథా = వ్యర్థముగా, కిం వా జల్పసి = ఏల ప్రేలెదవు? ముగ్ధే=ఓ ముగుదా, స్నిగ్ధ... మధురైః - స్నిగ్ధ = అనురాగవంతములును - విదగ్ధ = నేర్పుగలవియు - ముగ్ధ=అందములును - మధురైః = ప్రియములును, లోలైః = సతృష్ణములును, (అగు), కటాక్షైః = క్రేగంటిచూపులను, అలమ్ = మానుము. (ఏలనఁగా), చేతః = (నా)మనస్సు, చుమ్బిత...మృతం - చుమ్బిత = క్రోలఁబడిన - చన్ద్రచూడ చరణ ధ్యాన అమృతం = (చందురుఁడు సిగయందుఁగల) శివుని యడుగుల ధ్యానమనెడి యమృతముగలదిగా (శివపదధ్యాన మనెడియమృతమును అనుచు ననుట), వర్తతే = ఒప్పుచున్నది.

తా.—ఓరి మన్మథా! అల్లెత్రాటిని మ్రోఁగించుచు నీచేతిని నొప్పించుకొనకుము. ఓ కోయిలా! మృదుమధుర స్వరముతో నూరక ప్రేలకుము. ఓ సుందరీ నెయ్యంపు మిటారి సొగసుఁగటాక్షములను ప్రీత్యభిలాషలతో నాపై నిగిడింపకుము. ఏలన, నాచిత్తము శివచరణధ్యానానందపరాయణమై యొప్పుచున్నది.

ఉ. ఓరి మనోజ, సూనశర మూరక చిమ్మకు; మిన్నకే కహాఌం
కారము లేల చేసెదు పికద్విజ? యో మృగశాబకాక్షి, నీ
చారువిలోకనంబు లికఁ జాలును; నాహృదయంబు శంకరో
దార పదాబ్జ చింతన సుధారస తత్పర మయ్యె నియ్యెడన్.

వ్యా.—సంప్రతి సాటోపపరివార కందర్పనిరాకరణవచన మాహ - కి మితి.—రే కందర్ప హేమదన - రే ఇతి నీచసంబోధనే - ని. 'నీచసంబోధనే తు రే'ఇ త్యమరః, ఏవ ముత్తర త్రాపి, కోదణ్డటంకారితం కోదణ్డటంకారవత్కృతం - ధనుర్గుణ టంకార పూర్వక మి త్యర్థః * తత్కరోతీతి ణిచి ణా విష్ఠవద్భావే 'విన్మతోర్లుక్,' శరం త్వదీయబాణం, కిం కిమర్థం, కుత్సితో౽ర్థః కదర్థః * 'కోః క త్తత్పురుషే౽చీ'తి కుశబ్దస్య కదాదేశః - కదర్థం కరోషి కదర్థయసి - వ్యర్థయ సీ త్యర్థః * ధాత్వర్థే ణిచి సిప్, తథా, రేరే కోకిల హే కలకణ్ఠ, అత్ర * 'అసూయా సమ్మతి కోప కుత్సన భర్త్సనేషు'త్యసూయార్థే కోపాద్యర్థే ద్విరుక్తిః-'స్వరిత మామ్రేడిత'ఇ త్యాదినా ప్రాప్తస్య ప్లుతస్య * 'సాహస మనిచ్ఛతా విభాషా వక్తవ్య' ఇతి పాక్షికః ప్రతిషేధః - 'శాస్త్రత్యాగ స్సాహస మి'తి హరదత్తః, కోమలం రుచిరం, కలరవం మధురస్వరం - ని. 'కాకలీ తు కలే సూక్ష్మే ధ్వనౌ తు మధురాస్ఫుటే। కల' ఇ త్య మరః, కిం కి మర్థం వా, వృథా వ్యర్థం, జల్పసి కూజసి వ్యాహర సీతి యావత్ - న వ్యాహర్తవ్య మి త్యర్థః - ప్రయోజనాభావా దితి భావః, తథా ముగ్ధే హేసున్దరి, స్నిగ్ధాస్సాన్ద్రాః - ని. 'స్నిగ్ధం తు మసృణే సాన్ద్రే' ఇ త్యమరః - విదగ్ధాః వివిధవిలాసవిశేష వివరణనిపుణాః - చారవః ఇన్దీవరారవిన్దాదివ త్స్వభావరమణీయాః - మధురా స్సుధాధారావ న్మనోహరా శ్చ - విశేషణానా మపి మిథోవిశేషణవిశేష్యభావవివక్షాయాం * 'విశేషణం విశేష్యేణ బహుళ మి'తి సమాసః - తై, స్తథా, లోలై ర్నిసర్గచఞ్చలైః, కటాక్షై రపాఙ్గావలోకనై, రలం - యద్వా స్నిగ్ధైః -

'విస్రమ్భే పరమాం కాష్ఠా మారూఢే దర్శనాదిభిః
యే నాన్తరజ్గం ద్రవతి స స్నేహ ఇతి కథ్యతే.'

ఇత్యుక్తలక్షణ స్నేహపరిష్కృతైః - తథా - విదగ్ధైః విరక్త స్యాపి మన్మథవికారోద్దీపనచతురై రి త్యర్థః - 'యద్దర్శనే విరక్తో౽పి క్షుభ్యతే త త్సమన్మథ మి' తి లక్షణా - త్తథా - చారుభిః విషయమాత్రవిశ్రాన్తివిరహేణ విశృఙ్ఖలవృత్తిత్వ మదమన్థరత్వాది గుణ



శీలత్వస్య వివక్షితత్వాత్ స్మితాకారై రి త్యర్థః - త దుక్తం భావప్రకాశే -

'అపరిచ్ఛిన్నవిషయం మదమన్థరమీలితం
స్ఫురద్భ్రూపక్ష్మతాయుక్తం తత్ స్మేర మితి కథ్యతే.' ఇతి -

తథా - మధురై స్సంతాపహరైః - 'శీతలీక్రియతే తాపో యేన త న్మధురం స్మృత మి'తి లక్షణాత్, తథా, లోలై స్సతృష్ణై - స్సమ్భోగౌత్సుక్యభావనాతత్పరై రి త్యర్థః - తదుక్తం.-'కటాక్షై స్సాసగర్భై స్తు సంభోగౌత్సుక్యభావా నే'తి, కటాక్షైః -

'య ద్గతాగతవిశ్రాన్తివైచిత్ర్యేణ ప్రవర్తనం
తారకాయాః కలాభిజ్ఞా స్తం కటాక్షం ప్రచక్షతే.'

ఇత్యుక్తలక్షణై, రలం ఇత్థంభూతకటాక్షా న ప్రవర్తనీయా ఇ త్యర్థః * అత్ర వారణార్థయోగాత్ పక్షే తృతీయా, నను కుత ఏవం నిరాక్రియత ఇతి చే త్త త్రాహ-చేతో మదీయచిత్తం కర్తృ, చుమ్బిత మాస్వాద్యమానం-చన్ద్రచూడస్య చన్ద్రశేఖరస్య - చరణధ్యాన మే వామృతం - యేన త త్తథోక్తం సత్, వర్తతే తిష్ఠతి - స్మరహరచరణ ధ్యానావధాన సత్వర సంజాత పరమవైరాగ్యోల్లసితచిత్తం మా మేతే క్షుద్రాః కిం కరిష్య న్తీ త్యేకో భావః - అమృతపానపరితృప్తస్య కి మూరనాశే నే త్యపరో భావః-బ్రహ్మానన్దభరితస్య కిం వైషయికక్షుద్రానన్దే నే త్యపరతరో భావః - నాహ మిదానీం పూర్వవ ద్యుష్మత్కింకరః కిం తు శంకర కింకరః - అతో౽సాధ్య స్సాధయతాం యుష్మాకం కో౽య మపస్మార ఇ త్యపరతమో భావః - సర్వథా నాస్మాకం కామిన్యపేక్షా౽స్తీతి పరమో భావః. శార్దూలవిక్రీడితమ్.

---

అవ.—సంయోగవియోగముల తత్త్వము.

విరహే౽పి సఙ్గమః ఖలు పరస్పరం సఙ్గతం మనో యేషామ్ ;
హృదయ మపి † విఘటితం చేత్ సఙ్గో విరహం విశేషయతి.65.

టీక.—యేషాం = ఎవరికి, మనః=మనస్సు, పరస్పరం=ఒండొకటితో, సఙ్గతం = కలిసినదో, (తేషాం = వారికి), విరహే౽పి = ఎడఁబాటునందును, సఙ్గమః ఖలు = కూడికయే గదా. హృదయం=మనస్సు, విఘటితం చేత్ = వేఱుసేయఁబడిన దేని, సఙ్గః అపి = కూడిక యు, విరహం = వియోగమును, విశేషయతి = పెంపుసేయును.

తా.—మనస్సులకూడికయే కూడికగాని, దేహములకూడిక కూడికగాదు; అట్లే, మనస్సుల యెడఁబాటే యెడఁబాటుగాని దేహములయెడఁబాటు ఎడఁబాటు గాదు.

క. విరహమునందైనఁ బరం। స్పర మనురాగులకుఁ బొందు భాసిలు ; మన సె *
వ్వరి కనయదు వారలకును। విరహము నెచ్చుగ నొనర్చు వెస సంగతియున్.

వ్యా.—అథ పఞ్చవిషయవిరక్తిప్రకార మాహ - విరహ ఇతి.—యేషాం స్త్రీ పురుషాణాం, మనః, పరస్పర మన్యోన్యస్యం, సంగతం అన్యోన్యాన్యానురాగబద్ధ మిత్యర్థః, తేషాం, విరహోఽపి వియోగావస్థాయా మపి, సంగమః ఖలు సమాగమ ఏవ ఖలు 'హృదయసంగమ ఏవ సుసంగమో న తనుసంగమ ఆర్య సుసంగమ' ఇతి వచనాత్ - అస్త రజ్జుబలీయస్త్వన్యాయా చ్చేతి భావః - మనోనియమనే తు సజ్జః విరహహేతుక ఏవ భవ తీ త్యాహ-హృదయ మపి మనోఽపి, | విఘట్టితం సమ్యక్ కృతం - వైరాగ్యప్రవణీకృతం చే త్యర్థః, సజ్జ స్సమాగమోఽపి విరహం వియోగ మేవ, విశేషయతి విశిష్టం కరోతి - త మే వాపేక్షావిషయం కరో తీ త్యర్థః - తదానీం త స్యై వాతుతత్వా దితి భావః - అతః సర్వథా మనోనియమన మావశ్యకం-తేనచేన్ద్రియ ప్రవృత్త్యుపరమే విషయాణా మేకా న్తతః పరాహతి రితి కృత్వా పఞ్చవిషయవిరక్తి ర్నా మేయ మే వేతి నిగూఢాభిసంధిః, పరస్ప రే త్యత్ర * 'కర్మవ్యవహారే సర్వనామ్నో ద్వే భవత' ఇతి వక్తవ్యా త్పరశబ్దస్య ద్విర్భావః * 'సమాసవ చ్చ బహులం' - యథా న సమాసవ త్ప్రథమైకవచనం తథా పూర్వపద స్యేతి వక్తవ్యం - ద్వితీయాద్యేక వచనా న్తత్వ మపరపద స్యేతి.' ఆర్యాభేదః.

---

కిం గతేన యది సా న జీవతి? ప్రాణితి ప్రియతమా తథాఽపి కిమ్?
ఇ త్యుదీక్ష్య నవమేఘమాలికాం, న ప్రయాతి పథికః స్వమన్దిరమ్.

టీక.—సా ప్రియతమా = ఆ ప్రేయసి, యది న జీవతి = (విరహవేదనచే) బ్రతుక దేని, గతేన = (నేను) పోవుటచే, కిం = ప్రయోజన మేమి, (యది) ప్రాణితి= బ్రతుకునేని, తథా అపి = అట్లును, (గతేన) కిం=(పోవుటచే) ప్రయోజన మేమి, ఇతి =ఇట్లు, (తలపోసి), పథికః = బాటసారి, నవ...మాలికాం - నవ = క్రొత్త - మేఘమాలికాం = మబ్బులబారును, ఉదీక్ష్య = మీఁద చూచి, స్వ మన్దిరం ప్రతి = తన యింటికి, న ప్రయాతి = తరలఁడు.

తా..—ఒకబాటసారి ఆకాశమున క్రొత్తమబ్బుల బారును గాంచినవాఁడై, 'ఈ మబ్బులు కావించువిరహతాపమునకు ఇంట నాకాంతామణి బ్రదుక దేని నేను ఇంటి కేఁగుటచేత ప్రయోజనము లేదు; అటుగాక బ్రతుకు నేని పోవలసినపని లేదు;' అని తలపోసి యింటికి ఏఁగ డాయెను.

క. చన నేటికిఁ బ్రేయసి జీ। వనవతి యగు నేని? ప్రాణవతి గానితతిం
బని యే మ? ని యొక తెరువరి। చనఁ డింటికి నవ్యజలదసమయమునందున్.

వ్యా.—అథ కస్యచి త్ప్రవాసినో విరక్తస్య విచారరూపేణ వైరాగ్యం ప్రకటయ న్నాహ - కి మితి.— సా మదీయా, ప్రియతమా ప్రేయసీ, న జీవతి విరహావే



దనయా ప్రాణా న్న ధారయతి యది, తదా, గతేన గమనేన * భావే క్తః, కిం న కించి ద పీ త్యర్థః, య ద్వా గతేన గృహ ముపగతేన మ యేతి శేషః, కి మథ ప్రాణితి కేనచి ద్వినోదోపాయేన జీవతి యది, తథాఽపి ప్రాణనేఽపి, గతేన కిమ్ ఉభయథాఽపి గమనం వ్యర్థ మే వే త్యర్థః, ఇతి విచా ర్యేతి శేషః, ఇ హైవ గమ్యమానార్థత్వా దప్రయోగః-ప్రయోగే వా పౌనరుక్త్య మి త్యాలంకారికాః, పన్థానం గచ్ఛ తీతి పథికః - కశ్చి త్పాన్థః - 'పథః ష్కన్' ఇతి ష్కన్ ప్రత్యయః, నవమేఘమాలికాం నవీన కాదమ్బినీం-విరహినివహ సంహారకారిణీ మితి భావః, ఉదీక్ష్య, స్వమన్దిరం నిజగృహం, న ప్రయాతి వైరాగ్యనిశ్చలచిత్తత్వా దితి భావః -.తదుక్తం -

'య ద్భావి త ద్భవ త్యేవ, య దభావి న త ద్భవేత్,
ఇతి నిశ్చితబుద్ధీనాం న చిన్తా బాధతే క్వచిత్.' ఇతి.

రథోద్ధతావృత్తమ్.

---

అవ.—.స్త్రీసంగమును త్యజింపు మని ఉపదేశించుట.

విరమత బుధా యోషిత్సఙ్గాత్ సుఖాత్ క్షణభఙ్గురాత్;
కురుత కరుణా మైత్త్రీ ప్రజ్ఞా వధూ జన సఙ్గమమ్;
నఖలు నరకే హారాక్రాన్తం ఘన స్తనమణ్డలం
శరణ; మథవా శ్రోణీబిమ్బం రణన్మణిమేఖలమ్. 67.

టీక.—బుధాః = ఓకోవిదులారా, క్షణ భఙ్గురాత్ = క్షణములో నశించునట్టి, యోషిత్ సఙ్గాత్ సుఖాత్=స్త్రీలతోడి కూడికయనెడి సుఖమునుండి, విరమత= ఉడుగుఁడు, కరుణా...సఙ్గమమ్ - కరుణా = దయ - మైత్రీ = చెలిమి - ప్రజ్ఞా= తెలివి - (అనెడి) - వధూజన = స్త్రీసమూహముతోడి - సఙ్గమం = పొందును, కురుత = చేయుఁడు, నరకే = నరకమునందు, హార ఆక్రాన్తం = ముత్తైపుఁబేరులచే నాక్రమింపఁబడినదైన, ఘన...మణ్డలం - ఘన = గొప్ప - స్తనమణ్డలం = పాలిండ్లమండలము, అథవా = లేక, రణ...ఖలమ్ - రణత్ = మ్రోఁగుచున్న - మణిమేఖలమ్ = మణులమొలనూలుగల, శ్రోణీ బిమ్బం = పిఱుఁదుల మండలము, శరణం = రక్షకము, న ఖలు = కాదు గదా.

తా.—ఓకోవిదులారా క్షణికసుఖమయిన స్త్రీసంగమమును గోరకుఁడు, మైత్రీ కరుణా ప్రజ్ఞాది చిత్తపరికర్మలను అభ్యసింపుఁడు. నరకమునుండి తప్పించునవి ఇవి గాని స్త్రీల స్తనజఘన మండలములు గావు.

మ. మన సిం పొందఁగ ధీరులార కరుణా మైత్త్రీ మనీషా క్షమా
వనితా సంగము మాచరింపుఁ డెపుడుక్, భామాసుఖం బస్థిరం

బని వర్జింపుఁడు, హారరమ్యకుచముల్ ప్రాంచన్మణీమేఖలా
ధ్వనితాలంబినితంబముల్ నరకబాధల్ మాన్పి రక్షించునే?

వ్యా.—అథ బుధానాం తత్ర వైరాగ్య ముపదిశతి-విరమ తేతి.—హే బుధాః విద్వాంసః, యోషిత్సఙ్గా ద్యువతిసమాగమా, ద్యత్సుఖం తస్మాత్, కిదృగ్విధాత్-క్షణభఙ్గురాత్ క్షణికాత్ క్షణికసుఖప్రద యోషిత్సఙ్గా దిత్యర్థః * 'భఞ్జ భాస మిదో ఘురజ్' ఇతి ఘురచ్ప్రత్యయః * 'జుగుప్సా విరా మే'త్యా దినా పఞ్చమీ, విరమత ఉపరతా భవత - తుచ్ఛసుఖదం యోషిత్సమాగమం త్యజ తే త్యర్థః*'వ్యాఙ్పరిభ్యో రమ' ఇతి పరస్మైపదం, కింతు కరుణా దుఃఖి ష్వనుకమ్పా - మైత్రీ పుణ్యకృత్సు మిత్రితా - ప్రజ్ఞా బుద్ధివిశేషః సుఖి ష్వనుమోది తేతి యావత్ - ఏతేన పాపి ష్వూపేక్షా చ లక్ష్యతే - ఏతా ఏ వాన్తఃకరణమలశోధకత్వా చ్చిత్తపరికర్మా ణీతి వదన్తి సాంఖ్యాః - తా ఏవ వధూజన స్తస్య - సంగమం పరిశీలనతాత్పర్య మితి యావత్, కురుత, ఏతే నాత్యూర్జితసుఖం సంభవతి - కిం క్షణికసుఖావలమ్బనే నేతి భావః, విపక్షే బాధక మాహ - నరకే నిరయే, హారాకాన్తం ముక్తాహారోపశోభితం, ఘనస్తన మణ్డలం పటుతరకుచకలశభారో - వా, అ థేతి వాక్యారమ్భే, రణతీ - మణిమేఖలా మణిఖచితరశనా - యస్య త త్తథోక్తం - కాఞ్చీకలాపరమణీయ మి త్యర్థః, శ్రోణీబిమ్బం నితమ్బమణ్డలం వా, శరణం రక్షకం, న ఖలు - న భవతి హి, కరుణాదిసమాగమ స్తు నైవం భవ త్యత స్స ఏ వావశ్యం స్వీకర్తవ్య ఇతి భావః. హరిణీవృత్తమ్ - లక్షణం తూక్తమ్.

---

యదా యోగాభ్యాసవ్యసనకృశయో రాత్మమనసో
రవిచ్ఛిన్నా మైత్రీ స్ఫురతి కృతిన; స్తస్య కిము తైః
ప్రియాణా మాలాపై రధరమధుభి ర్వక్త్రవిధుభిః
సనిశ్వాసామోదైః సకుచకలశాశ్లేషసురతైః. 68.

టీక.—యదా = ఎప్పుడు, (యస్య = ఎవనికి), యోగ...కృశయోః - యోగ = సమాధియొక్క - అభ్యాస = అలవాటునందలి - వ్యసన = ఆసక్తిచేత - కృశయోః = నలఁగినట్టి, ఆత్మమనసోః = ఆత్మమనస్సులకు, అవిచ్ఛిన్నా = తెంపులేని, మైత్రీ = సంగాతము, స్ఫురతి = ప్రకాశించునో, తస్యకృతినః = ఆపుణ్యునకు, ప్రియాణాం = కాంతలయొక్క, తైః ఆలాపైః = ఆ మాటలచేతను, అధరమధుభిః = మోవితేనెలచేతను, సనిశ్వాసామోదైః = ఊర్పునెత్తావులతోడి, వక్త్రవిధుభిః = మోముఁజందురులచేతను, సకుచ...సురతైః - స కుచకలశ ఆశ్లేష = చనుగిండ్ల కౌఁగిలింతలతోడి - సురతైః = మదనకేళులచేతను, కిము = ఏమిప్రయోజనము.



తా.—మనస్సు ఆత్మయందు లయించునట్టి సమాధ్యానందము ముందఱ జవరాండ్రపొందు తుచ్ఛ మనుట.

చ. ఎనసినయోగమార్గరతి నెవ్వనిడెందము లోవెలుంగుతోఁ
గొనకొని యేకమై వెలుఁగుఁ గూరిమి మీఱఁగ, వాని కేటికిన్
వనితలముద్దుఁబల్కులును వాతెఱతేనియ లూర్పుఁదావులున్
గొన బగుమోముఁజందురులు గుబ్బలఁ గౌఁగిటఁ జేర్పుకూటముల్?

వ్యా.—ఏవం సాంఖ్యరీత్యా వైరాగ్య ముక్త్వా సంప్రతి యోగ మతానుసారే ణాహ-యదేతి - యదా యస్మిన్ సమయే - య స్యే త్యధ్యాహారః - ఉత్తరత్ర తచ్ఛబ్దసద్భావాత్ - తథా చ యస్య సంబన్ధినః, యోగాభ్యాసే అష్టాఙ్గయోగపరిశీలనే-య ద్వ్యసన మాసక్తి - స్తేన కృశయో స్తత్పరత న్త్రయో రిత్యర్థః, ఆత్మ మనసోః ప్రత్యగాత్మాఽన్తః కరణయోః, మైత్రీ మిత్రిత్వం-మైత్రీవాఖ్యాతా, స్ఫురతి ప్రకాశతే - యోగాభ్యాసవశే నాశేషబాహ్యవిషయా న్పరిత్యజ్య య దాత్మారామ మేవ మనో భవతీ త్యర్థః, తదా తస్య కృతినో ధన్యస్య * 'ఇష్టాదిభ్య శ్చే' తీని ప్రత్యయః, తైః కిము - న కి మ పీ త్యర్థః, తే క ఇత్యాశఙ్కాయా మాహ - ప్రియాణాం ప్రియతమానాం సంబన్ధిభి, రాలాపైః శ్రోత్రసుఖావహ మృదు మధురవ్యాహారై శ్చ, తథా నిశ్వా సామోదేన సహ సనిశ్వాసామోదైః పద్మినీజాతిత్వా న్నిశ్వాస ఘ్రాణ తర్పణ గన్ధ సంబన్ధబన్ధురై రి త్యర్థః, వక్త్రవిధుభి ర్నయనానన్దకరముఖచన్ద్రై శ్చ - అత్ర చన్ద్ర స్యైకత్వేఽపి ముఖబాహుళ్యాత్ బహుళత్వసిద్ధిః, తథా సకుచకలశాశ్లేషాణి కుచ కుమ్భాలిఙ్గనసహితాని-యాని సురతాని త్వగుపస్థేన్ద్రి యామన్దానన్దకర బాహ్యాభ్యన్తర సంభోగ విశేషాః - తైశ్చ, ఏవ మశేషేన్ద్రియగ్రామ సంతర్పణై రపి తైః కి మితి సంబన్ధః, ఆత్మానన్దానుభవవేళాయాం తేషా మతి తుచ్ఛతయా ప్రతీయమానత్వా దితి భావః. శిఖరిణీ వృత్తమ్.

---

యదాసీ దజ్ఞానం స్మరతిమిరసంచారజనితం,
తదా దృష్టం నారీమయ మిద మశేషం జగ దితి;
ఇదానీ మస్మాకం పటుతరవివేకాఞ్జనజుషాం
సమీభూతా దృష్టి స్త్రిభువన మపి బ్రహ్మ మనుతే. 69.

టీక.—యదా = ఎప్పుడు, స్మర = మదనుఁడనెడి - తిమిర = నేత్రరోగవిశేషముయొక్క - సంచార = పర్యటచేత - జనితమ్ = పుట్టింపఁబడినదైన, అజ్ఞానం = తెలివిలేమి, ఆసీత్ = ఉండెనో, తదా = అప్పుడు, అశేషమ్ = సమస్తమైన, ఇదం

జగత్ = ఈ ప్రపంచము, నారీమయమ్ ఇతి = స్త్రీలచే నిండినదిగా, దృష్టమ్ = అగపడినది, ఇదానీం = ఇప్పుడు, పటు...జుషాం - పటుతర = మిక్కిలి దృఢమయిన - వివేక = తెలివియనెడి - అఞ్జన = కాటుకను - జుషాం = పొందియున్నట్టి, అస్మాకం =మాయొక్క, దృష్టిః = చూపు, సమీభూతా సతీ=సమమయినది (కుదిరినది) అగుచు-త్రిభువనం = మూఁడులోకములను, బ్రహ్మ = బ్రహ్మముగా, మనుతే = తలఁచుచున్నది.

తా.—తిమిరవ్యాధిగలవానికి లోకమెల్ల వేఱువిధముగా నగపడి, ఆవ్యాధి మంచికాటుకచే నిమ్మళించినంతట, వాస్తవస్వరూపమున నగపడురీతిగా, మాకు కామావేశమున్నంతకాలము స్త్రీ యే లోకముగా నుండి యిపుడు వివేకము కలిగినంతట సమస్తమును బ్రహ్మమయముగా తెలియనగుచున్నది.

చ. స్మరతిమిరప్రచారభవ శశ్వదబోధము గల్గువేళ మే
దురగతి ముజ్జగంబులు వధూమయ మై కన నయ్యె; నిప్పుడిం
పరయఁగ సద్వివేక మహితాంజన సంగత మై మదీయభా
సురసమదృష్టి బ్రహ్మముగఁ జూచుచు నున్నది విశ్వ మంతయున్.

వ్యా.—అథ వేదాన్తరీత్యా వైరాగ్యవర్ణనం నిగమయతి-యదేతి.—యదా యస్మిన్ కాలే, సర్మః కామ ఏవ - తిమిరం తిమిరాఖ్యనేత్రరోగః - అన్ధకారశ్చ గమ్యతే - ని. 'తిమిరం నేత్రరోగే స్యా దన్ధకారే పి చ స్మృత' మిత్యభిధానాత్-తస్య - సంచారేణ వ్యాప్త్యా - జనిత ముత్పాదిత, మజ్ఞాన మవివేకః, ఆసీత్, తదా తస్మిన్ కాలే, అశేషం సర్వ, మిదం జగత్, నారీమయం యోషిద్రూప మితి, దృష్ట మాకలితం - అజ్ఞానవశా త్తథాఽవబుద్ధ మిత్యర్థః, ఇదానీ మస్మిన్ కాలే తు, పటుతరః అజ్ఞాననిరసనదక్షః - అన్యత్ర నేత్రరోగ నిరాకరణసమర్థశ్చ - యః వివేక స్తత్త్వజ్ఞాన - మే వాఞ్జనం నేత్రకల్యాణాఖ్యసిద్ధాఞ్జనం - తజ్జుషాం ప్రాప్తవతా, మస్మాకం సంబన్ధినీ, దృష్టిర్మతిః - దృక్చ, అసమా సమా సంపద్యమానా సమీభూతా * అభూతతద్భావే చ్విః - నిజప్రకృతి మాపన్నా సతీ త్యర్థః, త్రయాణాం భువనానాం సమాహార స్త్రిభువనం * 'తద్ధితార్థే' త్యాదినా సమాసః - పాత్రాద్యదన్తత్వా న్న స్త్రీత్వం, బ్రహ్మ బ్రహ్మమయం, మనుతే-జ్ఞానోదయవశా ద్బ్రహ్మస్వరూప మవబుధ్యతే, యథాఽఞ్జనేన నేత్రరోగనివృత్తౌ ఘటాద్యర్థతత్త్వజ్ఞానం జాయతే - తథా తత్త్వజ్ఞానేన కామాన్ధకారప్రయుక్తాజ్ఞానావరణాపాయే పరవస్తుసాక్షాత్కారో భవతి - తత స్సమ్యగ్దృష్ట్యా సర్వ మిదం బ్రహ్మైకాగతయా పశ్యతి. అయ మేవ వేదాన్తసిద్ధాన్త ఇతి భావః. అతో వివేకస్య పరశ్రేయోహేతుత్వా త్తదధిగమార్థ మేవ యత్నః కర్తవ్య ఇతి తాత్పర్యమ్.

రూపకాలంకారః. వృత్తం పూర్వవత్.

---



## దుర్విరక్తపద్ధతిః.

తావ దేవ కృతినా మపి స్ఫుర త్యేష నిర్మలవివేకదీపకః,
యావదేవ న కురఙ్గచక్షుషాం తాడ్యతే చటులలోచనాఞ్చలైః. 70.

టీక.—కృతినామ్ అపి = పుణ్యవంతులకు సయితము, ఏష = ఈ, నిర్మల...దీపకః - నిర్మల = నిర్దోషమైన - వివేక = జ్ఞానమనెడి - దీపకః = దివ్వె, కురఙ్గచక్షుషాం = లేడికంటులయొక్క, చటు...చలైః - చటుల = చంచలములైన - లోచన అఞ్చలైః = కనుఁగొనలనెడు చెఱఁగులచేత, యావ దేవ = ఎంతవఱకు, న తాడ్యతే కొట్టఁబడదో, తావ దేవ = అంతవఱకే, స్ఫురతి = ప్రకాశించును.

తా.—చెఱంగుతో ఆర్పువఱకే దీపము వెలుఁగుచుండునట్లు సుందరీకటాక్షము తగులువఱకే పురుషునివివేకము వెలుఁగుచుండును.

క. నీలోత్పలనయనాతర। ళాలోకనహతులు సోఁకు నంతకు వెలుఁగున్
ధీలలితసుజనవిమలో। ద్వేలాతిస్ఫుటవివేకదీపము నెమ్మిన్.

వ్యా.—అ థైతద్వైలక్షణ్యేన దుర్విరక్తపద్ధతి మాహ - తత్రాదౌ య దుక్తం కృతినో వివేకస్ఫురణ మితి త దేత దపవదతి - తావ దితి.—కృత మేభిః కృతిన స్తేషాం కుశలానా మపి * 'ఇష్టాదిభ్య శ్చే' తీని ప్రత్యయః - ఏష పూర్వోక్తో, నిర్మలో నిష్కళఙ్కో - వివేక స్తత్త్వావబోధ ఏవ దీపః * స్వార్థే కః, తావ త్తావత్పర్యన్త మేవ, స్ఫురతి దీప్యతే, కియత్పర్యన్త మిత్యాకాఙ్క్షాయా మాహ - కురఙ్గచక్షుషాం హరిణలోచనానాం, చటులాని చఞ్చలాని - లోచనాఞ్చలాని కటాక్షవీక్షణాని-తైః - కశాప్రాయై రితి భావః, యావ త్పర్యన్త మేవ, న తాడ్యతే న నిహన్యతే - నావలోక్యత ఇత్యర్థః - తావ దే వేతి సంబన్ధః, వివేకకుశలోఽపి జనః కామినీకటాక్షవీక్షితః కో వా వివేకనిర్వహణదక్ష ఇతి భావః, య ద్యపి - ని. 'అఞ్చలం త్వంశుకాన్తే స్యా' దిత్యమరః-తథాఽపి అన్తిమత్వసామ్యా దౌపచారికోఽయం నిర్దేశ ఇతి మన్తవ్యమ్. రథోద్ధతా.

---

వచసి భవతి సఙ్గత్యాగ ముద్దిశ్య వార్తా
శ్రుతిముఖరముఖానాం కేవలం పణ్డితానామ్;
జఘన మరుణరత్నగ్రన్థికాఞ్చీకలాపం
కువలయనయనానాం కో విహాతుం సమర్థః? 71.

టీక.—శ్రుతి...ముఖానాం - శ్రుతి = వేదములచే - ముఖర = మ్రోఁగుచున్న-ముఖానాం = నోళ్లుగల, పణ్డితానాం = విద్వాంసులకును, వచసి కేవలం = మాట

యందు మాత్రమే, సఙ్గత్యాగం = (స్త్రీలతోడి) కూడికవదలుటను, ఉద్దిశ్య = గురించి, వార్తా = ప్రస్తావము, భవతి = కలుగును, (అంతియ గాని), కువలయనయనానాం = కలువకంటులయొక్క, అరుణ...కలాపం - అరుణరత్న = ఎఱ్ఱనిమణులయొక్క (కెంపులయొక్క) - గ్రంథి = కూర్పుగల - కాఞ్చీ = మొలత్రాడనెడి - కలాపం = ఆభరణముగల, జఘనం = మొలను, విహాతుం = వదలుటకు, కః = ఎవఁడు, సమర్థః = శక్తుఁడు.

తా.—వేదవేత్తలు స్త్రీసంగము మానవలసినదని మాటమాత్రము చెప్పుచుందురు. అంతియగాని కెంపులమొలనూలు గ్రాలు కలువకంటులమొలను విడువఁజాలరు.

చ. నిగమసుభాషితాభ్యసననిష్ఠలు గల్గినయట్టిపండితుల్
మగువలపొందు నింద్య మని మాటికి వార్తలు చెప్ప నేర్పరల్;
జగమున నెవ్వఁ డోపు విలసత్కురువిందమణిప్రభాధగ
ద్ధగితకలాపరమ్యవనితాజఘనంబుఁ బరిత్యజింపఁగాన్.

వ్యా.—అథైతేషాం దుర్విరక్తత్వాభిద్యోతకానీదృశాన్యేవ వచనాన్యాహ.—వచసీతి.—శ్రుతిముఖరాణ్యశ్రాన్తశ్రుతిపాఠతత్పరాణి ముఖాని యేషాం తేషామ్-నిరన్తరవేదాభ్యసనవ్యసనరసనానాం వేదాన్తపారగాణామపీత్యర్థః, పణ్డితానాం వివేకినాం, వచసి కేవలం వాఙ్మాత్ర ఏవ, సఙ్గత్యాగం వధూసంసర్గత్యాగ, ముద్దిశ్య, వార్తా గాథా, భవతి, న త్వన్తఃకరణ ఇతి భావః, కుతః - అరుణరత్నగ్రన్థిః పద్మరాగమణిఖచితః కాఞ్చ్యేవ కలాపో భూషణం యస్య తత్తథోక్తం - ని. 'శోణరత్నం లోహితకం పద్మరాగోఽథ మౌక్తికం,' 'కలాపో భూషణే బర్హే' ఇతి చోభయత్రాప్యమరః, కువలయనయనానా మిన్దీవరాక్షీణాం, జఘనం కటిపురోభాగం, విహాతుం త్యక్తుం, కస్సమర్థః న కోఽపీత్యర్థః, ప్రాయశ ఈదృశాన్యేవ దుర్విరక్తానాం వచనానీతి భావః.

మాలినీ.

---

స్వపరప్రతారకోఽసౌ, నిన్దతి యోఽళీకపణ్డితో యువతీః,
యస్మాత్తపసోఽపి ఫలం స్వర్గః, స్వర్గేఽపి చాప్సరసః. 72.

టీక.—యః అళీక పణ్డితః = ఏ కల్ల విద్వాంసుఁడు, యువతీః = జవరాండ్రను, నిన్దతి = దూషించునో, అసౌ = అట్టి యీతఁడు, స్వ...తారకః - స్వ = తనయొక్కయు - పర = ఇతరులయొక్కయు - ప్రతారకః = వంచకుఁడు, యస్మాత్ = ఎందువలన (ననఁగా), తపసః అపి = (చాంద్రాయణాది) తపస్సునకుఁ గూడ, ఫలం = ఫలము, స్వర్గః = స్వర్గము, స్వర్గే అపి = స్వర్గమందుఁ గూడ, అప్సరసః = అప్సరసలు, (ఫలముగా నున్నారు).

తా.—ఉవిదలను నిందించుపండితుఁడు కల్లపండితుఁడు; అతఁడు తాను మోసపోయినదిగాక ఇతరులనుగూడ మోసగించును. ఎట్లన - స్త్రీసంగమును వర్జించి చాం



ద్రాయణాది వ్రతములు సేయుట స్వర్గము కొఱకు; స్వర్గము అప్సరసలకొఱకు.

తే. కుటిలవాదియుఁ బరవంచకుండు వాఁడు । నెమ్మి నెవ్వాఁడు యువతుల నింద సేయు,
నింద్రలోకము తపముల కెల్ల ఫలము । స్వర్గమున నున్నవార లచ్చరలు గారె?

వ్యా.—స ఇతి.—సోఽసౌ,వళీకపణ్డితః అనృతభాషీ-ని. 'అలీకం త్వప్రియేఽనృత' ఇత్యమరః, పరప్రతారకో లోకవఞ్చకః, కోఽసావిత్య ఆహ—యః అళీకపణ్డితో, యువతీః తరుణీః * 'యూనస్తి' రితి తిప్రత్యయః, నిన్దతి గర్హయతి, స ఇతి సంబన్ధః, నను నిస్సఙ్గత్వాద్యువతినిన్దాకరణే కథం ప్రతారకత్వ మత ఆహ-యస్మాత్కారణాత్తపసశ్చాన్ద్రాయణాదేః వ్రతోపవాసాదిరూపస్య వా, ఫలం స్వర్గః, తత్ర స్వర్గేఽపి చాప్సరస ఉర్వశీప్రభృతయః, స్తత్రాపి తత్సఙ్గమ ఏవేత్యర్థః - అతః పరప్రతారక ఇతి భావః - ని. 'స్త్రియాం బహుష్వప్సరసస్స్వర్వేశ్యా ఉర్వశీముఖాః' ఇత్యమరః - 'స్వపరప్రతారక' ఇతి పాఠేఽప్యయమేవార్థః, యోఽళీకపణ్డితః పణ్డితమానీ - రహస్యానభిజ్ఞ ఇత్యర్థః - యువతీ ర్నిన్దతి అసౌ స్వస్య పరేషాం చ ప్రతారకః - ఆత్మవఞ్చకః పరవంచకశ్చేత్యర్థః - కుతః - యస్మాదిత్యాది - శేషం సమానం - స్వపరఫలవేదన బోధనయోః పరిజ్ఞానాభావా దుభయవఞ్చక ఇత్యర్థః. ఆర్యాభేదః.

---

అవ.—మదనుఁడు అజయ్యుఁ డనుట.

మత్తేభకుమ్భదళనే భువి సన్తి ధీరాః,
కేచిత్ ప్రచణ్డమృగరాజవధేఽపి దక్షాః;
కిన్తు బ్రవీమి బలినాం పురతః ప్రసహ్య,
కన్దర్పదర్పదళనే విరలా మనుష్యాః. 73.

టీక.—భువి = భూమిలో, మత్తే...దళనే - మత్త ఇభ = మదించిన యేనుఁగుల - కుమ్భ = కుంభస్థలములయొక్క - దళనే = చీల్చుటయందు, ధీరాః = దిట్టలు, సన్తి = కలరు; కేచిత్ = కొందఱు, ప్రచణ్డ...వధేఽపి - ప్రచణ్డ = మిక్కిలికోపముగల - మృగరాజ = సింహముయొక్క - వధే అపి = చంపుటయందును, దక్షాః = సమర్థులు; కిం తు = కాని, ప్రసహ్య = వెనుదివియక, బలినాం పురతః = బలవంతుల యెదుట, బ్రవీమి = చెప్పుచున్నాను, కన్దర్ప...దళనే - కన్దర్ప = మన్మథునియొక్క - దర్ప = గర్వముయొక్క - దళనే = చీల్చుటయందు (చీల్పఁగల), మనుష్యాః = పురుషులు, విరళాః = అరుదు.

తా.—లోకములో ఏనుఁగునైనను, దానిని మించిన సింహమునైనను, జయించువారు కలరుగాని, మదనుని జయించువారు అరుదు.

తే. సమదకుంజరకుంభభంజనులు మఱియు । నుగ్రమృగరాజవధదక్షు లుర్విఁ గలరు;
తఱుచుగా లేరు కందర్ప దర్పదళన । నిపుణజను లని చాటింతు నిఖిలసభల.

వ్యా.—అథ మన్మథ స్యాత్యన్తదుర్జయత్వ మాహ - మత్తేభే తి.—భువి భూలోకే-మత్తేభానాం మత్తమాతఙ్గానాం-కుమ్భదళనే కుమ్భస్థలవిదారణే - సమర్థా ఇతి శేషః - ధీరాః శూరా స్సన్తి, తథా కేచి త్పురుషాః ప్రచణ్డోఽత్యన్తకోపనః- యో మృగరాజః సింహ- స్తస్య వధే హింసాయాం, దక్షా స్సమర్థా స్సన్తి-గజఘాతిభ్యోఽప్యుత్తమా శ్శూరా స్సమ్భవన్తీ త్యర్థః, కిన్తు బలినాం బలాఢ్యానాం శూరాణామ్- జ్ఞాన బలశాలినా మితి చ గమ్యతే, పురతోఽగ్రే, బ్రవీమి నిశ్శఙ్కం కర ముద్ధృత్య స డిణ్డిమఘోష ముద్ఘోషయా మీ త్యర్థః, కి ముద్ఘోషయ సీ త్యత ఆహ - ప్రసహ్య బలాత్ - భుజబలా ద్బుద్ధిబలా చ్చే త్యర్థః, కన్దర్పదర్పదళనే మదనమదవిదారణే, సమర్థా మనుష్యాః, విరళా మృగ్యాః- ప్రాయశో న సన్తీ త్యర్థః - శంభుం తద్భక్తాం శ్చ వినా మదనవిజయినో న సన్త్యే వేతి శివభక్తాగ్రేసరస్య కవే ర్నిగూఢతరాభిసన్ధిః.

అత్ర కన్దర్పదర్పేతి సకృద్వ్యఞ్జనద్వయావృత్తేః ఛేకానుప్రాసాఖ్య శ్శబ్దాలఙ్కారః. వసన్తతిలకా వృత్తమ్.

---

అవ.—వెండియు, మదనుఁడు అజయ్యుఁ డనుట.

సన్మార్గే తావ దాస్తే, ప్రభవతి చ నర స్తావ దే వేన్ద్రియాణాం,
లజ్జాం తావ ద్విధత్తే, వినయ మపి సమాలమ్బతే తావ దేవ
భ్రూచాపాకృష్టముక్తాః శ్రవణపథగతా నీలపక్ష్మాణ ఏతే
యావ ల్లీలావతీనాం న హృది ధృతిముషో దృష్టిబాణాః పతన్తి.

టీక.—భ్రూచా...ముక్తాః - భ్రూ చాప = కనుబొమయనెడి వింటిచేత - ఆకృష్ట = ఈడువఁబడి - ముక్తాః = విడువఁబడినవియు, శ్రవణ పథ గతాః = చెవి కడకు వచ్చినవియు, నీల పక్ష్మాణః = నల్లని ఱెప్పలుగలవియు (ఱెక్కలు అని బాణపరము), ధృతిముషః = ధైర్యమును దొంగిలించునవియు, (అయిన), లీలావతీనామ్ ఏతే దృష్టి బాణాః = వన్నెకత్తెలయొక్క యీ చూపుఁ దూపులు, యావత్ = ఎందాక, హృది = మనస్సునందు (ఱొమ్మునందు అని బాణపరము), న పతన్తి = పడవో, నరః = పురుషుఁడు, సన్మార్గే మంచిమార్గమునందు, తావ దేవ = అందాఁకనే, ఆస్తే = వర్తించును, ఇన్ద్రియాణాం = ఇంద్రియములకు, తావదేవ, ప్రభవతి = దొరయగును, లజ్జాం = సిగ్గును, తావదేవ, విధత్తే = పూనును, వినయ మపి = అడఁకువనుగూడ, తావదేవ, సమాలమ్బతే = వహించును.



తా.—వింటివారిని చెవిదాఁక లాగివేసిన నీలిఱెక్కలకోల గుండెకుఁ దాఁకఁగానే, ఎట్లో అట్లే, ఎమ్మెకత్తియలచూపులు కనుబొమలవలనముతోఁ గూడినవై ఆకర్ణాంత విశ్రాంతములై నల్లనిఱెప్పలు గలవై మనస్సును దాఁకఁగానే, నరునికి, ధైర్యము, సదాచారము, ఇంద్రియ నిగ్రహము, సిగ్గు, వినయంబును, అన్నియు, నశించును.

శా. సారాచారముఁ బూను, నింద్రియములన్ శాసించు, లజ్జాన్వితుం
డై రాజిల్లుఁ, బ్రశాంతిఁ జేకొను, నరుం డందాఁక; నెందాఁక దు
ర్వారంబుల్ ఘృణిమార్గగాములు సుదారభ్రూధనుర్ముక్తముల్
నారీవీక్షణబాణముల్ చొరవు విన్నాణంబుగా డెందమున్.

వ్యా.—అథ చ పునర్వచనవైచిత్రీ మే వాహ - స దితి.—నరః - విద్వా న పీతి భావః-సన్మార్గే శ్రుతిస్మృతిబోధితాచారే, తావ త్తావత్పర్యన్త మే వా, స్తే వర్తతే, ఇన్ద్రియాణాం చక్షురాదీనాం చ, తావ దేవ ప్రభవతి సమర్థో భవతి - నియమన ఇతి శేషః, లజ్జాం జుగుప్సితకర్మాచరణా చ్చేతస్సంకోచలక్షణాం వ్రీడాం చ, తావ దేవ, విధత్తేఽనువర్తతే, వినయం నమ్రత్వం చ, తావ దేవ సమాలమ్బతే స్వీకురుతే, కియత్పర్యన్త మిత్యాకాఙ్క్షాయా మాహ - భ్రూరేవ చాపం కార్ముకం - తే నాకృష్టా శ్చ తే ముక్తా శ్చేతి విశేషణ సమాసః - ఏకత్ర భ్రూభఙ్గపూర్వక-మపరత్ర చాపనమనపూర్వకం చ ప్రయుక్తా ఇ త్యర్థః, శ్రవణపథగతాః శ్రోత్రమార్గగతాః - ఏకత్ర కర్ణాన్త విశ్రాన్తత్వా దపరత్ర తావత్పర్యన్త మాకర్షణా చ్చేతి భావః, నీలాని పక్ష్మాణి లోమా న్యన్యత్ర గరుత శ్చ యేషాం తే త థోక్తాః, ధృతిం ముష్ణన్తీతి ధృతిముషో ధైర్యభేదిన, ఏతే ప్రసిద్ధా, లీలావతీనాం విలాసినీనాం, దృష్టయ ఏవ బాణాః, యావ ద్యావత్పర్యన్తం, హృది మానసే - వక్షసి, న పతన్తి, తావ దితి సంబన్ధః; తదనన్తరం సన్మార్గప్రవర్తనాదికం నిర్వోఢుం క స్సమర్థ ఇతి భావః - ఉక్తం చ ప్రబోధచన్ద్రోదయే -

'తావ ద్వివేకవిభవ । స్తావ త్సన్మార్గవర్తనం పుంసామ్,
నిపతన్తి దృష్టివిశిఖా । యావ న్నేన్దీవరాక్షీణామ్.' ఇతి.

అత్ర ద్వితీయార్ధే సమస్తవస్తువర్తిసావయవ రూపకాలంకారః. స్రగ్ధరావృత్తమ్.

---

ఉన్మత్తప్రేమసంరమ్భా దారభన్తే, య దఙ్గనాః,
తత్ర ప్రత్యూహ మాధాతుం బ్రహ్మాఽపి ఖలు కాతరః. 75.

టీక.—అఙ్గనాః = కోమలులు, ఉన్మత్త...సంరమ్భాత్ - ఉన్మత్త = చెలరేఁ - ప్రేమ = మరులుయొక్క - సంరమ్భాత్ = ఉరవడిచేత, యత్ = దేనిని, భన్తే = తొడఁగుదురో, తత్ర = దానికి, ప్రత్యూహం = విఘ్నమును, ఆధాతుం = చేయుటకు, బ్రహ్మా అపి = బ్రహ్మయును - కాతరః ఖలు = పిఱికివాఁడు సుమీ.

తా.—అందగత్తియలు ప్రేమోద్రేకమున చేయఁబూనిన పనికి బ్రహ్మ సయితము విఘ్నము సేయఁజాలఁడు.—ఎట్టి విఘ్నముల నయినను దాఁటి తమయభీష్టమును సాధింతు రని భా.

క. ప్రేమావేశభరంబున । భామాజను లాచరించు పని మరలింపం
దామరవిరిలోఁ బొడమిన । యామేటికి నైన నలవి యగునె తలంపన్?

వ్యా.—కిం బహునా బ్రహ్మాఽప్యఙ్గనోద్యోగప్రత్యూహాచరణే న ధీరో భవతీత్యాహ- ఉన్మత్తేతి.—అఙ్గనాః స్త్రియః, ఉన్మత్తోఽత్యుత్కటో - యః ప్రేమా అనురాగ-స్తస్య సంరమ్భా త్సంభ్రమాత్ -ని. 'సంరమ్భ స్సంభ్రమే కోపే' ఇతి విశ్వః, యత్కర్మ ఆరభన్తే- విహిత మవిహితం వా కర్తు ముద్యుఞ్జతే త దిత్యర్థః- తత్ర కర్మణి, ప్రత్యూహం విఘ్నం - ని. 'విఘ్నోఽన్తరాయః ప్రత్యూహః' ఇ త్యమరః, ఆధాతుం కర్తుం, బ్రహ్మాఽపి కిముతాఽన్య ఇతి భావః, కాతర స్సభయః - అసమర్థః, ఖల్వి త్యర్థః - అనివార్యనిశ్చయానా మనావృతానా మఙ్గనానాం కో నామ నివారయి తేతి భావః. అనుష్టుప్.

---

తావ న్మహత్త్వం పాణ్డిత్యం కులీనత్వం వివేకితా
యావ జ్జ్వలతి నాఙ్గేషు హతః పఞ్చేషుపావకః. 76.

టీక.—యావత్ = ఎందాఁక, హతః పఞ్చేషు పావకః = పాడు మద నాగ్ని, అఙ్గేషు = అవయవములందు, న జ్వలతి = మండకుండునో, తావత్ = అందాఁక, మహత్త్వం = గొప్పతనము, పాణ్డిత్యం = తెలివి, కులీనత్వం = తన సత్కులమునకుఁ దగిన నడత, వివేకితా=గుణదోషజ్ఞానము.

తా.—నరునికి అవయవములలో పాడు మదనాగ్ని మండఁగానే గొప్పతనము, తెలివి, కులగౌరవము, గుణదోషపరిజ్ఞానము,— ఇవి యన్నియు సమసి పోవును.— వీనికి విరుద్ధముగా నరుఁడు ఆచరించు నని భా.

క. కులశీలవివేకంబులు । దొలఁగక నరులందు నిల్చు దుర్భరమదన
జ్వలనము సర్వాంగంబుల । నెలకొననందాక; సంత నిలువం గలవే?

వ్యా.—తావ దితి - మహత్త్వం మహానుభావత్వం, పాణ్డిత్యం ప్రాజ్ఞత్వమ్, కులీనత్వం మహాకుల ప్రసూతత్వం * 'కులా త్ఖః' ఇతి ఖప్రత్యయః, వివేకితా కర్తవ్యాకర్తవ్యవిచార చతురత్వం చ, తావ త్తావత్పర్యన్త మేవ భవ తీతి శేషః, యావత్ హతో నీచః అశ్లాఘ్యతాపాదకత్వా న్నికృష్టః, పఞ్చ అరవిన్దాదయ ఇషవో బాణా యస్య సః పఞ్చేషుః మదన- స్స ఏవ పావకోఽగ్నిః, అఙ్గేషు, న జ్వలతి నావిర్భవతి - న సన్తాపయ తీ త్యర్థః, తావ దితి సంబన్ధః, తదనన్తరం కో వా మహత్త్వాదిగుణవిశిష్ట ఇతి భావః -

'అరవిన్ద మశోకం చ చూతం చ నవమల్లికా
నీలోత్పలం చ పఞ్చైతే పఞ్చబాణస్య సాయకాః.' ఇ త్యమరః.
అత్ర మదనే అగ్నిత్వరూపణా దేకదేశవర్తిరూపకమ్. అనుష్టుప్.



---

శాస్త్రజ్ఞోఽపి ప్రగుణితనయోఽ ప్యాత్తబోధోఽపి బాఢం
సంసారేఽస్మి న్భవతి విరలో భాజనం సద్గతీనామ్,
యే నైతస్మి న్నిరయనగరద్వార ముద్ఘాటయన్తీ
వామాక్షీణాం భవతి కుటిలా భ్రూలతా కుఞ్చికేవ. 77.

టీ.—యేన = ఎందుచేత, ఏతస్మిన్ (సంసారే) = ఈ సంసారమునందు, వామ అక్షీణాం = సుందర నేత్రలయొక్క, కుటిలా = వంకరయైన, భ్రూలతా = కనుబొమ తీఁగ, కుఞ్చికా ఇవ = కుంచెకోల వలె, నిర...ద్వారం - నిరయ నగర = నరక పురము యొక్క - ద్వారం = వాకిటిని, ఉద్ఘాటయన్తీ= తెఱచుచు, భవతి = ఉన్నదో, (అందుచేత), శాస్త్రజ్ఞః అపి = శాస్త్రములను తెలిసినవాఁడైనను, ప్రగుణిత నయః అపి = మిక్కిలి అభ్యసింపఁబడిన నీతిగలవాఁడైనను, బాఢమ్ = చక్కఁగా, ఆత్త బోధః అపి = పొందఁబడిన తెలివిగలవాఁడైనను, అస్మిన్ సంసారే = ఈ సంసారమునందు, సద్గతీనాం = మంచిగతులకు, భాజనం = పాత్రము, విరలః = అరుదైన వాఁడు (ఎవఁడో యొకఁడు) భవతి = అగును.

తా.—ఈ సంసారములో, సుందరనేత్రలు తీఁగవంటి తమ వంకరకనుబొమ యనెడు కుంచెకోలతో నరకద్వారమును తెఱచి పురుషుల నెల్ల నందులోనికిం బ్రవేశ పెట్టుచుండుటం బట్టి, శాస్త్రములు నేర్చినను, నయ మభ్యసించినను, మంచి తెలివిం బడసినను, మంచిగతి కేఁగువాఁడు అరుదు.

తే. శాస్త్రవిదుఁడైన బుధుఁడైన సనయుఁడైన । సద్గతికిఁ బోవు టరిది సంసారసరణి,
యమపురద్వారములకవాటములఁ గుంచి । కలునుబలె విప్పుచున్నవి కలికిబొమలు.

వ్యా.—అథ సాంసారికస్య సద్గతిః దుర్లభేతి సహేతుక మాహ - శాస్త్రజ్ఞ ఇతి.— శాస్త్రజ్ఞ స్సకలశాస్త్ర రహస్యాభిజ్ఞోఽపి * 'ఆతోఽనుపసర్గే కః' ఇతి కప్రత్యయః, తత్రాపి ప్రగుణితః ప్రకర్షే ణావృత్తివిషయీకృతః-నయో నీతిశాస్త్రం-యేన స తథోక్తోఽపి - ఫలవదర్థావబోధనపర్యన్తం సమ్యక్పరిశీలిత నీతిశాస్త్రోఽపీ త్యర్థః - ప్రగుణశబ్దాత్ *'తత్కరోతీ' తి ణ్యన్తా త్కర్మణి క్తః* ణా విష్ఠవద్భావే విన్మతో ర్లుక్- ని. 'గుణః స్యా దావృత్తిశబ్దాఖ్యే జ్యేన్ద్రి యాముఖ్య తన్తుషు' ఇతి వైజయన్తీ, తథా

బాధకం దృఢ, మాత్ర బోధ ఉత్పన్న జ్ఞానోఽపి పుమాన్, నస్మిన్ పరివర్తమానే, సంసారే, సద్గతీనాం, భాజనం పాత్రమ్ - యోగ్య ఇతి యావత్, విరలో మృగ్యో, భవతి - స్వర్గాది సద్గతిగామీ యః కశ్చి దేవ భవతి - న తు బహవ ఇ త్యర్థః, యతః - యేన కారణేన, ఏతస్మిన్ సంసారే, వామాక్షీణాం మనోహర నయనానాం *'బహువ్రీహౌ' ఇత్యాదినా షచి షిత్త్వాత్ జీష్, కుటిలా వక్రా, భ్రూరి గ్లతేవ భ్రూలతా భ్రూవల్లీ, కుఞ్చి కేవ విష్కమ్భవిఘటనసాధన వక్రాగ్రా యోమయ శలాకేవ, నిరయనగరస్య యమపురస్య ద్వారమ్ - లక్షణయా ద్వారపిధానకవాటవిష్కమ్భ మి త్యర్థః - ద్వారశబ్దేన కవాటస్య తేన చ తద్విష్కమ్భస్య చ లక్షితత్వాత్, ఉద్ఘాటయన్తీ విఘట్టయన్తీ - వ్యామోహోత్పాదనేన దుర్గతౌ ప్రవేశయన్తీ త్యర్థః, భవతి ఖలు - అతో విరళ ఇతి సంబన్ధః, స్త్రీసఙ్గినాం కుత స్సద్గతి రితి భావః. ఉపమాలఙ్కారః. మన్దాక్రాన్తావృత్తమ్.

---

కృశః కాణః ఖఞ్జః శ్రవణరహితః పుచ్ఛవికలో
వ్రణీ పూయక్లిన్నః కృమికులశ తైరావృతతనుః
క్షుధా క్షామో జీర్ణః పిఠరకకపాలార్పితగళః
శునీ మన్వేతి శ్వా; హత మపి చ హ న్త్యేవ మదనః. 78.

టీక.—కృశః = చిక్కినదియు, కాణః=గ్రుడ్డిదియు, ఖఞ్జః = కుంటిదియు, శ్రవణ రహితః = చెవులు లేనిదియు, పుచ్ఛ వికలః = తోఁక (యందు) తెగినదియు, వ్రణీ =పుండ్లుగలదియు, పూయ క్లిన్నః = చీముచేఁ దడిసినదియు, కృమి కుల శతైః = పురుగు సమూహముల నూఱులచేత, ఆవృత తనుః - ఆవృత = క్రమ్మఁబడిన - తనుః = ఒడలు గలదియు, క్షుధా = ఆఁకటిచేత, క్షామః = క్షీణించినదియు, జీర్ణః = ముదిసినదియు, పిఠరక...గళః - పిఠరక = కుండయొక్క - కపాల = పెంకునందు - అర్పిత =ఉంపఁబడిన - గళః = మెడగలదియు - (తన మెడకు కుండ తగుల్కొని యున్న దనుట), (అయిన), శ్వా = కుక్క, శునీం = ఆఁడుఁగుక్కను, అన్వేతి = వెంబడించును, హత మపి చ = పాడఱినదానిని సైతము, మదనః = మన్మథుఁడు, హన్త్యేవ = కొట్టనే కొట్టును.

తా.—చిక్కి, కన్నుపోయి, కాలు విఱిగి, తోఁకయూడి, పుండ్లు ప్రబలి, చీము నఁదోఁగుచు, ఒడలెల్ల వందలువందలు పురుగులు ప్రాఁకుచుండ, ఆఁకట సకసకంబడుచు మెడకు తగుల్కొనియున్న కుండతో, ముసలికుక్కయు, ఆఁడుఁగుక్కను సంగమార్థియై వెంటఁదగులును! మన్మథుఁడు ఎంత పాడఱినవాని నైనను ప్రేరింపక మానఁడు సుమా.

చ. కరము కృశించి కాల్ విఱిగి కన్నులుఁ గానక పుచ్ఛహీన మై
పురుగులు గ్రమ్ముచున్న వ్రణపుంజము మే నలమంగ నాఁకటం



బరవశ మై ఘటీముఖ కపాల గళం బగుకుక్క పెంటితో
నరిగెడుఁ గూళజంతువుల నైన వధించు మనోజుఁ డక్కటా!

వ్యా.—అథ ద్వాభ్యాం మన్మథస్య చరిత్ర వైచిత్ర్య మాహ-కృశ ఇతి.—కృశః పిణ్డాలాభా దస్థిచర్మావశిష్టదేహః, కాణోఽన్ధకః - యద్వా ఏకాక్షః, ఖఞ్జః పాదవికలః - అకార్యకరణేన లగుడ ప్రహారా ద్భగ్నపాద ఇ త్యర్థః, తథా శ్రవణ రహితః సమూలం ఛిన్న కర్ణః, పుచ్ఛేన వికల శ్ఛిన్నలాఙ్గూలః * 'యే నాఙ్గవికార' ఇతి సమాసః, వ్రణీ సర్వాఙ్గక్షతిమాన్, అతః పూయేన క్లిన్నః ఆర్ద్రః, క్రిమీణాం వ్రణోత్పన్నపాదతుచ్ఛజన్తూనాం - కుల శతైః అనేక క్రిమి పరమ్పరాభి రిత్యర్థః, ఆవృతా వ్యాప్తా-తను ర్యస్య స తథోక్తః, క్షుధా బుభుక్షయా, క్షామః పరిక్షీణః * 'క్షాయో మః' ఇతి మత్వమ్, జీర్ణః జరయా శిథిలావయవః, పిఠరక కపాలేన ఘటముఖవలయే-నార్పిత గళ ఆసఞ్జిత కణ్ఠనాళః-శునకో హి ఘటముఖే స్వశిరో నిక్షిప్య అన్నం భక్షయతి- తత స్తావతైవ పరిపుష్టత్వే నాక్రష్టు మశక్యత్వా ద్భువి విఘట్టనే నాధః కపాలాపాయే తన్ముఖకపాలే నాసఞ్జితకణ్ఠో భవతీ తి ప్రసిద్ధిః - అత ఏవంభూత ఇ త్యర్థః - యద్వా - చౌర్యణాన్నాదిభక్షణే త ద్దణ్డనార్థం భాణ్డస్య మధ్యే ఛిద్రం కృత్వా గళే ఆసఞ్జయన్తి-తస్మా దిత్థంభూత ఇ త్యర్థః, ఏవం జుగుప్సితోఽపి, శ్వా శునకః, శునీం సారమేయీం,మన్వే త్యనుసరతి - నిధువనార్థ మితి భావః; తథా హి - హతం వినష్ట మపి చ, మదనో హన్త్యేవ మనోవికారోత్పాదనేన పీడయ త్యేవ - న తు హతహనన మన్యాయ్య మితి విచారయ తీ త్యర్థః, శఠోఽయం మదనః కం వా కథంభూతావస్థాపన్నం న కరో తీతి భావః, అత్ర ఏవకారోఽత్యన్తాయోగవ్యవచ్ఛేదార్థః - 'పార్థో ధనుర్ధరో భవ త్యేవ' ఇ త్యుదాహృత్య క్రియాగతైవకారస్య తథాభూతార్థకత్వానుశాసనాత్. శిఖరిణీ వృత్తమ్.

---

స్త్రీముద్రాం ఝషకేతనస్య పరమాం సర్వార్థ సంపత్కరీం
యే మూఢాః ప్రవిహాయ యాన్తి కుధియో మిథ్యాఫలాన్వేషిణః;
తే తే నైవ నిహత్య నిర్దయతరం నగ్నీకృతా ముణ్డితాః
కేచి త్పఞ్చశిఖీకృతా శ్చ జటిలాః కాపాలికా శ్చాపరే. 79.

టీక—కు ధియః = దుష్ట బుద్ధిగల, మూఢాః = అజ్ఞులు, యే = ఎవరు, మిథ్యా...షిణః సన్తః - మిథ్యా=అవాస్తవ మైన - ఫల = (స్వర్గాది) ఫలమును - అన్వేషిణః సన్తః = వెదకుచు, సర్వా...కరీం = సర్వ అర్థ=సమస్తమయిన ప్రయోజనముల యొక్క - సమ్పత్ = కలిమిని - కరీం = చేయునదియు, పరమామ్ = శ్రేష్ఠమును,

(అగు), ఝుష కేతనస్య = చేప పడగవానియొక్క (మన్మథునియొక్క), స్త్రీ ముద్రాం = స్త్రీయనెడి శాసనమును, ప్రవిహాయ = వదలి, యాన్తి=పోవుదురో, తే = ఆ మూఢులు, తేన ఏవ = అతని చేతనే, నిర్దయతరం = అతిక్రూరముగా, నిహత్య = కొట్టఁబడి, నగ్నీకృతాః = దిస్సమొలవారుగాఁ జేయఁబడినారు - (దిగంబరసన్న్యాసులయి రని భా), ముణ్డితాః = తల గొఱిగింపఁబడినారు - (తల గుండు చేయించుకొని పరమహంస లయినా రని. భా); కేచిత్ = కొందఱు, పఞ్చ శిఖీ కృతాః=అయిదు జుట్లు గలవారుగాఁ జేయబడినారు - (పంచశిఖయతు లైనా రని భా.), కేచిత్ = కొందఱు, జటిలాః = జడలు గలవారుగా (చేయఁ బడినారు) - (మును లైరని భా.), అపరే = మఱి కొందఱు, కాపాలికాశ్చ = పునుకలో బిచ్చముగొనువారుగా (చేయఁబడినారు) - (కాపాలికసన్న్యాసు లై రని భా.)

తా.—స్త్రీగా వెలసియున్న మదనశాసనమును ఉల్లంఘించి, స్వర్గాపవర్గాదులనెడి యవాస్తవ ఫలములను ఆపేక్షించి తెలివిలేని దుష్టబుద్ధులు నానావిధవ్రతాదుల నవలంబించిన ట్లగపడుటయందలి తత్త్వ మే మనఁగా, వారు ఆయావిధముల మదనునిచేతి దండనమును అనుభవించుచుండుటయే సుమా. అది యెట్లనిన—అతనిచే దెబ్బలు తిని గోచితోఁగూడ దోఁచుకొనఁబడినవారు దిగంబరయతులుగాను, తల గొఱిగింపఁబడినవారు పరమహంసలుగాను, అయిదు జుట్లుగా గొఱిగింపఁబడినవారు పంచశిఖయతులుగాను, జడ లల్లి విడువఁబడినవారు మునులుగాను, పునుకతో బిచ్చమెత్తుకొనఁ బంపఁబడినవారు కాపాలికులుగాను ఆభాసించుచున్నారు.

చ. స్మరునకు సర్వలోకజయ సంపద లీయఁగఁ జాలుప్రోషలం
దరుణుల నింద సేయుట సధర్మలు కొందఱు మానవుల్ దిగం
బరులును బ్రహ్మచారులుఁ గపాలకపాణులు దండహస్తులై
తిరుగుచునున్నవారు; రతిదేవుని మీఱిన భోగ మబ్బునే?

వ్యా.—స్త్రీముద్రా మితి.—సర్వార్థానాం సంపదం కరోతీతి సర్వార్థసంపత్కరీమ్ - ధర్మార్థ కామ పురుషార్థ సమృద్ధి హేతుభూతా మిత్యర్థః * 'కృఞో హేతుతాచ్ఛీల్యానులోమ్యే ష్వి' తి టప్రత్యయః - టిత్త్వాన్ఙీప్, కుసుమాయుధస్య జగజ్జైత్రస్య మన్మథస్య, జయినీమ్ జయావహా మిత్యర్థః * 'జిదృక్షి' - ఇత్యాదినా ఇని ప్రత్యయః, స్త్రీముద్రాం స్త్రీరూపచిహ్నం, ప్రవిహాయ త్యక్త్వా, యే కుధియో దుర్బుద్ధయః, అత ఏవ మూఢాః కర్తవ్యాకర్తవ్య విచారశూన్యాః, మిథ్యాఫలాన్వేషిణః అభూతచరత్వా దసత్యప్రాయ మోక్షఫల కాఙ్క్షిణ స్సన్తః యాన్తి ప్రవ్రజ న్తీత్యర్థః, తే మూఢా స్తేన నిజముద్రాహాసజనితకోపేన, కుసుమేషు ణైవ, నిర్దయతరం దయాహీనం యథా తథా, నిహత్య నిచ్చైః కృత్వా, కేచి న్నగ్నీకృతాః దిగమ్బరీకృతాః-



ని. 'నగ్నోఽవాసా దిగమ్బరః' ఇత్యమరః * అభూతతద్భావే చ్విః * 'అస్య చ్వౌ' ఇతి ఈత్ * 'ఊర్యాదిచ్విడాచ శ్చ' ఇతి గతిసంజ్ఞాయాం * 'కుగతి ప్రాదయః' ఇతి సమాసః, కేచి న్ముణ్డితాః పరమహంసీకృతాః - న తు సౌభాగ్య సంపన్నీకృతా ఇత్యర్థః, అతః కుసుమేషుముద్రారూపాః స్త్రీయో న పరిహర్తవ్యా ఇతి భావః; యథా లోకే రాజాన స్తీక్ష్ణదణ్డా నిజాజ్ఞోల్లఙ్ఘనాపరాధిజనాన్ కాంశ్చి త్సర్వస్వాపహారేణ వస్త్రహీనాన్ కుర్వన్తి - కాంశ్చి త్సర్వతో ముణ్డితశిరస్కాన్ - కాంశ్చి దర్ధముణ్డితముణ్డాన్ - కాంశ్చి జ్జటాధారిణః - కాంశ్చి త్కపాలభిక్షుకాం శ్చ కుర్వన్తి - తద్వ దత్రాపి ఇతి ధ్వనిః.

అత్ర వైరాగ్యకృత నగ్నత్వాదేః కుసుమేషుకృతత్వోత్ప్రేక్షణా దుత్ప్రేక్షాలంకారః - సా చ నూన మిత్యాది వ్యఞ్జకాప్రయోగాత్ గమ్యా. శార్దూలవిక్రీడితమ్.

---

అవ.—ఇంద్రియ నిగ్రహము మానవులకు అలవడ దనుట.

విశ్వామిత్రపరాశరప్రభృతయో వాతామ్బుపర్ణాశనా
స్తేఽపి స్త్రీముఖపఙ్కజం సులలితం దృష్ట్వైవ మోహం గతాః;
శాల్యన్నం సఘృతం పయోదధియుతం యే భుఞ్జతే మానవా,
స్తేషా మిన్ద్రియనిగ్రహో యది భవే, ద్విన్ధ్యః ప్లవేత్ సాగరే. 80.

టీక.—వాతా...శనాః - వాత = గాలియు - అమ్బు = నీళ్లును - పర్ణ = ఆకులును - అశనాః= తిండిగాఁ గలవారైన, తే విశ్వామిత్ర పరాశర ప్రభృతయః అపి= ఆ విశ్వామిత్రుఁడు పరాశరుఁడు లోనగువారు కూడ, సులలితం = అతి సుందరమైన, స్త్రీ...జం - స్త్రీ = (మేనకాది) స్త్రీల యొక్క - ముఖపఙ్కజం = మోముఁదామరను, దృష్ట్వా ఏవ = చూచిన మాత్రాననే, మోహం = వలపును, గతాః = పొందినారు. యే మానవాః = ఏ మనుష్యులు, సఘృతం = నేతితోడిదియు, పయో... యుతం - పయః = పాలతోను - దధి = పెరుగుతోను - యుతం = కూడినదియు, (అగు), శాలి అన్నం = వరి యన్నమును, భుఞ్జతే = భుజింతురో, తేషాం = వారికి, ఇన్ద్రియ నిగ్రహః = ఇంద్రియములను అడఁచుట, భవేత్ యది=కలుగు నేని, విన్ధ్యః= వింధ్య (పర్వత) ము, సాగరే = సముద్రమునందు, ప్లవేత్ = తేలును.

తా.—ప్రాణధారణార్థమయి గాలిని నీళ్లను ఆకులను భుజించుచు ఒక్కచిక్కియుండు విశ్వామిత్ర పరాశరాది మహామునులే స్త్రీలయొక్క సుందరవదనారవిందమును చూచినమాత్రాన వలపుపాలు కాఁగా, పాలుపెరుగునేతులతో వరియన్నము

భుజించి పుష్టు లయియుండు మనుష్యమాత్రులకు ఇంద్రియనిగ్రహము కలుగుట సముద్రములో వింధ్యపర్వతము తేలుటవలె అత్యంతము అసంభావితము.

చ. వనదళవాతముల్ మెసవువారు పరాశరకౌశికాదు; లా
ఘనులును సుందరీజనులఁ గన్గొని మోహితచిత్తు లైరి; హె
చ్చిన ఘృతపాయసాన్నము భుజించెడివారలకున్ మనోజయం
బు నెగడు నేని, వింధ్యము సముద్రజలంబులఁ దేలియాడదే?.

వ్యా.—కిం బహునా మహర్షయోఽపీన్ద్రియ నిగ్రహ సమర్థా న జాతా ఇ త్యుపసంహరతి - విశ్వామిత్రేతి.—వాతామ్బుపర్ణా న్యేవాశనం యేషాం తే తథోక్తాః శరీరయాత్రామాత్రోపయోగి వాయూదక పరిణతపర్ణాహారా ఏవ - న త్విన్ద్రియతుష్టికర మృష్టాన్నభోజనా ఇత్యర్థః, విశ్వామిత్రపరాశరప్రభృతయో - విశ్వస్య మిత్రం విశ్వామిత్రో గాధినన్దనః - 'మిత్రే చర్షౌ' ఇతి దీర్ఘః - పరాశరో వ్యాసపితా - తౌ ప్రభృతీ యేషాం తే తథోక్తాః- ప్రభృతి శబ్దేన శాణ్డిల్యాదయోఽపి సఙ్గృహ్యన్తే, యే మహర్షయ స్సన్తీతి శేషః, తేఽపి, సులలిత మతిసున్దరమ్ - ని. 'లలితం త్రిషు సున్దరమ్' ఇతి శబ్దార్ణవే, స్త్రీణాం మేనకా రమ్భా సత్యవతీ ధాన్యమాలిన్యాది యోషితాం, ముఖపఙ్కజం, దృష్ట్వైవావలోక్యైవ, మోహం గతాః తత్పరతన్త్రా జాతాః - న త్విన్ద్రియ నిగ్రహ సమర్థా ఇత్యర్థః, కిం తు యే, మానవా స్సాధారణమర్త్యాః, సఘృతమ్ ఆజ్యప్లుతం, త దపి పయసా క్షీరేణ- దధ్నా చ- యుతం మిశ్రితం, శాల్యన్నం కలమాఖ్యవ్రీహ్యన్నమ్ - అత్యన్తవీర్యవృద్ధికరం మృష్టాన్న మి త్యర్థః, భుఞ్జతే అభ్యవహరన్తి * 'భుజోఽనవనే' ఇ త్యాత్మనేపదమ్, తేషాం మానవానా, మిన్ద్రియనిగ్రహ ఇన్ద్రియనియమ, స్సంభవే ద్యది, తదా విన్ధ్యః పర్వతః, సాగరే, ప్లవేత్ ఉన్మజ్జేత్, న తు కదాచి దపి విన్ధ్యః ప్లవతి - గ్రావప్లవన స్యాశ్రుతచరత్వాత్ - తథా చ విన్ధ్యప్లవనస్య యథా అసంభావితత్వం తథా ఇన్ద్రియనిగ్రహ స్యా పీ త్యర్థః; వాతాద్యశనానాం ఋషీణా మే వై తాదృశావస్థాపన్నత్వమ్, కిముత మృష్టాన్నభోజినాం మానవానా మితి భావః.

అ త్రేన్ద్రియాణాం నిగ్రహసంబన్ధేఽపి విన్ధ్యప్లవనదృష్టాన్తే నాసంబన్ధోక్తే స్సంబన్ధేఽసంబన్ధరూపాతిశయోక్తిః. శార్దూలవిక్రీడితమ్.

ఇతి భర్తృహరిసుభాషిత శృఙ్గారశతక వ్యాఖ్యానే విరక్తపద్ధతి ర్నామ చతుర్థీ వింశతిః.

---



ఋతువర్ణన పద్ధతిః.

---

అవ.—వసంత వర్ణన.

పరిమళభృతో వాతాః; శాఖా నవాఙ్కురకోటయో;
మధుర†విరుతోత్కణ్ఠాభాజః ప్రియాః పికపక్షిణామ్;
విరళవిరళస్వేదోద్గారా వధూవదనేన్దవః;
ప్రసరతి మధౌ, ధాత్ర్యాం జాతో న కస్య గుణోదయః? 81.

టీ.—వాతాః = వాయువులు, పరిమళ భృతః = తావిని మోచునవి, (అయినవి); శాఖాః = కొమ్మలు, నవ అఙ్కుర కోటయః = క్రొత్త మొలకచిగుళ్లుగల కొనలుగలవి, (అయినవి); పిక పక్షిణాం= కోయిల పిట్టలయొక్క, ప్రియాః = కాంతలు, మధుర... భాజః - మధుర = తియ్యని - విరుత = కూఁతలందు - ఉత్కణ్ఠా = కోరికను - భాజః = పొందినవి, (అయినవి) ; వధూ...దవః - వధూ = స్త్రీలయొక్క - వదన ఇన్దవః = మోముఁ జందురులు, విరళ...ద్గారాః - విరళ విరళ = కొంచె కొంచెము - స్వేద ఉద్గారాః = చెమటయొక్క పొటమరించుటగలవి, (అయినవి); ధాత్ర్యాం = భూమియందు, మధౌ = వసంతము, ప్రసరతి సతి = వ్యాపించుచుండఁగా, కస్య = దేనికి, గుణ ఉదయః = గుణముయొక్క పొడముట, న జాతః = కలుగదాయెను.

తా.—భూమిలో వసంతావతారమున ఎల్లవస్తువులకును గుణ మతిశయించినది. ఎట్లన, గాలికి పరిమళము కలిగినది. కొమ్మలకొనలు చిగిర్చినవి. పెంటికోయిలలు మధురముగా కూయ నుత్సహించినవి, స్త్రీలమోముఁజందురులను చిఱుఁ జెమరు అలంకరింపం దొడంగినది.

చ. వలపు వహించె గంధగిరి వాతపరంపర, భూరిభూజశా
ఖలు చిగిరించె, నిం పెసఁగెఁ గాకలి కోకిలలందుఁ, జెక్కులం
బలుచని ఘర్మబిందువులు భామలకుం బ్రసరించె; నెయ్యెడం
జెలువు ఘటింపఁజాలదు విశేషవసంతసమాగమం బిలన్?

వ్యా.—ప్రాసఙ్గికం పరిసమాప్య ప్రస్తుతశృఙ్గారోపయోగితయా ఋతువర్ణనం చికీర్షు స్తదాదౌ లోకవేదయోః ప్రాథమ్యేన వ్యవహారా ద్వసన్తం వర్ణయతి-పరిమళేత్యాదిభిః షడ్భిః - పరిమళే ఇతి.—వాతా ఉపవనపవనాః, పరిమళం బిభ్రతీతి పరిమళభృతో - వివిధ కుసుమ సమ్మర్ద జనిత గన్ధవిశేషబన్ధురాః - జాతా ఇతి శేషః - ని. 'విమర్దోత్థే పరిమళో గన్ధే జనమనోహరే' ఇ త్యమరః, శాఖా రసాలాదితరుస్కన్ధాః, నవాఙ్కురాణి నూతన కిసలయాని - కోటి ష్వగ్రేషు-యాసాం తా స్తథోక్తాః - పల్ల

విత్తా జాతా ఇత్యర్థః, పిక పక్షిణాం పికాఖ్య పక్షివిశేషాణాం, ప్రియాః కోకిలాఙ్గనా ఇత్యర్థః - ని. 'కోకిలః పిక ఇత్యపీ'త్యమరః - మధురా సహకారాఙ్కురకషాయాస్వాదలాభాత్సగుణా - †విధురా కాకకృతోపద్రవవశా ద్విగుణా చ - కష్టేతి యావత్ - యా ఉత్కణ్ఠా - కూజితౌత్సుక్యం - తాం భజన్తీతి తథోక్తా - జాతాః - 'భజోణ్విః' ఇతి ణ్విప్రత్యయః - ని. 'విధుర స్స్యాత్కష్ట విశ్లిష్టయో రపి' ఇతి విశ్వః, వధూనాం - వదనేన్దవో వక్త్రచన్ద్రాః, విరళవిరళః గ్రీష్మాతిరేకాభావా న్మన్దప్రకారః *'ప్రకారే గుణవచనస్య' ఇతి సాదృశ్యార్థే ద్విర్భావః - స్వేదోద్గారః శ్రమజలనిష్యన్దో - యేషాం తే తథోక్తా జాతాః - అత్రోద్గారశబ్దస్య గౌణవృత్తిసమాశ్రయణా న్న గ్రామ్యకక్ష్యామధ్యపతితత్వ మిత్యుక్తం ప్రాక్, తథాహి, ధాత్ర్యాం భువి, మధౌ వసన్తే, ప్రసరతి వ్యాప్రియమాణే సతి, కస్య వస్తునో, గుణోదయో గుణోత్కర్షో, న జాతః, సర్వ స్యాపి జాయత ఏ వేత్యర్థః* 'గత్యర్థాకర్మక' ఇత్యాదినా వర్తమానే కర్తరి క్తప్రత్యయః * 'మతిబుద్ధిపూజార్థేభ్యశ్చ' ఇతి చకారాత్ వర్తమానతా - ని. 'అథ పుష్పరసే మధు। దైత్యే వసన్తే చైత్రే చ' ఇతి విశ్వప్రకాశః. హరిణీవృత్తమ్.

---

మధు రయం మధురై రపి కోకిలా †కలకలై ర్మలయస్య చ వాయుభిః
విరహిణః ప్రహిణన్తి శరీరిణో; విపది హన్త సుధాఽపి విషాయతే. 82.

టీక.—అయం మధుః = ఈవసంతము, మధురైః = తీయని, కోకిలా కలకలైః = పెంటికోయిలలయొక్క గొల్లుచేతను, మలయస్య = గందపుఁగొండయొక్క, వాయుభిశ్చ = తెమ్మెరలచేతను, విరహిణః = ఎడఁబాసియున్న, శరీరిణః = జనులను, ప్రహిణన్తి = మిక్కిలి నొంచుచున్నది, హన్త = అయ్యో, విపది = ఆపదయందు, సుధా అపి = అమృతము సయితము, విషాయతే = విషమువలెనగును.

తా.—'ఆపదలో అమృతము సయితము విష మగును' అనుటకు నిదర్శనముగా, ఈ వసంతమున, వియోగముపా లయిన స్త్రీపురుషులను తియ్యని పెంటికోయిలలగొల్లులును మలయమారుతములును బాధించుచున్నవి.—ఈకలకలంబును వాయువులును అమృతము వంటివి, అవి విరహోద్దీపకములై బాధించుట విష మగుటవంటిది.

తే. నిండుకొని వచ్చుగందపుఁ గొండచల్ల । గాలియును బికకాకలికారవంబు
విరహిజనుల వధించె నవ్వేళఁ; గాన। నమృతమును విష మగు విప త్ప్రాప్తియందు.

వ్యా.—మధు రితి.—అయం పూర్వోక్తో, మధు ర్వసన్తః - సకలచరాచరోల్లాసకర ఇతి భావః, మధురైః శ్రావ్యై స్సంతాపహారై ర్వా - 'శీతలీక్రియతే తాపో యేన తన్మధురం స్మృతమ్' ఇతి లక్షణాత్, కోకిలానాం, పికసున్దరీణాం - †కలరవై రవ్యక్తమనోహరైః స్వరవిశేషైః - ని. 'కాకలీ తు కలే సూక్ష్మే ధ్వనౌ తు మధురాస్ఫుటే । కలః'



ఇత్యమరః - కోకిలే త్యత్ర జాతిగ్రహణేఽపి * 'కోకిలా జాతా వపి' ఇతి న ఙీష్, తథా మలయస్య వాయుభిః శ్రీఖణ్డశైలానిలై శ్చ - అత్యన్తసుఖావహై రపీతి భావః, విరహిణః శరీరిణః వియోగిజనాన్, ప్రహిణన్తి వినాశయతి, తథాహి, విపది ఆపత్కాలే, సుధా అమృత మపి, విషాయతే విష మివాచరతి - తద్వ త్ప్రాణప్రయాసకరీ భవతీత్యర్థః * 'ఉపమానా దాచారే' ఇతి క్యచ్ * 'అకృత్సార్వధాతుకయో ర్దీర్ఘః' ఇతి దీర్ఘః, హన్తేతి విషాదే - ని. 'హన్త హర్షేఽనుకమ్పాయాం వాక్యారమ్భవిషాదయోః' ఇత్యమరః.

సామాన్యేన విశేషణసమర్థనరూపోఽర్థాన్తరన్యాసః; స చ విషాయత ఇత్యత్ర ఉపమయా అఙ్గేన సఙ్కీర్యతే. అనుప్రాస శ్శాబ్దః. ద్రుతవిలమ్బితవృత్తమ్.

---

ఆవాసః కిలకిఞ్చితస్య దయితాః పార్శ్వే విలాసాలసాః,
కర్ణే కోకిలకామినీకలరవః, స్మేరో లతామణ్డపః,
గోష్ఠీ సత్కవిభి స్సమం కతిపయై, ర్ముగ్ధా స్సితాంశోః కరాః,
కేషాంచి త్సుఖయన్తి చాత్ర హృదయం చైత్రే విచిత్రాః స్రజః.

టీక.—పార్శ్వే = ప్రక్కను, కిలకిఞ్చితస్య = రోషహర్షాది సంకరమునకు, ఆవాసః = ఉనికిపట్టును, విలాస అలసాః = ఒయ్యారములచే మందగించినవారును, (అగు), దయితాః = కాంతలును, కర్ణే = చెవిలో, కోకిల...రవః - కోకిలకామినీ = కోయిలపెంటులయొక్క - కల = అవ్యక్తమధురమైన - రవః = కూఁతయు, స్మేరః = వికసించినట్టి, లతామణ్డపః = తీఁగయిల్లును; కతిపయైః = ఒకకొందఱు, సత్ కవిభిః సమం = మంచి కవులతో కూడ, గోష్ఠీ = సల్లాపమును, ముగ్ధాః = సుందరములైన, సితాంశోః = చంద్రునియొక్క, కరాః = కిరణములును, విచిత్రాః = పలువన్నెలుగలవైన, స్రజః = పూలసరములును, అత్ర = ఈ, చైత్రే = వసంతమునందు, కేషాంచిత్ = కొందఱియొక్క, హృదయం = మనస్సును, సుఖయన్తి = సుఖపెట్టును.

తా.—చైత్రమాసములో ఎవరో పుణ్యాత్ములు తమకెలంకుల రోషహర్షాది సంకరమునకు ఉనికిపట్టులై ఒయ్యారములచే మందగించినకాంతలు వెలుఁగ, కోయిలయిల్లాండ్ర తియ్యంపుఁగూఁతలను ఆలించుచు, పూచిన తీఁగచప్పరములలో ఒకకొందఱు సత్కవులతో సల్లాపించుచు, నానావర్ణముల పూసరములు దాల్చి, మనోహర మయినవెన్నెలను సేవించుచు సుఖింతురు.

చ. ఘన కిలకించిత్ప్రచుర కాంతలు చెంతఁ, బికాంగనాకల
స్వనములు వీనులందు, సుమశాలి నికుంజము, పుష్పమాల్యముల్,

వినుతకవిప్రసంగమును, వెన్నెలతేటలు, భాగ్యవంతు లౌ
జనులకుఁ జైత్రమాసమున సౌఖ్య మొసర్చు సుగంధితోయముల్.

వ్యా.—విరహిణా మేవ కృచ్ఛ్రం, న త్వన్యేషా మి త్యాహ - ఆవాస ఇతి - పార్శ్వ పరిసరే, కిలకిఞ్చితస్య 'రోషాశ్రుహర్షభీత్యాదే స్సఙ్కరః కిలకిఞ్చితమ్' ఇత్యుక్తలక్షణ శృఙ్గారచేష్టావిశేష, స్యావాసో నివాసభూతః- అత్రాధారమాత్ర వివక్ష యైకవచనగ్రహణ మితి వివేకః, తథా, విలాసాలసాః లీలామన్థరాః - కటాక్షభు జాక్షేపాది వివిధ విభ్రమాచరణ తత్పరా ఇత్యర్థః - ఏతే నైతాసాం స్మరమన్దీకృత వ్రీడత్వా త్ప్రాగల్భ్యం సూచ్యతే, దయితాః ప్రియతమా శ్చ, కర్ణే కర్ణయో రి త్యర్థః * 'స్తనాదీనాం ద్విత్వవిశిష్టా జాతిః ప్రాయేణ' ఇతి వామనసూత్రే ప్రాయగ్రహణా దేకవచన ప్రయోగః, కోకిలకామినీనాం కలకణ్ఠాఙ్గనానాం - కలరవః అవ్యక్త మధురస్వర శ్చ, స్మేరః ఈష ద్వికసిత కుసుమ ఇత్యర్థః - అత్ర కుసుమధర్మః కుసుమితే ఉపచర్యతే* 'ష్మిఙ్ ఈషద్ధసనే' ఇతి ధాతోః * 'నమి కమ్పి' ఇత్యాదినా రప్రత్యయః, లతామణ్టపో లతాగృహం చ, కతిపయైః కైశ్చిదేవ - అన్యథా రసాభాసాత్, సత్కవిభి స్సరసవిచిత్రచారుప్రబన్ధ ప్రణయన చతురతర కవీశ్వరైః, సమం, గోష్ఠీ ప్రసఙ్గ శ్చ, ము గ్ధా మనోహరా, సితాంశోః కరా శ్చన్ద్రకిరణా శ్చ, విచిత్రా నానావిధాః, స్రజః పుష్పమాలికా శ్చ, అత్ర అస్మిన్, చైత్రే వసన్తే, కేషాంచిత్ అన్యేషా మే వే త్యర్థః, హృదయం సుఖయన్తి రఞ్జయన్తి - న సర్వేషా మి త్యర్థః, ఈదృక్సౌభాగ్యసంపన్నా నాం విరళత్వా దితి భావః.

అత్ర ఖలేకపోతన్యాయా ద్దయితాది బహుకారణానాం హృదయరఞ్జన రూపైకకార్యసాధన సముద్యోగకథనా ద్ద్వితీయ స్సముచ్చయాఽలఙ్కారః - త దుక్తం విద్యానాథేన -

'ఖలేకపోతన్యాయేన బహూనాం కార్యసాధనే
కారణానాం సముద్యోగ స్స ద్వితీయ స్సముచ్చయః.' ఇతి.

శార్దూల విక్రీడితమ్.

———

పాన్థస్త్రీవిరహానలాహుతికలా మాతన్వతీ మఞ్జరీ
మాకన్దేషు పికాఙ్గనాభి రధునా సోత్కణ్ఠ మాలోక్యతే;
అల్పా స్తే నవపాటలాపరిమళప్రాగ్భారపాటచ్చరా
వాన్తి క్లాన్తివితానతానవకృతః శ్రీఖణ్డశైలానిలాః. 84.

టీక.—అధునా = ఇప్పుడు, పాన్థ...కలాం - పాన్థ స్త్రీ = తెరువరుల భార్యల యొక్క - విరహ అనల = ఎడఁబాటు నిప్పుయొక్క - ఆహుతి కలాం = హవిస్సు



యొక్క-వ్యాపారమును, ఆతన్వతీ = చేయుచున్నట్టిదై, మాకన్దేషు = తియ్యమామిడి చెట్లయందలి, మంజరీ = పూగుత్తి, పికాఙ్గనాభిః = కోయిలకొమరాండ్రచేతను, సఉత్కణ్ఠం = కోరికతో, ఆలోక్యతే = చూడఁబడుచున్నది. నవ...చ్చరాః - నవ = క్రొత్త- పాటలా = కలిగొట్టుపూలయొక్క - పరిమళ = తావియొక్క - ప్రాగ్భార = మొత్తముయొక్క - పాటచ్చరాః = దొంగలును, క్లాన్తి...కృతః - క్లాన్తి = బడలికలయొక్క - వితాన = సమూహముయొక్క - తానవ = అల్పత్వమును - కృతః = చేయునవియు, అల్పాః = మందములును, (అగు), తే = ఆ, శ్రీ...నిలాః - శ్రీఖణ్డశైల = గందపుఁగొండ యొక్క - అనిలాః = వాయువులు, వాన్తి = వీఁచుచున్నవి.

తా.—ఈ వసంతములో నిప్పను (నేయిలోనగు) హోమమువోలె తియ్యమామిడి యందలి పూగుత్తి దేశాంతర మేఁగినభర్తలచే ఇంటవిడువఁబడిన చెలువలవిరహతాపమును వృద్ధిచేయుచున్నది. ఆగుత్తిని మిక్కిలి తమితో పెంటికోయిలలు చూచుచున్నవి. మఱియు కలిగొట్టు క్రొన్ననల నెత్తావిమొత్తములను ముచ్చిలి తెచ్చుచున్నయీగందపుఁ గొండ మెల్లతెమ్మెరలు బడలికలను సన్నగిలం జేయుచు వీచుచున్నవి.

చ. వరలు వియోగినీ విరహవహ్నికి నాహుతిలీలఁ బొల్చు భా
సురసహకారమంజరులఁ జూచి మదించెఁ బికంబు లిత్తఱిన్,
సురతపరిశ్రమాతిశయసూదనముల్ విహరించెఁ బాటలీ
పరిమళభారచోరములు బంధురచందనశైలవాతముల్.

వ్యా.— పాన్థస్త్రీతి.— అధు నేదానీమ్ వసన్తసమయ ఇ త్యర్థః, పాన్థస్త్రీణాం ప్రోషితభర్తృకాణాం, విరహానలస్య వియోగాగ్నేః - ఆహుతికలాం ఆహుతి కలనామ్ తత్సామ్య మి త్యర్థః - ని. 'కలా శిల్పే కాలభేదే చన్ద్రాంశే కలనా కలా' ఇతి వైజయన్తీ, ఆతన్వతీ ఆదధానా తద్వదుద్దీపి కేత్యర్థః - తనోతే శ్శతరి* 'ఉగిత శ్చే'తి ఙీప్, మాకన్దేషు రసాలవిశేషేషు - విద్యమా నేతి శేషః, మఞ్జరీ - పుష్పమఞ్జరీ, పికాఙ్గనాభిః కోకిలాభిః, సోత్కణ్ఠ మాలోక్యతే సానన్ద ముద్వీక్ష్యతే - ఇష్టత్వా దితి భావః, తథా పాటలా ఫలేరుహాఖ్య వృక్షవిశేషః - ని. 'పాటలిః పాటలా మోఘా కాచస్థాలీ ఫలేరు హే' త్యమరః* 'పుష్పమూలేషు బహుళమ్' ఇతి లుపి * యుక్తవ ద్వ్యక్తి వచనే భవతః - నవపాటలా పరిమళ ప్రాగ్భారస్య నూతన పాటలీ కుసుమ గన్ధసంపత్తేః- పాటచ్చరా మలిమ్లుచాః త ద్గన్ధాపహారిణ ఇత్యర్థః, తథా క్లాన్తివితానస్య క్లాన్తిసమూహస్య - తానవం తనుత్వం - కుర్వన్తీ తి క్లాన్తివితానతానవకృతః * కరోతేః క్విప్, అల్పా మన్దాః, తే ప్రసిద్ధాః, శైత్యమాన్ద్య సౌగన్ధ్య యుక్తాః, శ్రీఖణ్డ శైలానిలా మలయ మారుతా, వాన్తి ప్రసరన్తి * 'వా గతిగన్ధనయోః' ఇతి ధాతో ర్లట్ - ఏతేన విరహిణాం దురన్తదుఃఖజనకత్వం సంయుక్తానాం పరమానన్దకత్వం చాస్యోక్త మి త్యవగన్తవ్యమ్.

అత్ర వియోగాగ్ని రిత్యత్ర రూపకమ్; ఆహుతికలా మిత్యత్రోపమయా సాపేక్షత్వాత్సఙ్కీర్ణం స చ్ఛాబ్దే నానుప్రాసేన సంకీర్యతే. వృత్తం పూర్వవత్.

---

ప్రథితః ప్రణయవతీనాం తావ త్పద మాతనోతు హృది మానః,
భవతి న యావ చ్చన్దనతరుసురభి ర్మలయపవమానః. 85.

టీక.—చన్దనతరుసురభిః - చన్దనతరు = గంధపుఁజెట్లచేత - సురభిః = సుగంధి (యగు), మలయ పవమానః = మలయ(పర్వత)పు గాలి, యావత్ = ఎందాఁక, న భవతి = పొడమదో, తావత్ = అందాఁక, ప్రణయవతీనాం = అనురక్తలయొక్క, హృది = మనస్సునందు, ప్రథితః = ప్రసిద్ధమగు, మానః = నెయ్యపుటలుక, పదం = స్థానమును, ఆతనోతు = చేయునుగాక.

తా.—గంధపుఁజెట్టుల నెత్తావితోడి మలయమారుతము వీవందొడంగు నందాఁకనే వనితలహృదయములయందు ఈసు రగులుచుండునుగాక; అనంతరము ఆయీసు ఉండనేని ఆమలయానిలము వారిప్రాణములను హరించును.

తే. అంగజునిగంధసింధురం బనఁగఁ బరఁగు । మలయజసుగంధి మలయాద్రిమారుతంబు
మలయ దెందాఁక నందాఁక మానవతుల । మానసంబుల నెలకొని మాన మమరు.

వ్యా.—ప్రథిత ఇతి.—ప్రథితః ప్రసిద్ధః దృఢతర ఇతి యావత్, మానః ప్రియతమ స్యాన్యస్త్రీసఙ్గిత్వ జనితేర్ష్యాకృతకోపః -

‘స్త్రీణా మీర్ష్యాకృతః కోపో మానోఽన్యాసఙ్గిని ప్రియే,
శ్రుతే వానుమితే దృష్టే’ ఇతి దశరూపకే,

ప్రణయవతీనాం ప్రియతమానాం, హృది, తావ త్తావత్పర్యన్తం, పదం స్థానం, ఆతనోతు కరోతు - తిష్ఠ త్విత్యర్థః * సమ్భావనాయాం లోట్ - ని. ‘పదం వ్యవసితత్రాణ స్థాన లక్ష్మాఙ్ఘ్రివస్తుషు’ ఇత్యమరః, కియత్పర్యన్త మిత్యత ఆహ - చన్దనతరుసురభిః శ్రీఖణ్డద్రుమ పరిశీలన సుగన్ధిః - ని. ‘సుగన్ధౌ చ మనోజ్ఞే చ సురభి ర్వాచ్యలిఙ్గవత్’ ఇతి విశ్వః - మలయపవమానో మలయమారుతః, యావ త్పర్యన్తం, న భవతి నప్రసరతి, తావ దితి సంబన్ధః - సామాన్యస్య విశేషపర్యవసానా త్పరిసరణార్థత్వం భువో ద్రష్టవ్యమ్ - ని. ‘యావ త్తావ చ్చ సాకల్యేఽవధౌ మానేఽవధారణే’ ఇత్యమరః, అ స్యాత్యన్తోద్దీపకత్వా న్మానిన్యోఽతిదృఢ మపి నిజమానం విహాయ ప్రియతమపగతస్త్రీః స్వయమేవ భవన్తీ త్యర్థః. ఆక్షేపభేదః.

---

సహకారకుసుమకేసర నికరభరామోదమూర్ఛితదిగన్తే
మధురమధువిధురమధుపే మధౌ భవే త్కస్య నోత్కణ్ఠా. 86.



టీ.—సహ...గన్తే - సహకార = తియ్యమామిడి-కుసుమ = పూవుల యొక్క - కేసర నికర భర = అకరువుల మొత్తముల బరువుల - ఆమోద = పరిమళము చేత - మూర్ఛిత = ఆక్రమింపఁబడిన - దిక్ అన్తే = దిక్కుల తుదలుగలదియు, మధుర ...మధుపే - మధుర = తీయని - మధు = పూఁదేనియచేత - విధుర = మత్తెక్కిన - మధుపే = తుమ్మెదలుగలదియు, (అగు), మధౌ = వసంతమునందు, కస్య = ఎవనికి, ఉత్కణ్ఠా = (సురతముకై) కోరిక, న భవేత్ = కలుగదు.

తా.— లోకమం దెల్లెడలను తీయమామిడిపూవుల యకరువుల పరిమళము గమగమలాడుచు, తీయని మకరంద మాని మత్తిల్లి తుమ్మెదలు పాడుచు, నున్న వసంతర్తువులో, సురతేచ్ఛ పొడమని వారు ఎవ్వరును ఉండరు.

తే. సరస సహకార కుసుమకేసర సమూహ । గురుతరామోదమయదిగంతరము మధుర
మధువిధురమధుపము మధుమాససమయ । మెవ్వనికి వేడ్క వాటింప దిజ్జగమున.

వ్యా.—సహకా రేతి.—సహకార కుసుమానాం రసాల విశేష ప్రసూనానామ్- ని. ‘ఆమ్ర శ్చూతో రసాలోఽసౌ సహకారోఽతిసౌరభః’ ఇత్యమరః - యే కేసర నికరాః కిఞ్జల్కపుఞ్జాః - తేషాం యే భరా స్సమృద్ధయః - తేషా - మామోదేన పరిమళ విశేషేణ- మూర్ఛితా వ్యాప్తా- దిగన్తా యస్మిన్ తస్మిన్, మధురేణ మాధుర్య గుణయుక్తేన - మధునా మకరన్దేన - విధురా విహ్వలా- ఉన్మత్తా ఇతియావత్ - మధుపా భృఙ్గా యస్మిన్ తస్మి, న్నిత్థ మస్యోక్త ముద్దీపకత్వ మిత్యర్థః, మధౌ వసన్తే, కస్య జనస్య స్త్రియో వా పురుషస్య వే త్యర్థః, ఉత్కణ్ఠా సంభోగౌత్సుక్యం, న భవే న్నోత్పద్యేత, అత స్సర్వ స్యాపి ఉత్పద్యత ఏ వే త్యర్థః - అతో మానత్యాగో యుజ్యత ఇతి భావః. అనుప్రాసః శబ్దాలంకారః. వృత్తం పూర్వవత్.

---

అవ.—గ్రీష్మర్తువర్ణన.

అచ్ఛాచ్ఛచన్దనరసార్ద్రతరా మృగాక్ష్యో,
ధారాగృహాణి, కుసుమాని చ, కౌముదీ చ,
మన్దో మరు త్సుమనసః, శుచి హర్మ్యపృష్ఠం,
గ్రీష్మే మదం చ మదనం చ వివర్ధయన్తి. 87.

టీ.—అచ్ఛ...తరాః - అచ్ఛఅచ్ఛ = తెల్లతెల్లని - చన్దన రస = గంధపు ద్రవముచేత - ఆర్ద్రతరాః = కడుందడిసిన, మృగాక్ష్యః = లేడికన్నుల స్త్రీలును, ధారాగృహాణి = (నీటి)ధారలయిండ్లును, కుసుమాని చ = పువ్వులును, కౌముదీ చ = వెన్నెలయును, సుమనసః = జాజిపువ్వుయొక్క, మన్దః మరుత్ = మెల్లని, మరుత్ =

గాలియు, శుచి = తెల్లని, హర్మ్య పృష్ఠం = మేడ పైతలమును, గ్రీష్మే = వేసవియందు, మదం = హర్షమును, మదనం చ = మన్మథునిని, వివర్ధయన్తి = పెంచును.

తా.—వేసవిలో తెల్లతెల్లని గందంపుఁ బూఁతలచే చల్లని కోమలులును కృత్రిమవర్షము గురియు జలయంత్ర గృహంబులును, పువ్వులును, వెన్నెలయు, జాజిపూవుల పరిమళమును వెదచల్లు మెల్లగాలియు, తెల్లని మేడ పైతలంబులును, ఉల్లాస మదనోద్దీపనములను గావించును.

చ. అతిసితచందనార్ద్రరుచిరాంగులు భామినులున్, సుగంధసం
గత మగుమందమారుతముఁ, గౌముదియున్, జలయంత్రగేహ, ము
న్నతశుచి సౌధభాగము, ఘనం బగువాసనఁ బూనుపుష్పసం
తతియు, మదంబు దర్పకునిదర్పముఁ బెంపుగఁ జేయు వేసవిన్.

వ్యా.— అథ త్రిభి ర్గ్రీష్మం వర్ణయతి - అచ్ఛా చ్ఛేతి.— అచ్ఛాచ్ఛో౽తిస్వచ్ఛో - య శ్చన్దనరసః పటీరద్రవః - ని. 'గుణే రాగే ద్రవే రసః' ఇ త్యమరః - తేన - ఆర్ద్రితగా అత్యన్తార్ద్రా - సన్తాప శాన్త్యర్థం సాన్ద్రచన్దనపఙ్క చర్చితాఙ్గా ఇ త్యర్థః, మృగాక్ష్యః తరుణ్య శ్చ, ధారాగృహాణి జలయన్త్రవేశ్మాని, కుసుమాని - మల్లికాదీని, కౌముదీ చన్ద్రికా చ, సుమనసో జాత్యా స్సంబన్ధీ గ్రీష్మకాలే ౽తివికాససమ్భవాత్, త త్కుసుమ పరిశీలనజనితామోదభరిత ఇ త్యర్థః - ని. 'సుమనా మాలతీ జాతిః' ఇత్యమరః, మన్దో మరుత్ మన్థరగన్ధవాహ శ్చ; శుచి శుభ్రం - సుధాలేపేనేతి భావః, హర్మ్య పృష్ఠం సౌధోపరిప్రదేశ శ్చేతి, గ్రీష్మే ఋతౌ మదం హర్ష వ్యతికరం, మదనం చ, వివర్ధయన్తి ఉద్దీపయన్తి.

అత్రాపి ద్వితీయ స్సముచ్చయాలఙ్కార ఉన్నేయః. వసన్తతిలకా వృత్తమ్.

———

స్రజో హృద్యామోదా వ్యజనపవన శ్చన్ద్రకిరణాః
పరాగః కాసారో మలయజరసః సీధు విశదమ్
శుచిః సౌధోత్సఙ్గః ప్రతను వసనం పఙ్కజదృశో
నిదాఘర్తా వేత ద్విలసతి లభన్తే సుకృతినః. 88.

టీక.—హృద్య ఆమోదాః = ఇంపైన నెత్తావిగల, స్రజః = పూలసరములును, వ్యజన పవనః = వీవనల గాలియు, చన్ద్ర కిరణాః = చందురుని వెలుంగులును - పరాగః = పుప్పొడియు, కాసారః = సరస్సును, మలయజ రసః = చందన ద్రవమును, విశదం = తేటయైన, సీధు = సారాయియు, శుచిః = తెల్లని, సౌధ ఉత్సఙ్గః = మేడ పయితలమును, ప్రతను = సన్నని, వసనం = వలువయు, పఙ్కజదృశః = తమ్మికంటి చెలువలును, అనెడి, ఏతత్ = దీనిని, నిదాఘ ఋతౌ = వేసవి కాలము, విలసతి సతి = చెలువారు చుండఁగా, సుకృతినః = పుణ్యవంతులు, లభన్తే = పొందుదురు.



తా.—వేసవియందు, మనోహరముగా పరిమళించు పూలసరములు, సురఁటీల గాలి, తేటసారాయి, తెల్లని మేడపై తలము, వలిపము, తామరసలోచనలును,—ఉత్కృష్టభోగసాధనములు ; ఇవి పుణ్యము చేసికొన్నవారికి లభించును.

ఉ. కమ్మనిదండలున్ సురఁటిగాడ్పులు వెన్నెలయుం బరాగపుం
జమ్మును మంచిగందమును సన్నపువల్వలు సీధుపానముం
దమ్మికొలంకు మేడయును దామరసాక్షు లనంగ నొప్పుభో
గమ్ములు పుణ్యవంతులకుఁ గాని లభింప వటంద్రు వేసవిన్.

వ్యా.—స్రజ ఇతి.—హృద్యామోదా మనోహరగన్ధాః, స్రజః పుష్పమాలికా శ్చ, వ్యజన పవన స్తాళవృన్త సమీరణ శ్చ - ని. 'వ్యజనం తాళవృన్తక మి' త్యమరః, చన్ద్రకిరణా శ్చ, పరాగ స్సుమనో రజ శ్చ, కాసారః క్రీడాసర శ్చ, మలయజరజ శ్చన్దనక్షోద శ్చ ; విశదం నిర్మలం, శేరతే అనే నేతి శీధు మద్యం చ * 'శీఙో ధుక్' ఇత్యౌణాదికో ధుక్ప్రత్యయః, శుచి శ్శుభ్రః - విహారయోగ్య ఇత్యర్థః, సౌధోత్సఙ్గః - ప్రాసాదోపరిప్రదేశ శ్చ, ప్రతను వసనం సూక్ష్మామ్బరం, పఙ్కజదృశః పద్మపలాశలోచనా, శ్చే త్యే తత్సర్వం భోగసాధనమ్ * 'నపుంసకమ్ -' ఇత్యాదినా నపుంసకైకశేషః, నిదాఘర్తౌ గ్రీష్మర్తౌ * 'ఆద్గుణః', విలసతి విజృమ్భమాణే సతి సుకృతినః పుణ్యశాలినః, లభన్తే ప్రాప్నువన్తి, కథ మసుకృతినా మీదృగ్భోగసాధనలాభ ఇతి భావః. శిఖరిణీ.

———

సుధాశుభ్రం ధామ, స్ఫురదమలరశ్మిః శశధరః,
ప్రియావక్త్రామ్భోజం, మలయజరస శ్చాతిసురభిః,
స్రజో హృద్యామోదా స్తదిద మఖిలం రాగిణి జనే
కరో త్యన్తఃక్షోభం, న తు విషయసంసర్గవిముఖే. 89.

టీక.—సుధా శుభ్రం = గచ్చుచే తెల్లనైన, ధామ = ఇల్లు, స్ఫురత్ అమల రశ్మిః = వెలుఁగుచున్న తెల్లని కిరణములుగల, శశధరః చంద్రుఁడు, ప్రియా వక్త్ర అమ్భోజం = కాంతయొక్క మోముఁ దామర, అతి సురభిః = మిక్కిలి వలచుచున్న - మలయజ రసః = చందన ద్రవము, హృద్య ఆమోదాః = మనోహరమైన తావిగల, స్రజః = పూదండలు, అనెడి, తత్ ఇదమ్ అఖిలం = ఆ యీ సర్వము, రాగిణి = రాగముగల, జనే = మనుష్యునికి, అన్తః క్షోభం = మనసునందలి కలఁతను, కరోతి = చేయును,

విష...ముఖే తు - విషయ సంసర్గ = విషయములతోడి సంబంధమునుండి - విముఖే తు = పెడమొగముగలవాని కన్ననో, న (కరోతి) = చేయదు.

తా.—పాలగచ్చు గృహము, చక్కఁగా వెన్నెల గాయుచున్న చంద్రుఁడును, తామరవంటి కాంతాముఖము, మిక్కిలి పరిమళించు గందపు ద్రవము, పూదండలును, ఇవి యన్నియు రక్తుని మనస్సును గలంచునే కాని, విరక్తునిఁ గలంపఁజాలవు.

తే. కలువచెలియును బూవుదండలును మంచి । గందమును నేలిసౌధంబుఁ గలికిమోముఁ.
గాముకునకు వికారంబు గలుగఁజేయుఁ । గలఁక వాటింప వెపుడు నిష్కాముననును.

వ్యా.—సుధే తి.—సుధయా లేపనద్రవ్యేణ శుభ్రమ్, యద్వా సుధా అమృతం తద్వ చ్ఛుభ్రమ్- 'సుధా స్యాల్లేపన ద్రవ్యేఽమృతే చ' ఇతి విశ్వః, అతిసురభి అత్యన్తసుగన్ధి, రాగిణి విషయాసక్తే, విషయసంసర్గవిముఖే విరక్తే - విరక్తస్య తేషామకిఞ్చిత్కరత్వా దితి భావః, నిగద వ్యాఖ్యాన మన్యత్. వృత్తం పూర్వవత్.

---

అవ.—వర్షాకాలము.

తరుణీ వైషా దీపితకామా । వికసితజాతీపుష్పసుగన్ధిః
ఉన్నతపీనపయోధరభారా । ప్రావృట్ తనుతే కస్య న హర్షమ్.

టీక.—దీపితకామా = రేఁపఁబడినకామము గలదియు, విక...గన్ధిః = వికసిత = విరిసిన - జాతీ పుష్ప = జాజి పూలచేత - సుగన్ధిః = తావిగలదియు, ఉన్న...భారాః- ఉన్నత = పొడవైన - పీన = బలిసిన - పయోధర = మేఘముల యొక్క (అని వర్షాపరము) పాలిండ్లయొక్క (అనితరుణీపరము) - భారా = బరువుగలదియు, (అగు), ఏషా ప్రావట్ = ఈ వానకాలము, తరుణీ ఇవ = జవ్వని వలె, కస్య = ఎవనికి, హర్షం = సంతోషమును, న తనుతే = చేయదు.

తా.— ఈ వర్షర్తువు రతీచ్ఛను పురికొల్పుచు, విరిసిన జాజిపువ్వులతావులు వెదచల్లుచు, పొడవయిన గొప్ప పయోధరములు (మబ్బులు, స్తనములు) గలదై, తరుణియుంబోలె సంతోషము గలిగించుచున్నది.

క. కామోద్దీపకయు సము । ద్దామపయోధరవిరాజితయు జాతిసుమ
స్తోమసుగంధియు నై స । ర్వామోద మొనర్చుఁ బ్రావృడంగన భళిరే.

వ్యా.—అథ వర్షాసమయవర్ణన మారభతే - తరు ణీతి.—ఉద్దీపిత ఉత్పాదితః- కామో మన్మథః సురతాఽభిలాషో వా-యయా సా తథోక్తా, వికసన్తి వికస్వరాణి- యాని జాతిపుష్పాణి తైః-శోభనో గన్ధో యస్యా స్సా తథోక్తా-ఏకత్ర జాతీకుసుమవికాస సంభవాత్ - అన్యత్ర తత్కుసుమాలంకృతత్వా చ్చే తి భావః * 'గన్ధ స్యేదుత్పూతి సుసురభిభ్యః' ఇతి గన్ధశబ్దస్య ఇకారోఽన్తాదేశః, య ద్యపి 'గన్ధశబ్ద స్యేత్వే



త దేకాన్తగ్రహణమ్' ఇత్యుక్తమ్-తథాఽపి కవీనాం నిరఙ్కుశత్వా త్ప్రయోగః, ఉన్నత ఉత్తుఙ్గః - పీనః పీవర శ్చ - పయోధరభారోఽమ్భోధరబృన్దం చ - అన్యత్ర స్తనభర శ్చ - యస్యాః సా తథోక్తా - ని. 'స్తనామ్భుదౌ పయోధరౌ' ఇతి వైజయన్తీ, అత ఏవ తరుణ్యా వేష ఇవ వేషో యస్యాః సా కామినీవ మోహనకారి ణీత్యర్థః, ప్రావృడ్ వర్షాః, కస్య పుంసో, హర్షం సంభోగౌత్సుక్యం, న తనుతే సర్వస్యాపి తనుతఏ వే త్యర్థః. శ్లేషానుప్రాణి తేయ ముపమా.

---

వియ దుపచితమేఘం భూమయః కన్దలిన్యో,
నవకుటజ కదమ్బామోదినో గన్ధవాహాః,
శిఖికుల కల కేకారావ రమ్యా వనాన్తాః,
సుఖిన మసుఖినం వా సర్వ ముత్కణ్ఠయన్తి. 91.

టీక.—ఉపచిత మేఘం = బలిసిన మబ్బులుగల, వియత్ = ఆకాశమును, కన్దలిన్యః = మొలకలుగల - భూమయః = నేలలును, నవ...మోదినః - నవ = క్రొత్తలైన - కుటజ = కొండమల్లెలయొక్కయు - కదమ్బ = కడప పువ్వులయొక్కయు - ఆమోదినః = పరిమళములుగల, గన్ధవాహాః = తెమ్మెరలును, శిఖి...రమ్యాః - శిఖి కుల = నెమళ్ల సమూహములయొక్క - కల = అవ్యక్త మధురమైన - కేకా రావ = కూఁతల ధ్వనిచేత - రమ్యాః = మనోహరములైన, వన అన్తాః = అడవి స్థలములును, సుఖినం = సుఖవంతుని, అసుఖినం వా = సుఖహీనునినిఁ గాని, సర్వం = ప్రతి వానిని, ఉత్కణ్ఠయన్తి = వలపు గొలుపుచున్నవి.

తా.—వర్షర్తువులో నల్లమబ్బుల వరుసలతోడి యాకాశమును, పొటమరించిన మొలకలతోడి నేలలును, క్రొత్తగా పుట్టిన కొండమల్లె పువ్వులయొక్కయును అట్టివే అగు కడపపువ్వులయొక్కయు తావులను వెదచల్లుచున్న వాయువులును, నెమళ్లగుంపులకేకలచే నింపారు నడవిపట్టులును, వియుక్తులకును సంయుక్తులకును ఎల్లవారికిని కామాతురతం గలిగించుచున్నవి.

చ. జలధరమాలికాఖచితచారునభంబు నవాంకురప్రభా
లలితమహీతలంబును గలస్వనకేకికులోల్లసద్వన
స్థలములు జాతి నీప కుటజ స్ఫుటగంధిలగంధవాహముల్
నెలకొని యెల్లవారలకు నిండుముదంబు ఘటించె నత్తఱిన్.

వ్యా.— వియ దితి.— ఉపచితాః పరిచితా-మేఘా యస్మిం స్త త్తథోక్తమ్ ఘనాఘనసంచారవ ది త్యర్థః, వియత్ ఆకాశం చ, కన్దలాని అఙ్కురాణి ఆసాం స

స్తీతి కన్దలిన్యో, భూమయో భూప్రదేశా శ్చ, నవో నూతనః - కుటజానాం గిరిమల్లికానాం-కదమ్బానాం నీప కుసుమానాం చ-ఆమోదో గన్ధవిశేష ఏషామ స్తీతి తథోక్తా, గన్ధవాహాః ఉద్యానపవనా శ్చ-ని. 'కుటజో గిరిమల్లికా' ఇత్యమరః, కేమూర్ధ్ని కాయ న్తి ధ్వనయ న్తి కేకా మయూరవాణ్యః - ని. 'కేకా వాణీ మయూరస్య' ఇత్యమరః - శిఖికులానాం మయూర నికరాణాం-యాః కలకేకారావా అవ్యక్త మధురకేకాస్వరా-స్తై రమ్యా మనోహరా, వనాన్తా శ్చ కేళీ వనమధ్యప్రదేశా శ్చ, సుఖినం, దుఃఖినం వా, సర్వమ్ అశేషం జనమ్, ఉత్కణ్ఠయ న్తి సంభోగాత్సుక్యవ న్తం కుర్వ న్తీ త్యర్థః - ఉద్దీపకత్వా దితి భావః, ఉత్కణ్ఠ శబ్దాత్ * 'తత్కరోతి-' ఇతి ణ్యన్తా ల్లట్. మాలినీ.

---

ఉపరి ఘనం ఘనపటలం, । తిర్య గ్గిరయోఽపి నర్తితమయూరాః,
క్షితి రపి కన్దళధవళా, । దృష్టిం పథికః క్వ పాతయతి! 92.

టీక.—ఉపరి = పైని, ఘనం = దట్టమైన, ఘన పటలం = మేఘ సమూహము, (కలదు), తిర్యక్ = అడ్డముగ (చుట్టురా), నర్తితమయూరాః - నర్తిత = ఆడింపఁబడిన - మయూరాః = నెమళ్లుగల, గిరయః అపి = పర్వతములు ను, (కలవు), క్షితి రపి = నేలయు, కన్దళ ధవళా = మొకలకలచే సిత తెల్లనిది ; పథికః = బాటసారి, దృష్టిం = చూపును, క్వ పాతయతి = ఎక్కడ వైచును.

తా.—ఈ ఋతువులో, భార్యను ఇంటవదలి పనిమీఁద దేశాంతరసంచారము సేయుచున్న బాటసారికి ఎటుచూచినను విరహోద్దీపకములే గుండె యగల్చుచున్నవి; ఎట్లన;—పైని దట్టంపునల్లమబ్బులు, చుట్టును కొండలమీఁద ఆడుచున్న నెమళ్లు, క్రింద మొలకలచే తెల్లగా ప్రకాశించుచున్న భూమియు; పాపము! అతఁడు చూపును ఎచ్చట వైవఁగలఁడు?

తే. మీఁద మబ్బులమోసులు మిసిమిమాపఁ, । బుడమియును గందళమ్ములఁ బొదల, నాడు
నెమ్మిగమితోడ దెసల శైలమ్ము లుండ । విరహిజనుఁ డెందుఁ దనదృష్టి విరియఁజేయు!

వ్యా.—ఉపరీ తి.—ఉపరి ఉపరిష్టా, ద్ఘనం సాన్ద్రం, ఘనపటలం మేఘబృన్దమ్, వర్తత ఇతి శేషః - ని. 'ఘనాః కఠిన సఙ్ఘాత మేఘకాఠిన్య ముద్గరాః' ఇతి వైజయ న్తీ, తిర్యగ్ దిక్షు ఇత్యర్థః, మహ్యా మతిశయేన రమ న్త ఇతి మయూరాః * పృషోదరాదిత్వా త్సాధుః, నర్తితా నృత్య న్తః స్వార్థే ణిచి * 'గత్యర్థాకర్మక-' ఇత్యాదినా వర్తమానే కర్తరి క్తః * 'మతిబుద్ధి-' ఇతి వర్తమానతా-యద్వా నర్తితా మేఘబృన్దేన నాటితాః-మేఘోదయే తేషాం ఉల్లాసవశేన నాట్యసంభవాత్-తథాభూతా మయూరా యేషు తే తథోక్తా, గిరయోఽపి, వర్త న్త ఇతి శేషః, క్షితి రపి భూమి రపి, కన్దలై ర్నానా



విధాఙ్కురై - ర్ధవలా స్వచ్ఛా, అతః పన్థానం గచ్ఛ తీతి పథికః పాన్థః * 'పథః ష్కన్' ఇతి ష్కన్ప్రత్యయః, దృష్టిం, క్వ కుత్ర, పాతయతి - ప్రసారయతి న కుత్రా పీ త్యర్థః - సర్వత్రా ప్యుద్దీపనసంభవా దితి భావః, మహ త్కష్ట మత్ర విరహిణా మితి పరమార్థః. ఆర్యాభేదః.

---

ఇతో విద్యుద్వల్లీవిలసిత, మితః కేతకితరోః
స్ఫుర న్గన్ధః, ప్రోద్యజ్జలదనినదస్ఫూర్జిత మితః,
ఇతః కేకిక్రీడాకలకలరవః, పక్ష్మలదృశాం
కథం యాస్య న్త్యేతే విరహదివసాః సంభృతరసాః! 93.

టీక.—ఇతః = ఈవైపున, విద్యు...సితం - విద్యుద్వల్లీ = మెఱపుఁదీఁగయొక్క - విలసితం = మెఱయుట, ఇతః, కేతకి తరోః = మొగలి చెట్టుయొక్క, స్ఫురన్ = వ్యాపించుచున్న, గన్ధః = పరిమళము, ఇతః, ప్రోద్య...ర్జితం - ప్రోద్యత్ = లేచుచున్న - జలద = మబ్బుయొక్క - నినద = ధ్వనియొక్క - స్ఫూర్జితం = మ్రోఁత, ఇతః, కేకి...రవః - కేకి = నెమళ్లయొక్క - క్రీడా = ఆటలయందలి - కలకలరవః = అల్లరి ధ్వని, కాఁబట్టి, సంభృతరసాః - సంభృత = నిండిన - రసాః = శృంగారరసముగల, ఏతే విరహ దివసాః ఈ వియోగదినములు, పక్ష్మలదృశాం = దట్టపు ఱెప్పల కన్నులుగల స్త్రీలకు, కథం = ఎట్లు, యాస్యన్తి = కడచును.

తా.—మెఱపు లొకచోట మెఱయుచున్నవి, మొగలిపూవుల తావి యొట పర్వుచున్నది, ఈ వైపున మబ్బులు లేచి యుఱుముచున్నవి, ఇచట నెమళ్లు ఆడుచు చెవులు గింగురనం గేకలు వెట్టుచున్నవి; (ఇవి యన్నియు విరహతాపోద్దీకములు;) వీని ముందఱ రసోత్తరంగము లగు నీ దినములలో జవరాండ్రు బ్రదుకుట కష్టము.

ఉ. ఇక్కడఁ గ్రొమ్మెఱుంగుఁగదివె లిక్కడఁ గేతకిగంధవైభవం
బిక్కడ భూరిగర్జితము లిక్కడ మత్తమయూరనిస్వనం
బక్కట యీరసోజ్జ్వలము లైనదినంబులు మన్మథార్తి వెం
పెక్కువియోగినీజనుల కెట్లు చనం గల వెన్ని చూడఁగన్!

వ్యా.—ఇత ఇతి.—ఇతోఽస్మిన్ప్రదేశే, విద్యుద్వల్లీనాం తడిల్లతానాం-విలసితం స్ఫురణమ్, భవ తీతి శేషః, ఇతః ప్రదేశే, కేతకితరోః కేతక్యాఖ్యవృక్షస్య-తత్కుసుమ స్యే త్యర్థః * 'ఙ్యాపోః సంజ్ఞాచ్ఛన్దసో ర్బహులమ్' ఇతి హ్రస్వః - కాళిదాస ఇతివత్, స్ఫుర న్వ్యాప్నువానో, గన్ధ శ్చ, వర్తత ఇతి శేషః, ఇతః ప్రోద్యత్ప్రవృద్ధం, జలదనినదస్య మేఘగర్జితస్య-స్ఫూర్జితం ఆరవం చ, భవ తీతి శేషః, ఇత శ్చ కేకినాం

శిఖావలానాం - క్రీడాసు కేలిషు - యః కలకలరవః కోలాహలధ్వనిః - ని.'శిఖావలః శిఖీ కేకీ' 'కోలాహలః కలకలః' ఇతి చామరః, యద్వా కలకలరవః అత్య న్తావ్యక్త మధురప్రకార స్వన శ్చ, సముజ్జృమ్భత ఇతి శేషః, పక్ష్మా ణ్యాసాం స న్తీతి పక్ష్మలాః * సిధ్మాదిత్వా ల్లచ్ప్రత్యయః - తథాభూతా దృశో యాసాం తాసాం పారిప్లవలోచనానామ్, ఏతేప్రసిద్ధాః, సంభృతరసాః సంపూర్ణశృఙ్గారాః - ఉద్దీపకా ఇత్యర్థః, విరహదివసా వియుక్తవాసరాః, కథం-యాస్య న్తి అతిక్రమిష్య న్తి - న కథంచి ద పీ త్యర్థః, దురన్తత్వా ద్దిన మేకం యుగం భవిష్య తీతి భావః. శిఖరిణీ వృత్తమ్.

---

అనూచీసఞ్చారే తమసి, నభసి ప్రౌఢజలద
ధ్వనిప్రాజ్ఞమ్మన్యే, పతతి పృషతానాం చ నిచయే,
ఇదం సౌదామన్యాః కనకకమనీయం విలసితం
ముదం చ మ్లానిం చ ప్రథయతి పథి స్వైరసుదృశామ్. 94.

టీక.—తమసి = చీఁకటి, అనూచీ సఞ్చారే సతి = సూది చలనములేనిది అగుచుండఁగా, నభసి = ఆకాశము, ప్రౌఢ...మన్యే సతి - ప్రౌఢ = బిగ్గరమైన - జలద ధ్వని = మేఘ శబ్దముచేత - ప్రాజ్ఞమ్మన్యే = తన్ను నేర్పరినిగా తలఁచుకొనునది యగుచుండఁగా, పృషతానాం = చినుకులయొక్క, నిచయే = సమూహము, పతతి సతి = పడు చుండఁగా, కనకకమనీయం - కనక = బంగారమువలె - కమనీయం = సొంపయిన, సౌదామన్యాః = మెఱుపుయొక్క, ఇదం విలసితం = ఈ మెఱయుట, స్వైర సుదృశాం = స్వతంత్ర స్త్రీలకు (అభిసారికలకు), పథి = దారిలో, ముదం చ = (దారిచూపుటచే) సంతోషమును, మ్లానిం చ = (తమ్ము ఇతరులకు చూపుటచే) ఖేదమును, ప్రథయతి – ప్రకటించుచున్నది.

తా.—సూది చలించుటకేనియు ఎడము లేనంత దట్టముగా చీఁకటి వ్యాపించియుండఁగా, ఆకాశము మేఘముల యుఱుముచే ప్రజ్ఞాగర్వపూర్వకముగా ప్రసంగించుచున్నట్లు అగపడుచుండఁగా, చినుకులధారలు రాలుచుండఁగా, ఈ మెఱుపు మెఱసి బంగారపు గీటువలె రంగారుచు అభిసారికలకు దారిచూపి సంతోషమును వారిగుట్టు బయట వేసి ఖేదమును కలిగించుచున్నది.

చ. ఘనతిమిరంబు సూది కవకాశ మొసంగమి, మీఁద వారిద
స్వనముల మిన్ను పిక్కటిల, వారికణంబులు రాలుచుండఁగాఁ,
గనకపురేఖలం దెగడు కాఱుమెఱుంగులు, జారకామినీ
జనములకున్ ముదంబును విషాదమునుం బ్రకటించెఁ ద్రోవలన్.



వ్యా.—అనూచీ తి.—తమసి అన్ధకారే, న విద్యతే సూచీసంచారో యస్మిం స్తస్మి న్సూచ్యగ్రమాత్ర స్యా ప్యనవకాశప్రదే - గాఢతమే స తీతి యావత్, తథా, నభసి అన్తరిక్షే చ, ప్రౌఢః ప్రగల్భః - గమ్భీర ఇతి యావత్ - యో - జలదధ్వని ర్మేఘగర్జితం- తేన - ప్రాజ్ఞం వాచాల మాత్మానం మన్యత ఇతి ప్రాజ్ఞమ్మన్యే - బహులతర మేఘనిర్హ్రాదవతి స తీ త్యర్థః * 'ఆత్మమానే ఖశ్చ' ఇతి ఖశి ముమాగమః, తథా పృషతానాం బిన్దూనాం చ- నిచయే సన్దోహే- పతతి సతి - ని. 'పృష న్తి బిన్దుపృషతౌ' ఇ త్యమరః, కనక కమనీయం కనకనికషణరేఖా సున్దర, మిదం ప్రవర్తమానం, సౌదామన్యా విద్యుతః- ని. 'తడి త్సౌదామనీ విద్యుత్' ఇత్యమరః, విలసితం స్ఫురణం (కర్తృ), స్వైరసుదృశాం అభిసారికాణాం, పథి ప్రియగృహమార్గే, ముదం మార్గప్రదర్శకత్వా త్సంతోషం, మ్లానిమ్ ఆత్మప్రకాశనహేతుత్వాత్ మ్లానిం చ * 'గ్లై మ్లై హర్షక్షయే' ఇ త్యాస్మాద్ధాతోః 'వీజ్యాజ్వరిభ్యో నిః' ఇ త్యౌణాదికో నిప్రత్యయః, ప్రథయతి ప్రకటయతి కరోతీ త్యర్థః, 'కాన్తాభిసరణోద్యుక్తా స్మరార్తా సాభిసారికా' ఇతి లక్షణాత్ కాన్త ముద్దిశ్య నిగూఢ మభిసరణశీలానాం స్త్రీణా ముపయోగానుపయోగాభ్యాం హర్షాహర్ష హేతుత్వా దితి భావః - ని. 'కాన్తార్థినీ తు యా యాతి సంకేతం సాఽభిసారికా' ఇ త్యమరః.

వృత్తం పూర్వవత్.

---

ఆసారేణ న హర్మ్యతః ప్రియతమై ర్యాతుం బహిః శక్యతే,
శీతోత్కమ్పనిమిత్త మాయతదృశా గాఢం సమాలిఙ్గ్యతే,
జాతాః శీకరశీతలా శ్చ మరుతో రత్యన్తఖేదచ్ఛిదో,
ధన్యానాం బత దుర్దినం సుదినతాం యాతి ప్రియాసఙ్గమే. 95.

టీక.—ప్రియతమైః = వల్లభులకు, ఆసారేణ = జడిచేత, హర్మ్యతః = మేడనుండి, బహిః = వెలుపలికి, యాతుం = పోవుటకు, న శక్యతే = అలవి కాదు, ఆయతదృశా = * నిడుదకన్నుల చెలువ, శీత ఉత్కమ్ప నిమిత్తం = చలిచేతనైన వడఁకు మూలముగా, గాఢం = బిగువుగా, సమాలిఙ్గ్యతే = * కౌఁగిలించుచున్నది, శీకరశీతలాః = తుంపరలచే చల్లనయిన, మరుత శ్చ = వాయువులును, రత్య...చ్ఛిదః - రతి అన్త = మరుకేళి కడపటి - ఖేద = అలయికను - ఛిదః = త్రుంచునవి, జాతాః = అయినవి; (ఇట్లు), బత = ఆహా, ధన్యానాం = పుణ్యవంతులకు, ప్రియా సఙ్గమే సతి = కాంతతోఁ పొందు ఉండఁగా, దుర్దినం = చెడుదినమైనను (మబ్బు క్రమ్మిన దినమైనను అని శ్లేష), సుదినతాం = మంచిదినమగుటను, యాతి = పొందుచున్నది.

తా.—జడిచే ప్రియతములు మేడవదలి బయటికి పోలేరు; చలివలనివణఁకు మూలమున వారిని ప్రియతమలు బిగువుగా కౌఁగిలించుకొనుచున్నారు; రత్యంతమందలి యలయికను తుంపురులతోఁడి చల్లగాలి పోఁగొట్టుచున్నది; ఈవిధమున ప్రియలతోఁడిపొందు గలుగుటం బట్టి పుణ్యవంతులకు మబ్బు గ్రమ్మినచెడుదినముసయితము మంచిదినమే అయినది.

ఉ. కేరుచు మేడనుండి వెలికిం జన శక్యము గాకయుండె నా
సారముచేత, శీతమున జవ్వని కౌఁగిలి గట్టె, శీకరో
దారసమీరణంబు సురతశ్రమవారణ మయ్యె, దుర్దినం
బారయ నయ్యెడన్ సుదిన మయ్యెఁ గృతార్థుల కంగనారతిన్.

వ్యా.— ఆసారే ణేతి.— ప్రియతమైః ర్వల్లభైః, ఆసారేణ ధారాసంపాతేన హేతునా - ని. 'ధారా సంపాత ఆసారః' ఇ త్యమరః, హర్మ్యతః ప్రాసాదాత్ -'ధామతః' ఇతి పాఠే గృహాత్-ఉభయత్రాపి * పఞ్చమ్యా స్తసిల్- 'అప పరి బహి రి' త్యాదినా సమాసవిధాన జ్ఞాపకాత్ బహిర్యోగే పఞ్చమీ, బహి ర్యాతుం, న శక్యతే న సమర్థ్యతే - 'శక్ల శక్తౌ' - భావే లట్ - 'శకధృష' ఇ త్యాదినా తుమున్ ప్రత్యయః, తదా ఆయతదృశా దీర్ఘదృశా తరుణ్యా, శీతేన- య ఉత్కమ్పో గాత్రవేపథు- స్తన్నిమిత్తమ్ - తన్నివారణార్థ మిత్యర్థః, గాఢ మతిదృఢం, సమాలిఙ్గ్యతే పరిరభ్యతే- పూర్వవ ల్లట్, తథా, శీకరై రమ్బుకణైః-శీతలాః శిశిరాః - ని. 'శీకరోఽమ్బుకణః స్మృతః' ఇ త్యమరః, రత్యన్తే సురతావసానే - యః ఖేదః శ్రమ - స్తం ఛిన్ద న్తీతి తథోక్తాః- సంరమ్భజనితశ్రమాపహారిణ ఇ త్యర్థః-'శ్రమః ఖేదోఽథ రత్యాదే ర్జాతః స్వేదాలిభూమికృత్' ఇతి లక్షణాత్, మరుత శ్చ, జాతాః ప్రసృతాః, అతః, ధన్యానాం పుణ్యశాలినాం, ప్రియాసఙ్గమే ప్రియాసంభోగే సతి, దుర్దినం దుష్టదిన మపి మేఘచ్ఛన్నదినం చ - ని. 'మేఘచ్ఛన్నేఽహ్ని దుర్దినమ్' ఇ త్యమరః, సుదినతాం సుదివసత్వం యాతి, అన్యేషాం తు త దేవ భవ తీ త్యర్థః, బ తేతి విస్మయే - ని. 'బత ఖేదానుకమ్పామన్త్రణ సంతోషవిస్మయే' ఇ త్యభిధానాత్.

అత్ర దుర్దిన మపి సుదినతాం యా తీతి స్ఫురతో విరోధ స్యోక్తసమాధానాద్విరోధాభాసోఽలఙ్కారః - 'ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఇష్యతే' ఇతి లక్షణాత్. శార్దూల విక్రీడితమ్.

---

అర్ధం సుప్త్వా నిశాయాః సరభససురతాయాసనన్నశ్లథాఙ్గః
ప్రోద్భూతాసహ్యతృష్ణో మధుమదనిరతో హర్మ్యపృష్ఠే వివిక్తే



సమ్భోగక్లాన్తకాన్తాశిథిలభుజలతావర్జితం కర్కరీతో
జ్యోత్స్నాభిన్నాచ్ఛధారం పిబతి న సలిలం శారదం మన్దపుణ్యః.

టీక.—నిశాయాః = రాత్రియొక్క, అర్ధం = సగము, సుప్త్వా = నిద్రించి, సరభ...థాఙ్గః - స రభస = వేగముతోఁ గూడిన - సురత = సంభోగముయొక్క-ఆయాస = బడలికచేత - సన్న = సోలిన - శ్లథ = సడలిన - అఙ్గః = అవయవములు గలవాఁడును, ప్ర ఉద్భూత = స్ఫుటముగా కలిగినట్టి - అసహ్య=సహింపరాని - తృష్ణః= దప్పిగలవాఁడును, మధు...తః - మధు = మద్యముచేతనైన - మద = కైపుచేత - నిరతః=వివశుఁడును, (అయి), హర్మ్యపృష్ఠే = మేడమీఁద, వివిక్తే = ఏకాంతమందు, కర్కరీతః = గిండినుండి, సమ్భోగ...వర్జితం - సమ్భోగ = రతిచేత - క్లాన్త=అలసిన- కాన్తా = ప్రియయొక్క - శిథిల = సడలిన - భుజ లతా = తీఁగవంటి బుజముచేత - ఆవర్జితం = వంపఁబడిన, సలిలం = నీటిని, శారదం = శరత్కాలమునకు సంబంధించినదానిని, జ్యోత్స్నా...ధారం - జ్యోత్స్నా = వెన్నెలచేత - భిన్న = మిశ్రమయిన- అచ్ఛ = తెల్లని - ధారం = ధారకలదానిని, మన్దపుణ్యః = అల్పపుణ్యుఁడు, న పిబతి= త్రాగఁడు.

తా.—శరత్కాలమందు మేడపయిప్రదేశమున అర్ధరాత్రమువఱకు నిద్రించి యనంతరము సురాపానమదయోగముతో వెన్నెలలో ప్రియకామినిం బొంది యలసి మిగుల డప్పిగొన్నవాఁడై సంభోగక్లాంత ఆప్రియ గరిగనుండి వంచినశరత్కాలజలమును వెన్నెల ప్రతిబింబముచే తెల్లగా ప్రకాశించుచున్నదానిని త్రాగునట్టిభాగ్యము మహాపుణ్యునికే గాని సామాన్యునికి అబ్బదు.—శారదరాత్రులు మిక్కిలి మిథునభోగ్యము లని భా.

చ. ప్రియముగ రే సగంబు నిదురించి, నితాంతరతాంతవిహ్వలుం
డయి దగఁ జెంది, యాసవ మదాలసుఁడై రతిఖిన్న కామినీ
శయమునఁ గర్కరీగళిత చంద్రవిభాచ్ఛశరజ్జలంబు లా
రయఁ గృతపుణ్యుఁ డిం పెసఁగఁ ద్రాగు రహస్థితసౌధసీమలన్.

వ్యా.—అ థైకేన శరదం వర్ణయతి - అర్ధ మితి.—నిశాయాః రాత్రేః అర్ధమ్- యామద్వయ మి త్యర్థః - ని. 'పుం స్యర్ధోఽర్ధం సమేంఽశక' ఇ త్యమరః * అత్యన్తసంయోగే ద్వితీయా, సుప్త్వా శయిత్వా-నిద్రయా యామద్వయం గమయి త్వే త్యర్థః, తతః మధ్యే ఇతి శేషః, సరభసం సోద్వేగం - య త్సురత మాభ్యన్తరసంభోగః - తేన-య - ఆయాసః శ్రమ - స్తేన-సన్నాని పరిఖిన్నాని - అత ఏవ - శ్లథాని శిథిలాని- అఙ్గా న్యవయవా - యస్య స త థోక్తః -

'మధ్యం నక్త ముదాహృతం శరది చ ప్రత్యూషకాలో హిమే.'

ఇతి భోజవచనా దర్ధరాత్రకృతసురతపరిశ్రాన్త ఇ త్యర్థః - ఏతే నైతస్య నాయకస్య

కామతన్త్రకుశలత్వం నాయికాయాః శఙ్ఖినీత్వం సూచ్యతే - తృతీయయామస్య తత్సురతయోగ్యకాలత్వాత్ - తదుక్తం రతిరహస్యే -

'రమయతి చ తృతీయే శఙ్ఖినీ, మార్దవభావం
గమయతి రమణీయాం పద్మినీం తుర్యయామే.' ఇతి -

అన్యత్రాప్యుక్తం -

'కుసుమితవనమధ్యే కూచిమార స్తృతీయే
తిమిరనిబిడయామే శఙ్ఖినీం సంలభేత.' ఇతి,

అత ఏవ ప్రోద్భూతా ప్రకర్షేణోత్పన్నా - అత ఏవాసహ్యా స్వతః శమయితు మశక్యా - తృష్ణా పిపాసా - యస్య స తథోక్తః, తథా, మధునా సంభోగప్రాక్కాలీనమద్యపానేన - యో మదో మోహ - స్తేన నిరతః పరవశ ఇత్యర్థః - 'మదిరాదికృతో మోహో హర్షవ్యతికరో మద' ఇతి లక్షణాత్, వివిక్తే విజనే - ని. 'వివిక్తౌ పూతవిజనౌ' ఇత్యమరః - అన్యథా విస్రమ్భవిహారానుభవా దితి భావః, హర్మ్యపృష్ఠే ప్రాసాదోపరిప్రదేశే, కర్కరీతః గలన్తికాఖ్యసచ్ఛిద్రకుణ్డికాయాః * పఞ్చమ్యా స్తసిః - ని. 'కర్కర్యాలూ గ్గలన్తికే' త్యమరః, సంభోగక్లాన్తాయా సురతాయాసపరిశ్రాన్తాయాః- కాన్తాయా స్స్వప్రియతమాయాః - శిథిలయా నిస్సహాయా - భుజలతయా - ఆవర్జితం ధారాకారేణ దత్తమితి స్వాదాతిశయోక్తిః, శారదం శరత్కాలసంబన్ధి సలిలం హంసోదక మిత్యర్థః, జ్యోత్స్నయా చన్ద్రికయా - భిన్నా మిళితా - అత ఏవాచ్ఛా ధారా యస్మిన్ కర్మణి తద్యథా తథా, మన్దపుణ్యో భాగ్యహీనో-న పిబతి - భాగ్యసంపన్న స్తు పిబతీ త్యర్థః ; హంసోదకలక్షణ ముక్తం ద్రవ్యరత్నమాలాయామ్ -

'అహ్నితప్త మహిమాంశురశ్మిభి శ్శీత మమ్బు శశిరశ్మిభి ర్నిశి
ఏవమేవ తదహర్నిశం స్థితం తచ్ఛహంస జలనామకం స్మృతమ్.' ఇతి -

ఏతత్పానే గుణసంపత్తి రపి తత్రైవోక్తా -

'ప్రసాదకం త్రిదోషఘ్నం హృద్యం లఘు చ శీతలం
వృష్యం మనోహరం స్వాదు విషఘ్నం కాన్తికృ త్పరమ్.' ఇతి

శరద్యేతత్పానే నియమ శ్చా ప్యుక్తోఽన్యత్ర -

'కర్పూరాగరుజం (?) సితాద్యభిరసై ర్హంసోదకం వాసితం
సౌధం చాతిమనోహరం శిశిరతో ముగ్ధాఙ్గనాలిఙ్గనమ్.' స్రగ్ధరావృత్తమ్.

---

హేమన్తే దధిదుగ్ధసర్పిరశనా మాఞ్జిష్ఠవాసోభృతః
కాశ్మీరద్రవసాన్ద్రదిగ్ధవపుషః ఖిన్నా విచిత్రై రతైః



వృత్తోరుస్తనకామినీజనకృతాశ్లేషా గృహాభ్యన్తరే
తామ్బూలీదళపూగపూరితముఖా ధన్యాః సుఖం శేరతే. 97.

టీక.—హేమన్తే = మంచుకాలమందు, దధి...రశనాః - దధి = పెరుఁగు - దుగ్ధ = పాలు - సర్పిః = నేయియు - అశనాః = భోజనముగాఁ గలవారును, మాఞ్జి...భృతః - మాఞ్జిష్ఠ = చెంగావి - వాసః = వస్త్రములను - భృతః = ధరించువారును, కాశ్మీ...వపుషః - కాశ్మీర ద్రవ = కుంకుమ మైపూఁతచే - సాన్ద్ర = దట్టముగా - దిగ్ధ = పూయఁబడిన - వపుషః = ఒడలుగలవారును, విచిత్రైః = వింతలైన, రతైః = రతులచేత, ఖిన్నాః = అలసినవారును, వృత్తో...శ్లేషాః = వృత్త = బటువయిన - ఉరు = గొప్ప - స్తన = చన్నులుగల - కామినీజన = వలపుకత్తెలచేత - కృత = చేయఁబడిన - ఆశ్లేషాః = కౌఁగిలింతలుగలవారును, తామ్బూలీ...ముఖాః - తామ్బూలీ దళ = తమలపాకులతోను - పూగ = పోఁకలతోను - పూరిత = నింపఁబడిన - ముఖాః = నోరుగలవారును, (అయి), ధన్యాః = పుణ్యవంతులు, గృహ అభ్యన్తరే = యింటి లోపల, సుఖం = సుఖముగా, శేరతే = నిద్రింతురు.

తా.— హేమంతకాలమున పాలుపెరుఁగునేతులతో ఆరగించి, చెంగావులు దాల్చి, కుంకుమమైపూఁత లలంది, విచిత్రసురతములచే నలసి, గుండ్రనిపాలిండ్లవలపుకత్తియలబిగికౌఁగిటనే నోట తమ్ములముతోనే గదులలోపల పుణ్యవంతులు సుఖముగా నిద్రింతురు.

చ. ఘృతదధిదుగ్ధభోజన మొగిన్ భుజియించి, సురంగవస్త్రముల్
హితముగఁ దాల్చి, కుంకుమము హెచ్చుగ మేన నలంది, ధన్యు ల
ద్భుతరతిఖిన్నులై విడెము పుక్కిట నుంచి పృథుస్తనాంగనా
కృతపరిరంభులై కడు సుఖింతురు మేడలలోన సీతునన్.

వ్యా.—అథ ద్వాభ్యాం హేమన్తం వర్ణయతి - హేమన్త ఇతి.—హేమన్తే హేమన్తఋతౌ, దధి ప్రసిద్ధం - దుగ్ధసర్పిషీ క్షీరఘృతే - తా న్యశనం యేషాం తే తథోక్తా - నను దుగ్ధాజ్యాదీనాం శైత్యావసాదకత్వేన సేవనం భవతు - దధిసేవనస్య తదతిరేకకరత్వా త్తత్సేవనం కథం యుక్త మితి చేన్న - తస్యాప్యాయుష్కామస్య హేమన్తే సేవనోపయోగాత్ - తదుక్తం చారుచర్యాయా మృతుచర్యా ప్రస్తావే సర్వజ్ఞభోజరాజేన -

'త్రిషు చ దధి నిషేవ్యం గ్రీష్మకాలే వసన్తే
శరది చ, పరివర్జ్యం వాఞ్ఛతా దీర్ఘ మాయుః,
యది ఖలు పరివాఞ్ఛా సేవ్యతాం సర్వకాలం
సహగుడమధుపాత్రే శర్కరాముద్గయూషైః.' ఇతి,

మఞ్జిష్ఠయా రఞ్జకద్రవ్యేణ రక్తాని మాఞ్జిష్ఠాని - వాసాంసి సురక్తవసనాని - బిభ్రతీతి తథోక్తాః * 'తేన రక్తం రాగా ది' త్యణ్ప్రత్యయః - య ద్యపి -

'నిర్వాతం భవనం సురక్తవసనం వహ్నేః పరం సేవనమ్.' ఇతి

వసన్తసమయయోగ్యత్వేన సురక్తవసనధారణ మభిహితం - తథాఽపి మతాన్తరే ఏవ ముక్త మితి న విరోధః, కాశ్మీరద్రవేణ కుఙ్కుమపఙ్కేన - సాన్ద్రం యథా తథా - దిగ్ధాని రూషితాని - వపూంషి యేషాం తే తథోక్తాః, విచిత్రై ర్బాహ్యాభ్యన్తరరూపేణ నానావిధైః, రతైః, ఛిన్నాః శ్రాన్తాః, వృత్తౌ వర్తులౌ - ఊరూ పీనౌ చ - స్తనౌ యాసాం తా స్తథోక్తా - యాః కామిన్య స్తా ఏవ జన - స్తేన కృతాశ్లేషాః విహితపరిరమ్భాః - త దుక్తం -

కస్తూర్యాఽగరుకుఙ్కుమై రతికృతం పానం తటాకస్థితం

శీతం నైవ విదీర్యతే ప్రియతమై రాలిఙ్గనం కమ్బళమ్.' ఇతి,

తథా తామ్బూలీదళై ర్నాగవల్లీదళైః - పూగైః క్రముకై శ్చ - పూరితాని ముఖాని వక్త్రాన్తరాళాని - యేషాం తే తథోక్తా స్తామ్బూలచర్వణరతాః - తత్పరా ఇ త్యర్థః - ని. 'ఘోణ్టా తు పూగః క్రముక' ఇ త్యమరః, ఇత్థంభూతా, ధన్యాః సుకృతినః, గృహాభ్యన్తరే మన్దిరాన్తరాళే, సుఖం యథా తథా, శేరతే స్వపన్తి * శీఙో రు డి' తి రుడాగమః, తామ్బూలస్య మానసోల్లాసాది బహుగుణ హేతుత్వా త్తచ్చర్వణోక్తిః - త దుక్తం చారుచర్యాయాం -

'మనసో హర్షణం శ్రేష్ఠం రతిదం మదకారణమ్,

ముఖరోగహరం హృద్యం దీపనం వస్తిశోధనం

ముఖశోధి క్రిమిహరం తామ్బూలం శ్రీకరం పరమ్.' ఇతి;

తత్కాలానుగుణోపచారత్వేన వీర్యవృద్ధికరత్వేన చ ప్రథమం దధిక్షీరాజ్యప్రాజ్యమృష్టాన్నం భుక్త్వాఽనన్తరం కుఙ్కుమకస్తూర్యాది మిశ్రిత చన్దనలేపన పూర్వకం వివిధ సురతసంరమ్భ సంభోగపరిశ్రాన్తాః కాన్తాసమాలిఙ్గితగాత్రా శ్చ సన్త స్తామ్బూలచర్వణరతాః సుకృతశాలిన స్సుఖేన నివాతగృహాభ్యన్తరే స్వప న్తీతి సముదాయార్థః.

శార్దూల విక్రీడితమ్.

---

ప్రోద్యత్ప్రౌఢప్రియఙ్గుద్యుతిభృతి వికసత్కున్దమాద్యద్ద్విరేఫే

కాలే ప్రాలేయవాతప్రచలవిలసితోదారమన్దార ధామ్ని

యేషాం నో కణ్ఠలగ్నా క్షణ మపి తుహినక్షోదదక్షా మృగాక్షీ

తేషా మాయామయామా యమసదనసమా యామినీ యాతియూనామ్



టీక.—ప్రోద్య...భృతి - ప్రోద్యత్ = వెలివిరియుచున్న - ప్రౌఢ = ముదిసిన - ప్రియఙ్గు = ప్రేంకణపుఁ దీఁగల - ద్యుతి = కాంతిని - భృతి = తాల్చినదియు, విక...రేఫే - వికసత్ = విరియుచున్న - కుంద = మొల్లలచేత - మాద్యత్ = మదించుచున్న - ద్విరేఫే = తుమ్మెదలుగలదియు, ప్రాలేయ...ధామ్ని - ప్రాలేయవాత = మంచుగాలిచేత - ప్రచల = కదలుచున్నట్టి - వికసిత = విరిసిన - ఉదార = రమణీయమయిన - మన్దార = మందారపుష్పములకు - ధామ్ని = తావును, (అగు), కాలే = ఋతువునందు, యేషాం యూనాం = ఏపడుచువాండ్రకు, తుహిన... దక్షా - తుహిన = మంచును - క్షోద = నుగ్గుసేయుటయందు (అనఁగా చలిని పోనడుచుటయందు) - దక్షా = సమర్థయైన, మృగాక్షీ = సుందరి, క్షణ మపి = నిముస మైనను, కణ్ఠలగ్నా - కణ్ఠ = మెడయందు - లగ్నా = దగులుకొన్నది, నో = కాదో, తేషాం = వారికి, యామినీ = రాత్రి, ఆ ... సతీ - ఆయామ = నిడివితోడి - యామా సతీ = జాములుగల - యమ సదన సమా (సతీ) = యమునియింటితో సాటియై, యాతి = జరుగును.

తా.—ముదురు ప్రేంకణలతల కాంతి పర్వుచుండ, విరియుచున్న మొల్లల మకరంద మాని తుమ్మెదలు మత్తిల్లుచుండ, దొడ్డ లగు మందారముకుళములు మంచుగాలికి కదలి విరియుచుండ, ఒప్పారెడి మంచుకాలమున మంచువలని చలిని మాపెడు లేడికంటి ఏవయసుకాండ్రి మెడలో క్షణ మయినను తగుల్కొనదో ఆవయసుకాండ్రకు రాత్రి ఎప్పటికిని తెల్లవాఱక మరణతుల్య మగును.

స్రగ్ధర. పొద్య త్ప్రౌఢ ప్రియంగు స్ఫుటరుచి యుతమై ఫుల్లమల్లీమతల్లీ

మాద్యత్సారంగమై హైమనపవనచల న్మంజుమందారభూజా

తద్యోతం బైన హేమంతమున విరహాసంతప్తు లౌవారి కెల్లన్

సద్యామాయామరాత్రుల్ చను విషమయమస్థాన సాదృశ్యమూర్తిన్.

వ్యా.—ప్రోద్య దితి.—ప్రోద్యన్త్యః ఉదిత్వరాః - ప్రౌఢాః ప్రవృద్ధా శ్చ - యాః ప్రియఙ్గవః ఫలిన్యః - తాభి ర్ద్యుతి ముపచయజనితశోభాం - బిభ ర్తీతి తథోక్తే - ని. 'ప్రియఙ్గుః ఫలినీ ఫలీ' త్యమరః, ద్వౌ రేఫౌ వర్ణవిశేషౌ యస్య స ద్విరేఫో భ్రమరశబ్దః - ఉపచారా త్తదర్థోఽపి ద్విరేఫ ఉచ్యతే * యథాఽఽహ కైయటః - 'శబ్దధర్మే ణాఽప్యర్థస్య వ్యపదేశో దృశ్యతే - యథా భ్రమరశబ్దస్య ద్విరేఫత్వా ద్ద్విరేఫో భ్రమరః.', వికసద్భిః - కున్దై ర్మాఘ్యకుసుమైః - మాద్యన్తో ద్విరేఫా యస్మిన్ తస్మిన్ - ని. 'మాఘ్యం కున్ద మి' త్యమరః * 'పుష్పమూలేషు బహుళ మి' తి లుప్ - య ద్యపి కున్దవికసనం శిశిరర్తులక్షణం తథాఽపి తత్ప్రత్యాసత్త్యోక్త మితి న విరోధః, ప్రళయా దాగతం ప్రాలేయం హిమం * 'తత ఆగత' ఇ త్యణ్ * 'కేకయ మిత్రయు ప్రళయానాం యాదే రియ ఇతి' యశబ్దస్య ఇయాదేశః - ప్రాలేయవాతై స్తుషారవా

యుభిః - ప్రచలం చఞ్చలమ్ - అత ఏవ విలసితం ప్రకాశమాన - ముదారం రమ్యం చ - మన్దారాణాం సంతానకతరూణాం - ధామ స్థానం - యస్య తస్మిన్ - య ద్వా - మన్దారాణాం పారిభద్రికతరూణాం - ధా మేతి ఉభయ త్రా ప్యుపచయహేతుత్వా దితి భావః - ని. 'పారిభద్రో నిమ్బతరు మన్దారః పారిజాతక' ఇ త్యమరః, ఏవం భూతే కాలే హేమన్తసమయే, యేషాం యూనాం తరుణానాం, తుహినక్షోదే శీతనివారణే - దక్షౌ కుచకుమ్భయో రౌష్ణ్యసంభవేన తదాలిఙ్గనా న్నివారణసమర్థే త్యర్థః, మృగాక్షీ తరుణీ, క్షణ మల్పకాల మపి * అత్యన్తసంయోగే ద్వితీయా, కణ్ఠలగ్నా కణ్ఠావసక్తా - కణ్ఠాలిఙ్గనతత్పరేతి యావత్, నో న భవ తీ త్యర్థః, తేషాం యూనాం, ఆయామాః అత్యన్తదీర్ఘా - యామాః ప్రహరాః - యస్యా స్సా విరహవేదనావశా త్తథా ప్రతీయమానయా మే త్యర్థః, యామినీ రజనీ, యమసదనసమా యమలోకకల్పా - దురన్తదుఃఖావహే త్యర్థః, యాతి గచ్ఛతి, తదానీ మఙ్గనాస్తవాలిఙ్గన మన్తరేణ దురన్తవిరహవేదనామహానద్యా స్తరితు మశక్యత్వా దితి భావః - ని. 'ద్వౌ యామప్రహరౌ సమౌ' ఇతి - 'రజనీ యామినీ త మీ' ఇతి చా ప్యమరః.

అనుప్రాసోపమయో శ్శబ్దార్థాలంకారయో సంసృష్టిః. స్రగ్ధరా వృత్తమ్.

---

అవ.—శిశిరఋతువు.

చుమ్బన్తో గణ్డభిత్తీ, రలకవతి ముఖే సీత్కృతా న్యాదధానాః,
వక్షస్సూత్కఞ్చుకేషు స్తనభరపులకోద్భేద మాపాదయన్తః,
ఊరూ నాకమ్పయన్తః, పృథుజఘనతటాత్ స్రంసయన్తోఽంశుకాని,
వ్యక్తం కాన్తాజనానాం విటచరితభృతః శైశిరా వాన్తి వాతాః.

టీక.—శీతవాయువులు విటులవలె నొప్పుచున్నవనుట.— కాన్తా జనానాం = అందగత్తెలయొక్క, గణ్డభిత్తీః = గోడలవంటి చెక్కిళ్లను, చుమ్బన్తః = ముద్దుగొనుచు, అలకవతి = ముంగురులుగల, ముఖే = మొగమందు, సీత్కృతాని = 'సీత్' అను శబ్దములను, ఆదధానాః = కలిగించుచు, (చలిచేత నని వాయుపరము, మోవికాటుచేత నని విటపరము), వక్షస్సు = ఱొమ్ములు, ఉత్కఞ్చుకేషు సత్సు అపి = పైని తాల్పఁబడిన అవికలు గలవి యయినను (అని వాయు.) - తీసివేయఁబడిన అవికలుగలవి కాఁగా (అని విట.), స్తన...ద్భేదమ్ - స్తనభర = వలుదచన్నులయందు - పులక = గగుర్పాటుయొక్క - ఉద్భేదమ్ = మొలచుటను, ఆపాదయన్తః = కలిగించుచు, ఊరూన్ = తొడలను, ఆకమ్పయన్తః = వణఁకించుచు, పృథు జఘన తటాత్ = విరివియైన మొలప్రదేశమునుండి - అంశుకాని = చీరలను, స్రంసయన్తః = ఊడ్చుచు, వ్యక్తం =



స్పష్టముగా, విట చరిత భృతః = విటుల నడవడిని దాల్చినవై, శైశిరాః = శిశిరకాలపు వాతాః = వాయువులు, వాన్తి = వీచుచున్నవి.

తా.—శిశిర కాలమందు చలివాయువులు కాంతా జనముల యెడల విటకాండ్రచేష్టల నొనరించుచు వీచును. అది యెట్లన, విటులు విశాలము లయిన చెక్కిళ్లను ముద్దుగొని, ముంగురులతోడి మొగమున-అధరమందు పలుకాట్లు గావించుటచే-సీత్కారమొదవించుచు, నిండు చన్నులయందు అవిక లెడలించి ఆలింగనములచే గగురుపాటొదవించుచు, ఊరువులందు (గిలిగింతచే) కంపము వెట్టుచు, విశాలమయిన మొలనుండి వలువ నెడలించుచు, విహరింతురు; ఈ చలి వాయువులు చెక్కులపై సోఁకుచు, ముంగురులను రేఁపుచు, మొగమున జిల్లుమని దాఁకి సీత్ అనిపించుచు, బిగువుగా అవికలు దాల్చియున్నను బటువుచనులను గగుర్కొలుపుచు, తొడలయందు వణఁకు పుట్టించుచు, విరివియైన మొలనుండి వలువ నెగురఁగొట్టుచు, వీచుచుండును.

చ. చెక్కులు ముద్దుగొంచు, ముఖసీమను సీత్కృతులన్ ఘటించుచుం,
జక్కనిచన్గవం బులకజాలములన్ మొలపించుచుం, గటిం
జెక్కినచేలముం దొలఁగఁ జేయుచు, శైశిరమారుతంబు లిం
పెక్కఁగఁ గాంతలందు విటకృత్యముఁ బూని చరించు నిత్తఱిన్.

వ్యా.—అథ ద్వాభ్యాం శిశిరర్తుం వర్ణయన్ నిగమయతి - చుమ్బన్త ఇతి.— కాన్తాజనానాం-గణ్డా భిత్తయ ఇవ తాః - గణ్డభిత్తీః కపోలస్థలీః, చుమ్బన్తః - 'స్తననయన కపోలాన్ చుమ్బనస్థాన మాహు రి' తి రతిరహస్యోక్తే రితి భావః, అత ఏవాలకవతి విశ్లేషణవశా చ్చూర్ణకున్తలాలంకృతే - ముఖే - ని. 'అలకా శ్చూర్ణకున్తలా' ఇత్యమరః, సీత్కృతాని సీత్కారాన్ - సీ ది త్యనుకరణశబ్దః, ఆదధానాః కుర్వాణాః - ఉత్పాదయన్త ఇ త్యర్థః, వక్షస్సు ఉరస్థలీషు, ఉత్కఞ్చుకేషు ఉద్గ్రథితకూర్పాసకేషు స త్స్వపి, స్తనభరేషు - పులకోద్భేదం రోమాఞ్చప్రాదుర్భావ, మాపాదయన్తః - ఇతి సాత్త్వికోక్తిః, ఊరూన్ సక్థీని, ఆకమ్పయన్తః ప్రచాలయన్తః, పృథువిశాలం - య జ్జఘనతటం జఘనప్రదేశ స్తస్మా, దంశుకాని పరిధానాంశుకగ్రన్థీ నీ త్యర్థః, స్రంసయన్తః విశ్లథయన్తః, అత ఏవ - వ్యక్తం స్ఫుటం - విటానాం పల్లవికానా మివ - చరితాని - కృత్యాని బిభ్రతీతి తథోక్తాః, శిశిర స్యైతే శైశిరాః - శిశిరర్తుసంబన్ధినః - 'త స్యేద మి' త్యణ్, వాతా, వాన్తి సంచరన్తి; విటసాధారణ విశేషణ విశిష్టత్వా ద్వాతానాం తచ్చరితభరణం యుక్త మితి భావః - తదుక్తం రతిరహస్యే -

'అలికచుబుకగణ్డం నాసికాగ్రం చ చుమ్బన్
పునరుపహితసీత్కం తాలుజిహ్వాం చ భూయః

భరితలిఖితనాభీమూలవక్షోరుహోరు
శ్లథయతి ధృతధైర్యః శ్లాథయిత్వాథ నీవీమ్' ఇతి.

అత్ర విటచరితభృత ఇత్యత్ర ఉపమాలంకారః, స చ వ్యక్త మిత్యనేన నాభి వ్యఞ్జిత యోత్ప్రేక్షయాఽఙ్గేన సంకీర్యత ఇతి సంక్షేపః. వృత్తం పూర్వవత్.

---

అవ.—చలిగాలియందు విటచర్యనే వెండియుం జెప్పుచున్నాఁడు.

కేశా నాకులయన్, దృశో ముకులయన్, వాసో బలా దాక్షిప,
న్నాతన్వ న్పులకోద్గమం, ప్రకటయ న్నఙ్గేషు కమ్పం శనైః,
వారం వార ముదారసీత్కృతకృతో దన్తచ్ఛదాన్ పీడయన్,
ప్రాయః శైశిర ఏష సమ్ప్రతి మరుత్కాన్తాసు కాన్తాయతే. 100.

టీక.—సంప్రతి = ఇపుడు (శిశిరర్తువులో), ఏషః = ఈ, శైశిరః = శిశిరకాలపు, మరుత్ - గాలి, ప్రాయః – తఱుచుగా, కాన్తాసు = చెలువలయెడల, కేశాన్ = కురులను, ఆకులయన్ = రేఁపుచు, దృశః = కన్నులను, ముకుళయన్ = మొగుడఁజేయుచు, వాసః = వలువను, బలాత్ = బలవంతముగా, ఆక్షిపన్ = ఊడ్చుచు, పులక ఉద్గమమ్ = గగుర్పుయొక్క మొలచుటను, ఆతన్వన్ = కలిగించుచు, అఙ్గేషు = అవయవములందు, శనైః = మెల్లగా, కమ్పం = వడఁకును, ప్రకటయన్ = వెల్లడించుచు, ఉదార సీత్కృత కృతః = మనోహరమయిన - సీత్కారమును జేయుచున్న, దన్తచ్ఛదాన్ = పెదవులను, వారంవారం = మాటిమాటికి, పీడయన్ = నొప్పించుచు, కాన్తాయతే = కాంతునివలె చేష్టించుచున్నది.

తా.—ఇప్పుడు ఈ శిశిరకాలపుగాలి చెలువలయందు కురులను రేఁపుచు, కన్నులు మొగిడ్పించుచు, బలిమిమై మొలమీఁది చీరను ఊడ్చి వైచుచు, గగ్గురు పుట్టించుచు, అవయములందు మెల్లమెల్లగా వడఁకుపుట్టించు, మాటిమాటికి పెదవిని నొప్పించి సీత్కారములు చేయించుచు, కాంతునివలె చేష్టించుచున్నది.

ఉ. వేనలిఁ గ్రొన్ననల్ చెదర విప్పుచుఁ, గన్నుల మూయఁ జేయుచుం,
బూనిన సీత్కృతుల్ నెఱపుమోవుల నొక్కుచు, నీవు లూడ్చుచున్,
జానుగ మేనులం బులకజాలములన్ వెలయించుచున్, బర
స్త్రీనికరంబునందుఁ బతిరీతిఁ జరించు సమీరు డత్తఱిన్.

వ్యా.— కేశా నితి.— కేశాన్ శిరోరుహాన్, నాకులయన్ వ్యాకులీకుర్వన్ - ఏకత్ర విశ్లేషణా దన్యత్ర కేళిసంరమ్భా చ్చేతి భావః, దృశో, ముకుళయ న్నిమీలయన్- ఏకత్ర పరుషస్పర్శవశా దపరత్ర సుఖపారవశ్యా చ్చేతి భావః, వాసో జఘనాంశుకం, బలా త్ప్రసహ్యాక్షిపన్ ఆకర్షన్ - ఏకత్ర వేగవశా దపరత్ర సమ్భోగేచ్ఛయా చేతి భావః, పులకోద్గమం రోమాఞ్చ, మాతన్వ న్నుత్పాదయన్ - ఏకత్ర శీతలస్పర్శా దన్యత్ర శృఙ్గారోద్బోధనా చ్చేతి భావః, ఆవేగే నోద్వేగేన - యః కమ్పో గాత్రవేపథు స్తం, శనైః ప్రకటయ న్స్పష్ట మభివ్యఞ్జయన్ - ఇతి విశేషణద్వయేన సాత్త్వికోక్తిః, ఉదారాణి మనోజ్ఞాని - సీత్కృతాని కుర్వన్తీతి తథోక్తాన్, ఛాద్యన్తే ఏభి రితి ఛదాః * 'పుంసి సంజ్ఞాయాం ఘః ప్రాయేణే' తి ఘప్రత్యయః, 'ఛాదే ర్ఘేఽద్వ్యుపసర్గస్యే' తి హ్రస్వః - దన్తానాం ఛదాః తా నధరోష్ఠాన్, వారం వారం పునః పునః, పీడయన్ - ఏకత్ర శైత్యాతిశయే నాన్యత్ర దన్తక్షతేన చ వ్యథయ న్నిత్యర్థః, ఏషోఽయం, శైశిరో మరుత్ శిశిరమారుతః, సమ్ప్రతీదానీం శిశిరర్తౌ, ప్రాయో భూమ్నా, కాన్తాసు కామినీషు విషయే, కాన్తాయతే -

'కథాభిః కమనీయాభిః కామైర్వ్యాపారభేదైశ్చ సర్వదా,
ఉపచారైశ్చ రమయే ద్యస్స కాన్త ఇతీరితః.'

ఇత్యుక్తలక్షణః కాన్త ఇవాచరతి - ఉక్తవిశేషణైః కాన్తసాదృశ్యలాభా త్స ఇవ వర్తత ఇత్యర్థః * 'ఉపమానా దాచార' ఇతి క్యఙ్ * 'అకృత్సార్వధాతుకయో ర్దీర్ఘః.'

అత ఏవోపమా - సా చ ప్రాయ శ్శబ్దాదివ్యఞ్జితోత్ప్రేక్షయా సంకీర్యతే - తదుక్త మాచార్యదణ్డినా -

'మన్యే శఙ్కే ధ్రువం నూనం ప్రాయ ఇత్యేవమాదిభిః,
ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దై రివశబ్దోఽపి తాదృశః.' ఇతి.

శార్దూల విక్రీడితమ్.

ఇతి శృఙ్గారశతకవ్యాఖ్యానే ఋతువర్ణనం నామ పఞ్చవింశతిః.

శృఙ్గారశతకం సమాప్తమ్.

---

చ. ఉపనిషదర్థవేద్య దురితోగ్రభవామయవైద్య వాసరా
ధిపశశివహ్నినేత్ర సముదీర్ణపవిత్రచరిత్ర సత్కృపా
స్నపితసమస్తలోక కరసంగతదివ్యపినాక భీకర
ద్విపసురవైరిభంజన సుధీజనరంజన నిర్గతాంజనా.

(ఉత్సాహ.)

తారకాసురారిజనక దక్షయాగభంజనా। తారకాచలేంద్రవాస దానకల్పభూరుహా
తారకాధినాయకావతంస భవపయోధిసం। తారకాభిధాన యాతుధానవైరిసన్నుతా.

క. దండధరచండవిక్రమ । దండనపాండిత్యమండితప్రబలభుజా
దండ షడ్పర్వాలయకో । దండ యఖండప్రమోదతాండవలోలా.

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షవీక్షాపాత్ర యేనుఁగు లక్ష్మణకవి రాజపౌత్త్ర తిమ్మనార్యపుత్త్ర వివిధవిద్వజ్జనవిధేయ లక్ష్మణకవి నామధేయ ప్రణీతం బయినసుభాషితరత్నావళీకావ్యంబునందు శృంగారశతకంబున స్త్రీప్రశంసయు సంభోగవర్ణనంబును కామినీగర్హణంబును సువిరక్తదుర్విరక్తపద్ధతియు ఋతువర్ణనంబు ననునైదు ప్రకరణంబులు గలది ద్వితీయాశ్వాసము.

---

శ్రీ

# భర్తృహరి సుభాషితమ్.

## వై రా గ్య శ త క మ్.

---

చూడోత్తంసితచారుచన్ద్రకలికాచఞ్చచ్ఛిఖాభాస్వరో
లీలాదగ్ధవిలోలకామశలభః శ్రేయోదశాగ్రే స్ఫురన్
అన్తఃస్ఫూర్జదపారమోహతిమిరప్రాగ్భార ముచ్చాటయం
శ్చేతఃసద్మని యోగినాం విజయతే జ్ఞానప్రదీపో హరః. 1.

టీక.—శివుని దీపముగా వర్ణించుచున్నాఁడు. చూడో...స్వరః - చూడా = సిగయందు - ఉత్తంసిత = శేఖరముగాఁ జేయఁబడిన - చారు = అందమైన - చన్ద్ర కలికా = చంద్రకలయనెడి - చఞ్చత్ = ఒప్పుచున్న (అని చంద్ర.) - చలించుచున్న (అని శిఖా.), శిఖా = జ్వాలచేత - భాస్వరః = ప్రకాశమానమై, లీలా...శలభః - లీలా = ఆటగా - దగ్ధ = కాల్పఁబడిన - విలోల= జయాశగల (మన్మథ.) - తనకను కూల వస్తువని యాసపడి వచ్చిన (శలభ.) - కామ = మన్మథుఁడనెడి - శలభః = మిడుతగలదియు, శ్రేయః దశా అగ్రే స్ఫురన్=శుభమయిన దశయందు ముందుగా పొడ సూపుచు (శివ.) - మంచి వత్తికొనను వెలుఁగుచు (దీప.), అన్త...ప్రాగ్భారం-అన్తః= లోపల (హృదయమందు - జ్ఞాన., ఇంటను - దీప.) - స్ఫూర్జత్ =ఏచుచున్న - అపార= హద్దులేని - మోహ=అజ్ఞానమను - తిమిర = చీఁకటియొక్క - ప్రాగ్భరమ్ = మొత్తమును, ఉచ్చాటయన్ = వెడలనడుచుచు, జ్ఞానప్రదీపః = జ్ఞానమనుదీపము - అగు, హరః = శివుఁడు, యోగినాం = యోగులయొక్క, చేతఃసద్మని = హృదయమను గృహమునందు, విజయతే = సర్వోత్కృష్టుఁడైయున్నాఁడు.

తా.—శివుఁడు దీపమువంటివాఁడు. ఆయనయొసంగు జ్ఞానము దీపముయొక్క వెలుతురువంటిది, సిగయందలి చంద్రకళ జ్వాలవంటిది, ఆయనను దరిసి దగ్ధుఁడయిన కాముఁడు దీపముపైఁ బడి కాలు మిడుతవంటివాఁడు, శుభదశయందు ఆదిలో ఆయన తోఁచుట మంచివర్తిమొదట దీపము వెలుఁగుటవంటిది, యోగులహృదయములు ఇండ్లవం

టివి, శివుఁడు అజ్ఞానమును పోఁగొట్టుట దీపము చీఁకటిని పోఁగొట్టుటవంటిది. అట్టియా దేవుఁడు సర్వోత్కృష్టుఁ డై యొప్పుచున్నాఁడు.

క. శ్రీరమణధృతమృదంగగ। ధీరధిమింధిమినినాదభేదక్రమయో
గ్యారంభగుంభనటన। శ్రీరంజితసుఖనివేశ శ్రీసోమేశా.

చ. కలితవతంసితేందుకలికాశిఖిచే విలసిల్లి చిత్తభూ
శలభము నగ్గిసేసి శుభసారదశాగ్రమునన్ వెలుంగుచున్
బలవదపారమోహభరబాధితమోహరణంబు సేయుచుం
దెలివివెలుంగు పొల్చు శివదేవుఁడు యోగిమనోగృహంబులన్.

వ్యా.—చూ డేతి.—చూడోత్తంసితస్య శిరోభూషణీకతస్య - చన్ద్రస్య - చారుకలికయా మనోహరకోరకే నేవ - చఞ్చచ్ఛిఖయా ప్రకాశమానాగ్రేణ - భాస్వరః ప్రకాశమానః, విలోలః చఞ్చలః - కామ ఏవ శలభః - సః లీలయా విలాసేన - దగ్ధో యేన, శ్రేయసాం శుభానాం - దశాసు అవస్థాసు - అగ్రే పురతః - స్ఫురన్ ప్రకాశమానః, అన్త ర్మనసి - స్ఫూర్జతః విజృమ్భమాణస్య - అపారస్య అనన్తస్య - మోహతిమిరస్య - ప్రాగ్భారం గురుం ప్రాక్ప్రదేశమ్, ఉచ్చాటయన్ నిరస్యన్, జ్ఞాన ప్రదీపః జ్ఞానప్రకాశకః, హరః భక్తానాం జ్ఞానాజ్ఞానకృత మానసిక వాచిక కాయిక పాపహారీ భగవాన్ సామ్బశివః, యోగినాం సనకాదీనాం, చేతస్సద్మని మన స్యేవ గృహే, విజయతే సర్వోత్కర్షేణ వర్తతే.

ప్రథమతః చూడోత్తంసి తేతి వాక్యే చన్ద్రపదగ్రహణాత్ భక్తానాం తాపహారీ త్యర్థో లభ్యతే, లీలాద గ్ధేతి వాక్యే కామశలభపదగ్రహణాత్ మహాశత్రుసంహారీతి లభ్యతే, అన్తఃస్ఫూర్జ దితి వాక్యే మోహతిమిరపదగ్రహణాత్ యథా ఉదిత స్సూర్యః సర్వతిమిరాణి నాశయతి తథా అయ మపి అజ్ఞాననాశం కరో తీతి, చేతస్సద్మ నీతి వాక్యే జ్ఞానదీపపదగ్రహణాత్ కామక్రోధాదిపఙ్కరహితనిర్మలచిత్తానాం నిస్సఙ్గానాం యోగినాం చేతసి యథా వర్తతే తథా భక్తానాం సర్వాజ్ఞాననాశనం కుర్వన్ జ్ఞానప్రదీపో హరో విజయత ఇ త్యభిప్రాయః.

---

## తృ ష్ణా దూ ష ణ మ్.

అవ.—వైరాగ్య భాగ్యమునకు సాధనముగా తృష్ణాత్యాగము నుపదేశించుట.

భ్రాన్తం దేశ మనేకదుర్గవిషమం ప్రాప్తం న కిఞ్చి త్ఫలం,
త్యక్త్వా జాతికులాభిమాన ముచితం సేవా కృతా నిష్ఫలా,
భుక్తం మానవివర్జితం పరగృహే ష్వాశఙ్కయా కాకవత్,
తృష్ణే, జృమ్భసి పాపకర్మనిరతే నా ద్యాపి సంతుష్యసి. 2.



టీక.—అనేక దుర్గ విషమం = పెక్కు పోవశక్యముగాని ప్రదేశములచేత వికటమైన, దేశం ప్రతి = దేశమున, భ్రాన్తం = తిరిగితిని, కిఞ్చిత్ = కొంచెమైనను, ఫలం = ప్రయోజనము, ప్రాప్తం న = పొందఁబడదాయెను, ఉచితం = తగినదైన, జాతి కుల అభిమానం = జాతియందును కులమునందునుగల ప్రేమను, త్యక్త్వా = వదలి, నిష్ఫలా = ప్రయోజనములేని, సేవా = కొలువు, కృతా = చేయఁబడినది, మాన వివర్జితం (యథా తథా) = గౌరవమును వదలి, పర గృహేషు = ఇతరుల యిండ్లయందు, కాకవత్ = కాకివలె, ఆశఙ్కయా = జంకుతో, భుక్తం = భుజించితిని, పాప కర్మ నిరతే = పాప కార్యములయందు ఆసక్తమా, తృష్ణే = ఆసా, జృమ్భసి = చెలరేఁగుచున్నావు, (కాని), అద్యాపి = ఇప్పుడును, న సంతుష్యసి = తనియవు.

తా.—ఆశ తీఱు నను భ్రమచే ఏఱ్లు కొండలు లోనగు దుస్సంచారప్రదేశములను దాఁటి వృథాగా దేశములు తిరిగితిని; జాతికులాభిమానము మాని వృథాగానే ధనికులను గొలిచితిని; బెదరుతోనే ఇతరులయిండ్లలో కాకివలె ఆదరములేనియన్నమును భుజించితిని, ఇన్నికష్టములు పడినను తనివి కలుగలేదు. ఇన్నికష్టములకుం గారణమై నానాపాపములు చేయించునట్టి యీయాశను ఇప్పుడు ఇంకను పెంపుచేసికొనుచున్నానేగాని వదలలేకున్నాను.

చ. విసికితి దుర్గదుర్విషయవిభ్రమయుక్తిఁ, గులాభిమానముం
బస చెడ సేవఁ జేసితి, విపన్నుఁడ నై పరగేహసీమ వా
యసమువలెన్ భుజించితిఁ, బ్రయత్నము నిష్ఫలమై నశించె, సం
తసపడ వుగ్రకర్మపిశునత్వముఁ జూపెద వాశ, యేటికిన్ ?

వ్యా.—అథ రాగస్య తృష్ణామూలకత్వా త్తద్గ్రహణం వినా న వైరాగ్యసిద్ధి రిత్యభిప్రేత్య తత్సిద్ధ్యర్థ మాదౌ తావ త్తత్పరిపన్థిభూతాం తృష్ణాం దూషయతి - భ్రాన్త మి త్యాది నవభి శ్శ్లోకైః; తత్ర ప్రథమం స్వకర్మకష్టనివేదనపూర్వకం తృష్ణాం సంబోధ్య త్రిభి ర్దూషయతి - భ్రాన్త మితి.—అనేకై ర్బహుభి - ర్దుర్గైః పార్వత వార్క్ష జల దుర్గాదిభిః - విషమం వికటం దుస్సంచార మి త్యర్థః, దేశం, భ్రాన్తం సంచరితం, తథాఽపి, కించి దల్ప మపి, ఫలం ధనం, న ప్రాప్తం న లబ్ధం - బహుఫలాపేక్షు యైవ దుర్గమవిదేశసంచారః కృతః - ఫలం త్వీష దపి న ప్రాప్త మి త్యర్థః - అత్ర దేశశబ్దస్య నపుంసకత్వం నిఘణ్ట్వన్తరేషు మృగ్యం - యద్వా - దేశ ముద్దిశ్య భ్రాన్తం * భావే క్తప్రత్యయః - అథవా - ని. 'నీవృజ్జనపదౌ దేశవిషయౌ వి' త్యభిధానాత్ - పుంలిఙ్గస్యాపి దేశశబ్దస్య నపుంసకత్వసంబన్ధ మనువర్తత ఇతి భాష్యకారప్రయోగా దిష్యతే, తథా, ఉచిత మనురూపం, జాతికులయోః - జాతిః బ్రాహ్మణత్వాదిః - కులం సద్వంశః - తయో రభిమాన మి త్యర్థః * సాపేక్షత్వేఽపి గమకత్వా త్సమాసః, త్యక్త్వా విసృజ్య,

నిష్ఫలా ఫలశూన్యా, సేవా పరిచర్యా, కృతా - ధనాధ్యానా మితి శేషః, ఉభయత్రాపి కష్ట మేవావశిష్టం న త్వన్య త్కించి దపీ త్యర్థః - ని. 'లాభనిష్పత్తిరోగేషు బలే శక్త్యే ధనే ఫల మి' తి వైజయన్తీ, తథా మానవివర్జిత మభిమానశూన్యం యథా తథా - బహుమానవిహీన మితి వా, ఆశఙ్కయా ఆకాఙ్క్షయా - లోలుపత్వే నేతి యావత్, పరగృహేషు, కాకేన బలిభుజా - తుల్యం కాకవత్ * 'తేన తుల్యం క్రియా చే ద్వతిః' ఇతి వతిప్రత్యయః, భుక్తమ్ అభిమాన త్యాగేఽపి న బహుమానపూర్వకం కింతు సావమాన మేవ దత్తం పరాన్నపిణ్డ మభ్యవహృత మి త్యర్థః, తథాఽపి, పాపకర్మణాం పాపాత్మనాం - పిశునే సూచికే-యేషాం తృష్ణా త ఏవ పాపిష్ఠా ఇతి భావః- య ద్వా - పాపకర్మణాం దుష్కర్మణాం-పిశునే ప్రవర్తకే - ఇ త్యర్థః-ఏత ద్వ్యతిరేకేణ దుష్కర్మప్రవర్తకాన్తరాభావా దితి భావః, హే తృష్ణే విషయస్పృహే, జృమ్భసి ప్రవృద్ధా భవసి, కిం త్వ ద్యాపి ఈదృక్కష్టకర్మప్రవర్తనదశాయా మ పీతి భావః, న సంతుష్యసి సంతుష్టా న భవసి - విరతిం న ప్రాప్నోషీ త్యర్థః, ఇతః పరమపి కించి ద్దుష్టకర్మ కారయితు మపేక్షాఽస్తీవ ప్రతిభా తీతి భావః.

---

ఉత్ఖాతం నిధిశఙ్కయా క్షితితలం, ధ్మాతా గిరే ర్ధాతవో,
నిస్తీర్ణః సరితాంపతి, ర్నృపతయో యత్నేన సన్తోషితాః,
మన్త్రారాధనతత్పరేణ మనసా నీతాః శ్మశానే నిశాః,
ప్రాప్తః కాణవరాటకోఽపి న మయా తృష్ణే, సకామా భవ.

టీక.—నిధిశఙ్కయా = లిబ్బి (కలదను) భ్రమచేత, క్షితితలం = భూప్రదేశము, ఉత్ఖాతం = త్రవ్వఁబడినది, గిరేః ధాతవః = కొండయొక్క (మనశ్శిలాది) శిలావిశేషములు, ధ్మాతాః ఊఁదఁబడినవి, సరితాం పతిః = ఏళ్లపెనిమిటి (సముద్రము), నిస్తీర్ణః = దాఁటఁబడినది, నృపతయః = రాజులు, యత్నేన = కడఁకతో, సన్తోషితాః = సంతోషపెట్టఁబడిరి, మన్త్ర ఆరాధన తత్పరేణ = మంత్రములతోడి యుపాసనయందు ఆసక్తమయిన, మనసా = మనస్సుచేత, శ్మశానే = వల్లకాటిలో, నిశాః = రాత్రులు, నీతాః = కడపఁబడినవి, కాణవరాటకోఽపి = గ్రుడ్డిగవ్వ యైనను, మయా = నాచేత, ప్రాప్తః న = పొందఁబడినది కాదు, కాఁబట్టి, తృష్ణే = ఆశా, సకామా భవ = (నన్ను నానాబాధలం బెట్టవలయునను నీకోరిక నెఱవేఱినది గావున నీవు) ధన్యవు గమ్ము.

తా.—లిబ్బి దొరకు నని భ్రమపడి భూమిని త్రవ్వితిని, బంగారమగు నని ధాతువులను కరఁగించి యూఁదితిని, విత్తకముకై సముద్రయాత్రలు చేసితిని, రాజులను భక్తితో కొలిచితిని, బేతాళాదిసాధనమునకై వల్లకాటిలో మంత్రోపాసనలయందు



రాత్రులు గడపితిని; దేనను ఒక గ్రుడ్డిగవ్వ యేనియు దొరకదాయెను; నన్ను నానాబాధలం బెట్టవలయునను నీకోరికమాత్రము నెఱవేఱినది; కావున, ఓయాశా నీవు ధన్యురాలవు, సుఖముండుము.

చ. నిధి యనుశంక భూతలము నిచ్చలుఁ ద్రవ్వితి, నావచే మహో
దధిఁ దరియించితిన్, శిఖరి ధాతువు లూఁదితి, రాజుఁ గొల్చితిన్,
వ్యథ గొని ఘోరమంత్రజప మర్థి నొనర్చితి, గవ్వయైన నే
విధమునఁ బొందనైతిఁ గద వేముద; నుండఁ గదే దురాశరో.

వ్యా.—ఉత్ఖాత మితి.—నిధిశఙ్కయా నిక్షేపోఽత్ర తిష్ఠ తీతి భ్రాన్త్యా, క్షితితలం కించి దిష్టకాదినిచితభూతల, ముత్ఖాత మవదారితం - తత్ర న కించి ల్లబ్ధ మి త్యర్థః, తథా గిరేః, ధాతవః మనశ్శిలాద్యాః, ధ్మాతాః సువర్ణభావం ప్రాప్స్య న్తీతి ధియా అగ్నౌ మూషాయాం సమూలికావిశేషం నిక్షిప్య యావత్ప్రాణం ఫూత్కారై స్సంతాపితా ఇ త్యర్థః - తథాఽపి న కించి జ్జాత మితి భావః * 'ధ్మాశబ్దాగ్ని(వక్త్ర)సంయోగయో రి' త్యస్మా ద్ధాతోః కర్మణి క్తః - ని. 'ధాతు ర్మనశ్శిలా ద్యద్రే రి' త్యమరః - అన్యత్రా ప్యుక్తం -

'సువర్ణ రూప్య తామ్రాశ్చ హరితాళ మనశ్శిలాః
గైరికాఞ్జన కాశ్మీర లోహ సీసా స్సహిఙ్గులాః
గన్ధ కాభ్రిక మి త్యాద్యా ధాతవో గిరిసంభవాః.' ఇతి -

అత్ర సుర్ణరూప్యవ్యతిరేకే నైవ యోజ్య - మన్యథా ప్రకృతాసంగతే రితి, తథా, సరితాం పతి స్సముద్రో, నిస్తీర్ణః ద్వీపాన్తరేషు వాణిజ్యేన బహుధనం సంపాదయిష్యామీతి సాంయాత్రికభావేన విలఙ్ఘిత ఇ త్యర్థః, నృపతయో రాజాన శ్చ, యత్నేన ఛన్దానువర్తనరూపప్రయత్నేన, సంతోషితాః, తథా మన్త్రారాధనతత్పరేణ మన్త్రజపతాత్పర్యవతా మనసా హేతునా, శ్మశానే ప్రేతభూమౌ, నిశా రాత్రయో, నీతా యాపితాః - భూతప్రేతపిశాచాదిభ్యో భయ మవిగణయ్య నిధ్యాదిప్రదర్శకదేవతాభిముఖీకరణసాధన మన్త్రజపతాత్పర్యేణ నిశాసు శ్మశానే స్థిత మి త్యర్థః, తథాఽపి మయా, కాణవరాటకః అన్ధకపర్దోఽపి, న ప్రాప్తః - ధనం తు దూరాపాస్త మితి భావః - ని. 'కపర్ద శ్చ వరాటక' ఇతి హలాయుధః, అతః, తృష్ణే, సకామా సఫలమనోరథా, భవ త్వత్ప్రతిజ్ఞాతార్థనిష్పత్తేః సిద్ధసంకల్పా భ వే త్యర్థః; ఇత్థ మనర్థహేతుభూతయా తృష్ణయా వృథా వ్యాపారజనితశ్రమ ఏ వావశిష్టో న వాఞ్ఛితలాభ- ఇ త్యత స్తదున్మూలనే యత్నః కర్తవ్య ఇతి భావః.

---

ఖలోల్లాపాః సోఢాః కథ మపి తదారాధనపరై,
ర్నిగృ హ్యాన్తర్బాష్పం హసిత మపి శూన్యేన మనసా,
కృతో విత్తస్తమ్భ ప్రతిహతధియా మఞ్జలి రపి,
త్వ మాశే మోఘాశే కి మపర మతో నర్తయసి మామ్! 4.

టీక.—ఖల ఉల్లాపాః = దుష్టులయొక్క పరుసములు, తత్ ఆరాధన పరైః = వారిని గొలుచుటయందు ఆసక్తుల(మయిన మా)చేత, కథ మపి = ఎట్లో, సోఢాః = ఓర్వఁబడినవి; అన్తః = లోపలనే, బాష్పం = కన్నీటిని, నిగృహ్య = అడంచుకొని, శూన్యేన=వట్టి (హర్షములేని), మనసా = మనస్సుతో, హసిత మపి= నవ్వనుసయితము నవ్వితిమి; విత్త...ధియాం - విత్త = ద్రవ్యముచేనైన - స్తమ్భ= జడత్వముచే - ప్రతిహత = కొట్టఁబడిన - ధియాం = బుద్ధిగలవారికి - (ధనగర్వితులకు అనుట), అఞ్జలి రపి = కేలుమోడ్పుసయితము, కృతః = చేయఁబడినది; అమోఘ ఆశే = వ్యర్థముగాని మనోరథముగల, ఆశే = ఆశా, త్వం = నీవు, మాం = నన్ను, అతః పరం కిం నర్తయసి = ఇంతకంటెను ఇంక ఏయాట ఆడించెదవు.

తా.—దుర్జనులవలన పరుసములు పడుటయగాక వారిమెప్పు వడయఁగోరి వారియాదుర్భాషలవలనఁ గలిగిన కన్నీళ్లను లోలోన నడంచుకొని మనస్సున ఏహర్షమును లేకయే నవ్వను గూడ నవ్వుచుంటిని. ధనజాడ్యహతమానసులయిన యాఖలులకు కేలుసైతము మోడ్చితిని. దేనను ఏమియు ఫలము లేదాయెను. ఓయాశా నన్ను బాధింపవలయు నను నీకోరికమాత్రము నెఱవేఱక మానదు గావున, నీవు నన్ను ఇంకను ఏమియాట లాడింపనున్నావు?

చ. పలువలు పల్కుమాట లొక భంగి సహించితి, బాష్పవారి లో
పలనె హరించి శూన్య మగు భావమునన్ వెడనవ్వు నవ్వితిం,
బొలుపఱి విత్తజాడ్యహతబుద్ధుల కంజలి చేసితిం, గటా!
తలఁకక నింక నేపనికిఁ దార్చెదు నన్ను దురాశ, నీ విటన్!

వ్యా.—ఖలాలాపా ఇతి.— ఖలానాం దుర్జనానా, మాలాపాః దుర్భాషితాని, తదారాధనపరై స్తత్సేవాతత్పరై - రస్మాభి రితి శేషః, కథ మప్యతికృచ్ఛ్రేణ, సోఢాః క్షాన్తాః - అన్యథాభావే కార్యభఙ్గో భవే దితి భయా దితి భావః, తథా, అన్త రభ్యన్తర ఏవ - బాష్పం తదాలాపశ్రవణజనితాశ్రు, నిగృహ్య నియమ్య, శూన్యేన నిరుత్సుకేన, మనసా ఉపలక్షితై ర్నిర్భిన్నాన్తఃకరణై రిత్యర్థః, హసితం హాసోఽపి కృత ఇతి శేషః * కర్తరి క్తః - దురాలాపై రాక్షిప్తా అపి తే సంతోషవన్త ఏవ న తు నిర్విణ్ణా - అతో విశ్వసనీయా ఇతి బుద్ధ్యుత్పాదనార్థం నిర్విషయమిథ్యాహాసోఽపి విరచిత ఇ త్యర్థః,



తథా, విత్తేన ధనేన - యః స్తమ్భో జడీభావ-స్తేన ప్రతిహతా మూఢా వివేకశూన్యేతి యావత్ - ధీ ర్యేషా న్తేషాం ధనదుర్మదాన్ధానా మి త్యర్థః - ని. 'స్తమ్భౌ స్థూణా జడీభావా వి' త్యమరః, అఞ్జలి రపి కృతః ప్రహ్వీభావోఽపి విహితః - తథాఽపి న కించి ల్లబ్ధ మితి భావః, అతః మోఘాశే వ్యర్థమనోరథే, ఆశే తృష్ణే - ని. 'ఆశా తృష్ణాదిశోః ప్రోక్తే' తి విశ్వః, త్వం, మా, మతోఽస్మా త్ఖలాలాపసహనాదికృత్యాత్, అపర మితరత్, కిం కార్యం, నర్తయసి నాటయసి - మయా కిం కార్యం కారయ సీతి యావత్ - న కిమ పీ త్యర్థః - నాటయితవ్యార్థస్య వైయర్థ్యా దితి భావః; నను పూర్వశ్లోకే మ యే త్యేకవచనం ప్రయుక్తం - అత్ర తు తదారాధనపరై రితి బహుత్వం - కథ మేత త్సమఞ్జస మితి చే త్సత్యం - తృష్ణోపహతానాం బహుత్వా త్తత్ప్రయుక్తతత్కర్మక ర్తృభేదేన క్వచి దేకవచనం క్వచి ద్బహువచనం చ వివక్షిత మి త్యవధేయమ్; ఏవ ముత్తరత్రాపి యోజ్యమ్. శిఖరిణీవృత్తమ్ - 'రసై రుద్రై శ్ఛిన్నా యమనసభలాగ శ్శిఖరి ణీ' తి లక్షణాత్.

---

అమీషాం ప్రాణానాం తులితబిసినీపత్త్రపయసాం
కృతే కిం నాస్మాభి ర్విగళితవివేకై ర్వ్యవసితమ్?
య దాఢ్యానా మగ్రే ద్రవిణమదనిస్సంజ్ఞమనసాం
కృతం † వీతవ్రీడై ర్నిజగుణకథాపాతక మపి. 5.

టీక.—తులిత...పయసాం - తులిత = సాటిసేయఁబడిన - బిసినీపత్త్ర = తామరాకునందలి - పయసామ్= నీరుగల, అమీషాం ప్రాణానాం కృతే = ఈ ప్రాణముల కొఱకు, విగళిత వివేకైః = జాఱిన తెలివిగల, అస్మాభిః = మాచేత, కిం = ఏది, న వ్యవసితం = ఉద్యమింపఁబడినది గాదు, యత్ = దేనిచేత (ఏలనఁగా ననుట), ద్రవి...నసాం - ద్రవిణమద = ధనగర్వముచేత - నిస్సంజ్ఞ = జడమయిన - మనసామ్ = మనస్సుగల, ఆఢ్యానామ్ = ధనికులయొక్క - అగ్రే = ఎదుట, వీతవ్రీడైః = పోయిన లజ్జగల (లజ్జమాలిన), (మాచేత), నిజ...పాతక మపి - నిజ గుణ కథా=సొంత గుణములను చెప్పుకొనుటయనెడి - పాతక మపి = పాపము కూడ, కృతమ్ = చేయఁబడినది.

తా.— తామరాకులోని నీటివలె నత్యంతాస్థిరమయిన యీప్రాణముకొఱకు మేము తెలివి మాలి సకలపాపములకును బడిగట్టితిమి. ఎట్లనఁగా—ధనమదముచే తెలివి దప్పియున్న ధనికులయెదుట సిగ్గుమాలి మా గుణములను మేమే చెప్పుకొనుట యను పాతకమును సయితము కావించితిమి. ఈపాతకమును చేసినవారము ఇంక నే పాతకమును చేయలేదు?

మ. నలినీపత్త్రగతాంబుచంచలము లెన్నం బ్రాణముల్, వీనికై
గళితప్రజ్ఞత మేము చేయనియసత్కార్యంబు లే దేమియున్,
బలవద్విత్తమదాతిరేకజనితాపస్మారు లైనట్టి లు
బ్ధులఁ బ్రోలన్ నిజసద్గుణస్తుతిమహాదోషంబు గావించుటన్.

వ్యా.—అథ తృష్ణాదుర్విలసితేనైవ మహ దనుచిత మప్యాచరిత మిత్యాహ - అమీషా మితి.—కింవ తులితాని సమీకృతాని - బిసినీపత్త్రపయాంసి - యేషాం తేషాం - నలినీదళగతజలతరళానాం - క్షణభఙ్గురాణా మిత్యర్థః, అమీషా మవిశ్వసనీయానాం ప్రాణానాం కృతే - ఏతత్పరిత్రాణార్థ మిత్యర్థః - ని. 'అర్థే కృతే శబ్దౌ ద్వౌ తాదర్థ్యేఽవ్యయసంజ్ఞితా వి' తి వచనాత్, విగళితః భ్రష్టః - వివేకః కర్తవ్యాకర్తవ్యవిచారో - యేషాం తై రస్మాభిః, కిం దుష్కర్మ, న వ్యవసితం నోద్యుక్తం - సర్వ మపి వ్యవసిత మే వే త్యర్థః, కుతః - య దస్మాత్కారణాత్, ద్రవిణమదేన ధనమదేన - నిస్సంజ్ఞాని స్తమ్భితాని - మనాంసి యేషాం తేషాం - విమర్శశూన్యాన్తఃకరణానా, మాఢ్యానాం - ని. 'ఇభ్య ఆఢ్యో ధనీ స్వామీ' త్యమరః, అగ్రే పురస్తాత్, † మ్లానవ్రీడై ర్నిర్లజ్జై, రస్మాభి, ర్నిజగుణకథాపాతకం స్వకీయవిద్యావినయాది గుణప్రశంసారూపపాప మపి, కృతం; తచ్చ నిషిద్ధమ్- 'ఆత్మప్రశంసా మరణం పరనిన్దా తథైవ చే' తి వచనా దాత్మగుణప్రశంసనై వాత్మోపఘాతః - తస్య చ నిరయప్రాపకత్వే నిపాతకత్వం చ; నిజగుణప్రఖ్యాపనేన ధనం సంపాద్య తేన ప్రాణాన్ సంతర్పయిష్యామ ఇత్యాశయే నేదృశానుచిత మాచరితం - తథాఽపి న తల్లబ్ధ మి త్యపి శబ్దార్థః.

---

క్షాన్తం న క్షమయా, గృహోచితసుఖం త్యక్తం న సంతోషతః,
సోఢో దుస్సహశీతవాతతపనక్లేశో, న తప్తం తపః,
ధ్యాతం విత్త మహర్నిశం, నియమితప్రాణై ర్న శమ్భోః పదం;
తత్తత్కర్మ కృతం య దేవ మునిభి, స్తై స్తైః ఫలై ర్వఞ్చితాః.

టీక.—క్షాన్తం = ఓర్చితిమి, (కాని), న క్షమయా=ఓర్పుచేతను కాదు, గృహ ఉచిత సుఖం = ఇంటఁ దగు సుఖము, త్యక్తం = వదలుకొనఁబడినది, (కాని), సంతోషతః న = ఇచ్ఛచేతను కాదు, దుస్సహ శీత వాత తపన క్లేశః = సహింపరానిచలి గాలి యెండల శ్రమ, సోఢః = ఓర్వఁబడనది, (కాని), తపః న తప్తం = తపస్సు చేయఁబడినది కాదు, విత్తం = ద్రవ్యము, అహర్నిశం = రేయుంబవలు, ధ్యాతం = ధ్యానింపఁబడినది, (కాని), నియమిత ప్రాణైః = నిగ్రహింపఁబడిన ప్రాణములుగల మాచే, శమ్భోః పదం న (ధ్యాతం) = శివుని చరణము ధ్యానింపఁబడినది కాదు; మునిభిః = మునులచేత, యత్ కర్మ = ఏక్షమాదికకర్మము, కృతం = చేయఁబడినదో, తత్ కర్మ ఏవ = ఆయాకర్మయే, కృతం = (మాచేతను) చేయఁబడినది, (కాని), తైః తైః ఫలైః = ఆయాఫలములచేత, వఞ్చితాః = మోసగింపఁబడితిమి.



తా.— మేము మునులు చేయుకర్మలనే చేసితిమిగాని, ఆచేయుటయందు కొంచెము భేద మున్నందున, వారికి ఆయాకర్మలకు కలిగినఫలముమాత్రము మాకుఁ గలుగ దాయెను. అది యెట్లన, మేమును అవమానాదికమును ఓర్చితిమిగాని, మునులవలె మనోజయముచేత ఓర్చినవారము గాము, ఎదుర్కొన లేక యశక్తిచేత గతిలేక ఓర్చితిమి; ఇంటిసౌఖ్యమును వదలుకొంటిమిగాని మునులవలె వైరాగ్యముచేతఁ గాదు, మఱి యే మన ధనికసేవచేత వదలినవారము; సహింపరాని శీతవాతాతపములను మేమును సహించితిమి, కాని, మునులవలె తపస్సుకొఱకుఁ గాదు, మఱి ధనతృష్ణచేత; రేయుంబగలు మేమును ధ్యానించితిమి గాని, మునులవలె ప్రాణయామపూర్వకముగా శంభుచరణములను గాదు, మఱి దేని నన ధనమును; కావున మేము ఆయా క్షమా గృహసుఖత్యాగాదికర్మల యొక్క ఆయాఫలములను పొందక దుఃఖించుచున్నాము.

మ. క్షమచేఁ గా దవమాన మోర్చుట, మహాసంతుష్టిచేఁ గాదు గే
హమునం దైనసుఖంబు మానుట, తపోవ్యాసక్తిచేఁ గాదు దు
ర్దమశీతోష్ణజయంబు, కాదు హరుపై ధ్యానంబు విత్తంబుపై;
నమరెన్ మాకు మునీంద్రకృత్యములు, లే వాసత్ఫలాభ్యున్నతుల్.

వ్యా.—అథ యద్యప్యుచిత త మే వాచరితం తథాఽపి తస్యాయాథాతథ్యా న్న ఫలోపధాయక మభూ దిత్యాహ క్షాన్త మితి.—సత్యేవాఽపి పరిభవహేతౌ మనసోఽనుద్వేగః క్షమా - తయా, న క్షాన్తం న సోఢమ్ - అవమానాదిక మితి శేషః - కిం త్వశక్తతయై వేతి భావః, తథా, గృహే - ఉచితం యుక్తం, యత్ సుఖం మృష్టాన్నభోజనకళత్రసంభోగాదిజనితానన్దాది, తచ్చ, సంతోషతః కి మనేన తుచ్ఛే నేతి పరితోషా, న్న త్యక్తం - కిం త్వసంభావితబ్రహ్మచర్యై రేవేతి భావః, తథా, దుస్సహా స్సోఢు మశక్యాః - యే శీతవాతతపనైః - క్లేశా దుఃఖాని - తే, సోఢాః క్షాన్తాః - దేహయాత్రార్థం దేశాన్తరసంచారే తేషా మనుభూతత్వా దితి భావః, తప శ్చాన్ద్రాయణాదికం తు, న తప్తం న చరితం, తథా, నియమితప్రాణై రన్తఃప్రత్యాహృతప్రాణై, రస్మాభిః, అహ శ్చ నిశా చాహర్నిశమ్ - అహోరాత్రం * 'అచతురే' త్యాదినా నిపాతనాత్సాధుః, విత్తం, ధ్యాతం చిన్తితం, శంభోః పదం, న ధ్యాతం, అతో మునిభి, ర్య ద్యత్కర్మ కృతమ్, అవమానసహనాదిక మాచరితం, తత్త దేవ కర్మ, అస్మాభి శ్చ కృతం, కింతు తై స్తై స్తత్తత్కర్మనియతైః, ఫలై, ర్వఞ్చితా వర్జితాః, తేషా మయథాచరణేన వైగుణ్యా త్ఫలభాజో న జాతా ఇ త్యర్థః; క్షాన్త్యాది నైవ యద్యవమానాదికం క్షా

_న్తం స్యాత్తృప్తి ఫలలాభో భవేదేవ - న తు తదాచరితమ్; అయం చానర్థ స్తృష్ణా దుర్విలసితమూల ఏ వేతి ఫలితార్థః. శార్దూలవిక్రీడితవృత్తం - లక్షణం తూక్తమ్.

---

అవ.—ముదిమియందును ఆశ వదలలే దనుట.

భోగా న భుక్తా, వయ మేవ భుక్తా;
స్తపో న తప్తం, వయ మేవ తప్తాః;
కాలో న యాతో, వయ మేవ యాతా;
స్తృష్ణా న జీర్ణా, వయ మేవ జీర్ణాః. 7.

టీక.—భోగాః = భోగములు, న భుక్తాః = అనుభవింపఁబడలేదు, వయ మేవ = మే మే, భుక్తాః = (కాలముచే) తినఁబడితిమి; తపః = తపస్సు, న తప్తం = చేయఁబడలేదు, వయ మేవ, తప్తాః = (దుఃఖములచే) కాల్పఁ బడితిమి; కాలః = కాలము, న యాతః = పోలేదు, వయ మేవ, యాతాః = పోయితిమి; అప్పటికిని, తృష్ణా = ఆశ జీర్ణా న = ఉడుగలేదు, వయమేవ, జీర్ణాః = ఉడిగినారము.

తా.— మేము భోగము లనుభవించుటకు మాఱుగా కాలము మమ్ము నమలివైచినది; తపస్సును మేము చేయుటకు బదులుగా దుఃఖములు మమ్ము క్రాఁచినవి; కాలమునకేమో అంతము రాలేదు గాని, మాకే అంతము వచ్చినది; మేమే ముదిమి నొందితిమి గాని, ఆశ మాత్రము ముదిమిని బొందలేదు.

క. భోగానుభవంబు తపో । యోగము కాలంబు చనుటయును ఘనతృష్ణా
ద్యోగవిరామము లేదహ । హా గురుత వహించి తృష్ణ యలజడి దెచ్చెన్.

వ్యా.—అథ త్రిభి ర్జరాదూషణద్వారా తృష్ణాం నిన్దతి - భోగా ఇతి.—భుజ్యన్త ఇతి భోగాః స్రక్చన్దనాదివిషయాః, న భుక్తా నానుభూతాః, కిం తు వయ మేవ భుక్తాః తత్ప్రాప్త్యర్థం దురన్తచిన్తయా గ్రస్తాః, తథా, తపః వ్రతోపవాసాదిపుణ్యం, న తప్తం నాచరితం, కిం తు వయ మేవ తప్తాః ఆధ్యాత్మికాదితాపత్రయేణ సంతాపితాః, తథా, కాలో న యాతః న గతః - త స్యాఖణ్డదణ్డాయమానత్వేన యానాసంభవా దితి భావః, కిం తు వయ మేవ యాతాః జీవితావధికాల మల్ప ఙ్ఘ్యావసానం ప్రాప్తా ఇ త్యర్థః, అథవా కాలో న యాతః సదాచారసజ్జనసహవాసాదినా న గతః - తథా చే చ్ఛ్రేయో భవే దే వేతి భావః - కిం తు వయ మేవ యాతాః దేహగేహాదియోగక్షేమానుసంధానలమ్పటత్వేన కాల మతిక్రమ్య గతా ఇ త్యర్థః, తథా, తృష్ణా, న జీర్ణా న శిథిలా-తచ్ఛైథిల్యహేతో రనుపస్థితత్వా దితి భావః, కింతు వయ మేవ జీర్ణాః తృష్ణాసహకృత



జరయా శిథిలాఙ్గా జాతా ఇ త్యర్థః, అతః ఇతః పరం వా, క్షిప్రం ఖట్వాఙ్గధారి చిన్తనే నైవ తృష్ణోన్మూలనహేతు స్సంపాదనీయ ఇతి భావః.

ఇన్ద్రోపేన్ద్రవజ్రాలక్షణశ్రవణా దుపజాతివృత్తమ్ - 'అనన్తరోదీరిత లక్ష్మభాజౌ పాదౌ యదీయా వుపజాతయ స్తాః' ఇతి లక్షణాత్.

---

వలి భిర్ముఖ మాక్రాన్తం, పలితై రఙ్కితం శిరః,
గాత్రాణి శిథిలాయన్తే, * తృష్ణైకా తరుణాయతే. 8.

టీక.—వలిభిః = ముడుతలచేత, ముఖమ్ = మొగము, ఆక్రాన్తం = క్రమ్ముకొనఁబడినది, పలితైః = నరపవెండ్రుకలచేత, శిరః = తల, అఙ్కితం = గుర్తుగలది, గాత్రాణి = అవయవములు, శిథిలాయన్తే = సడలుచున్నవి, (కాని), తృష్ణా ఏకా = ఆశ మాత్రము, తరుణాయతే = యౌవనముగలదిగానే ఒప్పుచున్నది.

తా.—మొగము ముడుతలు పడినది; తల నరసినది; అవయవములు సడలిపోయినవి; అయినను ఆశమాత్రము యౌవనవంతముగానే యున్నది. ముసలితనమందును ఆశ వదల దనుట.

క. కరచరణాద్యవయవముల । భర ముడిగెఁ, వళులు మొగము పై నిండారెఁ,
శిర సెల్లఁ దెల్లఁబాఱెను, । దరి మాలినతృష్ణ యొకఁడె తరుణతఁ బూనెన్.

వ్యా.—వలిభి రితి.—వలిభి ర్జరావిశ్లథచర్మరేఖాభి, ర్ముఖం వక్త్రం, మాక్రాన్తం-వైరూప్యం ప్రాపిత మి త్యర్థః, పలితేన జరసా శౌక్ల్యేన, శిరః మస్తకమ్, అఙ్కితం చిహ్నితం - శిరః కేశాదయో ధవళా జాతాః ఇ త్యర్థః, తథా, గాత్రాణి కరచరణాద్యవయవాః - అవయవివాచినో గాత్రశబ్ద స్యావయవార్థత్వం లక్షణయా వేదితవ్యమ్-అవయవావయవినో రభేద వివక్షయా వా - న చ వక్త్రబాహుళ్యవివక్షాయాం యథా శ్రుత మేవ సమఞ్జస మితి వాచ్యం - ముఖం శిర ఇ త్యేకవచనప్రయోగవిరోధాత్ - నను తత్రాపి జాత్యేకవచనగ్రహణే న కోఽపి విరోధ ఇతి చే - త్క్రమసేన బకబన్ధప్రయాసే నే త్యల మతిప్రసఙ్గేన, శిథిలాయన్తే శిథిలా నీ వాచరన్తి జరాజర్జరభావశ్లిష్టసంధిబన్ధతయా కార్యకరణాసమర్థాని జాయన్త ఇ త్యర్థః, కింతు, ఏకా తృష్ణా, తరుణాయతే తరు ణీవాచరతి - బలిష్ఠా జా తే త్యర్థః, జరయా సర్వ మ ప్యేవం విశకలితం న తృ ష్ణేతి మహ దేత దాశ్చర్య మితి భావః - ఉభయ త్రాపి * 'కర్తుః క్య జ్సలోప శ్చే' తి క్యఙ్ * 'అకృత్సార్వధాతుకయో ర్దీర్ఘః' ఇతి దీర్ఘః.

శ్లోకాఖ్య మేత దానుష్టుభం వృత్తం - లక్షణం తు నీతిశతకాద్యపద్యే ఉక్తమ్.

---

నివృత్తా భోగేచ్ఛా, పురుషబహుమానో విగళితః,
సమానాః స్వ ర్యాతాః సపది సుహృదో జీవితసమాః,
శనై ర్యష్ట్యుత్థానం, ఘనతిమిరరుద్ధే చ నయనే,
అహోలూ ధృష్టః కాయ, స్త దపి మరణాపాయచకితః! 9.

టీక.—భోగ ఇచ్ఛా = భోగములందలి కోరిక, నివృత్తా = పోయినది, పురుష బహుమానః = మగవాఁడనెడి గౌరవము, విగళితః = జారిపోయినది; జీవిత సమాః = ప్రాణముతో తుల్యులును, సమానాః = వయఃప్రభృతులచేత సదృశులును, (అగు), సుహృదః = మిత్త్రులు, సపది = శీఘ్రముగానే, స్వః = స్వర్గమునకు, యాతాః = పోయినారు; శనైః = మెల్లగా, యష్టి ఉత్థానం = కఱ్ఱచేత లేచుట, (కలిగినది); నయనే చ = కన్నులును, ఘన తిమిర రుద్ధే = దట్టమయిన తిమిరమను కంటిరోగముచేత అడ్డఁబడినవి; త దపి = అయినను - ధృష్టః = దిట్టమైన, కాయః = దేహము, మరణ అపాయ చకితః = చావుచేతనగు నెడఁబాటునకు వెఱచినది (గా నున్నది).

తా.—భోగాశ పోయినది, పురుషుఁడ నను గౌరవము లేదు. ప్రాణమువలె ప్రియులయిన సాటి మిత్త్రులు ముందే స్వర్గమునకు గతించినారు, మెల్లగా కఱ్ఱ ఊనుకొని లేచుచున్నాను, కన్నులను తిమిరవ్యాధి కప్పియున్నది; ఇన్ని కడగండ్లపా లయినను, చావు అన్న ఈ మొండిదేహము భయపడుచున్నది. ఏమి ఈ యాశ్చర్యము!

శా. భోగాపేక్ష దొలంగెఁ, బూజ్యత సెడెం, బోరానిమిత్త్రుల్ మహా
భాగుల్ సెల్లిరి, దండ మూఁతగొనుటల్ ప్రాప్తించెఁ, గన్నుల్ తమో
రోగచ్ఛన్నము లయ్యె, దేహము జరారూఢంబు, ప్రాణానిల
త్యాగాపాయభయంబునన్ వడఁకెడుం దా నెంత సమ్మూఢమో.

వ్యా.—నివృ త్తేతి.—భోగేచ్ఛా విషయానుభవస్పృహా, నివృత్తా, అత్ర జరాదూషణాభినివేశపారవశ్యే నేత్థ ముక్తం - తేన 'తృష్ణైకా తరుణాయత' ఇ త్యవిరోధః, పురుష ఇతి యో, బహుమాన స్సమ్మాన, స్సోఽపి, † గళితః అపగత - స్తత్ప్రయోజకపౌరుషాద్యపాయా దితి భావః - య ద్వా - పురుషాణాం బహుమాన స్తత్కర్తృకసమ్మాన - స్సోఽపి † గళితః - పూర్వవ త్పురుషాదినా న బహుమన్యత ఇ త్యర్థః - ఇదానీం తాదృశగౌరవాలాభా దితి భావః, అథ పరేతబాన్ధవశోచనాపదేశేన స్వ స్యాపశదతాం సూచయ న్నాహ - జీవితసమాః ప్రాణతుల్యాః - అత్య న్తప్రాణతుల్యా ఇ త్యర్థః, సుహృదో బన్ధవ శ్చ, సమానా స్సబహుమానా స్స న్త, స్సపది సద్య ఏవ జరావస్థాయాః ప్రా గే వే త్యర్థః, స్వ ర్యాతాః స్వర్గం గతాః - నిజసుకృతపాకేన పుణ్యలోకం గతా ఇ త్యర్థః - జరాదుర్దశాపత్త్యా బహుమానరహితోఽహం న యాతో హీనజీవన



ఇతి భావః - యద్వా - సమానా స్సవయసః - జీవితసమా బన్ధవ శ్చ - సపది సద్య ఏవ దురవస్థాపత్తేః పూర్వ మే వేతి భావః - స్వ ర్యాతా లోకా న్తరం గతాః - న త్వహ మిత్యర్థః - ని. 'స్వ రవ్యయం స్వర్గనాకత్రిదివత్రిదశాలయాః' ఇ త్యమరః, నను కంచి త్కాలం స్థీయతాం కి మనేన అమఙ్గళాశంసనేనే త్యత ఆహ - శనై ర్మన్దం, యష్ట్యుత్థానం యష్ట్యవష్టమ్భనోత్థానం - ప్రాప్త మితి శేషః - పాదపాటవవిఘట్టనా త్స్వయ ముత్థానే సంచారే వా శక్తి ర్నాస్తీ త్యర్థః, న త్వేతావన్మాత్ర మేవ - కింతు నయనే చక్షుషీ చ * ప్రగృహ్యత్వా దస్య అహో ఇ త్యనేన సన్ధ్యభావః, ఘనం నిబిడం - య త్తిమిరం పటలాఖ్య నేత్రరోగవిశేషో వైద్యశాస్త్రప్రసిద్ధః - ని. 'తిమిరం ధ్వాన్తే నేత్రామయేఽపి చే'తి విశ్వప్రకాశ శ్చ - తేన రుద్ధే నిరుద్ధశుద్ధప్రసారే అర్థగ్రహణాసమర్థే జాతే ఇ త్యర్థః - అన్ధకపఙ్గుజీవనా ద్వరం మరణ మే వేతి భావః, ఏత త్సర్వ మనర్థజాతం జరాకృత మే వేతి హృదయం, త దపి తథాఽపి, మూఢః జ్ఞానహీనః, కాయో దేహః, మరణేన యోఽపాయో విశ్లేషః - నాశ ఇతి యావత్ - త స్మా చ్చకితో భీతః భవ తీతి శేషః; అత్ర దేహధర్మాః తదుపాధౌ దేహే ఉపచర్యతే, అహో ఈదృక్కష్టదశాయా మపి జీవితాశైవ బలీయసీ న విజ్ఞానోదయ ఇత్యాశ్చర్య మి త్యర్థః, ఏత దపి తృష్ణావిలసిత మే వేతి భావః. శిఖరిణీవృత్తమ్.

---

అవ.—ఆశ దాఁటరానిది, దాఁటినవారు మహాత్ములు.

ఆశా నామ నదీ మనోరథజలా తృష్ణాతరఙ్గాకులా
రాగగ్రాహవతీ వితర్కవిహగా ధైర్యద్రుమధ్వంసినీ
మోహావ ర్తసుదు స్తరాఽతిగహనా ప్రోత్తుఙ్గచిన్తాతటీ
తస్యాః పారగతా విశుద్ధమనసో నన్దన్తి యోగీశ్వరాః. 10.

టీ.—ఆశా నామ = ఆశ యనునది, నదీ = ఏఱు, మనోరథజలా = కోరికలనెడు నీళ్లుగలది, తృష్ణా...కులా - తృష్ణా = దొరకని వస్తువులమీఁది యభిలాషలనెడు - తరఙ్గ = అలలచే - ఆకులా = తల్లడిల్లుచున్నది, రాగ...వతీ - రాగ = స్నేహములనెడు - గ్రాహవతీ = మొసళ్లుగలది, వితర్కవిహగా - వితర్క = ఊహలనెడు - విహగా = పక్షులుగలది, ధైర్య...సినీ - ధైర్య = తమకమియును - ద్రుమ = చెట్టును - ధ్వంసినీ = కూల్చునది, మోహా...స్తరా - మోహ = అజ్ఞానవృత్తులనెడి - ఆవర్త = సుడులచేత - సుదు స్తరా = బొత్తిగా దాఁటనలవిగానిది, అతి గహనా = మిక్కిలి లోఁతయినది, ప్రోత్తుఙ్గ...తటీ - ప్రోత్తుఙ్గ = మిక్కిలి ఎత్తయిన - చిన్తా = చింతలనెడి - తటీ = ఒడ్డులుగలది, తస్యాః = దానియొక్క, పార గతాః = అవలిగట్టును బొందిన,

విశుద్ధ మనసః = నిర్మల చిత్తు లగు, యోగీశ్వరాః = మహాయోగులు, నన్దన్తి = ఆనం
దింతురు.

తా.—ఆశ నదివంటిది, కోరికలు దానినీళ్లవంటివి, అలభ్యవస్తువులకైన యభిలా
షలు కరటములవంటివి, రాగద్వేషములు మొసళ్లవంటివి, ఊహలు జలపక్షులవంటివి, ఆ
శచే, కూలెడుధైర్యము ఏటిచే కూలెడుచెట్లవంటిది, అజ్ఞానవృత్తులు సుడులవంటివి, చిం
తలు ఎత్తయిన యొడ్డులవంటివి, దానిస్వరూపము తెలియమి లోఁతువంటిది, ఆశను అణఁ
చుకొనలేమి ఏటినిదాఁటఁజాలమివంటిది, అట్టియాశను చిత్తశుద్ధిగల మహాయోగులు దాఁటి
ఆనంద మొందుదురు.

చ. కలితమనోరథంబు లుదకంబులు, తృష్ణలు భూరివీచికా
వళు, లనురాగముల్ మకరవర్గము, మోహవితర్కముల్ సుడుల్
పులుఁగులు గాఁగ, ధైర్యఫలభూజముఁ గూల్చుదురాశ పేరిపు
ష్కలనది దాఁటి నిత్యసుఖసంపద గాంతురు యోగిపుంగవుల్.

వ్యా.—న న్వేతాదృశతృష్ణా ముల్లఙ్ఘ్య స్వాత్మసుఖానుభవతత్పరా యే కేచన మ
హా న్తస్స న్తికి మి త్యాశఙ్క్య స న్త్యే వేతి నిగమయ ఙ్తస్యాః పృథక్సదుస్తరతరత్వ
ద్యోతనార్థం మహానదీత్వం రూపయతి - ఆశేతి.—మృష్టాన్నపానభోజన విచిత్రామ్బర
భూషణ షోడశవార్షికకామినీసంభోగాది గోచర మానసవ్యాపారా మనోరథా స్త
ఏవ జలాని యస్యా స్సా తథోక్తా, అప్రాప్యే ష్వ ప్యర్థేషు ప్రాప్త్యభిలాషవిశే
షాః తృష్ణా-స్తాభి రేవ తరఙ్గైః కల్లోలై-రాకులా సఙ్కులా, అభిమతవస్తుషు స్నేహో
రాగః - ఉపలక్షణ మేత ద్ద్వేషాదీనాం - తథా చ రాగద్వేషాదయ ఏవ - గ్రాహా న
క్రాదయ - స్త ద్వ్యస్యాం స న్తీతి త థోక్తా, తత్తత్పదార్థలాభాలాభగోచరాః విత
ర్కాః - త ఏవ విహగాః కారణ్డవాదిపక్షిణో - యస్యాం సా త థోక్తా, 'మనసో
నిర్వికారత్వం ధైర్యం స త్స్వపి హేతు ష్వి' త్యు క్తలక్షణం ధైర్యం-త దేవ ద్రుమః-
తం ధ్వంసయతి ఉన్మూలయ తీతి తథోక్తా, అజ్ఞానం మోహ ఏవ - తద్వృత్తయో
దమ్భదర్పాదయో లక్ష్యన్తే - తథా చ - మోహాః అజ్ఞానవృత్తయ - ఏ వావర్తా జ
లభ్రమా - స్తై స్సుదుస్తరా సుష్ఠు తరితు మశక్యా, అతిగహనా - ఏకత్ర దుర్విభావ్య
స్వాభావ్యా దన్యత్ర దురవగాహత్వా చ్చేత్థమితి నిర్ణేతు మశ క్యే త్యర్థః, ఇష్టాధిగమ
జనితధ్యానం చిన్తా-చిన్తా బహువిధత్వేఽపి చిన్తానాం తటద్వయరూపణోపయోగార్థం
ద్విత్వం వక్ష్యతే-తథా ప్రోత్తుఙ్గే అత్యున్నతే-చిన్తే ఏవ తటే-యస్యా స్సా తథోక్తా,
ఆశా నామ నైకవిధాత్యాయతతృష్ణా - ని. 'దశాఽవస్థానైకవిధాఽత్యాశా తృష్ణాఽపి
చాయ తే' త్యమరః, నా మేతి ప్రసిద్ధౌ - ఆ శేతి ప్రసిద్ధే త్యర్థః, యా నదీ వర్త
త ఇతి శేషః - యత్తదో ర్నిత్యసమ్బన్ధాత్, తస్యా ఆశానద్యాః, పారం గతాః జ్ఞాన



ప్లవే నేతి భావః, అత ఏవ విశుద్ధమనసో నిర్మలా న్తఃకరణా, యోగీశ్వరా మహా
యోగినః, నన్దన్తి బ్రహ్మానన్ద మనుభవ న్తీ త్యర్థః; అత స్సర్వథా తృష్ణాతరణోపాయో ఽ
న్వేషణీయః శ్రేయస్కామే నేతి భావః.

అత్ర ప్రవాహరూపే ణావిచ్ఛిన్నత్వసామ్యా దాశాయాం నదీత్వం - ప్రతికృతి
స్వరూపనిరూప్యత్వ సర్వతోముఖసంభృతత్వాది సాదృశ్యా న్మనోరథేషు జలత్వం -
మజ్జనోన్మజ్జనపారమ్పర్యేణ విరామాభావసాధర్మ్యా త్తృష్ణాసు తరఙ్గత్వం - దుష్టస్వాభా
వ్యేన గ్రసిష్ణుత్వ సామ్యా ద్రాగాదిషు గ్రాహత్వం - నానావిధగతిమత్త్వసాదృశ్యా
ద్వితర్కేషు విహగత్వం - స్థిరతరత్వస్వాభావ్యాత్ ధైర్యే ద్రుమత్వం - నిరన్తరదురన్త
భ్రామకత్వసాధర్మ్యా న్మోహే ష్వావర్తత్వమ్ - అగాధ భావద్యోతకత్వసారూప్యా
చ్చిన్తాసు తటత్వం చ-రూపిత మి త్యవగన్తవ్యమ్. అత ఏవ సమస్తవస్తువర్తి సావయ
వరూపకాలంకారః. వృత్త ముక్తమ్.

ఇతి వైరాగ్యశతకవ్యాఖ్యానే తృష్ణాదూషణం నామ ప్రథమదశకమ్.

———

## అథ విషయపరిత్యాగ విడమ్బనా.

న సంసారోత్పన్నం చరిత మనుపశ్యామి కుశలం,
విపాకః పుణ్యానాం జనయతి భయం మే విమృశతః,
మహద్భిః పుణ్యౌఘై శ్చిరపరిగృహీతా హి విషయాః
మహాన్తో జాయన్తే వ్యసన మివ దాతు ర్విషయిణామ్. 11.

టీ.—సంసార ఉత్పన్నం = సంసారమందు పుట్టిన, చరితం=ఆచరణము, కుశ
లం = శ్రేయమని, న అనుపశ్యామి = తలంపను, (ఏలన), పుణ్యానాం = సుకృతముల
యొక్క - విపాకః=పరిణామము, విమృశతః=విచారించుచున్న, మే=నాకు, భయం=
వెఱపును, జనయతి = కలిగించుచున్నది, (ఏలయన), మహద్భిః పుణ్య ఓఘైః =
గొప్ప సుకృతముల మొత్తములచేత, చిర పరిగృహీతాః = చిరకాలము అనుభవింపబడిన,
విషయాః =భోగములు, విషయిణాం = భోగాసక్తులకు, వ్యసనం=దుఃఖమును, దాతు
మివ = ఇచ్చుటకే, మహాన్తః = గొప్పవి, జాయన్తే = అగును.

తా.—సంసారచర్య శ్రేయ మని నాకుఁ దోఁపదు. పుణ్యకర్మలవలనిస్వర్గాదిఫలా
నుభవమును పర్యాలోచించుకొనఁగా నాకు భయమే కలుగుచున్నది. గొప్పపుణ్యపరం
పరలఫలముగా ననుభవింపఁబడు స్వర్గాదిభోగములు 'అయ్యో! ఇవి కొన్నాళ్లకు ముగిసి
పోవునుగదా, అయ్యో! 'ముగిసి పోయెను గదా' అని యిట్టివిధముగా దుఃఖమునే
కలిగించునవి.

చ. భవమునఁ బుట్టుసత్క్రియ శుభం బని చూడము, పుణ్యకర్మగౌ
రవఫల మైనసంపద కరంబు భయావహ మెన్ని చూచినం,
బ్రవిమల పూర్వపుణ్య సముపార్జిత చందనముఖ్యభోగవై
భవమును భోగశీలుర కపాయము చేయను వృద్ధిఁ బొందెడున్.

వ్యా.—యదుక్తం యోగిన స్తృష్ణానదీం తీర్త్వా నన్దన్తీతి-తత్ర విషయపరిత్యాగ మన్తరా తదసంభవా దథ విషయపరిత్యాగవిడమ్బ నోచ్యతే - అథేతి.—అథ తృష్ణాదూషణానన్తరం, విషయాణాం రూపాదీనాం - ని. 'రూపం శబ్దో గన్ధరస స్పర్శాశ్చ విషయా అమీ' త్యమరః - యద్వా - స్రక్చన్దనవనితాదిభోగ్యవస్తూనాం - పరిత్యాగ స్సన్న్యాస - స్తస్య విడమ్బనాఽనుకరణ మభినయ ఇతి యావత్ - ఉచ్యత ఇతి శేషః - తత్ప్రకార మే వాహ దశభిః - న సంసారోత్పన్న మితి.—సంసారే అనాదిభవపరమ్పరాయా - ముత్పన్న ముదితం - ఫలోద్దేశే నానుష్ఠిత మితి యావత్, చరితం పుణ్యాచరణమ్ * 'ఆదికర్మణి కర్తరి చే' తి కర్తరి క్తః, కుశలం క్షేమకరం, నానుపశ్యామి నానుసందధామీ త్యర్థః, కుత ఏతద్వైపరీత్య మిత్యాశఙ్క్యాత్రోపపత్తి మాహ విపాక ఇతి - పుణ్యానాం పురాకృతసుకృతానాం, విపాక స్సంపద్రూపపరిపాకః, విమృశతః తత్ఫలం పరామృశతః, మే మమ, భయం, జనయ త్యుత్పాదయతి - తత్పర్యాలోచనే సంపదాం పుణ్యక్షయలభ్యత్వేన విపద్రూపత్వా ద్భయజనకత్వ మిత్యర్థః - అత ఏవోక్తం కవికులసార్వభౌమేన శ్రీహర్షేణ - 'పూర్వపుణ్యవిభవవ్యయలబ్ధా స్సంపదో విపద ఏవ విమృష్టా' ఇతి - అథవా - పుణ్యానాం జ్యోతిష్టోమాదిసత్కర్మణాం, విపాకః స్వర్గాదిరూపఫలపరిణామః, విమృశతః పూర్వోత్తరం పర్యాలోచయతో, మే, భయం జనయతి 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తీతి' భగవద్వచనాత్-యావన్నియతకాలం స్వర్గసుఖ మనుభూయ పుణ్యక్షయే సతి పునర్మర్త్యలోకప్రవేశే మహావిషాదగర్భ నిరయవాస జన్మపరమ్పరా దుఃఖప్రభవత్వా ద్భయఙ్కరత్వ మిత్యర్థః, అతః కుశలం న పశ్యామీతి సంబన్ధః, ఏవం తత్ఫలభూతానాం భోగానా మప్యనర్థహేతుత్వ మే వే త్యాహ - మహద్భిః భూయిష్ఠైః, పుణ్యౌఘైః పుణ్యసంచయైః- హేతుభి, శ్చిరపరిగృహీతా శ్చిరకాల మారభ్య సంగృహీతా, విషయా శ్చ భోగా అపి, విషయిణాం విషయాసక్తానాం, వ్యసనం విపత్తిం దుఃఖ మితి యావత్, దాతు మివ దాతు మేవ - ఇవశబ్దోఽత్రావధారణార్థకః - న తూత్ప్రేక్షాభివ్యఞ్జకః - అన్యథాఽర్థాన్తరతా స్యా దితి వేదితవ్యం, మహాన్తః ప్రవృద్ధా, జాయన్తే భవన్తి - వ్యసనప్రదాన ప్రవణైవ ఏతద్వృద్ధిః నాన్యదానప్రవణే త్యర్థః ; ఏవ మైహికాముష్మిక భోగానా మనిష్టానుబన్ధిత్వా త్తత్త్యాగ ఏవ శ్రేయా నితి భావః. శిఖరిణీవృత్తమ్.

———



అవ.—విషయములను త్యజించుట సుఖ మొసంగును.

అవశ్యం యాతార శ్చిరతర ముషిత్వాఽపి విషయాః,
వియోగే కో భేద, స్త్యజతి న జనో యత్ స్వయ మమూన్?
వ్రజన్తః స్వాతన్త్ర్యా దతులపరితాపాయ మనసః,
స్వయం త్యక్తా హ్యేతే శమసుఖ మనన్తం విదధతి. 12.

టీ.—విషయాః = శబ్దాదిభోగములు, చిరతరం = దీర్ఘకాలము, ఉషిత్వా అపి = ఉండియు, అవశ్యమ్ = తప్పక, యాతారః = గతించునవి, యత్ = ఎందుచేత, జనః = మనుష్యుఁడు, అమూన్ = వీనిని, స్వయం = తనంతట, న త్యజతి = వదలఁడో, (తత్ = అందుచేత), వియోగే = (ఇవి తమంతట) గతించుటయందు, కో భేదః = ఏమివిశేషము, స్వాతన్త్ర్యాత్ = స్వయముగా, వ్రజన్తః సన్తః = గతించునవై, (ఇవి), మనసః = మనస్సునకు, అతుల పరితాపాయ = సాటిలేని దుఃఖముకొఱకు (దుఃఖము నిడును అనుట), స్వయం = (పురుషునిచేత) తనంతనే - త్యక్తాః = వదలఁబడినవై, ఏతే = ఇవి (విషయభోగములు), అనన్తం = తుదిలేని, శమ సుఖం = శాంతిసుఖమును, విదధతి హి = నిశ్చయముగా చేయును.

తా.—భోగములు ఎన్నాళ్లు అనుభవించినను నరుని తప్పక వదలునవే. అట్లుండ నరుఁడే వానిని స్వయముగానే వదలఁడేమి? అవియే స్వయముగా వగలిపోవుటయందుఁ గలవిశేష మేమి? మఱి, అవి స్వయముగా వదలిపోవుటయందు మనస్సునకు మహాదుఃఖమును కలిగించును, మనుష్యుఁడే వానిని స్వయముగా వదలునేని అతనికి అనంతమయిన శాంత్యానందము కలుగును. కావున వానిని మనుష్యుఁడు స్వయముగానే వదలివేయవలసినది అని యుపదేశము.

చ. ఉపగతితోడ నేగుఁ దడ వుండియు భోగము, లట్టివానిఁ దా
నరుఁడు పరిత్యజింపఁడు, కనం గనఁ దద్విరహంబు భిన్న మే?
పురుషుని భోగముల్ విడిచి భూరిమనోవ్యథ లాచరించు, నా
పురుషుఁడె భోగముల్ విడిచి పొందు నిరామయశాంతి సౌఖ్యముల్.

వ్యా.—అథ సర్వథా విషయాః పరిత్యాజ్యా ఇతి వక్తుం తేషాం వ్యవసితి మాహ - అవశ్య మితి.—విషయా భోగాః, శ్చిరతరం బహుకాలమ్, ఉషిత్వా స్థిత్వాఽపి * 'వసతి క్షుధో రి' తీడాగమః * 'వచిస్వపీ' త్యాదినా సంప్రసారణమ్, అవశ్యం నియతం సిద్ధ మితి యావత్, యాతారో గన్తారః - ఆగమాపాయిత్వే నాస్థిరత్వా త్పరిచయానాదరేణ పురుషం త్యక్త్వా యాతార ఏవ - న తు పరిచయవశా ద్యావజ్జీవం స్థాతార ఇత్యర్థః - తదుక్తం భగవతా -

'మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః -
ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత.' ఇతి -

* యాతేర్లట్, అతః వియోగే విషయవిరహే, కో భేదః కో వా విశేషః న కోఽపీ త్యర్థః - స్వకర్తృకత్యాగే వా పురుషకర్తృకత్యాగే వా తస్య జాయమానత్వాదితి భావః, తథాహి, యద్యస్మాత్కారణాత్, జనో విషయాసక్తః పుమాన్, అమూన్ విషయాన్, స్వయం న త్యజతి గుణాన్ గృహీత్వా న విసృజతి - స్వయమేవ త్యజతి చేత్తర్హి తేన కృతార్థో భవే దితి భావః - ఏతేన విషయకర్తృకత్యాగే తు న కృతార్థత్వ మితి సూచ్యతే, నను కుత ఏత ద్వైషమ్య మి త్యాశఙ్క్య తత్ర వ్యవస్థా మాహ - స్వాతన్త్ర్యాత్ కర్తృత్వాత్ - స్వాచ్ఛన్ద్యా దితి యావత్ * 'స్వతన్త్రః కర్తే' త్యనుశాసనాత్, త్యజన్తః పురుషం విసృజన్త స్సన్తః - విషయా ఇతి శేషః, మనసః, అతులపరితాపాయ దురన్త సంతాపాయ భవ న్తీతి శేషః - అత్యన్తదుఃఖకారిణో భవ న్తీ త్యర్థః, స్వయం స్వేన కర్త్రా పురుషేణ, త్యక్తాః తుచ్ఛత్వభావనయా విసృష్టా శ్చే త్తర్హి, ఏతే విషయా, అనన్త మపరిచ్ఛిన్నం, శమసుఖం పరమానన్ద మితి యావత్, విదధతి కుర్వన్తి హి - హి రవధారణే - త దుక్తం -

'య చ్చ కామసుఖం లోకే య చ్చ దివ్యం మహ త్సుఖం -
తృష్ణాశమసుఖ స్యైతే నార్హత షోడశీం కళామ్.' ఇతి ;

అతోఽనర్థాపాదక విషయకర్తృక త్యాగా త్పూర్వ మేవ స్వయం తత్త్యాగతత్పరేణ భవితవ్యం శ్రేయస్కామే నేతి భావః. వృత్తం పూర్వవత్.

---

**అవ.**—బ్రహ్మజ్ఞానులు భోగములను త్యజింపఁగలరుగాని ఇతరులు త్యజింప లేరనుట.

బ్రహ్మజ్ఞానవివేకి†నో ఽమలధియః కుర్వ న్త్యహో దుష్కరం
య న్ముఞ్చ న్త్యుపభోగభా జ్యపి ధనా న్యేకాన్తతో నిఃస్పృహాః!
న ప్రాప్తాని పురా, ††న సంప్రతి, న చ ప్రాప్తౌ దృఢప్రత్యయో,
వాఞ్ఛామాత్రపరిగ్రహా ణ్యపి పరం త్యక్తుం న శక్తా వయమ్.

**టీక.**—బ్రహ్మజ్ఞానవివేకినః = బ్రహ్మమునుగూర్చిన ఎఱుకచే వివేకముగలవారగు, అమల ధియః = శుద్ధచిత్తులు, యత్ = ఎందుచేత, ఉపభోగభాఞ్జి అపి = అనుభవపడుచున్నవాని నైనను, ధనాని = ధనములను, ఏకాన్తతః = బొత్తిగా, నిఃస్పృహాః = కోరికలేనివారై, ముఞ్చన్తి = వదలుదురో, (తత్ = అందుచేత), దుష్కరం = అశక్యమును, కుర్వన్తి = చేయుచున్నారు, అహో = ఆశ్చర్యము, పురా = పూర్వము, ప్రాప్తాని న = దొరకినవి కావు, సంప్రతి = ఇప్పుడు, న = లేవు, ప్రాప్తౌ = దొరకుట



యందు, దృఢప్రత్యయః న = గట్టి నమ్మికయు లేదు, వాఞ్ఛామాత్రపరిగ్రహాణి అపి = కోరికచేతమాత్రమే పట్టుగలవానినైనను, త్యక్తుం = విడుచుటకు, వయం = మేము, పరం = బొత్తిగా, శక్తాః న = సమర్థులము కాము.

**తా.**—బ్రహ్మజ్ఞానముచేత వివేకమొందిన శుద్ధాత్ములు ఒకయశక్యకృత్యమును చేయుచున్నారు, అది యే దన - వారు ధనములను తమ యనుభవములోనున్నవానినే ఇంచుకయేనియు అపేక్షింపక వదలివైచుచున్నారు. మాకు ధనములు ఇంతకు ముందు దొరకను లేదు, ఇప్పుడును లేనే లేవు, ఇఁకనేని దొరకు నని నమ్మక మయినను లేదు; అట్టి యాధనములమీఁది కోరికను సయితము (ధనములనుకాదు సరియే గదా) వదలుటకు మేము అసమర్థుల మై యున్నాము.

చ. అనఘులు బోధపూర్ణులు మహాత్ములు భోగనిధాన మౌ మహా
ధనముఁ బరిత్యజింతురు గతస్పృహు లై పరమాద్భుతంబుగా ;
మునుపును బొంద, కిప్పుడును ముట్టక, నింకనుఁ జెందలేక, నె
మ్మనమునఁ దోఁచుభోగముల మానఁగఁ జాలము మే మొకింతయున్.

**వ్యా.**—నను కీదృగ్విధాః పురుషా విషయత్యాగసమర్థా ఇ త్యాకాఙ్క్షాయాం జ్ఞానిన ఏవ సమర్థా న తు మాదృశా ఇ త్యాహ - బ్రహ్మేతి.—బ్రహ్మజ్ఞానేన మోక్ష-వివేక స్తత్త్వవిచార - స్తేన - † నిర్మలా నిష్కళఙ్కా - అసంభావనాదిరహి తేతి యావత్ - సా ధీ ర్యేషాం తే జ్ఞానవన్త ఇ త్యర్థః, దుష్కరం కర్తు మశక్యం, కుర్వన్తి, అహో ఇ త్యాశ్చర్యే, కిం త ద్దుష్కర మి త్యాహ - య ద్యస్మా, దుపభోగం భజన్తీ త్యుపభోగభాఞ్జి స్రక్చన్దనాదిభోగసాధనత్వే నానుభూయమానా న్యపీ త్యర్థః - ధనాని విత్తాని, నిస్పృహా నిరీహా స్సన్తః, ఏకాన్తతః నితాన్తం నిరవశేష మితి యావత్, ముఞ్చన్తి విసృజన్తి, ఇద మే వాతిదుష్కర మత్యన్తాశ్చర్యం చే త్యర్థః, వయ మస్మద్విధా జ్ఞానిన స్తు, పురా పురాతనకాలే న సంప్రాప్తా న్యాధిగతాన్, †† సంప్రతీదానీం వర్తమానకాలేఽపి, ప్రాప్తౌ వా భవిష్యత్కాలలాభేఽపి వా, న దృఢప్రత్యయా స్న దృఢవిశ్వాసాన్ - అవిశ్వసనీయా నితి యావత్ - కాలత్రయేఽప్యసంభావ్యమానా నిత్యర్థః - ని. 'ప్రత్యయోఽధీన శపథ జ్ఞాన విశ్వాస హేతు ష్వి' త్యమరః, కిం తు, వాఞ్ఛామాత్రపరిగ్రహా న్మనోరథమాత్రసంగృహీతాన్ - మనోవ్యాపారమాత్ర గోచరీకృతా నపీ త్యర్థః - అనుభూయమానానాం స్తు కి ము తేతి భావః - విషయా నితి శేషః, త్యక్తుం, పర మత్యన్తం, న శక్తా అసమర్థాః - అత స్త ఏవ ధన్యా ఇతి భావః- 'శకధృషే' త్యాదినా తుమున్ ; విషయపరిత్యాగే బ్రహ్మజ్ఞాన మేవ ముఖ్యసాధన - మత స్తత్సంపాదనేన తత్పరిత్యాగోఽవశ్యం కర్తవ్య ఇతి ఫలితార్థః.

శార్దూల విక్రీడితమ్.

---

అవ.—మరల ఆమాటయే.

ధన్యానాం గిరికన్దరేషు వసతాం జ్యోతిః పరం ధ్యాయతామ్
ఆనన్దాశ్రుజలం పిబన్తి శకునా నిఃశఙ్క మఙ్కేశయాః ;
అస్మాకం తు మనోరథోపరచితప్రాసాదవాపీతట
క్రీడాకాననకేళికౌతుకజుషా మాయుః పరిక్షీయతే. 14.

టీక.—గిరి కన్దరేషు = కొండ గుహలయందు, వసతాం = వసించుచు, పరం జ్యోతిః = పర బ్రహ్మమును, ధ్యాయతాం = ధ్యానించుచు (ఉండు), ధన్యానామ్ = పుణ్యవంతులయొక్క, ఆనన్ద అశ్రు జలం=సంతోషమువలని బాష్పనీరమును, నిశ్శఙ్కం =జంకులేక, అఙ్కే శయాః = ఒడియందు నెలకొన్న, శకునాః = పక్షులు, పిబన్తి = త్రాగుచున్నవి, అస్మాకం తు = మా కన్ననో, మనో...జుషాం - మనోరథ = కోరికల చేత - ఉపరచిత = నిర్మింపఁబడిన - ప్రాసాద = మేడలందును - వాపీ తట = డిగ్గియల గట్టులందును, క్రీడాకానన = ఆటతోఁటలందును - కేళి = విహారములందలి- కౌతుక జుషాం = కుతూహలమును పొందియున్నవారికి (...పొందియుండఁగా), ఆయుః = జీవితకాలము, పరిక్షీయతే = క్షయించుచున్నది.

తా.—పుణ్యాత్ములు కొండగుహలందు వసించి పరమాత్మధ్యానమందు ఉండఁగా, ఆధ్యానమువలన వారి నేత్రములనుండి తొరఁగు నానందబాష్పములను వారియొడిలో నెలకొని పక్షులు త్రాగుచుండును; వారికాలము అట్లు గడచుచుండును. మఱి మేమన్న నో, మామనస్సులోనే కోరికలతో మేడలను దిగుడు బావులను, ఆటతోఁటలను కల్పించుకొని, ఆమేడలయందును, ఆబావుల దరులయందును, ఆతోఁటలయందును క్రీడలను అనుభవించుచు, ఆయుస్సును క్షయమొందించుచున్నాము. గొంతెమకోరికలతో నాసిల్లుచున్నామనుట.

చ. గిరిగుహలన్ వసించి వృషకేతనచింతన మాచరించుస
త్పురుషులసమ్మదాశ్రుకణపుంజముఁ గ్రోలుచు నంకశయ్యలం
దిరవుగ నుండుఁ బక్షులు ; సమిద్ధమనఃకృతసౌధవాపికా
వరవనకేళిశీలు రగువారల కాయువె విక్షతం బగున్.

వ్యా.—ఉక్త మేవార్థం భఙ్గ్యన్తరే ణాహ - ధన్యానా మితి.—గిరికన్దరేషు గిరిగహ్వరేషు - ని. ‘దరీ తు కన్దరో వా స్త్రీ’ త్యమరః, వసతాం వివిక్తతయా వర్తమానానాం - ‘వివిక్తసేవీ లఘ్వాశీ’ తి వచనా దితి భావః, తథా, పరం జ్యోతిః పరం బ్రహ్మ, ధ్యాయతాం, ధన్యానాం పుణ్యశాలినాం - ని. ‘సుకృతీ పుణ్యవాన్ ధన్య’ ఇత్యమరః, ఆనన్దేన యే - అశ్రుకణాః బాష్పబిన్దవః-తాన్, నిశ్శఙ్కం తేషాం తపః ప్రశాన్తత్వా న్నిర్భయం యథా తథా, అఙ్కే * శేరత ఇత్యఙ్కేశయాః ఉత్సఙ్గవర్తినః *‘అధికరణే శేతే రి’ త్యచ్ప్రత్యయః, శకునాః పక్షిణః, పిబన్తి, కింతు, మనోరథేన వాఞ్ఛామాత్రే - ణోపరచితాః యాః-ప్రాసాదేషు హర్మ్యేషు - వాపీతటే ష్వల్పసరస్తీరేషు - క్రీడాకాననే షూద్యానేషు చ - కేళయో విహారా - స్తాసు - కౌతుకజుషా మౌత్సుక్యభాజా - మస్మాక, మాయుః పరమ్ ఆయు రేవ, క్షీయతే నశ్యతి - దుర్లభవిషయచిన్తాతత్పరైః వృథా కాలో యాపితః - న తు తత్ బ్రహ్మజ్ఞానం సంపాదితమ్ - అతో వయ మపి తథా న ధన్యా ఇతి భావః. వృత్త ముక్తమ్.



---

అవ.—విషయభోగాభిలాష నిర్విణ్ణునిసయితము విడువ దనుట.

భిక్షాఽశనం, త దపి నీరస మేకవారం,
శయ్యా చ భూః, పరిజనో నిజదేహమాత్రమ్,
వస్త్రం సుజీర్ణశతఖణ్డమయీ చ కన్థా,
హాహా! తథాఽపి విషయాన్ న జహాతి చేతః! 15.

టీక.—అశనం = అన్నము, భిక్షా = బిచ్చము; త దపి = అదియును, నీరసమ్ = పుష్టిలేనిది, (అదియును), ఏకవారం = ఒకమాఱే (ఒక్కపూఁటయే, అనుట), శయ్యా చ = పడకయు, భూః = (వట్టి)నేల, పరి జనః = బలగము, నిజ దేహ మాత్రం = తన యొడలు మాత్రమే, వస్త్రం చ = గుడ్డయు, సుజీర్ణ...మయీ - సుజీర్ణ= మిక్కిలి ప్రాఁతగిలిన-శతఖణ్డ మయీ=నూఱుప్రేలికలతో చేయఁడిన, కన్థా = బొంత; తథా అపి = అట్లయినను, హాహా = అయ్యయ్యో, చేతః = మనస్సు, విషయాన్ = విషయభోగములను, న జహాతి = విడువదు.

తా.—అన్నమునకు గతిలేక, దినమున కొకపూఁటమాత్రమే మధుకరవృత్తిచే దొరకిననీరసాన్నమును భుజించుచు, చాఁపయేని లేక వట్టినేలనే పరుండుచు, తనకాలుసేతులే తనసేవకులుగా, నూఱుప్రాఁతగుడ్డ ప్రేలికలు కుట్టినబొంతకన్న వేఱు వస్త్రము లేక బ్రదుకుచుండుప్రాణి సయితము విషయభోగాపేక్షను విడువఁజాలఁడు.

చ. నిరతముఁ దిండి బిచ్చ మగు, నీరస, మద్దియు నొక్కపూఁటయే,
ధరణితలంబు సెజ్జ, సతతంబును దోడు శరీరమాత్రమే,
చిరుఁగులచీరతుక్కగమిచేత నమర్చినబొంత పుట్ట, మీ
కరణి మెలంగినన్ విషయకాంక్ష లొకింతయుఁ బాయ వక్కటా.

వ్యా.—అథ కస్యచి ద్విషయాభిభూతస్య నిర్వేదనవచన మభినీ యాహ భిక్షాశన మితి.—భిక్షా భైక్ష మి త్యర్థః, అశన మాహారః, త దపి భిక్షాన్నాశన మపి, నీరసం

మధురామ్లాదిరసహీనం, త దప్యేకవారం - న తు ద్విత్రివార మిత్యర్థః, శయ్యా శయనీయం చ, భూః - సాఽప్యాస్తరణాదిరహి తేతి భావః, పరిజనః సేవకజనః, నిజదేహమాత్రం స్వస్య స్వయ మేవ పరిజనో న తు కశ్చి దన్యోఽస్తీత్యర్థః, వస్త్ర మాచ్ఛాదనం చ, విశీర్ణా శత ఖణ్డమయీ విశేషేణ జీర్ణాఽనేక చీవరశకలనిర్మితా, కన్థా, తథాఽపి ఈదృక్కష్టదశాయా మపి, విషయాః భోగవాఞ్ఛాః, న పరిత్యజన్తి న విసృజన్తి - మా మితి శేషః, హా హేతి విషాదవిస్మయాతిశయాభినివేదనార్థా ద్విరుక్తిః, పాపిష్ఠా ఇమే విషయా హత మేవ ఘ్నన్తీతి భావః.

అత్ర విషయపరిత్యాగకారణసామగ్ర్యాం సత్యాం కార్యానుదయా ద్విశేషోక్తి రలంకారః - 'తత్సామగ్ర్యా మనుత్పత్తి ర్విశేషోక్తి ర్నిగద్యత' ఇతి లక్షణాత్.

వసన్తతిలకావృత్తమ్.

---

అవ.—పురుషులకు విరక్తిపుట్టించుటకైన స్త్రీదూషణ.

స్తనౌ మాంసగ్రన్థీ, కనకకలశా విత్యుపమితౌ;
ముఖం శ్లేష్మాగారం, త దపి చ శశాఙ్కేన తులితమ్;
స్రవన్మూత్రక్లిన్నం, కరివరశిరఃస్పర్ధి జఘనం;
ముహు! ర్నిన్ద్యం రూపం కవిజనవిశేషై ర్గురు కృతమ్. 16.

టీక.—కవిజన విశేషైః = కొందఱుకవులచేత, మాంసగ్రన్థీ = మాంసపుఁ గణుతులగు, స్తనౌ = చన్నులు, కనకకలశౌ = బంగరుగిండులు, ఇతి = అని, ఉపమితౌ = పోల్పఁబడినవి, శ్లేష్మ అగారం = కఫమునకు ఉనికిపట్టయిన, ముఖం = మొగము, శశాఙ్కేన = చంద్రునితో, తులితం = పోల్పఁబడినది, స్రవ...క్లిన్నం - స్రవత్ = ఓడుచున్న - మూత్ర = మూత్రముచేత - క్లిన్నం = తడిసిన, జఘనం = మొల, కరివర శిరః స్పర్ధి - కరివర = గొప్పయేనుఁగుయొక్క - శిరః = కుంభస్థలములతో - స్పర్ధి = మచ్చరించునది, (అని యీరీతిగా), ముహుః = మాటిమాటికి, నిన్ద్యం రూపం = దూష్యమయిన (స్త్రీ) రూపు, గురు = గొప్పదిగా, కృతమ్ = చేయఁబడినది (వర్ణింపఁబడినది అనుట).

తా.—మాంసపుఁగణుతు లగు చన్నులను బంగరుగిండ్లవంటి వనియు, కఫమునకు ఉనికిపట్టయిన ముఖమును చంద్రునివంటి దనియు, మూత్రముయొక్క ఓడికలకు తడిసియుండు మొలను గజేంద్రకుంభస్థలములవంటి దనియు, ఈరీతిగా, కొందఱుకవులు, ఎంతయు రోయవలసిన దగు స్త్రీరూపమును గొప్పచేసి వర్ణింతురు.

చ. స్తనములు మాంసపిండములు చక్కనిబంగరుకుండ లంచు, నా
ననము కఫాలయంబు దుహినద్యుతితుల్య మటంచు, మూత్రభా
జనజఘనస్థలంబు కరిచారుశిరస్సమ మంచుఁ, గామినీ
జనమలినాంగముల్ సుకవిచాతురి వర్ణన కెక్కె నిమ్మహిన్.



వ్యా.—అథ విషయాణాం కామినీప్రాధాన్యా త్తద్దూషణాభావే తత్పరిత్యాగో న సుకర ఇతి మనసి నిధాయ తాం దూషయతి- స్తనావితి.— స్తనౌ కుచౌ, మాంసగ్రంథీ మాంస పిణ్డౌ, తథాఽపి, కనకకలశౌ అనర్ఘ్యహిరణ్మయకుమ్భౌ, విత్యుపమితౌ ఉపమావిషయీకృతౌ-కనకకలశకల్పత్వే నోపవర్ణితా విత్యర్థః, ముఖం వక్త్రం తు, శ్లేష్మాగారం కఫ లాలా దన్తమ లాది స్థానం, త దపి చ, శశాఙ్కేన సుధారసమయేన చన్ద్రేణ, తులితం సమీకృతం - తత్తుల్యత్వే నోపవర్ణిత మిత్యర్థః * అత్ర తులిత శబ్దస్య సాదృశ్యవాచిత్వా త్తద్యోగేఽపి న * 'తుల్యార్థై రతులోపమాభ్యా మి'తి తృతీయాప్రతిషేధః - అత్ర సూత్రే సదృశవాచిన ఏవ గ్రహణా దితి, జఘనం కటిపురోభాగ స్తు - ని. 'పశ్చా న్నితమ్బః స్త్రీకట్యాః క్లీబే తు జఘనం పుర' ఇత్యమరః, స్రవతా మదనసదనదార్ఢ్యాభావా ద్ద్రవతా - మూత్రేణ - క్లిన్న మార్ద్రమ్ - అపవిత్ర మిత్యర్థః, త దపి, కరివరశిరఃస్పర్ధి మదజలపరిప్లుతిశ్లాఘ్యగజేన్ద్రకుమ్భస్థలసదృశ మిత్యుపవర్ణిత మితి భావః, అతః, ముహుః పౌనఃపున్యేన, నిన్ద్యం గర్హ్యాద్యాకారేణ జుగుప్స్యం, రూపం స్తనాద్యవయవస్వరూపం - కామిన్యా ఇతి శేషః, కవిజనవిశేషైః తత్తద్విశేష కల్పనా చతుర కవీశ్వరైః, గురు కనకకలశాది సాదృశ్య వర్ణనేన శ్రేష్ఠం, కృతం, కవిజనవాఙ్మాత్రసార మేవైత ద్రూపం న తు స్వతస్సిద్ధసారవ దితి భావః. అత్ర మాంసగ్రన్థిత్వేన స్తనయో ర్మర్దనానర్హత్వం, శ్లేష్మాగారత్వేన ముఖస్య చుమ్బనాద్యయోగ్యత్వం, స్రవన్మూత్రక్లిన్నత్వేన జఘనస్య హేయతయా సంభోగాపాత్రత్వం చ, సూచితమ్. ఏతత్కృత ఏవ కామినీనాం సంభోగాస్పదత్వే నాభిమతత్వమ్-ఇద మేవేత్థం జుగుప్సితత్వేన దూషితం చే త్తర్హి కి మన్య త్కామిన్యాం భోగయోగ్య మస్తీతి శ్లోకతాత్పర్యమ్ - త దుక్తం -

'హాసోఽస్థిసందర్శన మక్షియుగ్మ మత్యుజ్జ్వలం త త్కలుషం వసాయాః
స్తనౌ చ పీనౌ పిశితాస్రపిణ్డౌ స్థానాన్తరే కిం నరకో న యోషిత్?' ఇతి.

---

ఏకో రాగిషు రాజతే ప్రియతమాదేహార్ధధారీ హరో,
నీరాగేషు జనో విముక్తలలనాసఙ్గో న యస్మా త్పరః,
దుర్వారస్మరబాణపన్నగవిషవ్యావిద్ధముగ్ధో జనః
శేషః కామవిడమ్బితా న్న విషయా న్భోక్తుం న మోక్తుం క్షమః.

టీక.—నీరాగేషు=విరక్తులయందును, విముక్త లలనా సఙ్గః=విడువఁబడిన కాంతతోడి తగులముగలవాఁడైన, జనః = పురుషుఁడు - యస్మాత్ = ఏశివునికంటె, పరః= అధికుఁడు, న = లేఁడో, ప్రియ...హారీ - ప్రియతమా = ప్రేయసియొక్క (పార్వతియొక్క) - దేహ = శరీరముయొక్క - అర్ధ = సగమును - ధారీ = మోచువాఁడైన - హరః= ఆశివుఁడు, ఏక ఏవ = ఒక్కఁడే, రాగిషు=కాముకులందు, రాజతే = వెలుఁగుచున్నాఁడు; శేషః జనః (తు) = తక్కిన జనుఁడు అన్నమో, దుర్వార...ముగ్ధః - దుర్వార=వారింపనలవికాని - స్మర బాణ = మదన బాణములనెడి - పన్నగ = పాములయొక్క - విష = విషముచేతను - (విషమువంటిదైనమరులుచేతను) - వ్యావిద్ధ = కొట్టఁబడి - ముగ్ధః = మూఢుఁడై (మూర్ఛితుఁడైయనియు), కామ విడమ్బితాన్ = మన్మథునిచేత మోసముగాఁ గల్పింపఁబడిన, విషయాన్ = విషయములను, భోక్తుం = అనుభవించుటకును, మోక్తుం వా = వదలుటకును, క్షమః న = సమర్థుఁడు కాఁడు.

తా.—కాంతాసంగమును వదలి నిష్కాములలో అగ్రేసరుఁడైనశివుఁడు తన ప్రియను దేహార్ధమందు ధరించి కాముకులయందును అగ్రేసరుఁడై ఒప్పారుచున్నాఁడు. ఇతరు లన్నమో పామువిషమునకు మూర్ఛిల్లినట్లు మదనబాణమునకు మరులుపాలై కామకల్పిత మిథ్యాభోగములను అనుభవించుటకేని త్యజించుటకేనియు శక్తులు గాకయున్నారు.

చ. కాముకులందు మే సగముఁ గాంతకు నిచ్చెను శంకరుండె, ని
ష్కాములలోనఁ బంచశరశాసనుకన్నఁ బరుండుఁ గల్డఁ, దు
ర్దామమనోజబాణవిషదగ్ధులు తక్కినమూఢు లోప రే
సీమల భామినీసుఖముఁ జేరి భుజింపఁ బరిత్యజింపఁగన్.

వ్యా.—అథైకః పరమేశ్వర ఏ వైకాన్తతోఽనురక్తో విరక్తశ్చ అన్య స్తు తథాఽననురక్తత్వా చ్చ పరిక్లిష్ట ఏ వే త్యాహ - ఏక ఇతి.—ప్రియతమాయాః పార్వత్యాః - దేహస్య శరీరస్య - అర్ధమ్ అర్ధభాగమ్ * 'అర్ధం నపుంసక మి' తి సమాసః - తద్ధర తీతి తథోక్తః - మహాకాముకతయా క్షణమాత్రవిశ్లేష స్యా ప్యసహిష్ణుత్వా న్నిజదేహవామార్ధపరిక్లృప్తప్రియతమ ఇ త్యర్థః - దేహార్ధధా రీతి చ పాఠః, ఏక ఏవ హరో, రాగి ష్వనురక్తేషు - కాముకే ష్వి త్యర్థః, రాజతే అప్రతినిధిత్వేన ప్రకాశతే - తాదృశకాముకా న్తర స్యానుపలభ్యమానత్వా దితి భావః, తథా, నీరాగేషు విరక్తే ష్వపి, విముక్త స్త్యక్తో - లలనాసఙ్గో యోషిదాసక్తి - ర్యేన స త థోక్తో, జనః వైరాగ్యపురుషో, యస్మా ద్ధరాత్, పరోఽన్యో, నా స్తి - తపశ్చరణసమయే మదనదహనాదినా తాదృగ్వైరాగ్యప్రకటనా త్తథావిధ విరక్తో న కశ్చి ద స్తీ త్యర్థః, కింతు, దుర్వారాః నివారయితు మశక్యాః - స్మరబాణా ఏవ - పన్నగా స్సర్పా - స్తేషాం విషేణ గరళేన - తత్స దృశేన వ్యామోహేన చ - వ్యావిద్ధో వ్యాక్షిప్తః - అత ఏవ - ముగ్ధో మూఢో



నిశ్చేష్ట శ్చ, శేషః అవశిష్టః, జనః, కామేన మన్మథేన హేతునా - విడమ్బితా ననుకృతాన్ - స్వీకృతా నితి యావత్, విషయాన్ స్త్రీసంభోగాదీన్, భోక్తు మనుభవితుం వా, మోక్తుం త్యక్తుం వా, న క్షమః తాదృగనురాగ విరాగోత్కర్షాభావా త్తథావిధభోగత్యాగయో రసమర్థ ఇ త్యర్థః; కర్తు మకర్తు మన్యథా కర్తుం సమర్థః పరమేశ్వర ఏక ఏ వానురక్తేషు విరక్తేషు చ పరాం కాష్ఠాం ప్రాప్త, స్తదన్య స్సర్వోఽప్యుభయభ్రష్ట ఏ వేతి భావః. స్మరబాణపన్న గే త్యత్ర రూపకాలంకారః. శార్దూలవిక్రీడితమ్.

---

అవ.—దుష్టము లని తెలిసియు మనుష్యులు విషయములను విడువమి ఆశ్చర్యము.

అజాన న్దాహాత్మ్యం పతతు శలభో దీపదహనే,
స మీనోఽ ప్యజ్ఞానా ద్బడిశయుత మశ్నాతు పిశితమ్,
విజానన్తోఽ ప్యేతే వయ మిహ విపజ్జాలజటిలా
న్న ముఞ్చామః; కామా నహహ గహనో మోహమహిమా.18.

టీక.—శలభః = మిడుత, దాహాత్మ్యం = కాల్చుట స్వభావముగాఁ గలిగియుండుటను, అజానన్ = తెలియక, దీపదహనే = దీపపునిప్పునందు, పతతు = పడునుగాక, సః మీనః అపి = ఆ చేప యు, అజ్ఞానాత్ = తెలివిలేమివలన, బడిశయుతం = గాలముతోఁ గూడిన, పిశితమ్ = మాంసమును, అశ్నాతు = తినునుగాక, ఇహ = ఈలోకమునందు, ఏతే వయం = ఈ మనము, విజానన్తః అపి = ఎఱుంగుచునే, విపత్ జాల జటిలాన్ = ఆపదల సమూహముచేత దట్టమైన, కామాన్ = విషయములను, న ముఞ్చామః = వదలకున్నాము, మోహమహిమా = అజ్ఞానముయొక్క ప్రభావము, అహహ = ఔరా, గహనః = ఊహింపనలవిగానిది.

తా.—కాల్చు నని తెలియక మిడుత దీపముపైఁ బడుటయు, గాలముగ్రుచ్చుకొను నని తెలియక చేప యెరను మ్రింగుటయు, ఆశ్చర్యములు గావు. విషయములు ఆపత్పరంపరతోఁ గూడియున్నవని యెఱింగియు మనము వానిని వదలలేకుండుట ఆశ్చర్యకరము. ఇదే అజ్ఞానముయొక్క వింతప్రభావము.

చ. తెలియక నాశహేతు వగు తీవ్రతరానలకీలలోపలన్
శలభము చొచ్చుఁ గాక, ఘటి చాలక మీనము గాలపుంగొనం
గలపిశితంబు తా మెసఁగుఁ గాక, యెఱింగియు మేము దుఃఖదో
హలవనితాసుఖంబు విడనాడము, మోహముహత్త్వ మెట్టిదో!

వ్యా.—అథ విషయదోషపరిజ్ఞానేఽప్యత్యాగే కారణ మాహ - అజాన న్నితి.— శలభః పతఙ్గః, దహ్యతే అనే నేతి దాహః * కరణే ఘఞ్ - తస్య ఆత్మనః స్వభావస్య

భావో దాహాత్మ్యం భస్మీకరణస్వాభావ్య మిత్యర్థః - ని. 'ఆత్మా, దేహే ధృతౌ జీవే స్వభావే పరమాత్మనీ' తి విశ్వః, అజానన్ అనవబుధ్యన్, తీవ్రదహనే జాజ్వల్యమానాగ్నౌ, పతతు ప్రవిశతు - ప్రవిశ్య భస్మీభవ త్వి త్యర్థః * సంభావనాయాం లోట్, తథా, స ప్రసిద్ధో, మీనో మత్స్యోఽపి, అజ్ఞానా దాత్మవినాశకారణమేత ది త్యవివేకాత్, బడిశ యుతం మత్స్యవేధన సందానితమ్ - అయోమయవక్రకణ్టకాగ్రస్యూత మి త్యర్థః, పిశితం మాంస, మశ్నాతు భక్షయతు - ఆమిషలోభా త్కణ్టకగిళనేన గళ నిరోధా త్సోఽపి మ్రియతా మి త్యర్థః - నాత్రానయో రపరాధః - నాజ్ఞాన మపరాధ్యతి - 'పతఙ్గమాతఙ్గకురఙ్గభృఙ్గమీనా హతాః పఞ్చభి రేవ పఞ్చ' తి చ న్యాయా దితి భావః - ని. 'బడిశం మత్స్యవేధనం'-'పిశితం తరసం మాంస మి' తి చామరః, కిం త్వి హాస్మిన్ లోకే, విజానన్తోఽపి వినిపాతహేతవ ఇతి వివేకవన్తోఽపి, ఏతే వయం, విపజ్జాలై రాపత్పరమ్పరాభి - జటిలాన్ గ్రథితాన్-ఉపద్రవహేతూనపీ త్యర్థః*పిచ్ఛాదిత్వా న్మత్వర్థీ యే లచ్ప్రత్యయః, కామాన్విషయా, న్న ముఞ్చామో న త్యజామః - విషయస్వరూప పరిజ్ఞానేఽప్యముఞ్చతా మస్మాక మే వాపరాధ ఇతి భావః * 'శే ముచాదీనా మి' తి ను మాగమః, విచార్యమాణే నాస్మా కమ ప్యపరాధః - ప్రబలతరకారణసద్భావా దిత్యాహ - మోహస్య అజ్ఞానస్య, మహిమా మాహాత్మ్యం, గహనో దుర్విజ్ఞేయః - అఘటితఘటనాపటుతరావిద్యావిలాస మహిమ్నా లోకే జనః అవిహిత మపి కరోతి - అతో నాస్మాక మపరాధ ఇతి భావః. శిఖరిణీవృత్తమ్.

---

అవ.—రోగప్రతిక్రియలను జనులు భోగము లని భ్రమపడుచున్నారు.

తృషా శుష్య త్యాస్యే పిబతి సలిలం శీతమధురం,
క్షుధార్తః శాల్యన్నం కబళయతి మాంసాదికలితమ్,
ప్రదీప్తే కామాగ్నౌ సుదృఢతర మాలిఙ్గతి వధూం,
ప్రతీకారం వ్యాధేః సుఖ మితి విపర్యస్యతి జనః. 19.

టీక.—తృషా = దప్పిచేత, ఆస్యే = నోరు, శుష్యతి సతి = ఎండఁగా, శీతమధురం = చల్లనితియ్యని, సలిలం = నీటిని, పిబతి = త్రాగును; క్షుధార్తః సన్ = ఆఁకటిచే పీడితుఁడై, మాంస ఆది కలితమ్ = మాంసము మొదలైన వానితో కలుపఁబడిన, శాల్యన్నం = వరియన్నమును, కబళయతి = భుజించును; కామాగ్నౌ = మదనానలము, ప్రదీప్తే సతి = మండఁగా, సుదృఢతరం = మిక్కిలి బిగువుగా, వధూం = స్త్రీని, ఆలిఙ్గతి = కౌఁగిలించుకొనును; (ఈతీరున), వ్యాధేః = రోగముయొక్క, ప్రతీకారం = మందును, సుఖమ్ ఇతి = భోగము అని, జనః = మనుష్యుఁడు, విపర్యస్యతి = పొరఁబాటు పడుచున్నాఁడు.

తా.—భోగము లనునవి లేనే లేవు. తీయని చల్లని నీరు దప్పికి మందు, మాంసాదులతోఁడివరియన్నము ఆఁకటికి మందు, జవరాలి బిగికౌఁగిలి మదనతాపమునకు మందు. ఇట్లు రోగములకు మందులయిన వీనిని మనుష్యుఁడు భోగము లని భ్రమపడుచున్నాఁడు.

చ. శీతలవారిఁ ద్రావు వడఁ జెందినవాఁడు, క్షుధార్తుఁ డిష్టమృ
ష్టాతతభక్ష్యమాంసకలితాన్నము సాపడు, మన్మథాగ్నితా
పాతురుఁ డైనవాఁడు జవరాలిఁ గవుంగిటిలోనఁ జేర్చు, నీ
రీతిని రోగశాంతికర కృత్యము భోగ మనంగఁ జెల్లునే.

వ్యా.—అజ్ఞానమహి మ్నైవ సుఖాభావే ష్వ ప్యన్నపానాదివిషయేషు సుఖబుద్ధిం కరో తీ త్యాహ - తృషేతి.—తృషా తృష్ణయా, ఆస్యే వక్త్రే, శుష్యతి శోషం ప్రాప్నోతి సతి, శీతం చ త న్మధురం చేతి విశేషణయో రపి మిథో విశేషణవిశేష్యభావ వివక్షాయాం * 'విశేషణం విశేష్యేణ బహుళ మి' తి సమాసః - శైత్యగుణయుక్తం సంతాపహరం చే త్యర్థః - 'శీతలీక్రియతే తాపో యేన త న్మధురం స్మృత మి' తి లక్షణాత్ - యద్వా - మధురం శర్కరాపానకవ న్మాధుర్యసంయుక్తం - సలిల ముదకం-పిబతి, తథా, క్షుధార్తః బుభుక్షాపీడిత స్సన్, మాంసాదినా మాంస ఘృత పయో దధ్యాదివ్యఞ్జనద్రవ్యే ణే త్యర్థః - కలితం రుచిరం స్వాదూకృత మి త్యర్థః * కలిః కామధేనుః, శాల్యన్నం, కబళయతి భుఙ్క్తే, తథా కామాగ్నౌ మదనదహనే, ప్రదీప్తే ప్రజ్వలితే సతి - మన్మథోద్రేకే స తీ త్యర్థః, సుదృఢతర మతిగాఢం, వధూం స్త్రియ, మాలిఙ్గ త్యాశ్లిష్యతి, అతః, వ్యాధేః క్షుత్తృష్ణాదిరూపామయస్య, ప్రతీకారం తదుపశాన్తి కరాన్నపానాలిఙ్గనరూపౌషధసేవనరూపప్రతిక్రియా మి త్యర్థః, సుఖం భోగ, ఇతి, జనో, విపర్యస్యతి విపర్యస్తబుద్ధిం ప్రాప్నోతి - న తు తత్త్వం జానా తీ త్యర్థః, అతస్మి న్తద్గ్రహో విపర్యాసః, అయం చ అజ్ఞానదుర్విలాస ఏ వేతి భావః.

---

తుఙ్గం వేశ్మ, సుతాః సతా మభిమతాః, సంఖ్యాతిగాః సంపదః,
కల్యాణీ దయితా, వయ శ్చ నవ మి, త్యజ్ఞానమూఢో జనః
మత్వా విశ్వ మనశ్వరం నివిశతే సంసారకారాగృహే,
సందృశ్య క్షణభఙ్గురం త దఖిలం ధన్య స్తు సన్న్యస్యతి. 20.

టీక.—తుఙ్గం = ఎత్తైన, వేశ్మ = ఇల్లు, సతాం = సాధువులకు, అభిమతాః = ఇష్టులైన, సుతాః = పుత్త్రులు, సఙ్ఖ్య అతిగాః = లెక్కను మించు, సంపదః =

సిరులు, కల్యాణీ = గుణవంతురాలగు, దయితా = కాంత, నవం వయః = క్రొత్త వయస్సు (యౌవనము), ఇతి = అనెడి, విశ్వం = సమస్తమును, అజ్ఞాన మూఢః = మోహముచే తెలివిపోయిన, జనః = జనుఁడు, అనశ్వరం = నశింపకుండు దానినిగా, మత్వా = తలఁచి, సంసార కారా గృహే = సంసారమనెడి చెఱ సాలయందు, నివిశతే = చొచ్చును, ధన్య స్తు = పుణ్యాత్ముఁడన్ననో, తత్ అఖిలం = దాని నంతయు, క్షణ భఙ్గురం = నిముసములో నశించు దానినిగా, సందృశ్య=కనుఁగొని, సన్న్యస్యతి= త్యజించును.

తా.—ఉన్నతములగు మేడలు, యోగ్యులగు కొడుకులు, కొలఁదికి మీఱిన సంపదలు, గుణవతియైన యిల్లాలు, లేఁబ్రాయము, ఇట్టి దెల్ల శాశ్వత మని నమ్మి మూఢుఁడు చెఱసాలయందుంబోలె సంసారమున తగులుకొనుచున్నాఁడు. జ్ఞానియగు ధన్యుఁడు వాని నెల్ల క్షణభంగురములనుగా నెఱింగి త్యజించుచున్నాఁడు.

చ. పొడువులు మాడువుల్, ఘనులు పుత్త్రులు, పెక్కులు రమ్యసంపదల్,
పడఁతుక చారుశీల, యల్రప్రాయ మటంచు, నరుండు మూఢుఁ డై
కడు జగమెల్ల శాశ్వతము గాఁ గొని సంసృతిబందిలోపలం
బడు; నిది మాయ యంచు మతిమంతుఁడు దా విడుచుఁ జ సమస్తమున్.

వ్యా.—ఏవం తావ దజ్ఞో జన స్సంసారవిషయాసక్త్యా బద్ధో భవతి - జ్ఞానీ తు సర్వసఙ్గం పరిత్యజ్య కృతకృత్యో భవ తీతి నిగమయతి - తుఙ్గ మితి.—వేశ్మ ప్రాసాదాది, తుఙ్గ మున్నతం, సుతాః పుత్త్రాః, స్సతాం సాధూనాం - విదుషామ్, అభిమతా ఇష్టా - స్సంప్రాప్తవిద్యావినయాదిగుణా ఇ త్యర్థః * 'మతిబుద్ధీ' త్యాదినా వర్తమానార్థే క్తః - అత ఏవ * 'క్తస్య చ వర్తమాన' ఇతి షష్ఠీ - ప్రతిపదవిధానా షష్ఠీ న సమస్యత ఇతి వక్తవ్య మితి సమాసనిషేధః, సంపదః ధనధాన్యాదిద్రవ్యసమృద్ధయః, సంఖ్యాతిగాః అసంఖ్యేయాః - అపరిమితా ఇ త్యర్థః, దయితా ప్రియతమా - కల్యాణీ ఆనుకూల్యాదిగుణసంపన్నత్వా చ్ఛోభనా - త దుక్తమ్ -

'అనుకూలాం విమలాఙ్గీం కులజాం కుశలాం సుశీలసంపన్నాం
పఞ్చలకారాం భార్యాం పురుషః పుణ్యోదయా ల్లభతే.'

వయ శ్చ, నవం నూతనం - యౌవన మి త్యర్థః - ని. 'వయః పక్షిణి బాల్యాదా వి' త్యమరః, ఇ త్యేవ, మజ్ఞానేన మోహేన - మూఢో వివేకశూన్యో, జనః, విశ్వం గృహాపత్యవిత్తదారాదిప్రపఞ్చమ్, అనశ్వరం శాశ్వతం, మత్వా ఆలోచ్య, సంసార ఏవ కారాగృహం బన్దీగృహం - తత్ర, నివిశతే ప్రవిశతి - తత్రాసక్తో భవ తీ త్యర్థః - న తు త స్యానర్థమూలత్వం జానా తీతి భావః * 'నే ర్విశ' ఇ త్యాత్మనే పదమ్ - అతిసంకటతయా పరమనిర్బన్ధహేతుత్వా త్సంసారస్య కారాగృహత్వరూపణం - ని.



'కారా స్యా ద్బన్ధనాలయ' ఇ త్యమరః, ధన్య స్తు జ్ఞానీ - తు శబ్దః పూర్వస్మా ద్వైలక్షణ్యం ద్యోతయతి, త దేవాహ - త దఖిలం వేశ్మాద్యశేషప్రపఞ్చం, క్షణభఙ్గుర మశాశ్వతం, సందృశ్య సమ్యగాలోక్య * సంపూర్వా ద్దృశేః క్త్వాచో ల్యబాదేశః, సన్న్యస్యతి - న తత్రాసక్తో భవతి - కిం తు విరక్తో భవ తీతి భావః; అతః జ్ఞానేన సర్వానర్థమూల మజ్ఞానం నిరస్య కృతకృత్యేన భవితవ్య మితి తాత్పర్యమ్.

శార్దూలవిక్రీడితమ్.

ఇతి వైరాగ్యశతకవ్యాఖ్యానే విషయపరిత్యాగ విడమ్బనా నామ
ద్వితీయదశకమ్.

---

## యాచ్ఞాదైన్యదూషణమ్.

అవ.—మానవంతులు కుటుంబినియొక్క దారిద్ర్యబాధ కోర్వక యాచనకు తెగింతురు.

దీనా దీనముఖైః స దైవ శిశుకై రాకృష్టజీర్ణామ్బరా
క్రోశద్భిః క్షుధితై ర్నిరన్నవిధురా దృశ్యా న చే ద్గేహినీ,
యాచ్ఞాభఙ్గభయేన గద్గదగళత్రుట్యద్విలీనాక్షరం
కో దేహీతి వదే త్స్వదగ్ధజఠర స్యార్థే మనస్వీ పుమాన్? 21.

టీక.—దీనా = పేదదియు, దీన ముఖైః = విన్ననైన మొగములు గలవారై, క్రోశద్భిః = ఏడ్చుచున్న, క్షుధితైః = ఆఁకలిగొన్న, శిశుకైః = నిసువులచేత, సదా ఏవ = ఎలప్పుడును, ఆకృష్ట జీర్ణ అమ్బరా = ఈడ్వఁబడిన చినిఁగిన గుడ్డ గలదియు, నిరన్న విధురా = అన్నము లేమిచే కష్టపడుచున్నదియు, (అయి), గేహినీ = ఇల్లాలు, దృశ్యా = కనఁబడునది, న చేత్ = కా దేని, మనస్వీ=మానియగు, కః పుమాన్ = ఏపురుషుఁడు, యాచ్ఞా భఙ్గ భయేన - యాచ్ఞా = వేఁడికోలుయొక్క - భఙ్గ = వ్యర్థమగుటవలని - భయేన = దిగులుచేత, గద్గద...క్షరం. యథాతథా - గద్గద=డగ్గుత్తికతోడి-గళ = గొంతునందు - త్రుట్యత్ = తునుఁగుచు - విలీన = అడంగిపోయిన - అక్షరం యథాతథా = అక్షరములు గలుగునట్లుగా స్వదగ్ధ జఠరస్య అర్థే = తన పాడు పొట్టకొఱకు, దేహి ఇతి = ఇమ్ము అని, వదేత్ = చెప్పును.

తా.—శిశువులు మొగము వ్రేల వైచికొని ఆఁకటికి ఏడ్చుచు, తన్ను తనచింకి చీరనుపట్టి లాగుచుండఁగా, అన్నము లేమిచేత తాను కష్టపడుచు, వారిని సమదాయింప నేరక దుఃఖించుచున్నయిల్లాలిం గాంచినకారణంబునం గాదేని మానవంతుఁ డెవఁడును

తనవేఁడుకోలు వ్యర్థ మగు నేమో యని దిగులుపడుచు, డగ్గుత్తికపడి గొంతులోనే మాట తుంగి అణఁగిపోవునట్లుగా, తన పొట్టకోసము ఒరులను యాచింపఁడు.

ఉ. ఆఁకొని యేడ్చు లేఁజిఱుత లన్నము కై తనకొంగు లాగఁ, బె
ల్లాఁకట సోలుచుండెడునిజాంగనదుర్దశఁ జూడఁడేని యా
చ్ఞాకలనా విభంగ భయ సంభృత గద్గద శూన్య కంఠుఁ డై
చేకొని దేహి యం చడుగఁ జేరునె కాలినపొట్ట కెవ్వఁడున్.

వ్యా.—అథ యాచ్ఞాదైన్యదూషణ మారభతే - అత్ర అభిప్రాయః విషయాణాం యాచ్ఞాదైన్యప్రయోజకత్వా ద్విషయపరిత్యాగవిమ్బడనానన్తర్యే నైతత్ప్రయోజ్య యాచ్ఞాజనితదైన్య మపి దూషణీయ మే వేతి అతస్తత్ప్రసఙ్గానన్తర మేత ద్దూషయితు మారభతే - దీ నేత్యాదిశ్లోకదశకేన - దీనా దీనముఖై రితి.—దీనా దరిద్రా, అత ఏవ, దీనాని శోభాహీనాని ముఖాని యేషాం తైః, కుతః, క్రోశద్భిః రుదద్భిః, తత్కుతః, క్షుధితైః సంజాతక్షుత్కైః - బుభుక్షితై రిత్యర్థః - క్షుధాశబ్దోఽస్యాబన్త స్తస్మాత్ * 'త దస్య సంజాతం తారకాదిభ్య ఇత జితీ' తచ్ప్రత్యయః-తారకాది రాకృతిగణః- క్షు దితి ధకారాన్తపక్షే తు - క్షుధం ప్రాప్తైః క్షుధితైః క్షుధాతురైః * కర్తరి క్తః * 'వసతి క్షుధో రిడి' తీడాగమః, శిశుకై రత్యన్తబాలకైః * అల్పార్థే కన్ప్రత్యయః, సదా సర్వ దై, వాకృష్ట మన్నపానాదియాచ్ఞాపూర్వక మాక్షిప్తం -. జీర్ణామ్బరం విశీర్ణవస్త్రం - యస్యా స్సా, తథా, నిరన్నా అన్నపానరహితా - అత ఏవ - విధురా విహ్వలా - నిరన్నా చ సా విధురా చేతి విశేషణసమాసః - అన్నాభావా త్కష్టజీవనే త్యర్థః - ని. 'విధురః ప్రత్యవేతే స్యా త్కష్టవిశ్లిష్టయో రపీ' తి విశ్వః, గేహినీ గృహిణీ, దృశ్యా దృష్టిగోచరా, న చే న్న స్యా ద్యది, తర్హి, మనస్వీ సుమేధాః - ధైర్యశాలీ * ప్రశంసాయా మినిః, కః పుమాన్, యాచ్ఞాభఙ్గా ద్య ద్భయం తేన, గద్గదోహీనసర్వః - అనుకరణశబ్దోఽయం - యో - గళః కణ్ఠః - తత్ర - త్రుట్యన్తి శకలీభవన్తి - అత ఏవ - విలీనా న్యనుచ్చారితప్రాయా ణ్యక్షరాణి వర్ణా-యస్మిన్ కర్మణి త ద్యథా తథా, స్వస్య - దగ్ధః ప్లుష్టో - యో జఠరః ఉదరం - త, స్యార్థే తత్పూరణార్థ మి త్యర్థః - ని. 'అర్థే కృతే చ శబ్దౌ ద్వౌ తాదర్థ్యేఽవ్యయసంజ్ఞితా వి' త్యమరః- దగ్ధ శబ్దోఽత్ర నిర్వేదాభిద్యోతకః - యథోక్తం సురేశ్వరవార్తికే - 'అస్య దగ్ధోదరస్యార్థే కి న్న కుర్వ న్త్యసాంప్రత మి' తి, దే హీతి, వదేత్ బ్రూయాత్, న కోఽపీ త్యర్థః ; తస్యాః దృశ్యత్వా దీదృగన్థాపన్నో భవ త్యతోఽనర్థమూలత్వాత్ తత్పరిత్యాగోఽవశ్యం కర్తవ్య ఇతి భావః.      శార్దూలవిక్రీడితమ్.

---



అభిమత మహామానగ్రన్థిప్రభేదపటీయసీ
గురుతరగుణగ్రామామ్భోజస్ఫుటోజ్జ్వలచన్ద్రికా
విపులవిలసల్లజ్జావల్లీవితానకుఠారికా
జఠరపిఠరీ దుష్పూరేయం కరోతి విడమ్బనమ్. 22.

టీక.— అభిమత...పటీయసీ - అభిమత = ఇష్టమైన - మహత్ = గొప్ప - మాన = ఆత్మగౌరవముయొక్క - గ్రన్థి = గన్నుఫును - ప్రభేద=పగులుచ్చుటయందు - పటీయసీ = మిక్కిలి సమర్థమును, గురుతర...చన్ద్రికా - గురుతర = మిగుల గొప్పలైన - గుణగ్రామ = గుణముల సమూహమునెడి - అమ్భోజ = తామరలకు - స్ఫుట = విశదముగా - ఉజ్జ్వల = వెలిఁగెడి - చన్ద్రికా = వెన్నెలయు, విపుల...కుఠారికా - విపుల = మిక్కిలి - విలసత్ = ఒప్పుచున్న - లజ్జా = సిగ్గు అనెడి - వల్లీ= తీఁగలయొక్క - వితాన = సమూహమునకు - కుఠారికా = గొడ్డలియు, (అయి), దుష్పూరా = నిండింపనలవికాని, ఇయం జఠర పిఠరీ = ఈ కడుపు కుండ, విడమ్బనం = వంచనను, కరోతి = చేయుచున్నది.

తా.—ప్రియమయిన గొప్పస్వాభిమానమును మ్రానిగనుపునుంబోలె పగులుచ్చుటకు సమర్థమై, నిండుపండువెన్నెల తామరలను ఎట్లో అట్లు గాంభీర్యాదార్యాదిగుణములను నాశము చేయునదై, తీఁగలగుబురును చిఱుగొడ్డలి యెట్లు కొట్టునో అట్లు లజ్జను ఛేదించుచు, ఎంత తెచ్చివైచినను ఎప్పటికిని నిండని యీ పొట్ట యనెడుకుండ మనుష్యునిచేత నానా నీచ యాచనలను చేయించుచున్నది.

శా. మానగ్రంథివిభేదనక్షమము, శుంభద్ధైర్యగాంభీర్యము
ఖ్యానేకప్రియసద్గుణాంబుజసమూహజ్యోత్స్న, లజ్జాలతా
హానిస్ఫారకుఠారధార, జఠరం బన్నట్టిపెన్బాన, యా
రా నిండారదు దైన్యవృత్త్యభినయప్రాగల్భ్యముం జూపుచున్.

వ్యా.—ఇదానీం దైన్యానర్థమూలం జఠరం నిన్దతి - అభిమ తేతి.—అభిమతః కీర్తిప్రతిష్ఠావహత్వా దిష్టః - యో మహామానగ్రంథి గరిష్ఠాభిమానగ్రన్థిః - తస్య - ప్రభేదే విశ్లేషణే - పటీయసీ సమర్థతరా * పటుశబ్దా దియసు న్యుగిత శ్చేతి జీప్, గురుతరా అతిశయేన వర్తమానా - యే గుణగ్రామాః గామ్భీర్యధైర్యాదిగుణగణాః - త ఏ వాఽమ్భోజాని తేషాం స్ఫుటం యథా తథా - ఉజ్జ్వలచన్ద్రికా పూర్ణిమాకౌముదీ - తత్సంకోచహేతు భూ తేత్యర్థః, విపులం విస్తృతం యథా తథా - విలస త్ప్రకాశమానం - య ల్లజ్జావల్లీవితానం వ్రీడాలతావితతి - స్తస్య కుఠారికా పరశుః - తదుచ్ఛేదనసాధనభూ తే త్యర్థః, దుష్పూరా పూరయితు మశక్యా - ప్రత్యహ మన్నపా

నాది పూరితాఽపి పర్యాప్త్యభావా దితి భావః * 'ఈషద్దు రి' త్యాదినా ఖల్ప్రత్యయః, ఇయం జఠర ముదర మేవ పిఠరీ కుణ్డీ - ని. 'పిఠరః స్థా ల్యుఖా కుణ్డ మి' త్యమరః * గౌరాదిత్వాత్ జీష్ - తథా చ కృష్ణామృత స్తవే - 'జఠరపిఠరీపూర్త్యై నర్తితాసీ' తి, విడమ్బనాం యాఞ్చానుకరణం, కరోతి యాఞ్చాదైన్య మస్మాభి రభినాటయ తీ త్యర్థః, ఏతద్వ్యతిరేకేణ దైన్యకారిణీ న కాఽ ప్య స్తీతి భావః ; వల్లీ కఠోరకుఠారి కేతి పాఠే నిశితతపరశు రి త్యర్థః.

రూపకాలంకారః. హరిణీవృత్తం - 'భవతి హరిణీ న్సౌ మ్రౌ స్లౌ గో రసామ్బుధి విష్టపై రి' తి లక్షణాత్.

---

అవ.—బంధువులమధ్య దరిద్రుఁడై యుండుటకంటె బిచ్చమెత్తి బ్రతుకుట మేలు.

పుణ్యే గ్రామే, వనే వా మహతి, సితపటచ్ఛన్నపాలీం కపాలీ
మాదాయ న్యాయగర్భద్విజహుతహుతభుగ్ధూమధూమ్రోపకణ్ఠే
ద్వారం ద్వారం ప్రవిష్టో వర ముదరదరీపూరణాయ క్షుధార్తో
మానీ ప్రాణైః సనాథో న పున రనుదినం తుల్యకుల్యేషు దీనః. 23.

టీక.—న్యాయ...కణ్ఠే - న్యాయ గర్భం = విధి ప్రకారము - ద్విజ = బ్రాహ్మణులచేత - హుత = వేల్వఁబడిన - హుతభుక్ = అగ్నియొక్క. - ధూమ = పొగచే - ధూమ్ర = నలుపుతిరిగినయెఱుపుగల - ఉపకణ్ఠే = సమీపముగల, పుణ్యే గ్రామే (వా) = పవిత్రమైన యూరియందుఁ (గాని), మహతి వనే వా = గొప్ప యడవియందుఁగాని, సిత ఛన్న పాలీం = తెల్లగుడ్డతో మూయఁబడిన యంచులుగల, కపాలీం = బిచ్చపుముంతను, ఆదాయ = కైకొని, క్షుధా ఆర్తః = ఆఁకటిచేఁ బీడితుఁడగు, మానీ = మానవంతుఁడు, ఉదర దరీ పూరణాయ = పొట్ట యనెడిగుహను నిండించుటకొఱకు, ద్వారం ద్వారం = ప్రతిద్వారము (ప్రతియింటను), ప్రవిష్టః = చొచ్చి, ప్రాణైః సనాథః చేత్ = ప్రాణములతోఁ గూడినవాఁడగునేని (బ్రదుకునేని), వరం = కొంచెము మేలు, పునః = కాని, అనుదినం = దిన దినమును తుల్యకుల్యేషు = సమాన కులమువారినడుమ, దీనః = దరిద్రుఁడుగా నుండుట, న (వరమ్) = మేలుకాదు.

తా.—మానవంతుఁడు—యథావిధిగా బ్రాహ్మణులు హోమము గావించిన యగ్నియొక్క పొగచే ప్రాంతప్రదేశములు నల్లయెఱ్ఱవర్ణము నొందియున్న పుణ్యాగ్రహారములోఁగాని అట్టి మహారణ్యమందుఁగాని భిక్షాకపాలము కేలఁగొని దానిని తెల్లవస్త్రముతో అంచుకనఁబడకుండునట్లు మూసి ఆఁకటిబాధకై ఇంటింట మధుకర మెత్తి గుహవంటి పొట్టను నిండించుకొనుచు ప్రాణమును నిలుపుకొనుట యేనియు కొంచెము మేలు గాని, తనకులమువారినడుమ దరిద్రుఁడై జీవించుట యెంతమాత్రము మేలుగాదు.



చ. అవనిసురావళీ హుతహుతాశన కోమలధూమధూమలా
ప్రవిశదవాటియందు వనభాగమునందుఁ గపాలపాణియై
భవనములందు భిక్షుగొని ప్రాణముదాల్చుట కొంత మేలు బాం
ధవులను జేరి వేఁడి కడు దైన్యముఁ జెందుటకంటె మానికిన్.

వ్యా.—అథ మానిన స్తావ ద్బన్ధుయాఞ్చాయా వర మన్యత్ర భిక్షాశనతాత్పర్యేణ ప్రాణ ధారణ మి త్యాహ - పుణ్యగ్రామ ఇతి.—న్యాయగర్భం మీమాంసాశాస్త్రోక్తప్రకారగర్భితం యథా - య ద్వా - నీయన్తే జ్ఞాప్యన్తే - బుభుత్సితార్థా ఏభి రితి న్యాయాః - వేదశాస్త్రపురాణాదయః - తే - గర్భే కుక్షౌ - యేషాం తే న్యాయగర్భాః అధీతాఖిలవిద్యా ఇ త్యర్థః - ని. 'కుక్షిభ్రూణార్భకా గర్భా' ఇ త్యమరః - తథాభూతా - ద్విజాః బ్రాహ్మణాః - తైః - హుతాః ఆజ్యాదిహవిర్భి స్సుతర్పితాః - యే - హుతభుజోఽగ్నయ - స్తేషాం ధూమేన - ధూమ్రాణి కృష్ణలోహితవర్ణాని - ఉపకణ్ఠాని అన్తిమప్రదేశా - యస్య తస్మిన్ - ని. 'ధూమ్ర ధూమలౌ కృష్ణలోహితే' - 'ఉపకణ్ఠాన్తికాభ్యర్ణాభ్యగ్రా అ ప్యభితోఽ వ్యయ మి' తి చామరః, అత ఏవ - పుణ్యే పవిత్రే, మహతి విపులే చ, విశేషణద్వయేన నిస్సంకోచసంచారార్హత్వం సూచ్యతే, గ్రామే అగ్రహారే, వనే అరణ్యే వా - తత్రాపి వానప్రస్థాదీనాం విద్యమానత్వా దితి భావః, సితపటేన శ్వేతవస్త్రేణ - ఛన్నా పరేషాం దృష్టిగోచరత్వాభావార్థ మాచ్ఛాదితా - తథా విశిష్టాచారాత్ - పాలి రశ్రి ర్యస్యాస్తాం - ని. 'పాలి స్త్వశ్ర్యశ్రిఙ్కపఙ్క్తిషు' ఇతి వైజయన్తీ, కపాలీం భిక్షాహరణోచిత శరావ, మాదాయ గృహీత్వా, క్షుధార్తః క్షుత్పీడితః, మానీ అభిమానవాన్ పురుష ఇతి శేషః, ఉదర మేవ - దరీ గిరిగహ్వరం - తస్యాః - పూరణాయ పూర్త్యర్థ మి త్యర్థః * తాదర్థ్యే చతుర్థీ - అథవా - ఉదరం పూరయితు మి త్యర్థః * 'తుమర్థా చ్చ భావవచనా ది' తి చతుర్థీ, ద్వారం ద్వారం ప్రతిద్వారం-గృహమేధినా మితి శేషః * 'నిత్యవీప్సయో రి' తి వీప్సాయాం ద్విరుక్తిః, ప్రవిష్టః భిక్షార్థ మి త్యర్థ, ప్రాణై స్సనాథ స్సహిత శ్చేత్ భిక్షాశనేన ప్రాణధారణతత్పర స్స్యా చ్చే ది త్యర్థః, వరం మనా క్ప్రియం - ని. 'దైవాద్వృతే వర శ్శ్రేష్ఠే త్రిషు క్లీబం మనాక్ప్రియ మి' త్యమరః, దినే దినే అనుదినం ప్రత్యహ మిత్యర్థః * యథార్థేఽవ్యయీభావః, తుల్యకుల్యేషు సమానకుల్యేషు సమానకులోద్భవేషు తన్మధ్య ఇ త్యర్థః, దీనః పునః దైన్యవాం శ్చే న్న వరం - బన్ధుమధ్యే యాఞ్చాదైన్యనీచజీవనా ద్వరం భిక్షాన్నేన ప్రాణధారణం - 'న బన్ధుమధ్యే ధనహీనజీవన మి' తి వచనా దితి భావః. అత్ర య ద్యపి - 'త్యజ న్త్యసూన్ శర్మ చ మానినో వరం త్యజన్తి న త్వేక మయాచితవ్రత మి' తి వచనా న్మానినః సర్వథా అయాచితత్వ మేవ ముఖ్యవ్రతం తథాఽపి యది క్షుధాతురత్వేన యాఞ్చా ప్రవృత్తి స్స్యా త్తదా కుత్ర చి దపరిజ్ఞాత

దేశే శ్రోత్రియగృహేషు కపాలభిక్షాన్నభక్షణే నోదరపూరణం కర్తవ్యం - న తు బన్ధుజనయాచ్ఞా ప్రాణసంకటేఽపి - తస్యాః పరమనైచ్యావహత్వా దితి గూఢాభిసంధిః.

స్రగ్ధరావృత్తం - తదుక్తం కేదారేణ - 'మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిమునియతియుతా స్రగ్ధరా కీర్తితేయమ్.'

---

గఙ్గాతరఙ్గహిమశీకరశీతలాని
విద్యాధరాధ్యుషితచారుశిలాతలాని
స్థానాని కిం హిమవతః ప్రళయం గతాని
యత్సావమానపరపిణ్డరతా మనుష్యాః. 24.

టీక.—మనుష్యాః = నరులు, సావ...రతాః - సావమాన = తిరస్కారముతోఁ గూడిన - పరపిండ = ఇతరులకడియందు - రతాః యత్ = ఆసక్తులగుటను, గఙ్గా...శీతలాని - గఙ్గా = గంగయొక్క - తరఙ్గ = అలలయొక్క - హిమ = చల్లని - శీకర = తుంపురులచేత - శీతలాని = చల్లనివియు, విద్యా...తలాని - విద్యాధర = విద్యాధరులచేత - అధ్యుషితాని = అధివసింపఁబడిన - చారు = రమణీయమయిన - శిలాతలాని= ఱాతిప్రదేశములు గలవియు, అగు, హిమవతః = మంచుకొండయొక్క, స్థానాని = ప్రదేశములు, ప్రళయం గతాని కిమ్ = నాశమును పొందినవా యేమి.

తా.—తిరస్కార పూర్వకముగా ఇతరులు పడవేయునట్టి యన్నమును తిని బ్రతుకుటకన్న హిమవత్పర్వతమున విద్యాధరసేవితములై గంగాతరంగములచల్లనితుంపురులచే చలువ గ్రమ్ముచు సొంపారు చాఁపఱాలమీఁద కాలముగడపుట ఎంతయు మేలుగదా.

తే. పూతగంగోర్మిశీకరశీతలములు । లలితవిద్యాధరాధ్యశిలాతలములు
హిమగిరిస్థానములు నశియించె నొక్కొ । నరులు నిందితపరపిండనిరతు లగుట.

వ్యా.—అథ విశిష్టగత్యన్తరాభావవితర్కద్వారా దూషయతి - గఙ్గేతి.—గఙ్గాతరఙ్గాణాం భాగీరథీకల్లోలానాం - యే కణాః బిన్దవః - తేషాం - శీకరైః ప్రాలేయప్రాయలేశైః - అథవా - కణాః స్థూలబిన్దవః - శీకరాః సూక్ష్మాః - తైః శీతలాని శిశిరాణి- 'ఘనశీకరే'తి వా పాఠః - తథా సాన్ద్రాణి ఇత్యర్థః, విద్యాధరైర్దేవయోనివిశేషైః - రధ్యుషితాని అధిష్ఠితాని * 'గత్యర్థాకర్మకే' త్యాదినా వసేః కర్మణి క్తః * 'వచి స్వపీ' త్యాదినా సంప్రసారణం - అత ఏవ - చారూణి మనోహరాణి - శిలాతలాని యేషు తాని తథోక్తాని - * విశేషణద్వయే నైతేన పరమపవిత్రత్వం చ సూచ్యతే, హిమవతః హిమాద్రేస్సంబన్ధీని, స్థానాని ప్రాన్తప్రదేశాః, ప్రళయం గతాని కిం నష్టాని కిం - కింశబ్దోఽత్ర వితర్కే - ని. 'కుత్సాప్రశ్నవితర్కేషు క్షేపే కింశబ్ద ఇష్యతే.' ఇతి శాశ్వ



తః, నను కుతః ఏవం విద్యమానేష్వవస్థానేషు వినాశో వితర్క్యత ఇత్యాశఙ్క్య తత్ర కారణ మాహ - యద్యస్మాత్కారణా, న్మనుష్యా జనాః, సావమానేషు యాచ్ఞయా తిరస్కారాచరణపూర్వకం దత్తేషు - పరపిణ్డేషు పరాన్నేషు - రతా ఆసక్తాః - తాదృక్పరపిణ్డాశనేన ప్రాణత్రాణతత్పరా జాతా ఇత్యర్థః - యది స్థానాని న నశ్యేరన్ తర్హి జనా ఈదృక్కష్టయాచ్ఞాతత్పరా న భవేయుః - తేషాం నష్టత్వా దేవేదృగ్దురవస్థాపన్నా ఇతి కృత్వా ఏవం వితర్క్యత ఇతి వాక్యార్థః; యద్వా - గత్యన్తరాభావం ప్రశ్నద్వారా దూషయతి గఙ్గేతి - కింశబ్దోఽత్ర ప్రశ్నే - నన్వేవం కుతః పృచ్ఛ్యత ఇత్యత ఆహ - యస్మాత్కారణాత్ - హే మనుష్యాః సావమానపరపిణ్డరతాః - యూయం జాతా ఇతి శేషః - అతః ప్రశ్నస్యావకాశ ఇతి భావః - అన్య త్సమానమ్; ఏతేన దుర్భగయాచ్ఞా పిశాచికా మూర్ధన్యశనిం పాతయిత్వా గిరిపరిసరేషు సుఖేన వర్తితవ్య మితి సూచితమ్. వసన్తతిలకావృత్తమ్.

---

అవ.—నీచులను యాచించుటకన్న నీచము లేదు.

కిం కన్దాః కన్దరేభ్యః ప్రళయ ముపగతా? నిర్ఝరా వా గిరిభ్యః?
ప్రధ్వస్తా వా తరుభ్యః సరస ఫలభృతో వల్కలిన్యశ్చ శాఖాః?
వీక్ష్యన్తే య న్ముఖాని ప్రసభ మపగతప్రశ్రయాణాం ఖలానాం
దుఃఖోపాత్తాల్పవిత్తస్మయపవనవశానర్తితభ్రూలతాని? 25.

టీక.—ప్రసభమ్ = మిక్కిలి, అపగత ప్రశ్రయాణాం = పోయినయడఁకువగల (అడఁకువలేని), ఖలానాం = దుర్జనులయొక్క, దుఃఖ...లతాని - దుఃఖ = కష్టముచే- ఉపాత్త = సేకరింపఁబడిన - అల్ప = కొంచెపాటి - విత్త = ధనముచేతి - స్మయ = మదమనెడి - పవన = గాలికి - వశ = అధీనతచేత - ఆనర్తిత — ఆడింపఁబడిన - భ్రూలతాని = తీఁగలవంటి కనుబొమలుగల, ముఖాని = మొగములు, యత్ వీక్ష్యన్తే = చూడఁబడుచున్నవే అందులకుఁ గారణము, కన్దరేభ్యః = గుహలలో, కన్దాః = దుంపలు ప్రళయమ్ = నాశమును, ఉపగతాః కిం = పొందినవా యేమి, గిరిభ్యః = కొండలలో, నిర్ఝరాః వా = సెలయేళ్లును, (ప్రళయ...), తరుభ్యః = చెట్లలో, సరస ఫల భృతః= రసముతోడి పండ్లను మోచునవియు, వల్కలిన్యః = నారచీరలుగలవియు, అగు, శాఖాః = కొమ్మలు, ప్రధ్వస్తా వా = నశించినవా యేమి.

తా.—మనుష్యునికి కుడువను త్రాగను కట్టను, కావలసియున్నది. అందులకు గుహలలో దుంపలును, కొండలలో వాఁకలును, చెట్లలో నారలును మంచిపండ్లునుగల కొమ్మలును సిద్ధముగా నుండఁగా, వినయహీనులగు దుర్జనులను ఆశ్రయించి, వారు కష్టపడి గడించుకొన్న కొంచెపాటి ధనమునకే కలిగినమదముచేత కనుబొమలు గాలికి తీఁగలవలె

చలింపుచుండు నాఖలులముఖములను తదీయకరుణాకటాక్షమునకై యెదురుసూచుచు బ్రదుకుటకన్న అధమము వేఱొకటి లేదు.

మ. ఇలఁ గందంబులు మూలముల్ మడిసెనో యేల్లింకెనో కొండలన్
ఫలముల్ నారలు వృక్షశాఖలయెడం బా డయ్యెనో చూడఁ గే
వలదుఃఖాప్తమితార్థగర్వపవనవ్యానర్తితభ్రూలస
త్ఖలభూపాస్యము లర్థిఁ జూచెదరు భ్రాంతస్వాంతులై యాచకుల్.

వ్యా.—ఇదానీం పున ర్జీవనోపాయాన్తరాభావవితర్కద్వారా దూషయతి - కి మితి.—కన్దరేభ్యో గుహాభ్య, స్సకాశాత్ కన్దాః కన్దమూలాదిపదార్థాః - క్షుణ్ణి వారణక్షమా ఇతి భావః, ప్రళయం వినాశం - విరామ మితి యావత్, ఉపగతాః ప్రాప్తాః కిం - * జుగుప్సావిరామేత్యాదినా పఞ్చమీ, ఏవ ముత్తరత్రాపి - కింశబ్దో వితర్కే, తథా గిరిభ్య స్సకాశా, న్నిర్ఝరా వా ప్రవాహా శ్చ వా - ఉపశమకరా ఇతి భావః, ప్రళయ ముపగతాః కి మితి సంబన్ధః - ని. 'ప్రవాహో నిర్ఝరో ఝరః' ఇ త్యమరః - ని. 'వా స్యా ద్వికల్పోపమయో రేవార్థే చ సముచ్చయ' ఇతి చామరః, తథా, తరుభ్యః వృక్షేభ్య స్సకాశాత్, సరసాని మాధుర్యరసయుక్తాని - ఫలాని బిభ్రతీతి తథోక్తాః, వల్కలిన్యః వల్కలవత్యః, ఏతేన విశేషణద్వయేన సుభోజ్యవస్తుసమృద్ధత్వాచ్ఛాదనయోగ్యవస్తు సమృద్ధత్వే సూచితే, శాఖా శ్చ, ప్రధ్వస్తా వా వినష్టాః కిమ్ - అవ్యయానా మనేకార్థత్వాత్, నను విద్యమాన కన్దమూలాది ష్వవిద్యమానత్వం కుతో వితర్క్యత ఇ త్యత ఆహ - య ద్యస్మా త్ప్రసభ మత్యన్తమ్ - అపగతప్రశ్రయాణాం వినయశూన్యానాం, ఖలానాం దురీశానాం, దుఃఖాప్త మతిక్లేశేన ప్రాప్తం త దపి స్వల్పం య - ద్విత్తం ధనం - తేన యః - స్మయో గర్వ - స్స ఏవ పవనః - స్మయః పవన ఇవ చ - తద్వశా - దానర్తితా శ్చాలితాః - భ్రువ ఏవ లతాః భ్రువో లతా ఇవ చ యేషాం తాని - సవికారాణీ త్యర్థః - స్మయపవనే త్యత్ర భ్రూలతా ఇ త్యత్ర చ ఉపమారూపకయో స్సాధక ప్రమాణాభావా త్సందేహసంకరః, ముఖాని, వీక్ష్యన్తే - యాచకజనై రితి శేషః; కన్దమూలాదీనాం వినష్టత్వా దేవ జనై ర్దురీశ్వర పరిచర్యాతత్పరై రభ్యర్థ్యతే జీవనోపాయార్థం - మత స్తదభావ వితర్క స్స్యావకాశ ఇతి భావః, య ద్వా - జీవనోపాయాన్తరాభావ ప్రశ్నద్వారా నిన్దతి - కిం కన్దా ఇతి; కిం వా శబ్దౌ ప్రశ్నే, కుత ఏవం ప్రశ్నః క్రియత ఇ త్యత ఆహ - యస్మాత్కారణా, ద్దుర్వినీతదురీశ్వర ముఖా న్యవలోక్యన్తే యుష్మాభి స్తస్మా దభావప్రశ్నో యుజ్యత ఇతి భావః, శేషం సమానమ్; అ త్రాయ మభిసంధిః - పరమనైచ్యావహం శాస్త్రనిషిద్ధం చ దుర్వినీతసేవనోపజీవనం పరిత్యక్తవ్యమ్.

---



అవ.—ముక్కిడి దొరలను గొలుచుటకన్న అడవిలో బ్రదుకుటమేలు.

పుణ్యై ర్మూలఫలైః ప్రియే ప్రణయినీం వృత్తిం కురు ష్వాధునా
భూశయ్యాం నవపల్లవై రకృపణై, రుత్తిష్ఠ, యావో వనమ్;
క్షుద్రాణా మవివేకమూఢమనసాం య త్రేశ్వరాణాం సదా
విత్తవ్యాధివికారవిహ్వలగిరాం నామాఽపి న శ్రూయతే. 26.

టీక.—ప్రియే = ఓకాంతా, అధునా = ఇఁకను, ప్రణయినీం వృత్తిమ్ = ఇష్టమయిన భోజనమును, పుణ్యైః = పవిత్రములైన, మూల ఫలైః = వేరులతోను పండ్లతోను, అకృపణైః = వాడని, నవపల్లవైః = క్రొత్తచిగుళ్లతో, భూ శయ్యామ్ = నేలపడకను, కురుష్వ = చేసికొనుము, యత్ర = ఎచట, క్షుద్రాణామ్ = నీచులును, అవివేకమూఢ మనసాం = అజ్ఞానముచే తెలివిమాలిన మనస్సుగలవారును, సదా = ఎల్లప్పుడును, విత్త... గిరాం - విత్తవ్యాధి = ధన రోగపు - వికార = వైపరీత్యముచే - విహ్వల = వశము దప్పిన - గిరాం = పలుకులుగలవారును, అగు, ఈశ్వరాణాం = దొరలయొక్క, నామ అపి = పేరయినను, న శ్రూయతే = వినఁబడదో, (అటువంటి), వనం = అడవికి యావః = (ఇరువురము) పోవుదము, ఉత్తిష్ఠ = లెమ్ము.

తా.—ఓ కాంతా అజ్ఞానముచే ఏమియు తోఁపక ధనరోగముయొక్క వైపరీత్యములచే వశము తప్పిన మాటలాడుచుండు ముక్కిడిదొరల పేరయినను వినఁబడని చోటికి ఏదే నొక యడవికి పోవుదము లెమ్ము. అందు పవిత్రములయిన ఫల మూలములను భుజింతము, వాడని క్రొత్తచిగుళ్లు సెజ్జగా పఱచుకొని నేలను పరుందము.

చ. ప్రవిమలకందమూలఫల పంక్తుల జీవికఁ జేయు, ముర్విపై
నవనవపల్లవంబుల నొనర్పుము పానుపు, లెమ్ము, పావనా
టవికిని బోవు, మయ్యెడ దృఢద్రవిణామయదుర్వికారగా
రవవికలోక్తులై మెలఁగు రాజులపేరును జెప్పఁ డెవ్వఁడున్.

వ్యా.—అథ ఖలానాం ముఖాని దృశ్యన్త ఇ త్యనేన సూచితనిన్దాం ప్రకటయితుం చిరకాలదురీశసేవాఖిన్నస్య కస్యచి న్నిర్వేదవచన మభినీ యాహ - పుణ్యై రితి.—అధు నేదానీం, పుణ్యైః పవిత్రైః, మూలైః కన్దమూలైః, ఫలైః కదళీరసాలపనసాదిఫలై శ్చ - అపవిత్ర రక్త మూలక కాళిఙ్గ ఫలాది భక్షణ నిషేధ స్మరణా త్పుణ్యై రి త్యుక్తం, తథా అనిర్వాచ్యతయా, 'ప్రియ ప్రణయినీ మి' తి పాఠే-హే ప్రియసఖ ఇ త్యర్థః, ప్రణయినీం పరమసుఖావహతయా ప్రియతమాం - విశిష్టకన్ద మూలాద్యశనస్యానశనప్రాయత్వా త్తస్యాపి, 'తపో నానశనా త్పర' మి'తి తపః పర్యవసానత్వా త్తస్య చ 'తపసా కల్మషం హన్తీ'తి సకలకల్మషనివర్తనద్వారా పరమసుఖావహత్వా

దితి భావః, వృత్తిం జీవికాం - ని. 'వృత్తి ర్వర్తన జీవనే' ఇ త్యమరః, కురుష్వ విధేహి, తథా, అకృపణై రమ్లానైః, నవపల్లవైః, భూమి శయ్యాం చ కురుష్వ, అతః, ఉత్తిష్ఠ ఉత్థితోభవ - విలమ్బం మా కు ర్వి త్యర్థః, వనం ప్రతి - యావో గచ్ఛావః - యాస్యావ ఇ త్యర్థః - కి మనేన నీచసేవనే నేతి శేషః * వర్తమానసామీప్యే వర్తమానప్రత్యయః, యామో వన మితి న సాధీయా న్పాఠః, గమనే అభ్యుచ్ఛ్రియం ఫల మాహ - యత్ర వనే, క్షుద్రాణాం దీనానాం, కుతః - అవివేకే నాజ్ఞానేన - మూఢాని కర్తవ్యాకర్తవ్య విచార శూన్యాని - మనాంసి యేషాం తేషాం, తథా, సదా సర్వదా - విత్త మేవ వ్యాధి స్సన్నిపాతాదిరోగ - స్తేన యో వికారః విపరీతభావ - స్తేన విహ్వలా వికలా - అవిస్పష్టా ఇతి యావత్ తథాభూతా గిరో యేషాం తేషాం, మీశ్వరాణాం రాజ్ఞాం, నామాఽపి నామధేయ మపి, న శ్రూయతే నాకర్ణ్యతే - కిముత దర్శనసేవనాదిక మేతి భావః, తస్మా దైహికాముష్మికఫలలేశ సంబన్ధశూన్యం నీచ సేవనం పరిత్యజ్య సకలశ్రేయస్సంపాదకం వనం వ్రజ; వనవాస ఏ వావశ్యం కర్తవ్య ఇతి తాత్పర్యమ్. శార్దూలవిక్రీడితమ్.

---

అవ.—యాచనకన్న వనవాసము మేలు.

ఫలం స్వేచ్ఛాలభ్యం ప్రతివన మఖేదం క్షితిరుహాం
పయః స్థానే స్థానే శిశిరమధురం పుణ్యసరితామ్,
మృదుస్పర్శా శయ్యా సులలితలతాపల్లవమయీ
సహన్తే సంతాపం త దపి ధనినాం ద్వారి కృపణాః. 27.

టీక.—ప్రతివనమ్ = ఎల్లయడవులయందును, అఖేదం = కష్టములేకుండ, స్వ ఇచ్ఛా లభ్యం=తన యిచ్ఛప్రకారము దొరకునదైన, క్షితిరుహాం = చెట్లయొక్క - ఫలం= పండు, (కలదు), స్థానే స్థానే = ఎల్లచోట్లను, పుణ్యసరితాం = పవిత్రనదులయొక్క, శిశిర మధురం=చల్లని తీయని, పయః = నీరు, (కలదు), సులలిత లతా పల్లవమయీ= మిక్కిలి మృదువయిన తీఁగలచిగుళ్లచేత రచితమై, మృదు స్పర్శా = మెత్తని తాఁకుడుగల, శయ్యా = పడక, (కలదు), త దపి = అయినను, ధనినాం = ధనికులయొక్క, ద్వారి = వాఁకిట, కృపణాః = దీనులు, సంతాపం = దుఃఖమును, సహన్తే = ఓర్చుకొందురు.

తా.—ప్రతియడవియందును భుజించుటకు సులువుగా తనయిచ్ఛప్రకారము పండ్లు సిద్ధముగా నున్నవి; అట్లే త్రాగుటకు ఎల్లయెడలను చల్లని తియ్యని పుణ్యనదుల జలము కలదు, దానిచే దప్పి తీఱును, తాపమును అడంగును ; అట్లే పరుండుటకు మిగుల కోమల మయిన తీవచిగుళ్ల సెజ్జ మెత్తనిది కలదు. అ టయినను మనుష్యులు దీనతతో ధనికుల వాకిట దుఃఖించుచుండుట వింతగా నున్నది.

చ. కలవు పచేళిమంబు లయి కానలలోపలఁ బండ్లు మాఁకులం,
గలవు పవిత్రవాహినులఁ గమ్మనిశీతలవారిపూరముల్,
గలవు చిగుళ్లపాన్పు, లవి గైకొన నేరక దీను లై ధనా
ఢ్యులగవనిఁ వసించి నరు లోలి సహింతురు తీవ్రతాపమున్.

వ్యా.—అథ చ పున స్సత్యా మపి నిరవధిక నిరాతఙ్క జీవనసాధనసామగ్ర్యాం కృపణాః స్వకార్పణ్య మత్యజన్తః పరయాచ్ఞాదైన్యేన క్లిశ్యన్తి, కిం కర్తవ్య మి త్యాహ - ఫలమితి.—వనే వనే ప్రతివనం - న త్వేక త్రైవ క్లృప్త మి త్యర్థః * 'అవ్యయం విభక్తి' త్యాదినా యథార్థే ఽవ్యయీభావః, న విద్యతే ఖేదో యస్మి న్కర్మణి త ద్యథా తథా అఖేద మక్లేశం, స్వేచ్ఛయా స్వచ్ఛన్దేన - లభ్యం ప్రాప్యం - న తు పరప్రేష్య మితి భావః, క్షిత్యాం రోహ న్తీ తి క్షితిరుహః * క్విప్ - తేషాం కదళీ రసాల పనసాది తరూణాం, ఫల మ స్తీతి శేషః - ఉదరపూరణపర్యాప్త మితి భావః, తథా, స్థానే స్థానే ప్రతిస్థానం * వీప్సాయాం ద్విరుక్తిః, శిశిర మధురం - వ్యాఖ్యాత మేతత్ 'పిబతి సలిలం శీతమధుర మి' త్యత్ర, పుణ్యసరితాం - గఙ్గా గోదావ ర్యాది పుణ్యనదీనాం, పయ స్తీర్థం, మ స్తీతి శేషః - స్నానపానాభ్యాం బాహ్యాభ్య న్తరపఙ్కప్రక్షాళనద్వారా తృష్ణోపశా న్తికర మితి భావః, ఏతే నోభయేషా మపి శాస్త్రసిద్ధం పరోపకారకత్వం సూచితం - త దుక్తం - 'పరోపకారాయ ఫల న్తి వృక్షాః। పరోపకారాయ వహ న్తి నద్య' ఇతి, తథా, మృదుః అకఠినః - కోమల ఇతి యావత్ - స్పర్శో యస్యా స్సా హంసతూలికాతల్పక ల్పే త్యర్థః, కుతః - సులలితా న్యతికోమలాని - యాని లతాపల్లవాని - తన్మయీ తత్ప్రచురా - తై ర్నిర్మి తే త్యర్థః - అథవా - తన్మయీ తద్వికారా * 'ప్రాచుర్యే వికారార్థే మయ డి'తి జీప్, శయ్యా చా స్తీతి శేషః - సుఖస్వాపోచి తేతి భావః, త దపి తథాఽపి, ధనినాం ధనాఢ్యానాం, ద్వారి ప్రతీహారప్రదేశే - ని. 'స్త్రీ ద్వా ర్ద్వారం ప్రతీహార' ఇ త్యమరః, కృపణాః ధనలిప్సాపరతన్త్రాః, సంతాపం తదనువర్తనాద్యాయాస పరితాపం, సహన్తే మృష్యన్తి, శ్రేయోర్థినాం కిం త త్రాస్మాకం కర్తవ్య మితి భావః. అతః ఫలలాభసంబన్ధశూన్యాం ప్రత్యుత బలవదనిష్టానుబన్ధినీం దుర న్తసంతాపకారిణీం పరమకార్పణ్యకల్ణజపా మి హాముత్ర చ కీర్తిప్రతిష్ఠావిఘటనీం యాచ్ఞాదైన్యపరమనీచత్వా ద్దూషణీయాం పాపిష్ఠా మిమాం దురీశ్వరద్వార బహిర్విత ర్దికా దురహంకారడాకినీం వివేకోచ్చాటనమ న్త్రి ణో త్సా ర్యానేకశ్రేయస్సంపాదికాం వనవాసజీవికాం శ్రియ మేవ సమాశ్రయే ద్విద్వా నితి తాత్పర్యమ్; త దుక్తం శ్రీభాగవతే -

'చీరాణి కిం పథి న సన్తి? దిశన్తి భిక్షాం?
నోవాఙ్ఘ్రిపాః పరభృత? స్సరితోఽ ప్యశుష్యన్?
శుద్ధా గుహాః కి ము న సన్తి? మహానుభావా
యస్మా ద్భజన్తి యతయో ధనదుర్మదాన్.' ఇతి. శిఖరిణీవృత్తమ్.

---

యే † వర్ధన్తే ధనపతిపురః ప్రార్థనాదుఃఖభాజో
యే చాల్పత్వం †† దధతి విషయాక్షేపపర్యస్తబుద్ధేః
తేషా మన్తఃస్ఫురితహసితం వాసరాణాం స్మరేయం
ధ్యానచ్ఛేదే శిఖరికుహరగ్రావశయ్యానిషణ్ణః. 28.

టీక.—ధనపతి పురః = ధనికుని మ్రోల, ప్రార్థనాదుఃఖభాజః = యాచ్ఞాదైన్యమును అనుభవించువానికి, యే = ఏదినములు, వర్ధన్తే = పెరుఁగుచున్నవో, విషయా... బుద్ధేః - విషయ = విషయభోగములయొక్క - ఆక్షేప = లాగుటవలన - పర్యస్త = చెదరిన - బుద్ధేః = బుద్ధిగలవానికిని, యే చ = ఏదినములు, అల్పత్వం=హ్రస్వత్వమును, దధతి = పొందుచున్నవో, తేషాం వాసరాణాం=ఆదినములను, శిఖరి...నిషణ్ణః - శిఖరి= కొండయొక్క - కుహర = గుహయందలి - గ్రావ = తాయియనెడి - శయ్యా = పడుకయందు - నిషణ్ణః సన్ = కూర్చున్నవాఁడనై, ధ్యానచ్ఛేదే = ధ్యానము ముగిసినప్పుడు, అన్తః స్ఫురిత హసితం యథాతథా = లోపలనే స్ఫురించిన నవ్వు గలుగునట్లుగా - స్మరేయమ్ = తలంచుకొనెదను.

తా.—నే నేదే నొకకొండగుహకుఁ బోయి తపస్సు చేసికొనియెదను. అట భగవద్ధ్యానము ముగిసిన సమయములయందు నాపడుకయగు రాతిపలకమీఁద కూర్చుండి ధనికులముందట వేఁడుకొనుచుండు దుఃఖము ననుభవించు చుండినప్పుడు దీర్ఘములుగా తోఁచినదినములను, విషయభోగవ్యగ్రమానసుఁడనై యుండినప్పుడు త్వరగా ముగిసిపోయినట్లు అగపడినదినములను, అప్పుడు అజ్ఞానమహిమచేత అట్లు చెడితినిగదా యని నాలో నేను నవ్వుకొనుచు జ్ఞప్తికి తెచ్చుకొనియెదనుగాక.

చ. ధనపతిమ్రోల నిల్చి కడు దైన్యముఁ జూపెడువార లెవ్వరో
ఘనవిషయాభిలాష మతికల్పనమీఁటిననీచు లెవ్వరో
మనయుచు వారిదుష్టదినముల్ మది నవ్వి తలంతు నాత్మచిం
తనముతుదిన్ గుహాంతరమునన్ రుచిరోపలతల్పశాయి నై.

వ్యా.—ఇదానీం దురీశ్వరసేవనయాచ్ఞాదైన్యతత్పరవిషయాక్షిప్తచిత్తనిన్దావశేన స్వస్య సిద్ధవద్భావిశ్రేయోదశాం సూచయ న్నాహ:—య ఇతి.—ధనపతేః ధనా



ఢ్యస్య - పురః అగ్రే, ప్రార్థనాదుఃఖం యాచ్ఞాదైన్యం - భజ న్తీతి తథోక్తాః సన్తః *'భజోణ్విః,' యే పురుషాః, † వర్ధన్తే, తథా, యే చ పురుషాః, విషయాక్షేపే భోగసంగ్రహే - పర్యాప్తా తావన్మాత్ర ఏవ పర్యవసితా న తు తత్త్వవిచార ఇత్యర్థః - తాదృశీ యా బుద్ధిః తస్యాః - 'పర్యస్త' ఇతిపాఠే - విషయాక్షేపేణభోగసక్త్యా - పర్యస్తా విపరీతా - యద్వా - విషయాక్షేపేణ విషయకృతోపప్లవేన-పర్యస్తా విక్షిప్తా- యా బుద్ధిః - తస్యాః హేతోః, అల్పత్వం నీచత్వం, †† దధతి, తేషాం పురుషాణాం, వాసరాణి దివసాన్ - తదనుభూతదుర్దినా నీ త్యర్థః - ని. 'వా తు క్లీబే దివసవాసరౌ' ఇత్యమరః, అభిమతదేవతాయాం చిత్తస్థిరీకరణం ధ్యానం - తస్య - చ్ఛేదే అవసానే- బ్రహ్మధ్యానవ్యుత్థానసమయ ఇ త్యర్థః, శిఖరికుహరే గిరిగహ్వరే - యో గ్రావా పాషాణ స్స ఏవ శయ్యా - తస్యాం-నిషణ్ణః విశ్రమార్థం శయిత స్స న్ని త్యర్థః, అన్తరన్తః కరణ ఏవ - స్ఫురితం సముత్పన్నం - హసితం హాసో - యస్మిన్ కర్మణి త ద్యథా తథా - తదానీం తేషా మపహాస్యత్వా త్తదనుభావత్వే నోత్పన్నహాసగర్భిత మి త్యర్థః-స్మరేయం 'సదృశా దృష్టిచిన్తాద్యాః స్మృతిబీజస్య బోధకా' ఇతి వచనా త్కుత శ్చిచ్చిన్తావశా ద్దృష్టివశా ద్వా సముద్బుద్ధసంస్కార స్తదీయ దుర్దినాని స్మృతివిషయాణి కుర్యా మి త్యర్థః - వాసరాణాం స్మరేయ మితివా పాఠః - తథా * 'అధీగర్థద యేశాం కర్మ ణీ'తి కర్మణి షష్ఠీ - అధీగర్థానాం చ శేషాధికారాత్-అశేషత్వవివక్షాయాం తు ద్వితీ యైవ స్మర్యతే - సంభావనాయా ముత్తమపురుషైకవచనం - యథాఽహం యాచ్ఞాదుఃఖాభిసంతప్త విషయాక్షిప్తచిత్తజనదుర్దశాదర్శనా త్సంజాతనిర్వేదః కేనచి ద్భాగ్యోదయేన పరమేశ్వరానుగృహీత స్తద్ధ్యానోత్థానే తదీయదుర్దినస్మరణతత్పరో భవేయమ్ - తథా వివేకిభిః శ్రేయోర్థిభిః భవితవ్యం - న తు తద్వద్దుర్దశాభాగ్భి రితి నిగూఢోపదేశ స్తాత్పర్యార్థవిషయీకృత ఇ త్యవధేయమ్. మన్దాక్రాన్తావృత్తమ్.

---

అవ.—తృష్ణ తీఱదుగాన దానికై యాచ్ఞాదైన్యము వహించుట సరి కాదు.

యే సంతోషనిరన్తరప్రముదితా స్తేషాం న భిన్నా ముదో,
యే త్వన్యే ధనలుబ్ధసంకులధియ స్తేషాం న తృష్ణా హతా,
ఇత్థం కస్య కృతే కృతః స విధినా తాదృ క్పదం సంపదాం
స్వాత్మ న్యేవ సమాప్తహేమమహిమా మేరు ర్న మే రోచతే.

టీక.—యే = ఎవరు, సన్తోష...ముదితాః-సన్తోష = తనివిచేత - నిరన్తర = ఎడతెగక - ప్రముదితాః = సంతుష్టులో, తేషాం = వారికి, ముదః = హర్షములు, న భిన్నాః = భంగపడినవికావు (వర్ధిల్లుచునే యున్న వనుట), యే అన్యే = ఏయి

తరులు, ధన...ధియః - ధన = ధనమునందు - లుబ్ధ = ఆసగొన్న - సంకుల = కలంగిన - ధియః = మనస్సుగలవారో, తేషాం = వారికి, తృష్ణా = ఆశ, న హతా = ఉడిగినది కాదు, ఇత్థం = ఇట్టిస్థితిలో, సంపదాం = సమృద్ధులకు, తాదృక్ పదం = అట్టిగొప్ప స్థానమై, స్వాత్మని ఏవ = తనయందే, సమా...హిమా - సమాప్త = ముగిసిన - హేమ = బంగారముయొక్క - మహిమా = పెంపుగలదియగు - సః మేరుః = ప్రసిద్ధమైన బంగారుకొండ, బ్రహ్మణా = బ్రహ్మచేత, కస్య కృతే = ఎవనికొఱకు, కృతః = సృజింపఁబడినది, మే = నాకు, న రోచతే = రుచింపదు.

తా.—తనివిగలవారికి అఖండానందము కలదు, వారికి మేరువు అక్కఱలేదు, పేరాసగలవారికి మేరువువలననేనియు ఆసతీఱదు; లోకవృత్త మిట్లుండ, ఈయిరుదెగలవారికిం గొఱగానియట్లుగా దాని బంగారురాసులు ఒరులకు ఉపయోగపడక దానియందే యుండునట్లుగా ఆమేరువును బ్రహ్మ సృజించుట నా కేమియు నుచితముగాఁ దోఁపదు.— మేరువుచేతనేనియు తీఱని తృష్ణను తీర్చుకొనుటకై యాచ్ఞాదైన్యము వహించుట కేవలము అవివేక మని భావము.

మ. వరసంతోషనిరంతరప్రముదితుల్ వర్ణింప నెవ్వారు ని
ర్భరముల్ వారికి మోదముల్, కనకలుబ్ధస్వాంతు లౌవారికిన్
విరతిం బొందదు తృష్ణ, యెవ్వనికిఁ గావింపంబడెన్ బ్రహ్మచే
స్థిరసంపన్నిధి మేరు వాత్మధృతలక్ష్మీకంబు నా కిష్టమే ?

వ్యా.—అథ తృష్ణాయా యావతాఽప్యుపసంహారాభావాత్కిం యాచ్ఞాదైన్యే నేత్యాహ-య ఇతి.—యే పుమాంసః, దైవాల్లబ్ధేన వస్తునా జనితో మనోవిలాసస్సంతోష - స్తేన నిరన్తరం సతతం - ప్రముదితాః పరితుష్టాః - తృప్తా ఇతి యావత్ - తేషాం, ముదః ఆనన్దా, న భిన్నాః - కిం తు ప్రవృద్ధా ఏ వేత్యర్థః, తథాఽన్యే ఇతరే - యే పుమాంసః, ధనే - లుబ్ధా గార్ధ్యవతీ - అత ఏవ సంకులా ధీ ర్యేషాం తే తథోక్తా, స్తేషాం, తృష్ణా వస్తుస్పృహా, న హతా - న విరతే త్యర్థః - ధనలోభస్యాయత్తాభావా దితి భావః, ఇత్థ మేవం వ్యవస్థితే సతీతి శేషః - సః ప్రసిద్ధః, సంపదాం రత్నాదిసమృద్ధీనాం, తాదృ గిత్థ మితి వక్తు మశక్యం, పదం స్థాన - మనిర్వాచ్యధనసంప దాస్పద మి త్యర్థః, తథా, స్వాత్మ న్యేవ స్వస్మి న్నేవ, సమాప్తః పర్యవసితః - న తు పరోపకారపర్యాప్త ఇ త్యర్థః, తాదృశో, హేమమహిమా కాఞ్చనసంపత్తి ర్యస్య తథోక్తో, మేరు, ర్విధినా బ్రహ్మణా, కస్య కృతే కస్య పుంసః ప్రయోజనార్థం, కృతో నిర్మితః - నిత్యసంతోషసంపన్నానా మనపేక్షితత్వా దర్థలుబ్ధానా మపర్యాప్తత్వా చ్చానుపయోగా దితి భావః, అతో నిరర్థకత్వాత్ - మే మహ్యం, న రోచతే రుచిగోచరో న భవతి - న సమ్మత ఇత్యర్థః * 'రుచ్యర్థానాం ప్రీయమాణః'



ఇతి చతుర్థీ, తస్మా త్సుమేరుతుల్యధనలాభేఽపి తృష్ణాధనపిశాచ్యాః పరితోషాభావాత్తత్ప్రయుక్తయాచ్ఞాదైన్యవిభ్రాన్తిం తత్త్వవిచారేణ నిరస్య సంతుష్టాన్తఃకరణై ర్భవితవ్య మాయుష్మద్భి రితి తాత్పర్యమ్. శార్దూలవిక్రీడితమ్.

---

అవ.—యాచింపకయే జీవింప నుపాయము.

భిక్షాహార మదైన్య మప్రతిముఖం భీతిచ్ఛిదం సర్వదా
దుర్మాత్సర్యమదాభిమానమథనం దుఃఖౌఘవిధ్వంసనమ్,
సర్వత్రాన్వహ మప్రయత్నసులభం సాధుప్రియం పావనం
శమ్భోః సత్త్ర మవార్య మక్షయనిధిం శంసన్తి యోగీశ్వరాః.

టీక.—యోగీశ్వరాః = గొప్పయోగులు, అదైన్యం = విన్నఁదనము లేనిది, అప్రతిముఖం = ఎదిరి లేనిది, సర్వదా = ఎల్లప్పుడు, భీతిచ్ఛిదం = భయమును అడంచునది, దురా...మథనం - దుష్ట = చెడ్డవగు - మాత్సర్య=మచ్చరమును - మద = పొగరును - అభిమాన = గర్వమును - మథనం = త్రొక్కునది, దుఃఖ ఓఘ విధ్వంసనం= బాధల సమూహమును నాశముసేయునది, సర్వత్ర = ఎల్లయెడల, అన్వహం = ప్రతిదినమును, అ ప్రయత్న సులభం = ప్రయత్నము లేకయే సులువుగా దొరకునది, సాధు ప్రియం = సజ్జనులకు నిష్టము, పావనం = పవిత్రము, అగు, శమ్భోః సత్త్రం = శివుని (శివుఁడు వేసిన) యన్నసత్త్రమయిన, భిక్షాహారమ్ = భిక్షాన్నమును, అవార్యమ్ = అడ్డగింపఁబడని - అక్షయనిధిం = తఱుఁగనినిక్షేపముగా, శంసన్తి = చెప్పుదురు.

తా.—శివుఁడు ఎల్లవారికిని భిక్షాన్నసత్త్రము పెట్టియున్నాఁడు, దాన దీనతాదిదోషములు లేవు, అరిషడ్వర్గధ్వంసనాది గుణములే కలవు, దానినే మహాత్ములు అవారియగు నిక్షేప మందురు; యాచన, మాని దానజీవింపవచ్చును.— యచ్ఞాజీవనముకన్న భిక్షాన్నము మేలు.

మ. అభివర్ణింతురు యోగిపుంగవులు భిక్షాహారమున్ ధూతదై
న్యభయక్రోధమదాభిమానజడిమాహంకారమున్ సత్సుఖ
ప్రభవం బశ్రమలభ్య మూర్జిత మవార్యం బక్షయం బుగ్రదుః
ఖభిదాదక్షము శంభుసత్త్రము మహాకైవల్యసత్పాత్రమున్.

వ్యా.—తర్హి కథం జీవన మి త్యాశఙ్క్య తదుపాయం సపరికరం నివేదయన్నిగమయతి - భి క్షేతి.—యోగీశ్వరాః పరమార్థతత్త్వజ్ఞాః మహాయోగినః, భిక్షాహారం భైక్షాశనం కర్మ, న విద్యతే దైన్యం యాచ్ఞాకార్పణ్యం యస్మిం స్త త్తథోక్తం, భిక్షాం దేహీ త్యుచ్చారణానన్తర మేవ సద్గృహస్థై ర్బహుమానపూర్వకం దీయమానత్వా దితి

భావః - యద్వా-వ్యావహారికదైన్యసంభవేఽపి పారమార్థికదైన్యాభావా దితి భావః, న విద్యతే ప్రతిముఖం యస్య త త్తథోక్తం - స్వయ మేవ నిరతిశయసుఖం - న తు స్వస్య ప్రతిభటభూతం సుఖాన్తర మస్తీ త్యర్థః, సర్వత స్సర్వత్రాఽపి, భీతిచ్ఛిదం భయవినాశకం - భిక్షాశనతత్పర స్యాకుతోభయత్వా దితి భావః, దుష్టానాం దుస్స్వభావానాం - మాత్సర్య మ దాభిమానానా మసహిష్ణుత్వ ద ర్పాహంకారాణాం - మథనం నిరాసకం, దుఃఖౌఘవిధ్వంసనం సాంసారికాశేషబాధానివర్తకం - య ద్వా - దుఃఖౌఘస్య ఏకవింశతిమహాదుఃఖసముదాయస్య - విధ్వంసనం విచ్ఛేదకం - ఏకవింశతిమహాదుఃఖధ్వంసరూపమోక్షనిదాన మి త్యర్థ - 'ఆత్యన్తికదుఃఖధ్వంసో మోక్ష' ఇతి వైశేషికా స్తార్కికా శ్చ, అత్ర యత్కించి ద్వక్తవ్య మస్తి - విస్తరభయా న్నోచ్యతే, సర్వత్ర సర్వే ష్వపి దేశే ష్వి త్యర్థః, తత్రాఽప్యన్వహం ప్రతిదినం, తత్రాఽపి చాప్రయత్నం యత్నం వి నైవ - సులభం సుఖలభ్య మి త్యర్థః, సాధూనా మనహంకారిణాం - ప్రియ మిష్టం - పావనం పవిత్రం, శంభో శ్శివస్య, స త్త్రిం తృప్తిసాధన మి త్యర్థః - 'రుద్రో యేన కపాలపాణిపుటకే భిక్షాటనం సేవత' ఇ త్యన్నే నై వోక్తత్వాత్ - యద్వా - శంభో స్సత్త్రిం శంభుభక్తినిరతాన్నసత్త్రి మి త్యర్థః - ఖణ్డమణ్డలాధిపతిసత్త్రింతు నశ్వరం ఇదం తు సకలభువనాధీశ్వరప్రవర్తితత్వా చ్ఛాశ్వత మితి భావః, అత ఏవ, వావార్యం న కేనాఽపి నివారయితుం శక్యమ్, అక్షయనిధి మవినాశి నిదానం చ - నిత్యోపయోగేఽపిక్షయాభావా దితి భావః, శంస న్తి కథయ న్తి-అనుభవసిద్ధత్వా దిత్థం వర్ణయ న్తీ త్యర్థః; అతోఽనర్థపరమ్పరాజనితహైన్యం యాచ్ఞాదైన్యం విహాయో క్తరీత్యా సమస్తసద్గుణ విచిత్రం శంభుసత్త్రిం ప్రామాణికోక్తం సమాశ్రయణీయ మితి భావః. వృత్తం పూర్వవత్.

ఇతి వైరాగ్యశతక వ్యాఖ్యానే యాచ్ఞాదైన్యదూషణం
నామ తృతీయదశకమ్.

---

## అథ భోగాస్థైర్యవర్ణనమ్.

---

భోగే రోగభయం, కులే చ్యుతిభయం, విత్తే నృపాలా ద్భయం,
మానే దైన్యభయం, బలే రిపుభయం, రూపే జరాయా భయమ్,
శాస్త్రే † వాదభయం, గుణే ఖలభయం, కాయే కృతాన్తా ద్భయం,
సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం, వైరాగ్య మే వాభయమ్.



టీక.—భోగే = విషయభోగమునందు, రోగభయం = రోగముల్లవలని భయము, కులే = మంచికులమునుగూర్చి, చ్యుతి భయం = చెడుటవలని భయము, విత్తే = ధనమునందు, నృపాలాత్ = రాజువలన, భయం, మానే = అభిమానమందు, దైన్యభయం = దీనత్వమువలని భయము, బలే = బలమునందు, రిపుభయం = శత్రువువలని భయము, రూపే = సౌందర్యమందు, జరాయాః = ముదిమివలన, భయం, శాస్త్రే = తర్కవ్యాకరణాది శాస్త్రములందు, వాద భయం = వాదమువలని భయము, గుణే = మంచితనమునందు, ఖల భయం = దుర్జనునివలని భయము, కాయే=దేహమునందు, కృతాన్తాత్ = యమునివలన, భయం, భువి = భూమియందు, నృణాం = మనుష్యులకు, సర్వంవస్తు = సకలవస్తువును, భయ అన్వితం = భయముతోఁ గూడినది; వైరాగ్యమ్ ఏవ = విరక్తి మాత్రము, అభయమ్ = భయము లేనిది.

తా.—భోగములను రోగములు చెఱుచును, కులగౌరమును దురాచారము చెఱుచును, ధనమును రాజపహరించును, మానమును దీనత భంగపఱుచును, బలమునకు పగతురవలను కలుగును, రూపమును ముదిమి చెఱుచును, శాస్త్రజ్ఞానము వాదములు తెచ్చును, మంచితనమును ఖలులు దూషింతురు, శరీరమును యముఁడు చంపును; ఇట్లు లోకములో నిర్భయమైనవస్తు వేదియు లేదు; వైరాగ్య మొక్కటిమాత్రము నిర్భయము.

చ. బల గుణ భోగ రూప కుల ధర్మ కళేబర శాస్త్ర మానముల్
బలి ఖల రు గ్జరా చ్యుతి నృపాల యమ ప్రతివాది దైన్య సం
కులభయయుక్తముల్, నరులకుఁ భువి నెవ్వియు నిర్భయంబులై
నెలకొన వెన్నిభంగులను, నిర్భయ మొక్కవిరాగమే సుమీ.

వ్యా.—అథ భోగానా మస్థైర్యాకథనే యాచ్ఞాదైన్య మదూషితప్రాయ మేవేతి మనసి నిధాయ తద్దూషణాన న్తరం భోగాస్థైర్య మాహ-భోగఇతి.—భోగే స్రక్చన్దనవనితాసంభోగసుఖానుభవే - ని. 'భోగ స్సుఖే స్త్ర్యాదిభృతా వహే శ్చ ఫణకాయయో రి' త్యమరః, రోగా ద్వాతపిత్తాద్యామయా - ద్భయ మ స్తీతి శేషః - తస్య తద న్తరాయత్వా దితి భావః, కులే సద్వంశే, చ్యుతే రాచారభ్రంశా ద్భయం - తస్యాస్తదప్రతిష్ఠావహత్వా దితి భావః - అథవా చ్యుతే స్సంతానవిచ్ఛేదా - ద్భయం - తస్యా స్సంప్రదాయోపహతిహేతుత్వా దితి భావః, విత్తే ద్రవ్య సమృద్ధౌ, నృపాలా ద్రాజ్ఞో భయం - తస్య తదపహర్తృత్వా దితి భావః, మానే అభిమానే, దైన్యా త్కార్పణ్యా ద్భయం - తస్య తద్భఙ్గహేతుత్వా దితి భావః, బలే సామర్థ్యే, రిపో శ్శత్రో, ర్భయం - తస్య తద్దమనశీలత్వా దితి భావః, రూపే సౌన్దర్యే, జరాయా వార్ధకావస్థాయా, భయం - తస్యా స్తద్విలోపిత్వా దితి భావః, శాస్త్రే వేదాన్తాది శాస్త్రకలాపే, † వాదిభ్యః శుష్కతర్కకలహాకణ్ఠకేభ్యః, భయం - తేషాం తదపహాసకత్వా దితి భావః,

బడినవైన, వనాన్తాః = వన ప్రదేశములు, (కలవు), వైరాగ్యమ్=విరక్తి, అస్తి = కలదు, (ఎవనికి పూర్వోక్త మంతయుం గలదో వానికి), ఇతః పరమ్ = ఇటుపైని, అర్థనీయం కిమ్ = కోరఁదగినది ఏమి (ఏమియు లే దనుట).

తా.—ఎవనికి శివభక్తియు భవభయమును కలిగి దారపుత్త్రాదులందు ప్రేమ మాని, మదనవికారములు లేక, సంపర్క దోషములు ఉదయింపని విజనవనప్రదేశములును, వైరాగ్యమును, కలవో వానికి కోరఁదగిన యైహికశ్రేయ మేదియు లేదు.

చ. హరచరణాబ్జయుగ్మమున నంచితభక్తి, మనంబులో జరా
మరణభయంబు, బాంధవసమాజముపై స్పృహ లేమి, దుస్సహ
స్మరశరనిగ్రహంబు, మునిమాన్యవివిక్తవనప్రదేశముల్,
పరమవిరక్తియుం గలుగ, భాగ్యమహోన్నతి వేఱ యున్నదే?

వ్యా.—న న్వేవం శ్రేయస్సాధనత్వేన వ్యవహృతానా మేతేషాం నిషేధే కి మన్య చ్ఛ్రేయస్సాధన మి త్యత ఆహ - భక్తి రితి.— హే చేతః, భవే శమ్భౌ, భక్తి ర్భజనానురాగః కార్య ఇతి శేషః, కిం చ, మరణజన్మభ్యాం మహోపద్రవకారిభ్యాం నిధనోత్పత్తిభ్యాం - భయం, హృది తిష్ఠ తీతి హృదిస్థం కర్తవ్య మితి శేషః - న తు విస్మర్తవ్య మితి భావః, బన్ధుషు పుత్త్రమిత్త్ర కళత్త్రాదిషు విషయే, స్నేహోఽనురాగో, న న కార్యః, తథా, మన్మథా జ్జాయన్త ఇతి తథోక్తా, వికారాః స్త్రీపరతన్త్ర త్వాదయః, న న కార్యాః - శ్రేయోన్తరాయత్వా దితి భావః, ఇత్థం శ్రేయస్సాధన త్వేన కర్తవ్యద్వయం తదసాధనత్వే నాకర్తవ్యద్వయం చోపది శ్యేదానీం పున ర్ముఖ్యం కర్తవ్యాన్తర ముపదిశతి - సంసర్గదోషై స్సఙ్గదోషై - రహితాః కామక్రోధా దిప్రసఙ్గవర్జితా ఇ త్యర్థః - 'సఙ్గా త్సంజాయతే కామ' ఇ త్యాదిభగవద్వచనేన సఙ్గజనిత కామాది దోషపరమ్పరాయా అనర్థహేతుత్వా దితి భావః, కుతః - విజనాః వివిక్తాః, వనాన్తా వనప్రదేశా, స్సేవ్యా ఇతి శేషః, తత్ర కి మస్తీత్యాశఙ్కాయా మాహ - వైరాగ్య, మస్తి సంభవ తీ త్యర్థః, అతో వై రాగ్యా త్పర మన్య, త్కి మర్థ నీయ మభిలషణీయం - న కిమ పీ త్యర్థః. తస్యైవ పరమశ్రేయస్సాధనత్వా దితి భావః.

---

తస్మా దనన్త మజరం పరమం వికాసి
త ద్బ్రహ్మ చిన్తయ, కి మేభి రసద్వికల్పైః?
య స్యానుషఙ్గిణ ఇమే భువనాధిపత్య
భోగాదయః కృపణలోకమతా భవన్తి. 69.

టీక.—తస్మాత్ = అందుచేత (ఇహమందు కోరఁదగినది ఏదియు లేనందున), కృపణ లోక మతాః - కృపణ = దీనుల - లోక = సమూహమునకు - మతాః = ఇష్ట



ములైన, భోగ = సుఖానుభవములు - ఆదయః = మొదలైనవి, యస్య = ఏబ్రహ్మమును, అనుషఙ్గిణః = అనువర్తించునవో, అనన్తమ్ = తుదలేనిది, అజరం = ముదిమిలేనిది, పరమం = సర్వోత్కృష్టము, వికాసి = వెలుఁగుచుండునది, (అగు), తత్ బ్రహ్మ = ఆ బ్రహ్మమును, చిన్తయ = తలపోయుము, ఏభిః అసత్ వికల్పైః = ఈ చెడు తలంపులచేత, కిమ్ = ఏమి ప్రయోజనము.

తా.—కోరఁదగినది యేమియు లేనందున విరక్తుఁడు చేయవలసిన పని యేమనఁగా - చెడు తలంపులు మానినవాఁడై, ఏపరమాత్మను, లుబ్ధులు ఘనముగా నెంచి యాసించెడి యీ లోకాధిపత్య ప్రభృతి భోగములు అనువర్తించుచుండునో, తుదయు ముదిమియు లేక సర్వోత్కృష్టమై వెలుఁగుచుండునట్టి యా పరమాత్మను, చింతింపవలయును. దానంజేసి తదైక్యపదవిం జెందును.

తే. కావున ననంత మజర మక్షర మజంబు । బ్రహ్మము భజింపు, మతివికల్పములు మాను;
బ్రహ్మసంగికి భువనాధిపత్యభోగ । పదవియును నీకుఁ దుచ్ఛమై పరఁగుఁ జువ్వె.

వ్యా.—అథ బ్రహ్మవిచారతత్పరస్య తే సర్వేఽపి భువనాధి పత్యాదయ స్తుచ్ఛా ఏవ ప్రతిభాన్తీ త్యుపసంహరతి - తస్మా దితి.— తస్మాత్ యస్మా ద్వైరాగ్య మేవార్థ నీయం తస్మా ది త్యర్థః, హే చేతః, అనన్త మపరిచ్ఛిన్నం త్రివిధపరిచ్ఛేదశూన్యం, తథా, అజరం జన్మజరామరణవర్జితమ్, అత ఏవ, పరమం సర్వోత్కృష్టం, తథా, వికాసి వికస్వరం సర్వవ్యాపీ త్యర్థః - యద్వా - వికాసి భాస్వరం, త ద్బ్రహ్మ, చిన్తయ విచారయ, ఏభిః క్రియమాణై, రసద్వికల్పై రసద్భి రసాధుభిః - అసత్యై ర్వా - వికల్పై స్తత్తద్భోగ ప్రాప్త్యప్రాప్తిగోచరవిచారైః, కిం - వికల్పసాధ్యం నా స్తీత్యర్థః,* గమ్యమానసాధనక్రియాపేక్షయా కరణత్వా త్తృతీయా * 'న కేవలం శ్రూయమాణైవ క్రియా నిమిత్తం కారక భావస్య - అపి తు గమ్యమానా పీ' తి వచనాత్ * య త్తదో ర్నిత్య సంబన్ధా త్తచ్ఛబ్దస్య యచ్ఛబ్దాకాఙ్క్షాయా మాహ - యస్య బ్రహ్మణః - అనుషఙ్గిణః సమ్బన్ధవన్తః య ద్బ్రహ్మవిచార ఇ త్యర్థః, త వేతి శేషః, ఇమే కామ్యమానాః, భువ నాధిపత్యం లోకాధిపత్యం - భోగః స్వర్గాదిసత్యాన్తలోక సముదాయస్థః - తా వాదీ యేషాం తే తదాదయో భోగాః, కృపణలోకానాం బ్రహ్మవిచారహీనజనానాం- మతా ఇష్టా యోగ్యా ఇతియావత్-భవన్తి ప్రతిభాన్తి - తేషా మేవ యోగ్యాః తే నమాదృశానా మితి ప్రతీయన్త ఇ త్యర్థః, భువనాధిపత్యాదీనా మేవం ప్రతీయమానత్వే కి ముతాన్యేషా మితి భావః - తదానీం తవ తృణీకృతబ్రహ్మపురన్దరత్వా త్సర్వేఽపి తుచ్ఛా ఏవ ప్రతిభాన్తీతి పరమార్థః - యద్వా - నను సర్వథా భోగజాత మేవ మ మాభిలషితం నాన్య దితి యది మన్యసే తదా ఇత్థంభూతస్య తవ సర్వే భువనాధిపత్యాదిభోగా అనుషఙ్గా త్స్వయ మేవ సమ్భవన్తీతి సమాధాన మభిప్రే త్యాహ - హే చేతః, తత్

సకలవేదాన్త ప్రసిద్ధం - యద్వా - తచ్ఛబ్దలక్ష్యార్థభూత మిత్యర్థః - 'తత్త్వమసీ'తి మహావాక్యే తథా వ్యాఖ్యానా దితి భావః, చిన్తయా, చిన్తనఫల మాహ - యస్య బ్రహ్మచిన్తనతత్పరస్య, తే, కృపణలోకమతా ఇమే భువనాధిపత్యభోగాదయః, అనుషఙ్గిణః భవన్తి అనుషఙ్గా త్స్వయ మేవ సమ్భవన్తీ త్యర్థః - బ్రహ్మధ్యాననిష్ఠాసామ్రాజ్య లక్ష్మీపతేః కిం తే దుర్లభ మితి భావః - శేషం సమానమ్ - యద్వా - యస్య బ్రహ్మచిన్తనస్య ఇమే భువనాధిపత్యాదయః అనుషఙ్గిణః అనుబన్ధినః భవన్తి - తథా చ సతి బ్రహ్మచిన్తనే తదనుబన్ధవశా త్సర్వేఽపి స్వయ మేవ సమ్భవ న్తీతి భావః; అత్ర 'శిఖాతే వర్ధతే నూనం గుళూచీం పిబ శాబకే' తి శాస్త్రవచన మనుసృత్య తాత్పర్యాన్తరే నైవం సమాహిత మి త్యనుసన్ధేయమ్; కృపణలోకమతా ఇ త్యత్ర యద్యపి* మతిబుద్ధీ త్యాదినా వర్తమానార్థే క్తప్రత్యయే *'క్తస్య చ వర్తమాన' ఇతి షష్ఠీసమాస నిషేధః - తథాఽపి నిరఙ్కుశాః కవయ ఇ త్యలమ్.

---

పాతాల మావిశసి, యాసి నభో విలఙ్ఘ్య,
దిఙ్మణ్డలం భ్రమసి, మానస చాపలేన;
భ్రాన్త్యాఽపి జాతు విమలం కథ మాత్మనీనం
తద్బ్రహ్మ న స్మరసి నిర్వృతి మేషి యేన. 70.

టీక.—(హే) మానస = (ఓ) మనసా, చాపలేన = లోలతచేత, పాతాళమ్ = పాతాళమును, ఆవిశసి = చొచ్చెదవు, నభః = ఆకాశమును, విలఙ్ఘ్య = దాఁటి, యాసి = పోయెదవు, దిక్ మణ్డలం = దిక్కుల చక్రమును, భ్రమసి = తిరిగెదవు, యేన = ఏ బ్రహ్మస్మరణముచేత, నిర్వృతిమ్ = ఊఱటను (మోక్షము ననుట), ఏషి = పొందుదువో, భ్రాన్త్యా అపి = పొరఁబాటున నైనను, జాతు = ఒకప్పుడేని, విమలమ్ = నిర్మలమును, ఆత్మనీనం = ఆత్మకు హితమును, (అగు), తత్ బ్రహ్మ = ఆ బ్రహ్మమును, న స్మరసి కథమ్ = తలంప వేమి.

తా.—ఓమనసా, కుదురుగా నుండలేక ఎల్లలోకములను తలపోసెదవు, నానాదూరదేశములను చింతించెదవు; ఇంతియకాని దేనిని స్మరించిన మోక్షము కలుగునో, నిర్మలమును ఆత్మహితమును అగు నాపరబ్రహ్మమును తప్పి దారి యైనను ఒకప్పు డయినను స్మరింప వేమి?

చ. బలిసదనంబుఁ జొచ్చెదవు, ప్రాఁకెద వభ్రపదంబు దాఁటి, ది
గ్వలయము నాక్రమించెదవు, వారక చిత్తమ చాపలంబునం;
దలఁప వొకప్పుడుం దఱచి తప్పియుఁ లోన వెలుంగు బ్రహ్మము,
న్దలఁచెద వేని పొందెదవు నాశవివర్జిత నిత్యసౌఖ్యమున్.



వ్యా.—ఏవ మే వార్థం పునః ప్రకారాన్తరే ణోపదిశ న్నిగమయతి - పాతాళ మితి.—హే మానస, చాపలేన తత్తద్విషయాసక్తిజనితచాపల్యేన* యువాదిత్వా దణ్ *హేతౌ తృతీయా, పాతాళ మావిశసి అత్యన్తాధః ప్రదేశ మపి గచ్ఛ సీ త్యర్థః, తథా, నభోఽన్తరిక్షం, విలఙ్ఘ్య, యాసి అత్యూర్ధ్వప్రదేశ మపి గచ్ఛ సీ త్యర్థః, తథా, దిఙ్మణ్డలం దిక్చక్రవాళం, భ్రమసి అతిదూరదేశ మపి ధావ సీ త్యర్థః - సర్వత్రాపి మనోగతే నిరర్గళత్వా దితి భావః, కిం తు, భ్రాన్త్యా భ్రమవశే నాపి - మాస్తు వివేకే నే త్యపి శబ్దార్థః - తథాపి, జాతు కదాచి దపి, విమలం నిర్మలమ్ - అవిద్యాకార్యసంబన్ధశూన్య మి త్యర్థః, కిన్తు ఆత్మహిత మాత్మనీనం సుఖస్వరూపత్వాత్ *'ఆత్మన్విశ్వజన భోగో త్తరపదాత్ఖ' ఇతి ఖప్రత్యయః -'ఆత్మలీన మి'తి పాఠే-ఆత్మ న్యన్తరాత్మని-లీనం నిలీయ స్థితం - సర్వాన్తర్యామిత్వాత్, బ్రహ్మ, కథం, న సంస్మరసి న ధ్యాయసి - సర్వథా స్మర్తవ్య మి త్యర్థః, కుతః - యేన సంస్మరణేన, నిర్వృతి మానన్ద, మేషి ప్రాప్నోషి, అతః యథాకథంచి త్స్మరణేఽప్యానన్ద జనకత్వా దవశ్యం స్మర్తవ్య మేవ -

'హరి ర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః,
అనిచ్ఛయాఽపి సంస్పృష్టో దహ త్యేవ హి పావకః.'

ఇత్యాదివచనా దితి భావః.

ఇతి వైరాగ్యశతకవ్యాఖ్యానే మనస్సంబోధననియమనం నామ
సప్తమదశకమ్.

---

## అథ నిత్యానిత్యవస్తువిచారః.

---

కిం వేదైః స్మృతిభిః పురాణపఠనైః శాస్త్రై ర్మహావిస్తరైః
స్వర్గగ్రామకుటీనివాసఫలదైః కర్మక్రియావిభ్రమైః ?
ముక్త్వైకం భవదుఃఖభారరచనావిధ్వంసకాలానలం
స్వాత్మానన్దపదప్రవేశకలనం, శేషా వణిగ్వృత్తయః. 71.

టీక:—వేదైః = శ్రుతులచేత, స్మృతిభిః = ధర్మశాస్త్రములచేత, పురాణపఠనైః = పురాణములను చదువుటచేత, మహావిస్తరైః = గొప్పవిరివిగల, శాస్త్రైః = తర్కవ్యాకరణాదిశాస్త్రములచేత, స్వర్గ...ఫలదైః - స్వర్గ = స్వర్గమనెడి - గ్రామ కుటీ = పల్లెగుడిసెయందు - నివాస = కాపురమనెడి - ఫల = ప్రయోజనమును - దైః - ఇచ్చునవగు, కర్మక్రియావిభ్రమైః - కర్మ = శ్రౌతస్మార్త కర్మలయొక్క - క్రియా = చేతలయొక్క - విభ్రమైః = ఆడంబరములచేత, కిం = ఏమి(యు

(ప్రయోజనములేదు), భవ = సంసారమువలని - దుఃఖ భార = పెనుదుఃఖముల యొక్క - రచనా = నిర్మాణముయొక్క - విధ్వంస = రూపుమాపుటయందు - కాల అనలం = ప్రళయాగ్నియగు, స్వ = తనయొక్క - ఆత్మ ఆనన్ద = ఆత్మ సుఖముయొక్క - పద = స్థానమునందు - ప్రవేశ = చొచ్చుటయొక్క - కలనం = గడనను, ఏకం = ఒక్కదానిని, ముక్త్వా = విడిచి, శేషాః = కడమవి, వణిగ్ వృత్తయః = వర్తకుల వ్యాపారములు.

తా.—శ్రుతి స్మృతి పురాణ శాస్త్రవిస్తరములచేతఁగాని, తుచ్ఛమయిన స్వర్గ భోగము నొసంగునవైన జ్యోతిష్టోమాదికర్మలచేతఁగాని, ఏప్రయోజనమును లేదు. సంసార దుఃఖపరంపరకు కారణమయిన పూర్వకర్మను మాయించునదైన స్వాత్మానందసమాధి తప్ప కడమ పూర్వోక్తవేదాధ్యయనాదులు వర్తకవ్యాపారమువలె ఆర్జనకు వృత్తులు.

ఉ. శ్రీమహితశ్రుతిస్మృతులచే బహుశాస్త్రపురాణయుక్తిచే
నేమి ఫలంబు లౌక్యజన వృత్తికి నీడగు నిర్జరాలయ
గ్రామకుటీనివాసఫలకర్మముచే ఫల మేమి? జన్మదుః
ఖామయభేషజాత్మయమహాసుఖ మొక్కటి దక్క నన్నిటన్.

వ్యా.—అథ వేదాధ్యయన స్మృతిపర్యాలోచన శాస్త్రపఠన పురాణశ్రవణా దిభి ర్న కోఽపి లాభః - కిం తు విచారాత్ శ్రవణమననినిదిధ్యాసాదిభి రాత్మానుభవ ఏవ లాభ ఇతి మత్వా జనా నుద్దిశ్య బోధయతి - 'కిం వేదై' రితి శ్లోకేన - కిమితి.— వేదైః ఋగ్యజుస్సామాథర్వణ సంజ్ఞకైః చతుర్భి ర్వేదైః, కిం కిం ప్రయోజనం - న కి మపి ప్రయోజన మి త్యర్థః, స్మృతిభిః మన్వాద్యష్టాదశ స్మృతిభి రుపస్మృతిభి శ్చ, కిం ప్రయోజనం న కి మ పీ త్యర్థః, పురాణపఠనైః బ్రహ్మాండపురాణాద్యష్టాదశపురాణో పపురాణపఠనై శ్చ, న కి మ పీ త్యర్థః, మహావిస్తరై అతివిస్తృతైః, శాస్త్రైః తర్క వ్యాకరణాదిదర్శనైః, న కి మ పీ త్యర్థః, స్వర్గే సర్వపుణ్యకృన్నివాసే నాకలోకే చ - గ్రామేషు బ్రాహ్మణ ప్రధానవర్ణానాం నివాసేషు - కుటీషు పర్ణగృహేషు - యః నివాసః తేన ఫలదైః ఫలప్రదైః, కర్మణాం స్నానసంధ్యావన్దనౌపాసన యజ్ఞా దీనాం - క్రియాభిః వ్యాపారైః - విభ్రమై శ్చ, న కి మపి ప్రయోజన మి త్యర్థః, భవాత్ జననమరణరూపసంసారాత్ - య ద్దుఃఖం దారిద్ర్యభార్యాపుత్రాదినాశాది - తస్య - భారః అసహ్యాతిశయః - తస్య - రచనా కలనా - తస్యాః - విధ్వంసః నాశః- తస్య - కాలానలం ప్రళయాగ్నిరూపం, స్వస్య - ఆత్మానన్దః ఆత్మసుఖానుభవః-తస్య- పదం స్థానం - తస్మిన్ ప్రవేశః - తస్య - కలనం ఏకం కేవలం - ని. 'ఏకే ముఖ్యాన్య కేవలాః' ఇ త్యమరః, ముక్త్వా విహాయ, † శేషైః ఉక్తేభ్య అన్యైః వణిగ్వృత్తయః వర్తక వ్యాపారాః జనాః ఇ త్యర్థః.



ఆత్మజ్ఞానం వినా ఉక్తానాం వేదాదీనా మధ్యయనాదిభి రపి ఫలం నా స్తీత్యర్థః, సర్వేషాం వేదాన్తవాక్యానామ్ బ్రహ్మణి తాత్పర్య మి త్యుక్తరీత్యా బ్రహ్మజ్ఞాన మేవ సంపాదనీయం న త్వితర దిత్యాశయః; శేషై ర్వణిగ్వృత్తిభి రితి పాఠేన వర్తకవ్యా పారసదృశైః శేషైః ఉక్తాన్యైః న కి మపి ప్రయోజన మిత్యాశయః.

యదా మేరుః శ్రీమా న్నిపతతి యుగాన్తాగ్నివలితః,
సముద్రాః శుష్యన్తి ప్రచురమకరగ్రాహనిలయాః,
ధరా గచ్ఛ త్యన్తం ధరణిధరపాదై రపి ధృతా,
శరీరే కా వార్తా కరికలభకర్ణాగ్రచపలే? 72.

టీ.—యతః = ఏహేతువుచేత, శ్రీ మాన్ = సిరి గల, మేరుః = బంగరుకొండ, యుగా...లితః సన్ - యుగాన్త అగ్ని = యుగముకడపటి నిప్పుచేత - వలితః సన్ = చుట్టుకొనఁబడినదై, నిపతతి = పడునో, ప్రచుర...లయాః - ప్రచుర = పెక్కు - మకర = పెద్దచేఁపలకును - గ్రాహ = మొసళ్లకును - నిలయాః = ఉనికిపట్లయిన, సముద్రాః = సంద్రములు, శుష్యన్తి = ఎండిపోవునో, ధరణిధర పాదైః = పర్వతములయొక్క అడుగులచేత, ధృతా = పట్టుకొనఁబడినదైన, ధరా అపి = భూమియును, అన్తం = నాశ మును, గచ్ఛతి = పొందునో, (తతః = ఆహేతువుచేత), కరి...చపలే - కరి కలభ = ఏనుఁగు కొదమయొక్క - కర్ణ అగ్ర = చెవికొనవలె - చపలే = నిలుకడలేని, శరీరే = దేహమువిషయమున, కా వార్తా = ఏమి కథ.

తా.—సకల మణిసువర్ణాది సంపన్నమయిన మహా మేరువు సయితము ప్రళయాగ్ని చేత చుట్టుకొనఁబడి కరఁగి కూలిపోవును, పెక్కింటికి పెద్దచేఁపలకును మొసళ్లకును ఉనికి పట్టులగు మహాసముద్రములు సయితము ప్రళయాగ్నికి ఇగిరి పోవును, కొండల పాదముల చేత కదలకుండ పట్టుకొనఁబడియుండు భూమి సయితము ప్రళయాగ్నికి నాశ మొందును. స్థిరతర మయినవానిగతియే యిట్లుండఁగా, ఏనుఁగుకొదమచెవికొనవలె క్షణ మేనియు నిలుకడలేని దేహముమాట చెప్పవలయునా?

చ. స్థిరతర మైనమేరువు నశించు యుగాంతకృశానుకీలలన్,
వరమకరాకరంబు లగువారినిధానము లెల్ల నింకు, భూ
ధరములచే ధరింపఁబడు ధారుణి పోఁడిమి దప్పుఁ, గావునం
గరికలభశ్రవశ్చపలకాయమునం దిఁక వార్త లేటికిన్.

వ్యా.—అథాతిరిక్త స్యానిత్యత్వ మేవ ప్రపఞ్చయతి - యత ఇతి.—యతో యస్మాత్కారణాత్, శ్రీమాన్ మణిహిరణ్యాది సకలవస్తు సమృద్ధిమాన్, మేరుః మేరు గిరి రపి, యుగాన్తాగ్నినా ప్రళయకాలానలేన - వలిత స్సంవేష్టిత స్సన్ - న్నిపతతి విశీ

ష్టాగ్నిసంపర్కా న్నిలీనో భవతీత్యర్థః, తథా, ప్రచురాః ప్రభూతాః - మకరాః నక్రాః - గ్రాహా జలగ్రాహాశ్చ - తేషాం - నిలయాః సమాశ్రయాః - స్సముద్రాస్సప్త సాగరాశ్చ, శుష్యన్తి శోషం ప్రాప్నువన్తి, తథా, ధరన్తీతి ధరాః * పచాద్యచ్ - ధరణ్యాః ధరాః మహేన్ద్రాది సప్తకులాచలా - స్తేషాం - పాదైః ప్రత్యన్తపర్వతైః - ని. 'పాదాః ప్రత్యన్తపర్వతా' ఇత్యమరః, ధృతా సమ్యగవష్టబ్ధా, ధరా భూమిశ్చ, అన్తం నాశం పాతాళం వా, గచ్ఛతి ప్రాప్నోతి - ఉభయత్రాపి ప్రళయాగ్నిమేళనా దేవేతి భావః, తస్మాత్ కారణాత్ * యత్తదో ర్నిత్యసంబన్ధాత్, కరికలభస్య కరిపోతస్య - కర్ణాగ్రం కర్ణాఞ్చలం - తద్వ చ్చపలే, శీర్యత ఇతి శరీరే, కా వార్తా కా కథా న కాఽపీత్యర్థః; యతోఽత్యన్తస్థిరతరాణా మపి ఈదృ శ్యవస్థా కి ముత క్షణభఙ్గురాణాం శరీరాణాం - 'గజా యత్ర న గణ్యన్తే మశకానాం తు కా కథే'తి న్యాయా దితి భావః, సర్వేఽపి నశ్వరా ఏవ తతోఽప్యతినశ్వరం శరీర మితి తాత్పర్యమ్; కరికలభే త్యత్ర కరిశబ్దస్య విశేషప్రతిపత్తిహేతో ర్వైశేష్యప్రతీత్యర్థత్వా దపౌనరుక్త్యమ్; అత ఏ 'వైకార్థం పద మప్రయోజ్య మి' త్యుక్త్వా 'కరికలభకర్ణావతంసాదిషు ప్రతిపత్తివిశేషకరేషు న దోష' ఇత్యాహ వామనః.

---

అవ.—ముదిమిచేఁ గలుగుపాట్లు.

గాత్రం సఙ్కుచితం, గతి ర్విగళితా, భ్రష్టా చ దన్తావలి,
ర్దృష్టి ర్నశ్యతి, వర్ధతే బధిరతా, వక్త్రం చ లాలాయతే,
వాక్యం నాద్రియతే చ బాన్ధవజనో, భార్యా న శుశ్రూషతే,
హా కష్టం! పురుషస్య జీర్ణవయసః పుత్రోఽ†ప్యమిత్రాయతే. 73.

టీక.—జీర్ణ వయసః=ముదిసిన వయస్సుగల, పురుషస్య = పురుషునికి, గాత్రం= దేహము, సఙ్కుచితం = ముడిఁగినది, (అగును), గతిః = నడక, విగళితా = జాఱినది, (అగును), దన్త ఆవళిః = పలు వరుస, భ్రష్టా = రాలినది, (అగును), దృష్టిః = చూపు, నశ్యతి = నశించును, బధిరతా = చెవుడు, వర్ధతే = పెరుఁగును, వక్త్రం = నోరు, లాలాయతే= చొంగ గాఱును, బాన్ధవజనః = బందుగుల సమూహము, వాక్యం = (తన) మాటను, న ఆద్రియతే = సరకుగొనదు, భార్యా= పెండ్లాము, న శుశ్రూషతే = ఉపచరింపదు, కాఁబట్టి, హా కష్టం = అయ్యోకట్టా, పుత్రోఽపి= కొడుకుగూడ, అమిత్రాయతే = శత్రువువలె నగును.

తా.—దేహమునకు ముదిమిగలిగినప్పుడు నరునికిం గలుగుపాట్లు వినుము.—ఒడలు ముడిఁగిపోవును, నడక తడఁబడును, పండ్లు రాలిపోవును, చూపు నశించును, చెవుడు క్రముగా బలపడును, నోట చొంగ కాఱును, బంధువులు తనమాటను సరకుసేయరు, పెండ్లాము ఉపచరింపదు; అయ్యో! కటకటా! కొడుకు సయితము శత్రు వగును. కావున ఈపాడుదేహమును అభిమానింపక మోక్షోపాయమును సేవింపవలయును.



చ. తనువు ముడుంగుఁ, బాదగతిదప్పును, దంతము లాడుఁ, జీఁకటుల్
గనుఁగవ వర్తిలుం, జెవుడు గ్రమ్మును, జొంగలు గాఱు మోమునన్,
జనములు మాట చేకొనరు, సన్నిధిఁ జేరదు భార్య, పుత్త్రుఁడుం
గొనకొని శత్రునట్లు తిరుగుం గడుఁ గష్టము వృద్ధదేహికిన్.

వ్యా.—అథ శరీరిణో జరయా దురవస్థా మాహ ద్వాభ్యాం గాత్ర మితి.—గాత్రం శరీరం, సఙ్కుచితం భుగ్న మభూ దితి శేషః, గతి స్సంచారో, విగళితా సంచారశక్తి రపి నష్టేత్యర్థః, దన్తావళి ర్దన్తపఙ్క్తిశ్చ, భ్రష్టా పతితా, దృష్టి శ్చక్షురిన్ద్రియం చ, నశ్యతి అర్థగ్రహణాపటు ర్భవతీత్యర్థః, బధిరతా శ్రోత్రేన్ద్రియాపాటవం, వర్ధతే వృద్ధిం ప్రాప్నోతి, వక్త్రం చ, లాలా దన్తాన్తర్గతజలం-లాలే వాచరతి లాలాయతే-లాలామయం భవతీత్యర్థః - ని. 'సృణికా స్యన్దినీలాలే' త్యమరః, తథా బన్ధవ ఏవ బాన్ధవాః * స్వార్థేఽణ్ప్రత్యయః-త ఏవ జనో బన్ధువర్గశ్చ, వాక్యం వచనం, నాద్రియతే న రోచయత ఇత్యర్థః, కిం బహునా, భార్యాఽపి, న శుశ్రూషతే న సేవతే - యద్వా - సేవితుం నేచ్ఛతి - సేవా దూరాపా స్తేతి భావః, అతః, జీర్ణవయసో జరావస్థాసంపన్నస్య పురుషస్య, హేతి విషాదే, కష్టం కృచ్ఛ్రం, కుతః - పుత్రోఽప్యాత్మసంభవోఽపి, † అమిత్రాయతి అమిత్రం శత్రు మి వాచరతి - ప్రతికూలాచరణ తత్పరో భవతీత్యర్థః; లాలాయత ఇత్యత్ర * 'కర్తుః క్యఙ్ సలోపశ్చే'తి క్యఙ్ - అత్ర తు * 'ఉపమానా దాచార' ఇతి క్యచ్- ఉభయత్రాపి * 'అకృత్సార్వధాతుకయో ర్దీర్ఘ' ఇతి దీర్ఘః.

---

వర్ణం సితం † శిరసి వీక్ష్య శిరోరుహాణాం
స్థానం జరాపరిభవస్య తదా పుమాంసమ్
ఆరోపితాస్థిశకలం పరిహృత్య యాన్తి
చణ్డాలకూప మివ దూరతరం తరుణ్యః. 74.

టీక.—తరుణ్యః = జవ్వనులు, శిరసి = తలయందు, శిరోరుహాణాం = తలవెండ్రుకలయొక్క, సితం వర్ణం = తెల్లని వన్నెను, వీక్ష్య = చూచి, తదా = అప్పుడు, (తల నరసినప్పుడు), జరా పరిభవస్య = ముదిమిచేతి తిరస్కారమునకు, స్థానం=తావు (పాత్రము), (అగు), పుమాంసం = పురుషుని, ఆ...లం - ఆరోపిత = పైనిపెట్టఁబడిన-

అస్థి=ఎముకల - శకలం = తునుకలుగలదైన, చణ్డాల కూప మివ = మాలల నూతివలె, పరిహృత్య = వదలి, దూరతరం = మిక్కిలి దూరముగా, యాన్తి = పోవుదురు.

తా.—నరసినతలను జూచి జవ్వనులు ముదిమిచే తిరస్కారభాజన మగునరుని ఒరపైని ఎముకతునుకలు పెట్టియుండెడుమాలనూతిని బోలె వదలి దూరముగాఁ బోదురు.

ఆ. కురులతెలుపు చూచి కొఱగాఁడు వీఁడని । ముసలివాని విడిచి ముదితలెల్ల
దూరముగఁ దొలంగుదురు సాస్థిశకలమౌ । మాలనూతి విడిచి మలఁగు భంగి.

వ్యా.—వర్ణ మితి.—తరుణ్యో యువతయః కర్త్ర్యః * 'వయసి ప్రథమ' ఇతి ఙీప్, శిరసి రోహ న్తీతి శిరోరుహా శ్చికురాః తేషామ్ * ఇగుపధలక్షణః క ప్రత్యయః, సితం వర్ణం ధావళ్యగుణం - పలితత్వ మితి యావత్, † ఝడి త్యఞ్జసా, వీక్ష్య దృష్ట్వా- ని. 'ద్రాగ్ఝడి త్యఞ్జసాహ్నా యే' త్యమరః, తదా తస్మిన్ సమయే - దర్శన సమనన్తర కాల ఏ వే త్యర్థః, జరయా వార్ధకావస్థయా - యః పరిభవః అవమాన - స్తస్య- స్థాన మాస్పదం, తథా, ఆరోపితం బహిఃస్ఫుటలక్ష్యత్వా దారోపిత ప్రాయ - మస్థిశకలకం యస్య తం తథోక్తం - అన్య త్రారోపితం నిక్షిప్తం - అస్థిశకలకం యస్మిన్ తం- 'ఆరోపితాస్థిశకల' మితి పాఠే- ఏక త్రారోపితప్రాయకీకసఖణ్డం అన్యత్ర నిక్షిప్తకీకసఖణ్డ మి త్యర్థః, పుమాంసం పురుషం, చణ్డాలకూపం చణ్డాలసంబన్ధిజలాశయ మివ, పరిహృత్య పరి త్యజ్య, దూరతర మతివిప్రకృష్టం, యాన్తి హేయత్వా ద్విహా యాన్యత్ర గచ్ఛ న్తీ త్యర్థః; అతః కష్టం జీర్ణవయసోఽపి జీవన మితి భావః.

———

యావత్ స్వస్థ మిదం శరీర మరుజం, యావచ్చ దూరే జరా,
యావ చ్చేన్ద్రియశక్తి రప్రతిహతా, యావ త్క్షయో నాయుషః,
ఆత్మ శ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్,
సందీప్తే భవనే తు కూపఖననం ప్ర త్యుద్యమః కీదృశః? 75.

టీక —యావత్ = ఎందాఁక, ఇదం శరీరమ్ = ఈ బొంది, అరుజం = రోగము లేనిదై, స్వస్థం = పసిగా, (ఉండునో), యావచ్చ, జరా = ముదిమి, దూరే = దూరమునందు, (ఉండునో), యావచ్చ, ఇన్ద్రియ శక్తిః = ఇంద్రియముల దార్ఢ్యము, అప్రతిహతా = అఖండితముగా, (ఉండునో), యావత్, ఆయుషః = ఆయుస్సునకు, క్షయః = నాశము, న = లేదో, తావ దేవ = అందాఁక నే, విదుషా = ఎఱుకగలవానిచే, ఆత్మ శ్రేయసి = తన మేలుకై, మహాన్ యత్నః = గొప్ప యత్నము, కార్యః = చేయఁదగినది. భవనే = ఇల్లు, సందీప్తే సతి = మండుచుండఁగా, కూప ఖననం ప్రతి = నూయి త్రవ్వుటకు, ఉద్యమః = యత్నము, కీదృశః = ఎట్టిది.



తా.—దేహము ఆరోగ్యము గలిగి హాయిగా నున్నప్పుడే, ముదిమి రాకముందే, ఇంద్రియపాటవము తఱుఁగక ముందే, ఆయుస్సు క్షీణింపకముందే, విద్వాంసుఁడు మోక్షసాధనార్థము ప్రయత్నింపవలయును; రోగములు, ముదిమి, ఇంద్రియదౌర్బల్యము, ఆయుఃక్షయము - ఇవి పైకొన్నప్పుడు మోక్షముకై యత్నించుట మండుచున్నయింటిని ఆర్పుటకు బావి త్రవ్వుటవంటిది. బావిత్రవ్వులోపల ఇల్లెల్లు కాలిపోవునో అట్లే మోక్షస్వరూపము తెలియుటకు ముందే మృత్యువు కొనిపోవును.

చ. ధృతిఁ గొని రోగముల్ జరయు దేహము నొంపకముందె, యింద్రియ
ప్రతిహతి లేకముందె, తన ప్రాణవిరామము కాకముందె, పం
డితజనుఁ డాచరింపఁ దగు శీవిఁ బ్రయత్నము ముక్తికిన్, మహో
ద్ధతశిఖి నిల్లు గాలుతటిఁ దాలిమి నూతులు త్రవ్వ టొప్పునే?

వ్యా.—అతః దురవస్థాక్రాన్తేః పూర్వ మేవ శ్రేయస్సంపాదనార్థం యత్నః కర్తవ్యః నాన్య థేతి సదృష్టాన్త మాహ - యావదితి.—యావత్ యావత్పర్యన్తం, మిద మేత, చ్ఛరీరం, స్వస్థం పీడారహితం, భవ తీతి శేషః - ఏవ ముత్తర త్రాపి, తథా, యావత్ న విద్యతే రుజా రుగ్యస్య త త్తథోక్తమ్ - ఆరోగ్య యుక్తం భవతి - ని. 'స్త్రీ రుగ్రుజా చోపతాప' ఇ త్యమరః - యద్వా - అరుజం సత్ - స్వస్థ మవికలం- భవతి, తథా, యావ జ్జరా, దూరతః - దూరే భవతి- వార్ధకదశా యావ త్పర్యన్తం నాక్రామ తీ త్యర్థః, తథా యావ దిన్ద్రియశక్తి శ్చక్షు రాదీన్ద్రియపాటవం చ, అప్రతిహతా అఖణ్డితా భవతి, యావ దాయుషః, క్షయో నాశో, న భవతి, తావ త్తావత్పర్యన్త మేవ - తన్మధ్యకాల ఏ వేత్యర్థః, వే త్తీతి విద్వాన్ - తేన విదుషా అభిజ్ఞేన * 'విదే శ్శతు ర్వసు' రితి వసుప్రత్యయః, ఆత్మనః - శ్రేయసి విషయే- మోక్ష ప్రాప్తా వి త్యర్థః, మహాన్ ఫలజననపర్యాప్తత్వేన పూజ్యః, ప్రయత్నః జ్ఞానవైరాగ్యతపస్సంపాదనోద్యోగః, కార్యః; నను కోయం నియమః? అవసానేఽపి ప్రయత్నస్య కర్తుం యుక్తత్వా ది త్యాశఙ్క్యావకాశాభావా న్న యుక్త ఇతి వ్యతిరేకదృష్టాన్త మాహ- భవనే గృహే, సందీప్తే అగ్నినా దహ్యమానే సతి, కూపఖననం ప్రతి కూపనిర్మాణం ప్రతి, ఉద్యమః ప్రయత్నః, కీదృశః కీదృగ్విధః - న యుక్త ఇ త్యర్థః - అవకాశాభావా దితి భావః; గృహదాహవేళాయాం కూపఖననప్రయత్న ఇవ అవసానకాలే శ్రేయఃప్రాప్త్యర్థోద్యమోఽపి న యుజ్యత ఇతి భావః; తస్మా త్స్వస్థావస్థాయా మేవ శ్రేయస్సాధన సంపాదన తత్పరేణ భవితవ్య మవశ్యం బుద్ధిమ తేతి తాత్పర్యమ్.

———

తపస్యన్తః సన్తః కి మధినివసామః సురనదీం?
గుణోదారా న్దారా నుత పరిచరామః సవినయమ్?

పిబామః శాస్త్రౌఘా? నుత వివిధకావ్యామృతరసా?
న్న విద్మః కిం కుర్మః కతిపయ నిమేషాయుషి జనే? 76.

టీక.—తపస్యన్తః = తపస్సుచేయుచు, సురనదీం = గంగకడ, అధినివసామః కిం = వసింతుమా, ఉత = లేక, సవినయం = అనుకూలతతో, గుణ ఉదారాన్ = సుగుణములచే రమ్యమైన, దారాన్ = భార్యను, పరిచరామః కిం=ఆశ్రయింతుమా, శాస్త్రౌఘాన్ = శాస్త్రప్రవాహములను, పిబామః కిం=త్రాగుదుమా, ఉత=లేక, వివిధ... రసాన్ - వివిధ = పలువిధములైన - కావ్య=కావ్యములయందలి - అమృత రసాన్= అమృత ద్రవములను, పిబామః కిం, జనే = జనుఁడు, కతి...యుషి సతి - కతిపయ= కొన్ని - నిమేష = నిముసములే - ఆయుషి సతి = ఆయువుగలవాఁడగుటంబట్టి, కిం కుర్మః = దేనిని చేయుదుమో, న విద్మః = ఎఱుఁగము.

తా.—నరుని యాయుస్సు కొన్ని నిముసములే గదా. ఈ స్వల్పకాలము ఏమి చేయుటకును చాలదు; కావున, గంగాతీరమందు తపస్సు చేయుదుమా, యోగ్యురాలగు భార్యతో ప్రేమతో సుఖముందుమా, ప్రవాహములవలె పెరుఁగుచునేయుండు శాస్త్రములను నేర్తుమా, నానాకావ్యములయందు అమృతతుల్యమగు నభిప్రాయములను గ్రోలుదుమా, ఏమి చేయనుం దోఁపక యున్నాము.

మ. తపముల్ సేయుచు దేవతాతటినిచెంతన్ నిల్తుమో, కాక దా
రపరత్వంబున నుందుమో, వివిధశాస్త్ర శ్రవ్యకావ్యామృతం
బుపభోగింతుమొ, యేమి సేయను హితం బూహింపఁగా లే, మని
త్యపులోకంబున మానవుల్ మితనిమేషాయుష్కులై యుండఁగన్.

వ్యా.—అథ తపశ్చరణాదీన్ బహూన్ కర్తవ్యతయా వికల్ప్యానన్తర మవశ్యం తప ఏవ సంపాదనీయ మితి కేషాంచి న్నిశ్చయ మనుసంధా యాహ - తపస్యన్త ఇతి ద్వాభ్యాం - తపస్యన్త ఇతి.—తపస్యన్తః తప శ్చరన్తస్సన్తః, కేవల మితి శేషః * 'కర్మణో రోమన్థతపోభ్యాం వర్తిచరో' రితి క్యజ్ప్రత్యయః, సురనదీం మన్దాకినీమ్, అధినివసామః కిం అధితిష్ఠామో వా - వైరాగ్యే ణేతి భావః - కింశబ్ద ఉత్తరత్రాప్యనువర్తనీయః * 'ఉపాన్వధ్యాఙ్వస' ఇతి సురనద్యాః కర్మత్వమ్, ఉత అథవా, వినయే నానుకూల్యేన సహితం యస్మిన్ కర్మణి తద్యథా తథా, గుణైః సౌభాగ్యసౌశీల్యాదిభి- రుదారాన్ రమ్యాన్, దారాన్ జాయాం, పరిచరామః కిం అనుసరామో వా - సాంసారికధర్మే ణేతి భావః - ని. 'భార్యా జాయా ఽథ పుంభూమ్ని దారాః' ఇత్యభిధానా ద్దారశబ్దస్య పుంస్త్వం బహుత్వం చ, తథా, శాస్త్రౌఘాన్ శాస్త్రకలాపాన్, పిబామః కిం అద్యైవ కీర్తిప్రతిష్ఠా విజ్ఞానార్థ మిత్యర్థః * 'పాఘ్రాధ్మే' త్యాదినా పాతేః పిబాదేశః, ఉత యద్వా, వివిధాని కావ్యాని కావ్యనాటకాలంకారా



ఏ వామృతరసా స్సుధాద్రవాః - అథవా - వివిధేషు కావ్యేషు యే అమృతరసా - స్తాన్, పిబామః - సకలకలాకౌశలార్థ మితి భావః, జనశబ్దే నాత్ర తత్సముదాయో వివక్షితః - తథా చ - జనే జనసముదాయే, కతిపయే కియన్తః - యే నిమేషా స్తావన్మాత్రకాలపరిచ్ఛిన్న - మాయు ర్యస్య తస్మిన్ స తీ త్యర్థః - జాత్యేకవచనవివక్షాయాం తు జనే ష్వస్మాసు కతిపయనిమేషాయుస్సు సత్స్వి త్యర్థః, కిమ్ ఉక్తతపశ్చరణాదిషు కిం వా, కుర్మః సర్వేషా మాచరణే అవకాశాభావా దితి భావః, న విద్మః న జానీమః - నిశ్చయాభావా దితి భావః.

---

దురారాధ్యా శ్చామీ తురగచలచిత్తాః క్షితిభుజో,
వయం తు స్థూలేచ్ఛాః సుమహతి ఫలే బద్ధమనసః,
జరా దేహం, మృత్యు ర్హరతి దయితం జీవిత మిదం,
సఖే, నాన్య చ్ఛ్రేయో జగతి విదుషోఽన్యత్ర తపసః. 77

టీక.—తురగచల చిత్తాః=గుఱ్ఱమువలె చపలమయిన మనస్సుగలవారగు, అమీ క్షితిభుజః = ఈరాజులు, దురారాధ్యాః = మెప్పింప శక్యులుకారు, వయన్తు=మనమో, స్థూల ఇచ్ఛాః = గొప్ప యాశలుగలవారము, సుమహతి పదే = మిక్కిలి గొప్ప ప్రయోజనమందు, బద్ధమనసః = కట్టఁబడిన మనసుగలవారము, జరా = ముదిమి, దేహం = ఒడలిని, హరతి = కొనును, మృత్యుః = చావు, దయితం = ప్రియమైన, జీవితం = ప్రాణమును, హరతి, సఖే = చెలికాఁడా, జగతి = లోకములో, విదుషః = తెలివిగలవానికి, తపసః అన్యత్ర=తపస్సు తప్ప, అన్యత్ శ్రేయః = విశేషమయిన మేలు, న = లేదు.

తా.—రాజసేవ వలదు. రాజులు గుఱ్ఱములవలె చలచిత్తులు, ఎంత గొలిచియు వారిని మెప్పింపలేము; మనకు ఆశలు గొప్పగా నున్నవి, గొప్పఫలమును అపేక్షించుచున్నాము. కావున ముదిమిచే దేహము ఎత్తుపడకముందే, చావు రాకముందే తపస్సుచేసికొనుటకంటె ఈలోకములో మేలు మఱి లేదు.

ఉ. వాజిచలస్వభావు లగువారు ప్రసన్నులు గారు భూపతుల్,
రాజసవృత్తి మానరు, దురాశయు నెక్కుడు మాకు సొమ్మపైఁ,
దేజ మడంచు వృద్ధదశ, దీకొని ప్రాణము నొంచుఁ గాలుఁ, డ
వ్యాజతపంబు కన్న భువి నాత్మహితం బగుకృత్య మున్నదే.

వ్యా.—తతః కిమి త్యాశఙ్క్య తతో నిశ్చయ మాహ - దురారాధ్యా ఇతి.— తురగాః ఉత్తమాశ్వాః - తద్వ - చ్చలాని చిత్తాని యేషాం తే అస్థిరహృదయా ఇత్య

ర్థాః, అపి పరిదృశ్యమానాః, క్షితిభుజో రాజానః, దురారాధ్యా ఆరాధయితుం ప్రసాదయితు మశక్యాః - ప్రసాదోన్ముఖీకరణాశక్యా ఇ త్యర్థః, తథా, స్థూలేచ్ఛా అధికాశాతత్పరాః, వయం చ, సుమహతి బహులే, ఫలే ధనే, బద్ధం మనో యేషాం తే తథోక్తాః - బహుధనాకాఙ్క్షిణ ఇ త్యర్థః - ఆకాఙ్క్షామాత్ర మే వాస్మాకం న తు తే దాస్య న్తీతి భావః, తథా, జరా వార్ధకదశా, దేహం, హరతి క్షిణోతి, మృత్యు ర న్తక శ్చ, దయితం ప్రియతమ, మిదం జీవితమ్ ఇమాన్ ప్రాణా ని త్యర్థః, హరతి, అతః హే సఖే, జగ త్యస్మిన్ లోకే, విదుష స్తత్త్వజ్ఞస్య పుంసః, తపసో,ఽన్య త్రాన్యత్ ఇతర ది త్యర్థః, అన్య దసాధారణ ముత్తమం, శ్రేయః మోక్షసాధనం, నాస్తి తతోఽన్య త్పరమం శ్రేయో న్తరం నాస్తి, అత స్సర్వథా త దేవ సంపాదనీయ మితి భావః.

---

మానే మ్లాయిని, ఖణ్డితే చ వసుని, వ్యర్థం ప్రయాతేఽర్థిని,
క్షీణే బన్ధుజనే, గతే పరిజనే, నష్టే శనై ర్యౌవనే,
యుక్తం కేవల మేత దేవ సుధియాం యజ్జహ్నుకన్యాపయః
పూతగ్రావ గిరీన్ద్రకన్దరతటీ కుఞ్జే నివాసః క్వచిత్. 78

టీక.—మానే = అభిమానము, మ్లాయిని = మాయఁగా, వసుని= ధనము, ఖణ్డితే = నశింపఁగా, అర్థిని = యాచకుఁడు, వ్యర్థం = నిరర్థకముగా, ప్రయాతే = పోఁగా, బన్ధుజనే = బంధుజాతము, క్షీణే = క్షీణింపఁగా, పరిజనే = భృత్యవర్గము, గతే = వదలిపోఁగా, శనైః = క్రమక్రమముగా, యౌవనే=జవ్వనము, నష్టే = గతింపఁగా, క్వచిత్ =ఒకానొకచోట, జహ్ను...కుఞ్జే - జహ్నుకన్యా= గంగయొక్క - పయః = నీటిచేత - పూత = పవిత్రమైన - గ్రావ = ఱాలుగల - గిరీన్ద్ర = పర్వతరాజగు హిమవంతముయొక్క - కన్దర = గుహయొక్క - దరీ = గట్టునందలి - పొదరింటియందు, నివాసః=వసించుట, యత్ =ఏదో, ఏత దేవ=ఇది యే, కేవలం = మిక్కిలి, సుధియాం = బుద్ధిమంతులకు, యుక్తమ్ = మంచిది.

తా.—మానము పోయి, ధనముపోయి, యాచకులకు పెట్టలేక, బంధువులను పోషింపలేక, సేవకులకు జీత మియ్యలేక, యౌవనము క్రమముగా దాఁటి పోఁగా, బుద్ధిమంతులకు ఇది యొకటియే తగినది; ఏ దనఁగా గంగనీటిచే పవిత్రమయిన చాఁపఱాలుగల హిమాలయగుహాగట్టున నొకపొదరింట నివసించి తప మాచరించుట.

ఉ. మానము గ్రుంగఁగా, ధనము మట్టముగా, నిజబాంధవాశ్రితుల్
దీనతఁ జెంది యేఁగ, నతిథిప్రకరంబు నిరాశమైఁ జనన్,



మానుగ జవ్వనం బరుగ, మాన్యవకుం దగు జహ్నుకన్యకా
నూనతరంగపూతకలితోపలశైలనికుంజవాసముల్.

వ్యా.— అథ తపసః శ్రేయోహేతుత్వే తదాచరణస్య కిం వా యోగ్యస్థాన మి త్యాశఙ్కాయా మాహ - మాన ఇతి.—మానే అభిమానే మ్లాయిని భగ్నే సతి, తథా, వసుని ధనే చ, ఖణ్డితే వినష్టే సతి - ని. 'దేవభేదేఽనలే రశ్మౌ వసూ రత్నే ధనే వ స్వి'తి విశ్వః, అత ఏ వార్థిని యాచకే, వ్యర్థే అలబ్ధమనోరథత్వా న్నిరర్థకే, ప్రయాతే సతి వాఞ్ఛితార్థాలాభా ద్వైముఖ్యం గతే స తీ త్యర్థః, బన్ధుజనే పుత్త్రమిత్త్రాది బన్ధుజనసమూహే, క్షీణే అన్నాద్యలాభా త్కృశే సతి, పరిజనే భృత్యవర్గే, గతే వేతనదానాభావా దన్యత్ర గతే సతి, తథా, శనై ర్మన్దం, యౌవనే తారుణ్యే నష్టే గళితే సతి, అనిత్యత్వస్వాభావ్యా త్సర్వస్మి న్విపన్నే స తీ త్యర్థః, సుధియాం బుద్ధిసంపన్నానా, మేత దేవ ఇద మే, వైకం కేవల మత్యన్తమ్, యుక్త ముచితం, కి మేత ది త్యత ఆహ - క్వచిత్ కస్మింశ్చిత్, జహ్నుకన్యాపయః పూతాః గఙ్గాజల పవిత్రాః- గ్రావాణః పాషాణాః - యస్మిన్ స తథోక్తో యో గిరీన్ద్రః తస్య హిమవద్గిరేః కన్దరతట్యాం గుహాబహిఃస్థల్యాం - నికుఞ్జో లతామణ్డపః తస్మి, న్నివాస ఇతి యత్ త దేత ద్యుక్త మితి సంబన్ధః, త స్యైవ శ్రేయస్సాధనభూతతపోయోగ్యస్థలత్వా దితి భావః - ని. 'నికుఞ్జకుఞ్జౌ వా క్లీబే లతాదిపిహితోదరే' ఇ త్యమరః.

---

అవ.—రమ్యములు వానియనిత్యత తెలియఁగానే అరమ్యము లగును.

రమ్యా శ్చన్ద్రమరీచయ, స్తృణవతీ రమ్యా వనా న్తఃస్థలీ,
రమ్యం సాధుసమాగమాగతసుఖం, కావ్యేషు రమ్యాః కథాః,
కోపోపాహితబాష్పబిన్దుతరళం రమ్యం ప్రియాయా ముఖం,
సర్వం రమ్య, మనిత్యతా ముపగతే చిత్తే న కిఞ్చి త్పునః. 79.

టీక.—చన్ద్రమరీచయః=జాబిల్లి వెలుఁగులు, రమ్యాః = ఇంపయినవి, తృణవతీ= పచ్చికగల, వన అన్తః స్థలీ=అడవి నడిమి తావు, రమ్యా, సాధు...సుఖం - సాధు=సజ్జనులతోఁడి - సమాగమ = సాంగత్యమువలన - ఆగత=వచ్చిన- సుఖం=సుఖము, రమ్యం, కావ్యేషు = కావ్యములందు, కథాః = కథలు, రమ్యాః, కోప...తరళం - కోప=కినుకచేత - ఉపాహిత = ఉంపఁబడిన - బాష్పబిందు = కన్నీటిబొట్లచేత - తరళం= మెఱయుచున్న, ప్రియాయాః = కాంతయొక్క, ముఖం = మొగము, రమ్యం, కాఁబట్టి, సర్వం = సమస్తమును, రమ్యం, పునః = కాని, చిత్తే = మనస్సు, అనిత్యతామ్ = వస్తువుల నశ్వరత్వమును, ఉపగతే సతి = ఎఱింగిన దగుచుండఁగా, కిఞ్చిత్ = ఏదియు, న (రమ్యమ్) = మనోహరము కాదు.

తా.—జాబిల్లివెలుంగులు, పచ్చికగల యడవితావు, సజ్జనసాంగత్యమువలని యానందము, కబ్బములలోని కథలు, అలుకచే పొడమిన కన్నీళ్లతోడి కాంతావదనము - ఇవన్నియు రమ్యములే; కాని, వీనియనిత్యత బుద్ధి కెఱుకపడినంతట ఒకటియు రమ్యముగాదు.

ఉ. మంచివి పండువెన్నెలలు, మంచివి పుష్పవనప్రదేశముల్,
మంచిది సాధుసంగమసమాగతసౌఖ్యము, చాటువాక్యముల్
మంచివి, మంచి దశ్రుయుతమానవతీముఖ; మీసమస్తముఁ
మంచిది కా దనిత్య మని మానసవృత్తి నెఱుంగువారికిఁ.

వ్యా.—అథ చిత్తస్య నిత్యానిత్యవస్తువివేకే సతి రమ్య మపి సర్వ మరమ్య మేవ ప్రతిభాతీ త్యాహ ద్వాభ్యామ్ - రమ్యా ఇతి.—చన్ద్రమరీచయ శ్చన్ద్రకిరణాః రమ్యాః రమణీయాః - ఉద్దీపకత్వా దితి భావః, తథా, తృణవతీ శాద్వలప్రాయా, వనాన్తఃస్థలీ వనమధ్యభూమిః, రమ్యా రన్తుం యోగ్యా * 'జానపదే' త్యాదినా అకృత్రిమార్థే జీష్, తథా, సాధు సమాగమాత్ సజ్జన సహవాసా - దాగతం ప్రాప్తం - య త్సుఖం, త దపి, రమ్యం, కవయతి వర్ణయ తీతి కవిః - తస్య కర్మ కావ్యం - * బ్రాహ్మణాదిత్వాత్ ష్యఞ్ - తస్య పఙ్కజాదివ ద్రూఢత్వా ద్రసోల్లసితశబ్దార్థసంఘటన మర్థః న కర్మమాత్రం - తథా చ కావ్యే షూక్తప్రకారేషు కావ్యనాటకాదిషు, కథాః శ్రవ్యవాచః ఉపాఖ్యానాని వా, రమ్యా మనోహరాః, తథా, కోపోపాహితాః ప్రణయకలహాదిషు క్రోధవశా దుత్పన్నా - యే - బాష్పబిన్దవః అశ్రుకణా - స్తైః - తరళమ్ ఆవిలం, ప్రియాయా ముఖం రమ్యమ్, అత స్సర్వ మపి రమ్య ముక్తరీత్యా సకల మపి మనోహర మేవ, కింతు, చిత్తే మనసి, అనిత్యతాం నిత్యానిత్యవస్తువిచారతత్పరతామి త్యర్థః, ఉపగతే సతి, కించి త్పునః కించి దపి, రమ్యం న భవతి - బ్రహ్మానన్దం వినేతి శేషః.

---

అవ.—సాధువులు నశ్వరసుఖమును గోరరు.

రమ్యం హర్మ్యతలం న కిం వసతయే? శ్రావ్యం న గేయాదికం?
కిం వా ప్రాణసమాసమాగమసుఖం నైవాధిక ప్రీతయే ?
కిం తు భ్రాన్తపతఙ్గపక్షపవనవ్యాలోలదీపాఙ్కుర
చ్ఛాయాచఞ్చల మాకలయ్య సకలం సన్తో వనాన్తం గతాః. 80.

టీక.—రమ్యం = ఇంపయిన, హర్మ్యతలం= మేడప్రదేశము, వసతయే=కాఁపురమునకు, న కిం = లేదా, గేయ ఆదికం = పాట లోనగునది, శ్రావ్యం= చెవి కింపైనది, న కిం = కాదా, ప్రాణ...సుఖం - ప్రాణ సమా = ప్రాణములతో సమానురాలగు (అనఁగా ప్రాణములంత ప్రియయగు) నాయికతోడి - సమాగమ = పొందుచేతనగు - సుఖమ్ = సుఖము, అధికప్రీతయే నైవ కిం = ఎక్కుడు మోదమునకు కానే కాదా, కిం తు = అయినను, సన్తః=సజ్జనులు, సకలం= ఈసమస్తమును, భ్రాన్త... చఞ్చలం - భ్రాన్త=బ్రమసిన - పతఙ్గ= మిడుతయొక్క - పక్ష=ఱెక్కలయొక్క - పవన = గాలిచేత - వ్యాలోల= కదలుచున్న - దీపాఙ్కుర=దీపపుమొగ్గయొక్క - ఛాయా = కాంతివలె - చఞ్చలమ్= అస్థిరమునుగా, ఆకలయ్య = ఎంచి,వనాన్తం = వనప్రదేశమునకు, గతాః = పోయిరి.



తా.—కాఁపురమునకు ఇంపయినమేడలను, శ్రుతిప్రియమయిన గీతవాదనములను, అత్యంతానందకరములగు ప్రాణప్రియాసంభోగములను, బ్రమసిన మిడుతయొక్క ఱెక్కతాఁకుడుచే నల్లలనాడు దివ్వెమొగ్గకాంతివలె క్షణభంగురము లని త్యజించి సత్పురుషులు శాశ్వతబ్రహ్మానందసాధనమునకై తపోవనమున కేఁగుదురు.

ఉ. సంతతముఁ సుఖం బొసఁగఁ జాలవె చాల విశాలసౌధముల్
కాంతలసంగముఁ మధుర గానములుఁ వివరించి చూడ? సం
భ్రాంత పతంగ పక్షభవ మారుత ఘాత విధూత దీపికా
కాంతిచలంబు సర్వ మని కానల కేఁగిరి పండితోత్తముల్.

వ్యా.—ఉక్త మే వార్థం వివృణ్వ న్నిగమయతి - రమ్య మితి.—హర్మ్యతలం ప్రాసాదోపరిప్రదేశః, వసతయే నివాసాయ, న రమ్యం కిం - రమ్య మే వే త్యర్థః, తథా, గేయం గానం * 'భవ్య గేయే' త్యాదినా కర్తరి నిపాతః - త దాదిః యస్య త త్తథోక్తం - ఆదిశబ్దేన వీణావాదనాదిక మపి సంగృహ్యతే * 'శేషా ద్విభాషే' తి కప్ ప్రత్యయః, న శ్రావ్యం కిం శ్రోత్రసుఖావహం న కిం - శ్రావ్య మే వే త్యర్థః, తథా, ప్రాణసమాయాః ప్రాణప్రియనాయికాయా - స్సమాగమేన సంభోగేన - య త్సుఖం త చ్చ, అధికప్రీతయే అత్యన్తసంతోషాయ, నైవ భవతి కిం భవ త్యే వే త్యర్థః, కింతు, సన్తః వస్తువిచారతత్పరపురుషాః, సకల మశేషం - హర్మ్యతలనివాసాదిక మపి, భ్రాన్తః పతనేచ్ఛయా పరిభ్రమఁ - యః - పతఙ్గ శ్శలభః - ని. 'పతఙ్గ శ్శలభే భానా వి' తి విశ్వః - తస్య - పక్షయోః పవనేన గరుతోః వాయునా - వ్యాలోలోఽతిచఞ్చలో - యోదీపాఙ్కురో దీపకలికా - తస్య - ఛాయా కాన్తి - స్తద్వ - చ్చఞ్చలం తరళం నశ్వర మిత్యర్థః, ఆకల య్యాలోచ్య, వనాన్తం వనమధ్యం, గతాః శాశ్వత బ్రహ్మానన్దసాధనతపశ్చర్యార్థ మితి భావః.

ఇతి వైరాగ్యశతకవ్యాఖ్యానే నిత్యానిత్యవస్తువిచారో నామ
అష్టమం దశకమ్.

---

## అథ శివార్చనమ్.

† ఆసంసారం త్రిభువన మిదం చిన్వతాం తాత తాదృ
ఙ్నైవాస్మాకం నయనపదవీం శ్రోత్రమార్గం గతో వా
యోఽయం ధత్తే విషయకరిణీగాఢ †† రూఢాభిమాన
క్షీబ స్యాన్తఃకరణకరిణః సంయమాలానలీలామ్. 81.

టీక.—యః అయం = ఎవఁడు, విషయ...క్షీబస్య - విషయ=విషయములనెడి-కరిణీ = పిడియేనుఁగులందు - గాఢ=దృఢముగా - రూఢ = నాటుకొన్న - అభిమాన = ప్రేమచేత - క్షీబ = మత్తిల్లిన - అన్తఃకరణ = మనస్సనెడి - కరిణః = ఏనుఁగుయొక్క, సంయ...లీలామ్ - సంయమ = కట్టుటకు - ఆలాన = కంబముయొక్క - (పా. ఆనాయ=వలయొక్క) - లీలాం = రీతిని, ధత్తే = ధరించునో, (హే) తాత = బాబూ, తాదృక్ = అట్టివాఁడు, ఆసంసారం = సంసారముండువఱకు, ఇదం త్రిభువనం = ఈమూఁడులోకములను, చిన్వతామ్ = వెదకుచున్న, అస్మాకం = మాకు, నయన పదవీం = కన్నుల దారినిగాని, శ్రోత్ర మార్గం వా = చెవుల దారిని గాని, న గతః= పొందిన వాఁడుగాఁడు.

తా.—పిడియేనుఁగులమీఁద దిట్టముగా నాటుకొన్నమరులుచేత మదమెక్కిన యేనుఁగును వానిమీఁదికి పోనీయక మావటీఁడు స్తంభమునకు (పా. ఉరులతో) కట్టు విధంబున, విషయములమీఁదికి పట్టరాని తమితో ప్రసరించుమనస్సును అట్లు ప్రసరింపనీయక నిలుపునట్టి మహాపురుఁడు, ఓబాబూ, అనాది సంసారము మొదలుగా మూఁడు లోకములందును వెదకినను ఎవ్వఁడును మాకు కనఁబడ లేదు, వినఁబడను లేదు.

మ. తగ సంసారము నాదినుండియును దత్తత్కర్మ సంయుక్తిము
జ్జగముం ద్రిమ్మరు మాకుఁ గానఁబడఁడే చందంబునం గర్ణమా
ర్గగతుం డైనను గాఁడు భోగకరిణీ గాఢాదరోన్మత్త చి
త్త గరిష్ఠద్విపరాజ సంయమపటు స్తంభాత్మకుం డెవ్వఁడున్.

వ్యా.—నను వస్తువిచారప్రసక్తానుప్రసక్త్యా తపసోఽత్యన్తావశ్యకత్వ ముక్తం తత్కింవిధ మిత్యాశఙ్కాయాం శివార్చనవ్యతిరేకేణాన్య న్నకించిద ప్యస్తీతి మనసి కృత్వేదానీం తావచ్ఛివార్చనం వర్ణయతి . తచ్చార్చనం ద్వివిధం బాహ్య మాభ్యన్తరం చేతి - తత్రాద్యం బహూపకరణసాధ్యం బహిర్ముఖవిషయత్వా దముఖ్యం చేత్యభిప్రేత్యాదౌ త దుపేక్ష్య ముఖ్య మాభ్యన్తరపూజనప్రకార మేవాభినీ యాహ-
† ఆసంసారా దితి.—అత్ర తా తే త్యాశ్చర్య శ్రవణాభిముఖీకరణార్థ మాదరా



తిశయద్యోతకం పృథగ్జనం ప్రతి సంబోధనవచనమ్ - హే తాత జనక - ని. 'తాతస్తు జనకః పితే' త్యమరః - ఆ సంసారాత్ అనాదిసంసార మారభ్యే త్యర్థః * పదద్వయ మేతత్ * వికల్పా దసమాసః, ఇదం ప్రసిద్ధం, త్రయాణాం భువనానాం సమాహార స్త్రిభువనం - భువనత్రయ మపి - * 'తద్ధితార్థే' త్యాదినా సమాహారసమాసే పాత్రాద్యదన్తత్వా న్న స్త్రీత్వం, చిన్వతాం మార్గమాణానాం - కర్మవశాత్తత్ర ప్రవేశలాభా దితి భావః - అథవా - చిన్వతాం పరామృశతామ్, అస్మాకం, నయనపదవీం లోచన మార్గం వా, శ్రోత్రమార్గం శ్రవణపథం వా, తాదృక్తథావిధః పుమాన్, న గతో న ప్రాప్త ఏవ - తాదృక్పుమాన్ - న శ్రుతో న దృష్టశ్చే త్యర్థః, కోఽసా విత్యత ఆహ - యోఽయం పుమాన్, ప్రతీయమానతయా భోగసాధనాని స్రక్చన్దనవనితాదీని విషయా - స్త ఏవ కరిణ్యః ఇభ్యః - తాసు - గాఢోఽతిదృఢో - ††రూఢః అప్రకాశశ్చ - యోఽభిమానః అత్యన్తాసక్తత్వాగ్రహః - తేన క్షీబస్య మత్తస్య - ని. 'మత్తే శౌణ్డోత్కటక్షీబా' ఇ త్యమరః * 'క్షీబృ మద' ఇ త్యస్య ధాతో రనుపసర్గాత్ * 'ఫుల్లక్షీబ కృ శోల్లాఘా' ఇతి నిష్ఠాన్తో నిపాతః, అన్తఃకరణ మేవ కరీ తస్య చిత్తమత్తేభస్య, సంయమే సమ్యఙ్నియమనే, ఆనాయస్య రజ్జునిర్మిత జాలస్య - ని. 'ఆనాయః పుంసి జాలం స్యా ది త్యమరః - 'ఆలానే' తి పాఠే - ఆలానస్య బన్ధనస్తమ్భస్య - లీలాం, ధత్తే దుర్దమమనోనియమనసమర్థో భవ తీ త్యర్థః, తాదృ గితి సంబన్ధః.

అత్రేదృశపురుషస్య నయనశ్రోత్రపథవిషయసంబన్ధేఽప్యసంబన్ధోక్త్యా సంబన్ధే అసంబన్ధరూపాతిశయోక్తిః; తయా చ మనోనియమన స్యాత్యన్తాశక్యత్వరూపం వస్తు వ్యజ్యత ఇ త్యలంకారేణ వస్తుధ్వనిః ; తథా చ కేనచి ద్యోగేన మనో నియమ్య తత్త్వ బ్రహ్మానన్ద సాధనభూతా న్తరఙ్గశివార్చనతపోఽవశ్యం కర్తవ్య మితి గూఢోఽయ మభిప్రాయః ; తథా అన్యధర్మ స్యాన్యత్ర సంబన్ధాసంభవా దానాయలీలా మివ లీలా మి త్యౌపమ్యపర్యవసా నాదసంభవద్వస్తుసంబన్ధరూపో నిదర్శనాలంకారః ; స చోక్త రూపకే ణాఙ్గాఙ్గిభావేన సంకీర్యతే. మన్దాక్రాన్తావృత్తమ్.

---

అవ.—తపస్సునం గలుగు పరిణతి.

యదేత త్స్వచ్ఛన్దం విహరణ, మకార్పణ్య మశనం,
సహార్యైః సంవాసః, శ్రుత ముపశమైకవ్రతఫలమ్,
మనో మన్దస్పన్దం బహి రపి; చిర స్యాపి విమృశ -
న్న జానే క స్యైషా పరిణతి రుదారస్య తపసః. 82.

టీక.—స్వచ్ఛన్దం = స్వేచ్ఛమైన, ఏతత్ విహరణమ్ = ఈ సంచారము, అకార్పణ్యమ్ = దీనత్వములేని, అశనమ్=ఆహారము, ఆర్యైః సహ = జ్ఞానులతోడ, సంవా

సః = కూడిక, ఉప...ఫలమ్ - ఉపశమ = శాంతియనెడు - ఏక = ముఖ్యమైన - ఫలమ్ = ప్రయోజనముగలదియగు, శ్రుతం - వినికి, బహిః = వెలికి, మన్ద స్పన్దం = జడమైన చలనముగల, మనః అపి = మనస్సును, (ఇతి) యత్ = అనునది ఏదో, ఏషా= ఇది, కస్య ఉదారస్య తపసః పరిణతిః = ఏ గొప్ప తపస్సునకు పరిపాకమో, చిరస్య = ఎంతయుం గాలము, విమృశన్ అపి = ఆలోచించుచుండియు, న జానే = ఎఱుఁగకున్నాను.

తా.—ఈ స్వేచ్ఛావిహారము, దీనత లేని తిండి, పెద్దలతోడిసాంగత్యము, తప్పకుండ శాంతి కలిగించునట్టి విషయములను పెద్దలవలన వినుట, మనస్సును బాహ్యవిషయములమీఁదికి ప్రసరింపనొల్లమియు, ఇదంతయు ఏ మహాతపమునకు ఫలమో ఎంత యరసియుం గననేరకున్నాను.

ఉ. ఇచ్చకు వచ్చినట్లు చరియించుట, దైన్యము లేనితిండియుఁ,
నిచ్చలు సాధుసంగమును, నిర్మలశాంతియు, శాస్త్రబోధముఁ,
మచ్చిక లోనఁ బూని వెలి మట్టనిచిత్తము నాఁగ నింతయుఁ
వచ్చుట యేమహోన్నత తపంబుఫలంబొ యెఱుంగ నేర్తుమే?

వ్యా.—అథ తపఃప్రవృత్తిప్రకార మే వాహ-య దితి.—స్వచ్ఛన్దం యథేచ్ఛమ్ అపరాధీన మితి యావత్, విహరణం విహార శ్చ, న విద్యతే కార్పణ్యం దైన్యం యస్మిం స్త త్తథోక్త, మశనం భిక్షాన్నభోజనం కన్దమూలాద్యాహారో వా, తథా, ఆర్యై ర్విజ్ఞానసంపన్నైః, సహ సంవాస స్సమాగమ శ్చ, తథా, ఉపశమో విషయభోగ విరతి రేవ-ఏకం ముఖ్యం - వ్రతఫలం యస్మిం స్త త్తథోక్తం, శాన్తిఫలక తపశ్చరణ బోధక మిత్యర్థః, శ్రుతం వేదాన్తశాస్త్రశ్రవణం చ - ని. 'శ్రుతం శాస్త్రావధృతయో రి' తి విశ్వః, తథా, బహిః బాహ్యదేశే మన్దస్పన్దం మన్దప్రసారమ్ - అన్తర్ముఖత్వా దితి భావః, మనోఽప్యన్తఃకరణం చేతి య దేత త్సర్వం వర్తత ఇతి శేషః * 'నపుంసక మనపుంసకే నైకవ చ్చే' త్యాదినా ఏకశేషః * ఏ షేతి విధేయప్రాధాన్యాత్ స్త్రీలిఙ్గతా - 'శైత్యం హి య త్సా ప్రకృతి ర్జల స్యే'తివత్, క, స్యోదారస్య మహత, స్తపసః, పరిణతిః పరిపాకో వా, న జానే న వేద్మీ త్యర్థః - యద్వా - పరిణతిః పరిణామో వా [illegible]నే - కింవా తపః ఏవంరూపేణ పరిణతం త న్న జానామీ త్యర్థః, కథంభూత స్స న్నపి - చిరస్య చిరకాల మి త్యర్థః, విమృశన్ పరామృశ న్నపి - ని. 'చిరాయ చిరరాత్రాయ చిర స్యాద్యా శ్చిరార్థకా' ఇత్యమరః * విభక్తిప్రతిరూపక మవ్యయం; త చ్చ తప శ్శివపూజన మేవ - కథ మన్యథాఽన్య స్యేదృక్ఫలసాధనే ఏవంవిధపరిణామనే వా సామర్థ్యం సంభవే దితి భావః.

---



అవ.— పరమశివునిపాదములు తప్ప వేఱు శరణము లేదు.

జీర్ణా ఏవ మనోరథా శ్చ హృదయే, యాతం చ త ద్యౌవనం,
హ న్తాఙ్గేషు గుణా శ్చ వన్ధ్యఫలతాం యాతా గుణజ్ఞై ర్వినా,
కిం యుక్తం సహసాఽభ్యుపైతి బలవా న్కాలః కృతాన్తోఽక్షమీ,
హా జ్ఞాతం మదనాన్తకాఙ్ఘ్రియుగళం ముక్త్వాఽస్తి నాన్యాగతిః. 83.

టీక.—మనోరథాః = కోరికలు, హృదయే = ఎదలోనే, జీర్ణాః = నశించినవి, తత్ యౌవనం చ = ఆ ప్రాయము ను, హన్త = అయ్యో, అఙ్గేషు = అవయవములందు, యాతం = అణఁగి పోయినది, గుణజ్ఞైః వినా=గుణము నెఱుంగువారు లేమిచే, గుణా శ్చ = గుణములును, వన్ధ్య ఫలతాం= వ్యర్థమైన ప్రయోజనము గలిగియుండుటను (వ్యర్థతను), యాతాః = పొందినవి, బలవాన్ = బలముకలదియు, కృత అన్తః= నాశము సేయునదియు, అక్షమీ = ఓర్పులేనిదియు, (అగు), కాలః=మృత్యువు, సహసా = వడిగా, అభ్యుపైతి = మీఁదికి వచ్చుచున్నది, (కావున), కిం యుక్తం = ఏమి తగునో, హా = ఓహో, జ్ఞాతం = తెలిసినది, మదనా ... గళం - మదన అన్తక= (మరుని(గూల్చిన) శివునియొక్క - అఙ్ఘ్రి యుగళం ముక్త్వా = అడుగుల జంట తప్ప, అన్యా = వేఱు, గతిః = శరణము, నాస్తి = లేదు.

తా.—కోరికలు తీఱలేదు, ఉత్కటమయిన యాయౌవనంబును అవయవములలోనే అణఁగిపోయినది. గుణజ్ఞులులేమిచే గుణములు వ్యర్థమయినవి. నాశము సేయునదైన బల్లిదంపుమృత్యువు విలంబము నోర్వక మీఁదికి వచ్చుచున్నది. మఱి యిప్పుడేమి సేయఁదగును? ఆ! ఆ! తెలిసినది! మహేశ్వరచరణయుగళోపాసన తప్ప వేఱు శరణము లేదు.

ఉ. చిత్తమునందె కోరికలు జీర్ణము లయ్యె, న శేషగాత్రముఁ
హత్తినజవ్వనం బరిగె, నార్యులు లేమి గుణంబులుఁ ఫలో
చ్ఛిత్తి వహించె, నెద్ది తగుఁ? జేరక మానఁడు కాలుఁ డక్కటా;
చిత్తజవైరిపాదయుగసేవనమే గతిగా నెఱింగితిన్.

వ్యా.—అథ శివచరణ మేవ శరణ మితి స్మరణ మభినీ యాహ - జీర్ణా ఇతి.— మనోరథా విషయాభిలాషా శ్చ హృదయే అన్తరఙ్గ ఏవ, జీర్ణాః నష్టాః - వాఞ్ఛామాత్ర మేవ న త్వనుభూతా ఇ త్యర్థః, తథాఽఙ్గేషు, త త్తథాభూతం- కామినీసంభోగోపయుక్త మి త్యర్థః, యౌవనం, యాతం గళితం, హ న్తేతి విషాదే, తథా, గుణజ్ఞా గుణగ్రాహిణ స్సహృదయా ఇతి. యావత్ - తైః, ర్వినా * 'పృథగ్వి నే' త్యాదినా తృతీయా, గుణా విద్యావినయాదయ శ్చ, వన్ధ్యఫలతాం నిష్ఫలతాం, యాతా గతాః -

అనుభావకాభావా న్నిరర్థకా జాతా ఇత్యర్థః, తథా, బలవాన్ బలిష్ఠః - దుర్జయ ఇత్యర్థః, కాలః కాలస్వరూప అపరావర్త ఇతి యావత్, అక్షమీ అసహన శ్చ, కృతాన్తో యమ స్సహసాఽభ్యుపైతి అభియుజ్క్తే - ప్రాణాపహరణార్థ మితి భావః - ని. 'కృతాన్తౌ యమసిద్ధాన్తా వి' త్యమరః, అతః కిం, యుక్త ముచితమ్ - ఈదృగ్దశాయాం కిం కర్తవ్యమి త్యర్థః, హా కష్టం - తథాఽపీద మేకం తరణసాధన మస్తీతి స్మరణ మభినీయాహ, జ్ఞాత మవగతం, కిం జ్ఞాత మి త్యత ఆహ - మదనాన్తకస్య శంభోః - అఙ్ఘ్రి యుగళం పాదయుగ్మం, ముక్త్వా విహాయ, అన్యా, గతి శ్శరణం, నాస్తి, అత స్తదేవ శ్రయణీయ మితి భావః.

---

మహేశ్వరే వా జగతా మధీశ్వరే, జనార్దనే వా జగద న్తరాత్మని,
న వస్తుభేదప్రతిపత్తి రస్తి మే; తథాఽపి భక్తి స్తరుణేన్దుశేఖరే. 84.

టీక.—జగతామ్ = లోకములకు, అధీశ్వరే = ప్రభువగు, మహేశ్వరే వా= హరునియందుఁ గాని, జగత్ అన్తః ఆత్మని=లోకములకు లోపలి యాత్మయగు, జనార్దనే వా = హరియందుఁ గాని, మే = నాకు, వస్తు భేద ప్రతిపత్తిః = వస్తువులు వేఱనెడు (హరుఁడు వేఱు హరి వేఱు అనెడు) భావము, న=లేదు, తథాఽపి=అయినను, తరుణ ఇన్దు శేఖరే=(లేఁత చందురుఁడు సిగపూవుగాఁ గల) హరునియందు, భక్తిః=ఉపాసింపననురక్తి.

తా.—హరచరణమే శరణ మనుటలో హరిచరణము కా దని నాభావము గాదు. లోకాధీశ్వరుఁ డగు హరుఁడును లోకాంతర్యామి యగు హరియును వేర్వేఱుగారని నే నెఱుంగుదును. అయినను, నా భక్తి ఎలనెలసిగపూదాల్పునందు నెలకొని యున్నది.

తే. జగదధీశ్వరుఁ డగుమహేశ్వరునియందు । సకలజగదంతరాత్ముఁ డౌ శార్ఙ్గియందు
భేదవిజ్ఞాన మెయ్యెడ లేదు మాకు; । నైనఁ దరుణేందుశేఖరునంద భక్తి.

వ్యా.—నను -

'యత్పాదనిస్సృతసరిత్ప్రవరోదకేన
తీర్థేన మూర్ధ్న్యధికృతేన శివః శివోఽభూత్,
ధ్యాతు ర్మన శ్చ కులశైలవిసృష్టవజ్రం
ధ్యాయే చ్చిరం భగవత శ్చరణారవిన్దమ్.'

ఇత్యాదినా శివాద్యశేషదేవతాకల్యాణప్రదే అఖిలలోకారాధ్యే సంసారార్ణవ తరణయానపాత్రే భగవతశ్చరణారవిన్దే జాగ్రతి కథం శివాఙ్ఘ్రియుగళం వినాఽన్యా గతి ర్నాస్తీతి ప్రలపసి ఇ త్యాశఙ్క్యాహ - మహేశ్వర ఇతి.—జగతాం చతుర్దశభువనానాం, మధీశ్వరే స్వామిని, మహేశ్వరే శివే వా, తథా, జగతా మన్తరాత్మని అన్తః కరణసాక్షిణి - అన్తర్యామి ణీతి వా- అథవా అన్తర్భూతాత్మని జీవాత్మస్వరూపే అవిద్యాప్రతిబిమ్బిత చైతన్యత్వేన తథాభూతత్వా దితి భావః - య ద్వా - జగ న్త్యన్తరాత్మని యస్య తస్మిన్ తథోక్తే - కుక్షిస్థాఖిలభువన ఇత్యర్థః, జనా నర్దయ తీతి జనార్దనే విష్ణౌ వా, మే మమ, వస్తు భేద ప్రతిపత్తిః అయం మహేశ్వరోఽయం జనార్దన ఇతి వస్తుగోచర భేద బుద్ధి - ర్నాస్తి - 'శివాయ విష్ణురూపా యే' త్యాదినా తయో ర్వస్తుతో భేదాభావా దితి భావః, తథాఽపి భేదప్రతిపత్త్యభావేఽపి, తరుణేన్దుశ్శేఖరః శిరోభూషణం యస్య తస్మిన్ శివే, భక్తి ర్భజనానురాగో, ఽస్తీతి శేషః - అత ఏవ నాన్యా గతి రి త్యుక్త మితి భావః; ఇదం చ స్వభావో దురతిక్రమ ఇతి న్యాయా ది త్యవగన్తవ్యమ్. వంశస్థవృత్తమ్ - 'జతౌ తు వంశస్థ ముదీరితం జరా వి'తి లక్షణాత్.

---

స్ఫురత్ స్ఫారజ్యోత్స్నాధవళితతలే క్వాఽపి పులినే
సుఖాసీనా శ్శాన్త ధ్వనిషు రజనీషు ద్యుసరితః,
భవాభోగోద్విగ్నాః శివ శివ శి వే త్యుచ్చవచసః
కదా స్యామానన్దోద్గతబహుళబాష్పాప్లుతదృశః. 85.

టీక.—శాన్త ధ్వనిషు=ఉడిగిన శబ్దములుగల, రజనీషు=రాత్రులందు, స్ఫుర... తలే - స్ఫురత్ = ప్రకాశించుచున్న - స్ఫారజ్యోత్స్నా = నిండువెన్నెలచేత - ధవళిత = తెల్లనిదిగాఁజేయఁబడిన - తలే = ప్రదేశముగల, ద్యుసరితః = చదలేటి యొక్క, పులినే = ఇసుకతిన్నెయందు, సుఖాసీనాః సన్తః = సుఖముగాఁగూర్చున్న వారమై, భవా...ద్విగ్నాః - భవ = సంసారముయొక్క - ఆభోగ = విటివివలన - ఉద్విగ్నాః = బెగ్గడిల్లిన మేము, శివ శివ శివ ఇతి= శివ శివ శివ యని- ఉచ్చవచసః= బిగ్గఱయగు పలుకుగలవారమై, కదా=ఎప్పుడు - ఆనన్దో...దృశః - ఆనన్ద=సంతోషముచే - ఉద్గత = ఉబికిన - బహుళ=మెండయిన - బాష్ప = కన్నీళ్లచేత - ఆప్లుత= అంతటఁ దడుపఁబడిన - దృశః = కన్నులుగలవారము, స్యామ = అగుదుమో.

తా.—రాత్రులందు శబ్దము లన్నియు నడఁగియున్నప్పుడు చదలేట మెండుగా వెలుఁగు పండువెన్నెలచేత తెల్లగా ప్రకాశించుచుండు నిసుకతిన్నెలో నొకచోట హాయిగా కూర్చుండి అపారసంసారమునకు బెగ్గడిల్లి శివశివశివ అని బిగ్గఱగా ఉచ్చరించుచు కన్నులనిండ ఆనందబాష్పములవెల్లితో నెప్పుడు ఉందుమో!

శా. శాంతారావనిశీథకాలముల భాస్వత్సాంద్రచంద్రాతపా
క్రాంతస్వచ్ఛమరున్నదీపులినయోగ్యక్షోణిఁ గూర్చుండి జ
న్మాంతోద్వేగుల మైనమేము శివశబ్దావృత్తితో నెప్పు డ
త్యంతానందభవాశ్రుసంకులదశావాప్తిన్ సుఖం బుందుమో.

వ్యా.—అథ స్థాయిన శ్శమ స్యోదయవశా చ్ఛాన్తరసాభివ్యఞ్జకవాక్యా న్యాహ పఞ్చభిః - స్ఫురత్ స్ఫారజ్యోత్స్నేతి.—శాన్తా ఉపరతాః - ధ్వనయః పక్షిమృగాదిరుతాని - యాసు తథోక్తాసు - ఏతేన చిత్తవిక్షేపహేతు రాహిత్యం సూచ్యతే, రజనీషు రాత్రిషు, స్ఫురన్తీ ప్రకాశ మానా - స్ఫారా ప్రవృద్ధా చ - యా జ్యోత్స్నా చన్ద్రికా - తయా - ధవళితం పాణ్డురీకృతం - తలం ప్రదేశో - యస్య తస్మిన్, క్వాఽపి కస్మింశ్చిత్, ద్యుసరితో గఙ్గాయా స్సంబన్ధిని, పులినే సైకతే, సుఖం యథా తథా- ఆసీనా ఉపవిష్టా స్సన్తః, భవాభోగా త్సంసారవిస్తారా - దుద్విగ్నాః విహ్వలాః- దుఃఖజనకత్వా దితి భావః, వయ మితి శేషః, అత శ్శివేత్యాది త్రివార, ముచ్చారితాని - వచాంసి ఆక్రన్దవచనాని యేషాం తే తథోక్తాః- 'ఆర్తవచస' ఇతి పాఠే దైన్యవచనా స్సన్తః, కదా కస్మి న్వా సమయే, అన్త రభ్య న్తరే - గతాః నియమనవశా దన్తర్లీనా ఇతి యావత్ - బహుళా శ్చ - యే బాష్ప ఆనన్దాశ్రూణి - తై రాకులా - యా దశా అవస్థా - తాం, యాస్యామః అన్తర్నియమి తానన్దబాష్ప పర్యాకులావస్థాం.కదా గమిష్యామ ఇ త్యర్థః - 'దృశ మి'తి పాఠే బాష్పాకులా యా దృష్టి స్తాం యాస్యామ - ఇ త్యన్వయః - 'కదా స్యా మానన్దోద్గతబహుళబాష్పాకుల దృశ'ఇతి పాఠే - ఆనన్దా దుద్గతా ఉత్పన్నా యే బహుళ బాష్పాః తై రాకులా దృశో యేషాం తే తథోక్తాః కదా స్యామ భవేమ, తదానీం ఖలు వయం కృతకృత్యా ఇతి భావః.

---

విత్తీర్ణే సర్వస్వే తరుణకరుణాపూర్ణహృదయాః
స్మరన్తః సంసారే విగుణపరిణామాం విధిగతిమ్
వయం పుణ్యారణ్యే పరిణతశరచ్చన్ద్రకిరణా
స్త్రియామా నేష్యామో హరచరణచిన్తైకశరణాః! 86.

టీక.—తరుణ...హృదయాః - తరుణ = పటువయిన - కరుణా = దయచేత - పూర్ణ = నిండిన - హృదయాః సన్తః = హృదయము గలవారమై, సర్వస్వే = (మాయొక్క) సకల ధనము, వితీర్ణే = (పేదలకు) ఈఁబడినది కాఁగా, సంసారే = సంసారమునందు, విధి గతిం = దైవముయొక్క ప్రవృత్తిని, విగుణ పరిణామాం = వెగటయిన పర్యవసానముగలదానినిగా, స్మరన్తః = తలపోయుచు, వయం = మేము, పుణ్యారణ్యే = తపోవనమునందు, హర...శరణాః - హర = శివునియొక్క - చరణ = అడుగులయొక్క - చిన్తా = ధ్యానమే - ఏక = ప్రధానమైన - శరణాః = ప్రాపుగాఁ గలవారమై, పరిణత...కిరణాః - పరిణత = పండిన - శరత్ చన్ద్ర కిరణాః = శరత్కాలపుఁ జందురుని వెలుంగులుగల, త్రియామాః = రాత్రులను, నేష్యామః = కడపుదుము.



తా.—నిండుభూతదయచే మాధన మెల్ల పేదల కిచ్చి, సంసారమందు విధిపరిపాకము ఎప్పుడును వెగటుగానే యుండు నని తలపోయుచు, మేము, తపోవనమందు శివచరణధ్యానమే ప్రాపుగా శరత్కాలపుఁ దఱపివెన్నెలరాత్రులను ఎపుడు గడపుదుమో!

చ. కలధన మంతయున్ సెలవుగా నిడి, నూత్నకృపాప్రపూర్ణ చి
త్తుల మయి, సంసృతిం గుశలమూరవిపాకము గాఁగ దైవముం
దలఁచుచుఁ, గానలో శివపదస్మృతినిష్ఠుల మై నయింపఁ గాఁ
గలము శరత్ప్రసన్నమిహికాకరరమ్యము లైనరాత్రులన్.

వ్యా.—వితీర్ణ ఇతి - సర్వస్వే నిఖిలధనే, వితీర్ణే దత్తే - అర్థిసా త్కృతే సతి - ని. 'స్వో జ్ఞాతా వాత్మని స్వం త్రి ష్వాత్మీయే స్వోఽస్త్రియాం ధన'ఇ త్యమరః, తత స్తరుణా ప్రత్యగ్రా - యా కరుణా భూతదయా - తయా - పూర్ణాని పూరితాని - హృదయాని యేషాం తే తథోక్తాః, తథా, సంసారే, విధిగతిం దైవప్రవృత్తిం, విగుణపరిణామాం విషమపరిపాకామ్ - అకుశలపర్యవసాయినీ మితి యావత్, స్మరన్తస్సన్తః మన స్యనుసందధానా స్సన్తః, వయం, పుణ్యారణ్యే తపోవనే, హరచరణచిన్తా శివపాదారవిన్దధ్యాన మే - వైకం ముఖ్యం - శరణం రక్షణం - యేషాం తే తథోక్తా స్సన్తః, పరిణతాః పరితో వ్యాప్తాః - శరచ్చన్ద్రకిరణా శ్శారదేన్దు మయూఖా- యాసు తా స్తథోక్తా-స్త్రియామాః రాత్రీః, నేష్యామో గమయిష్యామః,క దేతి శేషః; ద్వయోః ప్రథమచరమయామార్ధయో ర్దినవ్యవహారాత్ త్రయో యామా యస్యా స్సా త్రియా మేతి స్వామీ.

---

కదా వారాణస్యా మమరతటినీరోధసి వసన్,
వసానః కౌపీనం, శిరసి నిదధానోఽఞ్జలిపుటమ్,
అయే గౌరీనాథ, త్రిపురహర, శమ్భో, త్రినయన,
ప్రసీ దేతి క్రోశ న్నిమిషమివ నేష్యామి దివసాన్! 87

. టీక.—కదా = ఎప్పుడు, వారాణస్యామ్ = కాశిలో, అమర తటినీ రోధసి = వేల్పు ఏటి యొడ్డున, వసన్ = కూర్చుండి, కౌపీనం = గోఁచిని, వసానః = పెట్టుకొని, శిరసి = తలయందు, అఞ్జలి పుటం = చేదోయి మోడ్పును, నిదధానః = ఉంచుకొని, .అయే = ఓ, గౌరీ నాథ = గిరిజాపతీ,• త్రిపుర హర = త్రిపురములను మాపినవాఁడా, శమ్భో = శంకరుఁడా, త్రినయన = మూఁడుకన్నులవాఁడా, ప్రసీద = దయగలుగుము, ఇతి = అని, క్రోశన్ = మొఱయిడుచు, దివసాన్ = దినములను, నిమిష మివ = క్షణమునుం బోలె, నేష్యామి = కడపుదు నూ.

తా.—ఎప్పుడు, కాశిలో గంగయొడ్డున గోఁచి దాల్చి కూర్చుండి, దోయిలను కేలు మోడ్చి, ఓ గౌరీపతీ, త్రిపురాంతకా, శంభుఁడా, త్రిలోచనుఁడా, నాపై కరుణింపుము అని మొఱ యిడుచు దినములను నిముసముగాఁ గడపుదునో!

ఉ. శ్రీనుతకాశియం దమరసింధువుచెంగట నిల్చి, గోఁచినిం
బూని, ప్రణామముద్రఁ దల మోపి, 'పురాన్తక పార్వతీశ శం
భో నిటలాక్షు రక్ష,' యని మొఱ్ఱలు వెట్టుచు నిశ్చలానుసం
ధానత నెన్నఁడేఁ గడపెదన్ దినముల్ నిమిషంబు కైవడిన్!

వ్యా.—క దేతి.—కదా కస్మి న్వా కాలే, వారాణస్యాం కాశ్యాం, మమరతటినీరోధసి గఙ్గాతీరే, వసన్ తిష్ఠన్, తథా, కౌపీనం గుహ్యాచ్ఛాదనచేలఖణ్డం, వసానః ఆచ్ఛాదయన్ - లోక విరోధపరిహారార్థం తావన్మాత్రపరిగ్రహ ఏవ న తు పరిగ్రహాన్తరాపేక్ష ఇ త్యర్థః, * 'వస ఆచ్ఛాదనే' ఇతి ధాతో శ్శానచ్, శిర స్యఞ్జలిపుటం కరసంపుటం, నిదధాన స్సన్, అయే భో, గౌరీనాథ పార్వతీపతే, త్రయాణాం పురాణాం సమాహార స్త్రిపురం * పాత్రాదిత్వా న్న జీప్ - తస్య - హర తీతి హరః - హే త్రిపురాన్తక, శం సుఖ మస్మా ద్భవ తీతి శంభో, త్రినయన హే త్ర్యమ్బక * క్షుభ్నాదిత్వా న్న ణత్వమ్ - ఏత దామన్త్రణచతుష్టయం పరమేశ్వరస్య లోకసంగ్రహకారణ త్వాలౌకికకార్యకరణసామర్థ్యత్వ భక్తజనసుఖసంధాయక త్వాసాధారణమహిమాస్పదత్వ ద్యోతనార్థ మి త్యవగన్తవ్యం, ప్రసీద ప్రసన్నో భ, వేతి, క్రోశన్నుచ్చై రటన్, దివసా న నేకాన్, నిమిష మివ క్షణ మివ, నేష్యామి - అత్ర భావి తీవ్రనరకయాతనానుచిన్తాదిభి ర్విభావై ర్జనితః - కౌపీనధారణ శిరోఞ్జలిపుటసంఘటనాదిభి రనుభావై రభివ్యక్తః - క దేతిపదసూచితేన చిన్తాఖ్యేన సంచారిభావేన చ పరిపుష్టః - స్వాత్మావమాననలక్షణో నిర్వేదస్థాయీ - శాన్తరసః పరిస్ఫుర తీ త్యవగన్తవ్యమ్. ఏవ ముత్తర త్రాపి యోజ్యమ్.

---

స్నాత్వా గాఙ్గైః పయోభిః శుచికుసుమఫలై రర్చయిత్వా విభో త్వాం,
ధ్యేయే ధ్యానం నియోజ్య క్షితిధరకుహరగ్రావపర్యఙ్కమూలే
ఆత్మారామః ఫలాశీ గురువచనరత స్త్వత్ప్రసాదాత్ స్మరారే,
దుఃఖం మోక్ష్యే కదాఽహం సమకరచరణే పుంసి సేవాసముత్థమ్. 88.

టీ.—గాఙ్గైః = గంగాసంబంధులగు, పయోభిః = నీళ్లతో, స్నాత్వా = స్నానముచేసి, (హే)విభో = (ఓ) స్వామీ, త్వాం = నిన్ను, శుచికుసుమఫలైః - శుచి = పవిత్రములైన - కుసుమ ఫలైః = పూవులతోను పండ్లతోను, అర్చయిత్వా = పూజించి,



ధ్యేయే = ధ్యానింపఁదగిన వస్తువునందు (నీచరణమునందనుట), ధ్యానం = ఏకాగ్రచింతనమును, నియోజ్య = పెట్టి, క్షితి...మూలే - క్షితిధర = కొండయొక్క - కుహర = గుహయందలి - గ్రావ = ఱాయియనెడి - పర్యఙ్క = మంచముయొక్క - మూలే = మూలను, ఆత్మారామః = ఆత్మయందే క్రీడించువాఁడను, ఫల ఆశీ = పండ్లను తిను వాఁడను, గురు వచన రతః = ఆచార్యుని యుపదేశమందు (ఉపదేశము ప్రకారము ఆచరించుటయందు) ఆసక్తుఁడను, అహం = నేను, (హే) స్మర అరే = ఓ మదనశత్రుఁడా, త్వత్ ప్రసాదాత్ = నీయనుగ్రహమువలన, సమకరచరణే = సమానములైన (నాపాటియేమైన) కాలుసేతులుగల (అనఁగా కేవలము నాపాటివాఁడే అయిన - లేక - మకరరేఖతోఁ గూడుకొన్న పాదములుగలవాఁడైన - పాదమున మకరరేఖ మహాభాగ్యసూచకము గాన - మహాభాగ్యవంతుఁడయిన యని భావము), పుంసి = పురుషుని, సేవా సముత్థం = కొలుచుటవలనఁ బుట్టిన, దుఃఖం = దుఃఖమును, కదా = ఎప్పుడు, మోక్ష్యే = వీడుదునో.

తా.—స్వామీ, మదనాంతకా, నాబోఁటి నరులను కొలువు గొలిచిన దుఃఖమును, - గంగోదకముల స్నానమాడి, పవిత్రములయిన పువ్వులతోను పండ్లతోను నిన్నుఁ బూజించి, ధ్యానయోగ్యమయిన నీపాదమును ధ్యానించుచు, కొండగుహలో చాఁపఱాతిమంచముపై నొకకడ ఆత్మానుసంధానానందము ననుభవించుచు, పండ్లే ఓగిరముగా జీవించుచు, నీయనుగ్రహమున ఎప్పుడు తలంగుదునో!

ఉ. వేలుపుయేటఁ దోఁగి, సుపవిత్రఫలాదులఁ బూజచేసి, ని
న్నోలి మనంబులో నిలిపి, యోగ్యగుహాశిలయందు నాత్మసం
శీలుఁడనై, ఫలాశినయి, శ్రీగురువాక్యరతుండనై, మహీ
పాలకసేవనశ్రమముఁ బాసెద నెన్నఁడు మన్మథాంతకా.

వ్యా.—స్నాత్వేతి.—గఙ్గాయా ఇమాని గాఙ్గాని * త స్యేద మి త్యణ్ - తైః పయోభి ర్గఙ్గాజలై రిత్యర్థః, స్నాత్వా శుద్ధో భూత్వా, హే విభో శంభో, శుచిభిః శుద్ధై ర్నాగ్రసమ్మతై రితి యావత్ - కుసుమైః ఫలై శ్చ, త్వా మర్చయిత్వా సమారాధ్య. - ఏతేన బాహ్యపూజాయా అ ప్యంశతః ప్రాధాన్య మ స్తీతి సూచితం, ధ్యేయే ధ్యాతుం యోగ్యే వస్తుని - త్వచ్చరణారవిన్ద ఏ వే త్యర్థః, ధ్యానం నివేశ్య ఏకాగ్రచిత్తో భూ త్వే త్యర్థః, తథా, క్షితిధరకుహరే - యో గ్రావా పాషాణ - స్స ఏవ పర్యఙ్కః సుఖశయ్యా - తస్య మూలే, నిషణ్ణ స్స న్నితి శేషః - సమాధివ్యుత్థానానన్తరం సుఖసంవేశ యోగ్యతాద్యోతనార్థం గ్రావ్ణి పర్యఙ్కత్వరూపణమ్, ఆత్మ న్యేవారమత ఇ త్యాత్మారామో విషయాన్తరాసక్తిశూన్య స్స న్ని త్యర్థః - 'రమన్తే యోగినోఽనన్తే నిత్యానన్దే చిదాత్మ నీ'తి స్మృతేః, తథా, ఫలాశీ ఫలాహారః - శరీర

